# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 16 సంచిక : 11 హైదరాబాద్ 208 నవంబర్ 2018 పేజీలు : 68 రు. 25

* తెలంగాణలో ఎన్నికలు - మేధావుల పాత్ర
* ప్రజా మేధావుల నిర్బంధం - కోర్టుల వైఖరి
* విధ్వంస పాలనకు హెచ్చరిక తిత్లీ
* రాజ్య నిఘా నేత్రానికి సుప్రీం పచ్చజెండా
* రాఫెల్ కొనుగోళ్లలో భారీ అవినీతి
* నీతి తప్పిన నీతి అయోగ్ విద్యా విధానం
* బిజెపి ఎన్నికల అస్త్రంగా పాకిస్తాన్ బూచి

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

## ఆర్థిక వ్యవస్థ - సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం - ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| రైతు ఆత్మహత్యలన్నీ ప్రభుత్వ హత్యలే | రైతు సేవా సమితి | 100 |
| భారతదేశంలో ఉత్పత్తి విధానం- ఉత్పత్తి సంబంధాలు | విరసం | 20 |
| ప్రపంచీకరణ ప్రాభవంలో... | విద్యాభూషణ్ | 120 |
| మార్క్స్ రాసిన పెట్టుబడి | డేవిడ్ స్మిత్, ఫిల్ ఇవాన్స్ | 200 |

## తెలంగాణ

| | | |
|---|---|---|
| తెలంగాణార్థం | ఎన్. వేణుగోపాల్ | 150 |
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 150 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| సమగ్ర తెలంగాణ | వీక్షణం ప్రచురణ | 295 |
| ఎవరికోసం మల్లన్నసాగర్? | తెలంగాణ ఆత్మగౌరవ వేదిక | 20 |

## శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ - పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం - సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 120 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 150 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

## కులం-మతం

| | | |
|---|---|---|
| భారతదేశంలో కుల సమస్య | అనురాధ గాంధీ | 120 |
| పంచతంత్రం | బొజ్జా తారకం | 200 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 60 |
| చరిత్ర మార్చిన మనిషి | బొజ్జా తారకం | 150 |
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 150 |
| గులాంగిరి | జోతిబా ఫూలే | 60 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 60 |
| శూద్రులు - ఆర్యులు | అంబేద్కర్ | 20 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 30 |

## తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం-లెనినిజం-మావోయిజం | విరసం ప్రచురణ | 125 |
| మార్క్స్ పెట్టుబడి రచనా క్రమం | విరసం ప్రచురణ | 50 |
| మార్క్సిస్టు నిఘంటువు-1 | లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ | 350 |
| మార్క్సిస్టు పదకోశం | లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ | 50 |

## చరిత్ర-జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయం | డి.డి. కోసంబి | 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 70 |
| భగవద్గీత చారిత్రక పరిణామం | డి.డి. కొశాంబి | 20 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 100 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 100 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్సన్ | 150 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 120 |
| చేగువేరా | కాత్యాయని | 120 |
| మహాత్మా జ్యోతిరావ్ పూలే | ధనుంజయ్ కీర్ | 100 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| తలపుల తోవ | షౌకత్ కైఫీ | 100 |
| ఏడవకు బిడ్డా... | గుగి వా థియాంగో | 150 |

## సాహిత్య విమర్శ - వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| కవిత్వంతో ములాఖాత్ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| సాహిత్య వ్యాసాలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ రచనలు | చలసాని ప్రసాద్ | 100 |
| చలసాని ప్రసాద్ సాహిత్య సర్వస్వం-1 | విరసం ప్రచురణ | 270 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-2 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు-3 | కె.వి.ఆర్. | 250 |
| కెవిఆర్ సామాజిక వ్యాసాలు | కె.వి.ఆర్. | 300 |
| కెవిఆర్ డిటెన్యూ డైరీ | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 170 |
| కెవిఆర్ కవిత్వం | కె.వి.ఆర్. శారదాంబ కమిటీ | 200 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |
| మన ప్రపంచం | దుప్పల రవికుమార్ | 75 |
| అల్లంరాజయ్య కథలు పరిశీలన | ఎస్. నీళాదేవి | 75 |
| దారులేసిన అక్షరాలు | భారతీయ మహిళల రచనలు | 400 |
| కొలిమి రవ్వలు | గౌరి లంకేశ్ రచనలు | 150 |

## విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్-1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్-2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| మావో రచనలు - 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు - 2 | విరసం ప్రచురణ | 220 |
| జనతన రాజ్యం | పాణి | 300 |
| 30 ఇయర్స్ దండకారణ్య కల్చరల్ మూవ్‌మెంట్ | ఎన్.ఎం. చేతనా | 250 |
| సంకెళ్ల సవ్వడి | అరుణ్ ఫరేరా | 150 |
| మలుపు తిప్పిన మహా ఉద్యమం | విరసం ప్రచురణ | 60 |
| అభాగ్యజీవులు | విరసం ప్రచురణ | 170 |
| బోల్షివిక్ పార్టీ చరిత్ర | విరసం ప్రచురణ | 250 |
| ఆవాజ్ | విరసం ప్రచురణ | 65 |
| మెరిసే అక్షరాల వెనుక | సృజన ప్రచురణ | 30 |
| నక్సల్బరీ ఒక ఊరు మాత్రమే కాదు | విరసం ప్రచురణ | 80 |
| పికెఎం ప్రభాకర్ రచనలు | విరసం ప్రచురణ | 70 |
| కార్మికవర్గ విప్లవం-విప్లవ ద్రోహి కౌట్స్కీ | విరసం ప్రచురణ | 60 |

## కథ - నవల

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు (2005-2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 150 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి - మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| దళితులు - రాజ్యం | బొజ్జాతారకం | 25 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 120 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| హింసపాదు | బమ్మిడి జగదీశ్వరరావు | 180 |
| అభాగ్యజీవులు | ఫ్రాంజ్ ఫనాన్ | 170 |
| నిషిధ | నల్లూరి రుక్మిణి | 180 |

## డివిడి

| | |
|---|---|
| వీక్షణం (2003 - 2012) | 200 |
| సృజన (1966-1992) | 240 |
| అరుణతార (1970-2013) | 125 |
| 'ఓయు'ద్ధకాండ | 100 |

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

208

ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

నవంబర్ 2018
సంపుటి : 16
సంచిక : 11





‘వీక్షణం’లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. ‘వీక్షణం’ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

**‘వీక్షణం’ పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం** VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 25 | రు. 25 |
| సంవత్సరం | రు. 300 | రు. 250 |
| మూడు సంవత్సరాలు | రు. 900 | రు. 650 |
| ఐదు సంవత్సరాలు | రు. 1500 | రు. 1100 |
| పది సంవత్సరాలు | రు. 3000 | రు. 2000 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై ‘**VEEKSHANAM**’ అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

***వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2018 అక్టోబర్ నెలలో వచ్చిన విరాళాలు - డా. బి. రమేష్ - హన్మకొండ - రు. 500; మిత్రులకు కృతజ్ఞతలు - సం.***

'అజ్ఞానాన్ని ఆయుధీకరించడం' అనే పదాలను ఇటీవలే ఓ ఇంగ్లిష్ న్యూస్‌లో చూశాను. నేడు దేశంలో జరుగుతున్న అనేక దాడుల్లో ఈ అంశాన్ని చూడొచ్చు. అమాయకుల అజ్ఞానాన్నే ఆసరాగా చేసుకుని విద్వేషాలను రెచ్చగొట్టి పాలకవర్గాలు లబ్ధి పొందుతున్నాయి. ఈ అజ్ఞానాన్ని, మౌఢ్యాన్ని, మతాన్ని ప్రశ్నించాలంటే శాస్త్రజ్ఞానం అత్యవసరం. ఈ క్రమంలోనే నేను గత వీక్షణం సంచికలో చార్లెస్ డార్విన్ పరిణామ సిద్ధాంతం అనే వ్యాసాన్ని చదివాను. ఇంజనీరింగ్ కాలేజీల్లోనూ 'సూడో సైన్స్' సిలబస్‌ను ప్రవేశపెట్టేందుకు ఏఐసిటిఇ సిద్ధమవుతున్న నేపథ్యంలో సైన్స్‌కు సంబంధించిన వ్యాసాల అవసరం ఎంతో ఉంది. అయితే 'చార్లెస్ డార్విన్ పరిణామ సిద్ధాంతం' అనే శీర్షికతో ప్రచురితమైన ఈ వ్యాసంలో విషయానికంటే చార్లెస్ డార్విన్ జీవిత విశేషాలను ఎక్కువగా చర్చించినట్లు అనిపించింది. కాగా, స్వామి అగ్నివేశ్, సందీప్ పాండే రాసిన 'హిందుత్వ హింసను, రాజ్యహింసను సమర్థిస్తారా?' అనే వ్యాసం చాలా బాగుంది. హిందూత్వ అతివాదుల (తీవ్రవాదులు?), రాజ్యహింసను సవివరంగా చర్చించారు. మనకు తెలియకుండానే మీడియా మత్తులో మన విచక్షణను కోల్పోతామేమో అనే అనుమానం ఈ వ్యాసం చదివాక కలిగింది. ఎందుకంటే హిందూత్వ హింస, రాజ్యహింస పై జరగవలసినంత చర్చ జరగలేదని భావిస్తున్నాను గనుక. భీమా కోరేగావ్ అల్లర్ల కేసులోనూ మిలింద్ ఎక్బోటే, శంభాజీ భిడేలను వదిలి హక్కుల కార్యకర్తలను అరెస్టు చేయడం... ప్రముఖ హేతువాదులు నరేంద్ర దభోల్కర్, ఎం.ఎం. కల్బుర్గి, గౌరీ లంకేశ్‌ల హంతకులకు, మహారాష్ట్రలో పేలుడు పదార్థాలను స్వాధీనం చేసుకున్నవారికి సనాతన సంస్థతో సంబంధాలున్నట్లు వెల్లడవుతున్నా ఆ సంస్థపై ప్రభుత్వం నిషేధం విధించకపోవడం దేనిని సూచిస్తోంది? ఇలాంటి అంశాలపై చర్చించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

**మహేష్**

కరీంనగర్

కులాంతర వివాహాలపై కత్తి పద్మారావుగారి వ్యాసంలో (వీక్షణం అక్టోబర్, 2018) 'కులం అనేది కొన్ని మత విశ్వాసాల కారణంగా ఏర్పడిన వ్యవస్థ' అంటూ ఇలా వివరించారు: 'హిందువులు తమ సామాజిక వ్యవస్థను పరమ పవిత్రంగా భావిస్తారు. కులానికి దైవిక ప్రాతిపదికను ఆపాదిస్తారు.' ఇది పద్మారావుగారి అభిప్రాయం కావచ్చును. ఐతే 'అంబేద్కర్ దృక్పథం'గా చెప్పడం సరికాదు. ఎందుకంటే అంబేద్కర్ తన ప్రసిద్ధ పుస్తకం 'కుల నిర్మూలన'లో ఇలా రాశారు: 'కులానికి మతంతో ఏమీ సంబంధం లేదు. కులం ఒక ఆచారం. అది ఎలా పుట్టిందో నాకు తెలియదు; నా బౌద్ధిక ఆకలిని తీర్చుకోడానికి దాన్ని తెల్సుకోవాల్సిన అవసరమూ లేదు...ఐతే కులం మన ఆధ్యాత్మిక పరిణతికి, జాతి అభివృద్ధికి కూడా హానికరమని నాకు తెలుసు. వర్ణ-ఆశ్రమ వ్యవస్థలకు కులాలతో ఏమీ సంబంధం లేదు. వర్ణ ధర్మం మన జన్మని బట్టి వచ్చిన వృత్తులను నిర్వహించే బతుకుతెరువుకి సంబంధించినది... అవన్నీ మానవాళి సంక్షేమానికి కావల్సిన వృత్తులే; అందులో ఉచ్చ-నీచాలేమీ లేవు; అన్నీ మంచివే, సమాన హోదా కలవే. ధార్మిక గురువైన బ్రాహ్మణ వృత్తి, పాకీ వృత్తి రెండూ సమానమే...' అని అంబేద్కర్ రాశారు.

అలాగే 'హిందువులు తమ సామాజిక వ్యవస్థను పరమ పవిత్రంగా భావిస్తారు. కులానికి దైవిక ప్రాతిపదికను ఆపాదిస్తారు' అనీ; అందువల్ల 'శాస్త్రాల, వేదాల అధికారాన్ని నిర్మూలించవలసి ఉన్నది' అనీ పద్మారావు రాశారు. హిందూమతం, దైవం కులాన్ని శాసిస్తున్నాయని దాని తాత్పర్యం. అయితే మతాలన్నీ మానవుడు సృష్టించుకున్నవే. అవి చారిత్రకంగా ఏదో ఒక సందర్భంలో పుట్టి, ఒకానొక దశలో సానుకూల పాత్ర నిర్వహించి ఉంటాయి కూడా. ఈ విషయంలో అంబేద్కర్ అభిప్రాయాలు ఇలా ఉన్నాయి:

'హిందూ మతమూ ఒకానొక కాలంలో 'ధర్మ ప్రచార మతం' (మిషనరీ రెలిజన్) అని అంగీకరించాల్సిందే. అలా కాకపోయి ఉంటే విశాల భారత భూమి అంతటా వ్యాపించగలిగేదికాదు. అయితే ఈనాడది 'ధర్మ ప్రచార మతం'గా లేదన్నదీ వాస్తవమే. హిందూమతం 'ధర్మ ప్రచార మతం'గా ఉండెనా? అన్నది ప్రశ్న కాదు; అది అలా లేకుండా పోయింది ఎందువల్ల? అన్నదే అసలు ప్రశ్న. దానికి నా జవాబు: హిందువులలో కులవ్యవస్థ పెరగడంతో అలా 'ధర్మ ప్రచార మతం' కాకుండా పోయింది. కులం, మతమార్పిడితో (కన్వర్షన్‌తో) పొసగదు...అదే కులంలో పుట్టినవారు మాత్రమే తమది ఆ కులం అని చెప్పుకోగలరు. కులాలు స్వాధికారం (అటానమస్) గలవి. ఈ వ్యక్తిని మీ కులంలో చేర్చుకోండి అని శాసించగల 'అథారిటీ' ఎక్కడా ఎవరికీ లేదు...హిందూ సమాజం కులాల సమాహారంగా ఉన్నది. ఏ కులానికా కులం తలుపులు మూసేసుకున్న సంస్థ (క్లోజ్డ్ కార్పొరేషన్)గా ఉన్నది; అందులో కన్వర్షన్‌కి స్థానం లేదు. ఈ విధంగా కులం హిందువులని విస్తరించకుండా నిరోధించేదిగా ఉంది. ఇతర మతాలని ఇముడ్చుకోడానికి అడ్డంకిగా ఉంది. అందువల్ల కులం ఉన్నంత కాలం హిందూ మతం 'ధర్మ ప్రచారమతం' కాజాలదు; 'శుద్ధి' కార్యక్రమం బుద్ధి తక్కువ పనీ, నిరర్థకమూ కూడా.'

పైవి అంబేద్కర్ అభిప్రాయాలు. కులం, మతం నమ్మని నాస్తికత్వం నా విశ్వాసం. నేను అంబేద్కరువాదిని కాదు. అయినా పై విషయాలను పాఠకుల దృష్టికి తేవడం అవసరమని భావిస్తున్నాను. అంబేద్కర్ దృక్పథం, లేదా మరొకరి దృక్పథం అని రాసేవారు మరింత బాధ్యతతో, తమ అభిప్రాయాలను విడిగా, రాయాలని మనవి. మూలాన్ని ప్రస్తావిస్తే మంచిది. అంబేద్కర్ తన అభిప్రాయాలను మార్చుకుంటే అదీ పేర్కొనాలి.

**- ఎం. ఉదయభాను**

హైదరాబాద్

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ - సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం - సి.ఎచ్. గిరిజ; మెదక్ - ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ - మహమ్మద్ ఇక్బాల్; వరంగల్ - ఓరగంటి ఎల్లయ్య

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ - కె. నాగేశ్వరాచారి; చిత్తూరు - పలమనేరు బాలాజి; కడప - కొండ్రాయుడు; కర్నూలు - జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి - కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం - ఆర్. శ్రీలత; విశాఖపట్నం - పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

# అదే తాను ముక్క, వేరే రంగు ఉంటుందా?

సెంట్రల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్ (సిబిఐ) దేశంలోని ప్రభుత్వ సంస్థలలోకెల్లా ప్రఖ్యాతమైన పరిశోధనా సంస్థ. ఇది నేరుగా కేంద్ర ప్రభుత్వ సిబ్బంది వ్యవహారాల మంత్రిత్వ శాఖలో భాగమైనప్పటికీ, దానికి సాపేక్షిక స్వతంత్ర ప్రతిపత్తి, స్వతంత్రంగా వ్యవహరించగలదనే పేరు వచ్చాయి. ఆర్థిక నేరాలనూ, ప్రత్యేక నేరాలనూ, అవినీతి వ్యవహారాలనూ, ప్రముఖమైన కేసులనూ నిష్పక్షపాతంగా దర్యాప్తు చేయడం దాని ప్రకటిత లక్ష్యం. కాని దాని డైరెక్టర్‌గా నియమించబడే వ్యక్తి తప్పనిసరిగా డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ స్థాయిగల ఐపిఎస్ అధికారి అయి ఉండాలనే నియమం వల్ల, అది ఒక మంత్రిత్వశాఖలో అంతర్భాగంగా ఉన్నందువల్ల మొదటి నుంచీ కూడ దాని నిష్పక్షపాతం మీద అనుమానాలు వ్యక్తమవుతూనే వచ్చాయి. పాలకపార్టీ, కేంద్ర ప్రభుత్వం, ప్రధానమంత్రి తమ ప్రత్యర్థుల మీద కక్ష తీర్చుకోవడానికి సిబిఐని జేబుసంస్థగా వాడుకుంటున్నారనే ఆరోపణలు దశాబ్దాలుగా చెలరేగుతూనే ఉన్నాయి. ఆ సంస్థ అత్యున్నత అధికారంలో ఉన్నవారు స్వయంగా అవినీతికి, ఆశ్రిత పక్షపాతానికి పాల్పడుతున్నారనీ, అధికారపక్షపు చేతిలో ఆయుధంగా ఉపయోగపడుతున్నారనీ విమర్శలు వెల్లువెత్తుతూనే ఉన్నాయి. ఒకవైపు సిబిఐ మీద ఈ అనుమానాలు, విమర్శలు, ఆరోపణలు ఉన్నప్పటికీ వివాదాస్పద అంశాలన్నిటిలోను సిబిఐ విచారణ జరిపించాలని కోరడం, అది అధికారపక్షానికి అనుకూలమైన తప్పుడు నివేదిక ఇస్తే మరింత పెద్ద ఎత్తున విమర్శలు గుప్పించడం కూడ జరుగుతూనే ఉన్నాయి.

సిబిఐలో అక్టోబర్ 23 రాత్రి జరిగిన పరిణామాలు, అంతకు కొన్ని నెలల ముందు నుంచీ రాజుకుంటున్న నిప్పు, అక్టోబర్ 23 నుంచి ఇది రాస్తున్న సమయం వరకూ నాలుగు రోజుల్లో ప్రభుత్వంలో, సుప్రీంకోర్టులో జరిగిన పరిణామాలు చూస్తుంటే సిబిఐ మీద ఇంతకాలమూ ఉన్న అనుమానాలను, ఆరోపణలను వంద పెట్టి హెచ్చవేసినా ఇంకా వాస్తవాన్ని పూర్తిగా అర్థం చేసుకోలేమని అనిపిస్తున్నది. నిష్పక్షపాతంగా నేరాలను దర్యాప్తు చేయవలసిన సంస్థ తానే స్వయంగా నేరాలకు, కుట్రలకు, కుతంత్రాలకు నిలయంగా మారింది. నేరాలను దర్యాప్తు చేసే అధికారం ఉన్నవారు ఆ నేరాలను మాఫీ చేసేందుకు, తగ్గించి చూపేందుకు, శిక్షలు పడకుండా కేసులు తయారు చేసేందుకు పూనుకుని ఆమేరకు ముడుపులు, ఆస్తులు సంపాదిస్తున్నారు. అక్రమాల, అవినీతి కుంభకోణాల ఆరోపణలున్న బడా వ్యాపారులకు, రాజకీయవేత్తలకు సిబిఐ కార్యకలాపాలలో మితిమీరిన జోక్యం ఉన్నదని ఎన్నో ఆధారాలు బైటపడుతున్నాయి. అంతకుముందు కూడ సిబిఐకి ఘన చరిత్ర ఏమీ లేనప్పటికీ, ఎన్ డి ఎ ప్రభుత్వంలో, ముఖ్యంగా నరేంద్ర మోడీ ప్రధాన మంత్రిత్వంలో అన్ని రాజ్యాంగ, కీలక సంస్థల దుర్వినియోగం, విధ్వంసం జరిగినట్టుగానే, సిబిఐ దుర్వినియోగం కూడ పెచ్చరిల్లింది. గుజరాత్ లో అధికారులుగా పనిచేసి తన విధానాల అమలులో, నమూనా రూపకల్పనలో పాత్ర వహించిన అధికారులందరినీ ప్రధాన సంస్థల కీలక స్థానాల్లో నియమించడం మోదీ ప్రధానలక్ష్యంగా పెట్టుకున్నారు. ఆ రకంగానే ప్రతిపక్ష నాయకులను వేధించడానికి ఎక్కువ అవకాశం ఇచ్చే సిబిఐ డైరెక్టర్ గా తన మనిషిని నియమించాలనుకున్నారు. కాని సిబిఐ డైరెక్టర్ నియామకం కేవలం ప్రధానమంత్రి అధికార పరిధిలోది కాదు. ఆ నియామకాన్ని ప్రధానమంత్రితో పాటు ప్రతిపక్ష నాయకుడు, సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి కూడ ఆమోదించవలసి ఉంటుంది. ఒకసారి డైరెక్టర్ గా నియామకమైనవారిని రెండు సంవత్సరాల పాటు తొలగించడానికి ఎవరికీ అధికారం లేదు. నరేంద్ర మోడీ అధికారానికి వచ్చి సర్దుకునే లోగానే అనిల్ సిన్హా అనే బీహార్ కాడర్ కు చెందిన ఐపిఎస్ అధికారి డైరెక్టర్ అయ్యారు. ఆయన పదవీకాలం ముగిసిన డిసెంబర్ 2016లో తన మనిషి, గుజరాత్ కాడర్ ఐపిఎస్ అధికారి రాకేష్ ఆస్థానాను ఆ పదవిలో కూచోబెట్టి తన పనులు సాగించుకోవాలని మోదీ అనుకున్నారు. గోధ్రా రైలు దహనం కేసు, లాలూ దాణా కుంభకోణం కేసు, ఆగస్టా వెస్ట్ లాండ్ కేసు వంటి పరిశోధనలకు బాధ్యుడైన ఆస్థానాను అందుకు సిద్ధం చేశారు. కాని ఆ కోరిక నెరవేరలేదు. త్రిసభ్య ఎంపిక కమిటీ ఆలోక్ వర్మను నియమించింది. ఆలోక్ వర్మ కూడ ప్రధానికి సన్నిహితుడే అయినా, ప్రతిపక్ష నాయకులను వేధించే మోదీ ఆలోచనకు సమ్మతించక పోవడంతో ఆస్థానాను చట్టవ్యతిరేకంగా సమాన అధికార కేంద్రంగా తయారు చేశారు. దానితో ఆలోక్ వర్మ ఆగ్రహం మరింత పెరిగి, ఒకరి మీద ఒకరు నిఘాలతో, తప్పుడు సాక్ష్యాధారాల తయారీతో, ఉద్దేశపూర్వకంగా ఇరికించడంతో కుట్రలు, కుతంత్రాలు ప్రారంభించారు.

ఈ మధ్యలో రాఫెల్ కుంభకోణానికి సంబంధించిన కీలక రహస్యాలపై దర్యాప్తు జరపాలని ఆలోక్ వర్మ నిర్ణయించారు. దానితో మోదీ సొంత ప్రయోజనాలకే దెబ్బతగలడం ప్రారంభమయింది. ఆస్థానా మీద చర్య తీసుకోవాలని వర్మ ఆలోచించడంతో, అది మరింత ముదిరి రాత్రికి రాత్రి డైరెక్టర్ వర్మను చట్టవ్యతిరేకంగా తొలగించారు. మరిన్ని అవినీతి ఆరోపణలున్న ఎం నాగేశ్వరరావును సెంట్రల్ విజిలెన్స్ కమిషనర్ సిఫారసు మేరకు ఆ స్థానంలో నియమించారు. నిజానికి సివిసికి కూడ ఆ సిఫారసు చేసే అధికారం చట్టప్రకారం లేదు. పైగా ఉపరాష్ట్రపతి, సివిసి, ప్రస్తుతం నియమించబడిన వ్యక్తి ఒకే సామాజికవర్గానికీ, ఒకే భావజాలానికీ చెందడం ఈ నియామకాన్ని అనుమానాస్పదం చేస్తున్నది. సెలవు పేరుతో తనను అక్రమంగా తొలగించడం, తన కార్యాలయం స్వాధీనం చేసుకుని సోదాలు జరపడం వంటి చట్టవ్యతిరేక చర్యల మీద వర్మ సుప్రీం కోర్టును ఆశ్రయించగా, సుప్రీం కోర్టు కూడ మళ్లీ విచారణ బాధ్యతను సివిసికే అప్పగించింది.

ఒక్కమాటలో చెప్పాలంటే, ఈ వ్యవస్థలో విశ్వసించదగిన, గౌరవించదగిన సంస్థ ఏదీ లేదని, ప్రతి సంస్థనూ తమ స్వార్థ రాజకీయ ఆర్థిక ప్రయోజనాలకే వాడుకుంటామని, ప్రజాధనంతో నడిచే ఆ రాజ్యాంగబద్ధ సంస్థలలో ఏ ఒక్కదాన్నీ ప్రజలకు, రాజ్యాంగానికి జవాబుదారీగా నడపబోమని పాలకవర్గాలు నానాటికీ మరింత నిస్సిగ్గుగా ప్రకటిస్తున్నాయి. ఈ కుళ్లిపోయిన వ్యవస్థను ఇంకా ఇలాగే కొనసాగిద్దామా ప్రజలే తేల్చుకోవలసి ఉంది. ఈ వ్యవస్థను మారుస్తామని బయల్దేరిన వారికి ఇంతగా పతనమైన ఈ వ్యవస్థను కూల్చడానికి ఇంతకన్న మించిన సమయం మరొకటి దొరకదు. కాని వారు అందుకు సిద్ధంగా ఉన్నారా తేల్చుకోవలసి ఉంది. వీ

### సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# మితిమీరుతున్న ఎన్నికల వాగ్దానాలు

ఎన్నికలు ఇంకా ఆరు వారాల పైనే ఉన్నప్పటికీ రాష్ట్రంలో ఎన్నికల జ్వరం ప్రారంభమయింది. అధికారపక్షం చాల ముందుగానే తన అభ్యర్థులను ప్రకటించి అందరికన్న ముందే, ప్రత్యర్థి కూడ లేకుండానే ఎన్నికల గోదాలోకి దిగింది. ప్రతిపక్ష కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీ, తెలంగాణ జన సమితి, భారత కమ్యూనిస్టు పార్టీ మహా కూటమి ఏర్పరుస్తామని ప్రకటించినప్పటికీ సీట్ల సర్దుబాటు కసరత్తుకే ఎక్కువ సమయం తీసుకుంటూ, నిజంగా ప్రత్యర్థి కాగలరా అనే అనుమానానికి తావిస్తున్నారు. బహుజన లెఫ్ట్ ఫ్రంట్ పేరిట ఎన్నికల గోదాలో దిగబోతున్న సిపిఐ (ఎం), తదితర పార్టీలు ప్రభుత్వ వ్యతిరేక వోట్లు చీల్చడానికి, తద్వారా అధికారపక్షాన్నే మరొకసారి గెలిపించడానికి ఉపయోగపడతారనిపిస్తున్నది. భారతీయ జనతా పార్టీ ఎన్ని బీరాలు పలికినా, అన్ని స్థానాలకూ పోటీ చేస్తామని అంటున్నా, కేంద్రస్థాయిలో తెలంగాణ రాష్ట్ర సమితితో మిలాఖత్తు వల్ల అది కూడ అధికార పక్షానికే ఉపయోగపడుతుంది. ఇలా వర్తమాన రాజకీయ పరిస్థితి అధికారపక్షానికే ఎక్కువ అనుకూలంగా ఉన్నట్టు పైకి కనబడుతున్నప్పటికీ, అధికారపక్ష ప్రకటనల్లో మేకపోతు గాంభీర్యమే తప్ప నిజమైన ఆత్మవిశ్వాసం కనబడడం లేదు. నిజంగా తెలంగాణ ఉద్యమ ఆకాంక్షలను నెరవేర్చి ఉంటే, కనీసం తమ ఎన్నికల ప్రణాళికలోని వాగ్దానాలను సాకారం చేసి ఉంటే, అవే చెప్పుకుని ధైర్యంగా ఎన్నికల ప్రచారానికి వెళ్లవచ్చు. తాము చేసిన అభివృద్ధి ఏమిటో, ప్రజాహిత కార్యక్రమాలేమిటో చూపుకుని వోట్లు అడగవచ్చు. ప్రతిపక్షాలు బలహీనంగా ఉన్నాయనేది వాస్తవమైనప్పుడు అసలు ప్రతిపక్షాల ఊసే లేకుండా తన పనితీరు మీద, అభివృద్ధి మీదనే కేంద్రీకరించవచ్చు. కాని, పనితీరును పక్కనపెట్టి, ప్రతిపక్షాల మీద తిట్లూ దుర్భాషలూ, ఉద్యమకాలం నాటి భావోద్వేగాలను రెచ్చగొట్టడమూ, దాదాపు ప్రతి స్థానంలోనూ అగ్రాసనాధిపతే ప్రచారం చేస్తాననడమూ చూస్తుంటే, ఎక్కడో అధికారపక్షానికే తన విజయం మీద అపనమ్మకం ఉన్నట్టు కనబడుతున్నది. నిజంగానే ప్రజలలో అసంతృప్తి ఉన్నది. రాష్ట్ర సాధనలోని తమ ఆకాంక్షలు నెరవేరలేదన్న నిరాశ ఉన్నది. ఆనాటి భావోద్వేగాల ఉధృతస్థాయి లేదు. స్థానిక శాసనసభ్యుల మీద, మరీ ముఖ్యంగా కొత్త తరం, మొదటిదఫా ఎన్నికైన శాసనసభ్యుల మీద, వారు నాలుగు సంవత్సరాలలో ఒక్కసారైనా ముఖం చూపలేదని, నియోజకవర్గాలకు ఏమీ చేయలేదని అసంతృప్తి ఉన్నది. బహుశా ఆ ఎదురుగాలి గుర్తింపు వల్లనే కావచ్చు స్వయంగా అగ్రనాయకుడు వంద స్థానాల్లో ప్రచారానికి వస్తానని అంటున్నారు. గాలి అనుకూలంగా ఉండి ఉంటే అంత భారీ ప్రచారం అవసరమే లేదు. మొత్తంగా చెప్పాలంటే అటు అధికారపక్షానికైనా, ఇటు ప్రతిపక్షాలకైనా ఒక డోలాయమాన, అనిశ్చిత స్థితి నెలకొని ఉంది. ఈ స్థితిని డబ్బో, మద్యమో, కులమో, తాత్కాలిక ఆకర్షణలో ఎంతవరకు మార్చగలవనేది ఊహాతీతమైన అంశమే. ఇటువంటి స్థితిలో ఎవరికైనా మిగిలేది అరచేతిలో వైకుంఠం చూపే వాగ్దానాలు మాత్రమే. అధికార, ప్రతిపక్షాలు రెండూ పోటాపోటీగా వాగ్దానాలు కుమ్మరిస్తున్నాయి. అయితే ఇక్కడ కూడ ఒక చుక్కెదురు ఉంది. అధికార పక్షానికైతే ఇవే, ఇటువంటివే వాగ్దానాలు గతంలో కూడ చేశావు గదా, మళ్లీ వస్తే అమలు చేస్తావని నమ్మకం ఏమిటి అని ప్రశ్నలు ఎదురుకావచ్చు. ప్రతిపక్షానికైతే, మీ గతపాలనల్లో వాగ్దాన భంగాలెన్నో చూశాం గదా, మళ్లీ ఎట్లా నమ్మమంటారు అని ప్రశ్నలు రావచ్చు. ఈ వాగ్దానాల వెల్లువలో ప్రజలకు మిగిలింది ఆ నిలదీసే ప్రశ్నల పూచికపుల్లలు మాత్రమే. ఆ పుల్లలతోనైనా ఈ వరదలో జనం నిలదొక్కుకోగలరా, అవతలిగట్టు చేరగలరా? వీ

### సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# ప్రజలకేమీ ఒరగని చంద్రబాబు-ఢిల్లీ యుద్ధం

భారత రాజకీయాలలో కేంద్ర ప్రభుత్వ విధానాల మీద, పెద్దన్న వైఖరి మీద రాష్ట్ర ప్రభుత్వాలు, రాజకీయ నాయకులు, వివిధ జాతుల నాయకులు విమర్శలు గుప్పించడం, ఢిల్లీ పెత్తనం తగ్గాలని వాదించడం కొత్తదేమీ కాదు. 1947 దాకా కాంగ్రెస్ నాయకులతో సహా రాజకీయ ప్రముఖులందరూ భారతదేశం విభిన్న జాతుల నిలయమని అంగీకరించినవారే. రాష్ట్రాల ఏర్పాటు జాతి ప్రాతిపదికన జరగాలని కోరినవారే. ఆ కారణం వల్లనే భారత రాజ్యాంగం దేశాన్ని రాష్ట్రాల సమ్మేళనంగా నిర్వచించి, సమాఖ్య పద్ధతి అమలు కావాలని నిర్దేశించింది. కాని అన్ని జాతీయోద్యమ లక్ష్యాలను తుంగలో తొక్కినట్టుగానే కాంగ్రెస్ ప్రభుత్వం సమాఖ్య స్వభావాన్నీ కాలరాస్తూ వచ్చింది. కశ్మీర్, ఈశాన్య రాష్ట్రాల పోరాటాలు, ద్రవిడ ఉద్యమం, ఆనంద్‌పూర్ సాహిబ్ తీర్మానం, సర్కారియా కమిషన్ వంటి ఎన్నో సందర్భాలలో మళ్లీ మళ్లీ సమాఖ్య స్వభావాన్ని కేంద్ర ప్రభుత్వానికి గుర్తు చేయడానికి రాష్ట్రాల నాయకులు ప్రయత్నించారు. కాని ఢిల్లీ పాలకులు మాత్రమే కాక ఢిల్లీకి ఎదిగిన రాష్ట్రాల నాయకులు, చివరికి ప్రతిపక్ష పార్టీలు కూడ కేంద్ర ప్రభుత్వ అధికారం చేజిక్కగానే సమాఖ్య స్వభావాన్ని మరిచిపోతూ వచ్చారు. ఇక కేంద్రం మిథ్య అనే మరొక కొసదాకా వెళ్లిన చరిత్ర ప్రాంతీయ పార్టీగా పుట్టిన తెలుగు దేశం పార్టీది. మళ్లీ అదే తెలుగుదేశం పార్టీ అటు కేంద్రంలో అధికారం పంచుకున్నప్పుడు ఆ మాట మరిచిపోయింది. ఇటు రాష్ట్ర అధికారంలో ఉన్నప్పుడు రాష్ట్రంలో వికేంద్రీకరణను మరిచిపోయింది. ఈ మూడున్నర దశాబ్దాల చరిత్ర నేపథ్యంలో ఇప్పుడు హఠాత్తుగా ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు కేంద్ర ప్రభుత్వం మీద, ప్రధాని నరేంద్ర మోడీ మీద చేస్తున్న విమర్శలు, హుంకరింపులు వింటుంటే హాస్యాస్పదంగా ఉన్నాయి. మూడున్నర సంవత్సరాల పాటు ఆ కేంద్ర ప్రభుత్వంలోనే భాగం పంచుకుని, పెద్ద నోట్ల రద్దు, జిఎస్‌టి, భిన్నాభిప్రాయం పట్ల హంతక అసహనం, రాజ్యాంగ వ్యవస్థల విధ్వంసం వంటి ఎన్నో చర్యలలో తోడుదొంగగా ఉండి, ఇవాళ హఠాత్తుగా తిరుగుబాటు జెండా ఎగరేస్తున్నానంటే ఆశ్రితులు, అమాయకులు తప్ప మరెవరూ నమ్మజాలరు. ఆ తిరుగుబాటు తన వాటా దక్కనందుకో, తన మనుషుల మీద దాడులు జరుగుతున్నందుకో మాత్రమే గాని నిజంగా ఆంధ్రప్రదేశ్ ప్రజా ప్రయోజనాల కోసం కాదు. నిజంగా సమాఖ్య స్వభావాన్ని అమలు జరపాలనే నినాదమే చేపట్టదలచుకుంటే అది ప్రజా ప్రయోజనాల కోసమే, కేంద్రం తరలించుకుపోతున్న నిధులలో, వనరులలో ప్రజల వాటా కోసమే, కేంద్రం నుంచి ప్రజా అవసరాల కోసం అందవలసిన నిధుల కోసమే జరగాలి గాని, తన పార్టీలోని అక్రమ వ్యాపారస్తుల మీద సిబిఐ దాడులు జరిగినప్పుడే సమాఖ్య స్వభావమూ, ఢిల్లీ మీద యుద్ధమూ, మోదీ అక్రమాలూ గుర్తు రావడం ఫక్తు అవకాశవాద రాజకీయ ఎత్తుగడే తప్ప ప్రజా ప్రయోజనాలు కావు. దేశాన్ని ఏకం చేసి, మోదీని దించేస్తాం అని ఇవాళ బీరాలు పలుకుతున్నవారు, మూడున్నర సంవత్సరాలు మోదీని తామే ఎందుకు బలోపేతం చేశారో ప్రజలకు చెప్పుకోవలసి ఉంటుంది. మోదీకన్న మౌలికంగా భిన్నమైన, ప్రజా ప్రయోజనకర పాలన ఇవ్వడం తమ ఎజెండాలోనే లేదని తొమ్మిదిన్నర సంవత్సరాల ఉమ్మడి రాష్ట్ర పాలనలో, నాలుగున్నర సంవత్సరాల విభజిత ఆంధ్రప్రదేశ్ పాలనలో చూపుకున్నవారు మోదీని దించేయడం తమ లక్ష్యం అనడం హాస్యభరిత అవకాశవాదం. వీ

# మాల్దీవులలో కొలువుదీరిన కొత్త ప్రభుత్వం

- రాజేంద్రబాబు అర్విణి

ఇటీవల జరిగిన మాల్దీవుల సార్వత్రిక ఎన్నికలలో విపక్ష మాల్దీవియన్ డెమోక్రటిక్ పార్టీ అభ్యర్థి ఇబ్రహీం సోలిహ్ 58.3 శాతం ఓట్లు సాధించి అధ్యక్షుడిగా ఎన్నికయ్యారు. పాలక పక్షాన్ని ఓడించిన ఈ ప్రతిపక్ష పార్టీని మహమ్మద్ నషీద్ అన్న జర్నలిస్టు, సామాజిక కార్యకర్త 2003లో స్థాపించాడు. ప్రజాస్వామిక రాజకీయ వ్యవస్థకోసం డెమోక్రటిక్ పార్టీ చేపట్టిన ఉద్యమం కారణంగా 2008లో కొత్త రాజ్యాంగం అమలులోకి వచ్చి, అధ్యక్ష పదవికి ప్రత్యక్ష ఎన్నికలు జరిగాయి. ఆ ఎన్నికలలో మహమ్మద్ నషీద్ గెలుపొందాడు. కాని, కొన్ని రాజకీయ, సామాజిక కారణాలవల్ల, ప్రకృతి వైపరీత్యాల (2004లో పెను సునామీ సంభవించి మాల్దీవుల ఆర్థికస్థితి తలకిందులయి విదేశీ అప్పు భారం 2011 కల్లా తడిసి మోపడయింది) వల్ల అలజడులు మొదలయ్యాయి. పోలీసు, మిలిటరీ వర్గాలలో తిరుగుబాటు రావడం వల్ల నషీద్ రాజీనామా చేయాల్సి వచ్చింది. అరెస్ట్‌చేసి, ఉగ్రవాద నేరం మోపి 13 ఏళ్ల జైలుశిక్ష విధించారు. ఐక్యరాజ్య సమితి కలగజేసుకొని ఇది రాజకీయ కక్ష సాధింపు చర్య అని నిరసించి తక్షణమే విడుదలకు పిలుపునిచ్చింది. ఆ వెంటనే 2013లో జరిగిన ఎన్నికల్లో నషీద్ గెలిచినా సుప్రీం కోర్టు ఆయన ఎన్నికను రద్దు చేసింది. తిరిగి జరిగిన ఎన్నికలలో అబ్దుల్లా యామీన్ అధ్యక్షునిగా ఎన్నికయ్యాడు. నూతన అధ్యక్షునిపై హత్యా ప్రయత్నం జరిగింది. పెద్ద ఎత్తున ప్రభుత్వ వ్యతిరేక అల్లర్లు జరిగితే అబ్దుల్ యామీన్ దేశంలో ఎమర్జెన్సీ ప్రకటించాడు. ఇప్పుడు జరిగిన ఎన్నికల్లో యామీన్ 41.7 శాతం ఒట్లతో పరాజయం పాలవగా, మహమ్మద్ నషీద్ దగ్గరి మిత్రుడు, సమీప బంధువు ఇబ్రహీం సోలిహ్ అఖండ మెజారిటీతో గెలిచాడు. కోర్టు విధించిన అనర్హత కారణంగా నషీద్ పోటీలో లేకుండా, తన నమ్మకస్తుడయిన సోలిహ్ గెలుపుకోసం కృషి చేశాడు. ప్రవాసంలో ఉండి కూడా సోలిహ్ గెలుపులో ప్రధాన పాత్ర వహించాడు. శ్రీలంకకు నైరుతి దిక్కున ఉన్న ఈ దక్షిణాసియా దేశంలో మెజారిటీ ప్రజలు పాటించేది ముస్లిం మతం. ఆసియా, ఆఫ్రికా దేశాలతో సాంస్కృతిక, వ్యాపార సంబంధాలు బలంగా ఉన్నాయి. 1965లో బ్రిటిష్ వలస పాలన నుండి విముక్తి పొందిన మాల్దీవులు అనేక ఒడిదుడుకుల నెదుర్కొంది. నాసిర్ అన్న ఆ దేశ అధ్యక్షుడు వందల కోట్ల రూపాయల విలువచేసే డాలర్లు తీసుకొని సింగపూర్ పారిపోయాడు. ఆ తర్వాత అధ్యక్షునిగా ఎన్నికయిన మౌమూన్ అబ్దుల్ గయూమ్ 30 ఏళ్లపాటు అధ్యక్షునిగా కొనసాగి దేశానికి సుస్థిర పాలన అందించాడు. కాని ఆయన కాలంలో కూడా మూడుసార్లు సైనిక తిరుగుబాట్లు జరిగాయి. 1988 తిరుగుబాటు సమయంలో భారత విమాన దళం ఆ దేశానికి రక్షణగా నిలిచి అక్కడి ప్రభుత్వాన్ని, అధ్యక్షుని అస్తిత్వాన్ని కాపాడింది.

జనాభా కేవలం 4 లక్షల 30 వేలు అయినా ప్రపంచంలో గుర్తింపు పొందే విజయాలు సాధించింది. దక్షిణాసియా దేశాల ప్రాంతీయ సహకార సంస్థ (సార్క్) ఏర్పాటులో కీలక పాత్ర వహించి దాని సంస్థాపక సభ్యదేశాలలో ఒకటిగా నిలిచింది. మానవ అభివృద్ధి సూచికలో 'ఉత్తమ' శ్రేణి స్థాయి సాధించింది.

పరిపాలనలో ప్రజాస్వామ్య విలువలను వదిలేసిన అబ్దుల్ యామిన్‌ను ఓడించడంలో మాల్దీవుల ప్రస్థానంలో ఒక అంకం పూర్తయింది. నూతన అధ్యక్షుడు సోలిహ్ ముందు అనేక సవాళ్లు ఉన్నాయి. అందులో ముఖ్యమైనది ప్రతిపక్ష శక్తులనన్నిటిని ఒక తాటి పైకి తెచ్చి రాజకీయ సుస్థిరత సాధించడం. రెండవది మౌలిక వసతుల ఏర్పాటు కోసం చైనా నుండి వస్తున్న పెట్టుబడి వరదలను సమీక్షించి చైనా పై ఎక్కువగా ఆధారపడే పరిస్థితి నుండి దేశాన్ని నిజమయిన అలీన రాజ్యంగా తీర్చిదిద్దడం. వీ








❖ **హంసమంజీరాలు** – నవల – సి.యస్. రావు శివదత్త – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ – 192 పేజీలు, 1/8 డెమీ, రు. 130, ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, జి.ఎస్.ఐ. పోస్టు, బండ్లగూడ (నాగోల్), హైదరాబాద్ – 500068, అన్ని బ్రాంచిలలో



❖ **పుంస్త్రీ** – నవల – కన్నడం: డా. ప్రభాకర శిశిల – అనుసృజన: వేలూరి కృష్ణమూర్తి – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 200 పేజీలు, 1/8 డెమీ, రు. 120



❖ **అల గా... అల గా...** – కథలు – ఎల్.ఆర్. స్వామి – పాలపిట్ట బుక్స్ ప్రచురణ – 120 పేజీలు, 1/8 డెమీ, రు. 70

పై రెండు ప్రతులకు: పాలపిట్ట బుక్స్, ఇ.నెం. 16-11-20/6/1/1, 403, విజయ సాయి రెసిడెన్సీ, సలీమ్‌నగర్, మలక్‌పేట, హైదరాబాద్ – 500036



❖ **నిశ్శబ్ద యుద్ధం** – కవిత్వం – గొట్టిపర్తి యాదగిరిరావు – 96 పేజీలు, 1/8 డెమీ, రు. 90, ప్రతులకు: గొట్టిపర్తి యాదగిరిరావు, 339, అలేఖ్య టవర్స్, బైరామల్‌గూడ, హైదారాబాద్ – 500073, ఫోన్ : 8297277795



❖ **సింహగిరి వచనములు** – కృష్ణమాచార్య– సంపాదకుడు డా. ఎం. కులశేఖరరావు – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణ – 57 పేజీలు, 1/8 డెమీ, రు. 40



❖ **రసార్ణవ సుధాకరము** – స్వరజ్ఞ సింగభూపాల విరచితం – సంపాదకులు డాక్టర్ శ్రీరంగాచార్య – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణ – 564 పేజీలు, 1/8 డెమీ, రు. 250



❖ **నందగిరి ఇందిరాదేవి కథలు** – సంపాదకులు డా. చీదెళ్ల సీతాలక్ష్మి, పరిమి వెంకట సత్యమూర్తి – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణ – 118 పేజీలు, 1/8 డెమీ, రు. 50



❖ **రైతు రుణ విముక్తి** – రాళ్లబండి రాఘవశర్మ – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణ – 38 పేజీలు, 1/8 డెమీ, రు. 25

పై నాలుగు ప్రతులకు: తెలంగాణ సాహిత్య అకాడమి, కళాభవన్, రవీంద్ర భారతి ప్రాంగణం, హైదరాబాద్ – 500004; అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలు



❖ **చురక-2** – విద్య, సాహిత్య, సామాజిక విశ్లేషణలు – ఎన్. తిర్మల్ – ప్రజా సంస్కృతి – ఖమ్మం ప్రచురణ – 229 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు: యన్. తిర్మల్, ఇ.నెం. 16-3-179, పి.యన్.ఆర్. డూప్లెక్స్ కాలనీ, (పోస్టు) గొల్లగూడెం, ఖమ్మం – 507002, ఫోన్ : 9441864514, అన్ని పుస్తక కేంద్రాల్లో



❖ **ఏడుపదుల స్వాతంత్ర్యం** – వ్యాస సంకలనం – ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురణ–88 పేజీలు, 1/8 డెమీ, రు. 60



❖ **సైకాలజీ పెట్టుబడిదారీ వ్యవస్థ** – రాన్ రాబర్ట్స్ – సంక్షిప్త అనువాదం ముక్తవరం పార్థసారధి – ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురణ–80 పేజీలు, 1/8 డెమీ, రు. 60



❖ **నేనొక అంతర్జాల పోకిరిని** – భాజాపా అంతర్జాల సైన్యపు అంతఃపుర రహస్యాలు – స్వాతి చతుర్వేది – ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురణ–104 పేజీలు, 1/8 డెమీ, రు. 75



❖ **మహారాష్ట్రలో రైతుల మహా పాదయాత్ర** – తెలుగు: ఎస్ సరోజిని – ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురణ–63 పేజీలు, 1/8 డెమీ, రు. 40

పై నాలుగు ప్రతులకు: ప్రజాశక్తి బుక్‌హౌస్, ఇ.నెం. 27-1-54, కారల్‌మార్క్స్ రోడ్, గవర్నర్‌పేట, విజయవాడ – 2, ఫోన్:0866 – 2577533



❖ **కవిత్వ భాష** – సాహిత్య వ్యాసాలు – బొల్లోజు బాబా – 143 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: బొల్లోజు బాబా, ఇ.నెం. 30-7-31, సూర్యనారాయణ పురం, కాకినాడ, తూర్పుగోదావరి జిల్లా, ఫోన్: 0884 – 2368189, 9849320443



❖ **మోదీ నాలుగేళ్ల దుష్పరిపాలన – ఆర్థిక వ్యవస్థ అస్తవ్యస్థం** – భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు), ఆంధ్రప్రదేశ్ కమిటీ ప్రచురణ – 40 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు: సిపిఐ (ఎం) కమిటీ రాష్ట్ర కార్యాలయం, ఇ.నెం. 27-13-3, ఆకుల వారి వీధి, గవర్నర్‌పేట, విజయవాడ – 2, ఫోన్ : 0866-2577202



❖ **కసువు పువ్వులు** – కవితల కూర్పు – సంకలనం అగరం వసంత్ – బస్తి యువక బృందం ప్రచురణ – 120 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు: డా. ఎన్. వసంత్, బస్తి యువక బృందం, 2/1097, బస్తి, ఆవులపల్లి రోడ్డు, హోసూరు-635109, కృష్ణగిరి జిల్లా, తమిళనాడు

# తెలంగాణలో ఎన్నికలు - మేధావుల పాత్ర

***ప్రజల ఆకాంక్షలను నెరవేర్చడంలో టిఆర్ఎస్ ప్రభుత్వం విఫలమైందనీ, గత ప్రభుత్వాల విధానాలనే కొనసాగిస్తోందనీ, దీనికి వ్యతిరేకంగా ప్రజాపక్షం వహించే మేధావులు ప్రజాస్వామిక తెలంగాణ కోసం మరో ఉద్యమం నిర్మించాలనీ అంటున్నారు రామటెంకి అశోక్***

'విద్యార్థులలోను, మేధావులలోను ఇటీవల కాలంలో సిద్ధాంత, రాజకీయ కృషి తగ్గుముఖం పడుతున్నది. కొన్ని అనారోగ్యకర ధోరణులు తలెత్తాయి. రాజకీయాల గురించి గాని, మానవజాతి ఆదర్శాల గురించి గాని తాపత్రాయ పడనవసరమేమి ఇక లేదని కొందరు భావిస్తున్నారు' అని కామ్రేడ్ మావో చైనాలో విప్లవానంతరం మేధావుల గురించి అతి ముఖ్యమైన వాఖ్యానాలు చేశారు.

ప్రస్తుతం తెలంగాణ పరిస్థితులకు అన్వయిస్తే తెలంగాణ స్వపరిపాలన కోసం పోరాడిన మేధావులు తెరాస విధానాలను వ్యతిరేకిస్తూ బాహాటంగా ముందుకు రావాల్సిన సమయంలో మేధావుల పాత్ర గొప్పది. వీరు ఆయా సమాజాల్లోని వివిధ సమస్యల పైన, వాటి పరిష్కారం కోసం భావజాల వ్యాప్తి చేస్తుంటారు. ప్రధానంగా తెలంగాణలో మేధావులు ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఆవిర్భావానికి ఎనలేని కృషి చేశారు. తదనంతరం చాలా మార్పులు చోటుచేసుకున్నాయి.

ప్రజలకు చైతన్యాన్ని, ధైర్యాన్ని, రక్షణలకు, హక్కులకు గ్యారంటీని, ప్రశ్నించేతత్వాన్ని అందించే మేధావులలో కొందరు ప్రభుత్వంలో ఇమిడిపోవడంతో పాలకులు - ప్రజలపై తమ ఉక్కుపాదాలతో అణచివేతతో విరుచుకుపడుతున్న సందర్భం నేడు తెలంగాణ రాష్ట్రంలో ఆవరించి ఉన్న వాస్తవ స్థితిలో... ప్రజలకు రక్షణ ఎవరు? అనే భయాందోళన వాతావరణం ఛేదించాల్సి ఉన్నది. అది మేధావుల బాధ్యతే!

తెలంగాణ ఉద్యమంలో పాల్గొన్న ప్రజల నిజమైన ఆకాంక్షలు నెరవేర్చే కార్యక్రమాల రూపకల్పన జరగకుండానే - అర్థాంతరంగా తెరాస ప్రభుత్వం అసెంబ్లీని రద్దుచేసి ముందస్తు ఎన్నికలకు తెరతీసింది. కనీసం టిఆర్ఎస్ అధికారంలోకి రావడానికి కారణమైన దాని మేనిఫెస్టోలోని అంశాలు అమలులోకి తీసుకురాలేదు. పైగా మళ్లీ తెలంగాణ సెంటిమెంట్‌ను రెచ్చగొట్టే ప్రయత్నాలకు కెసిఆర్ తెరలేపుతున్నాడు. సెంటిమెంట్లను ఎగదోసి మంట రాజేసి, ఎన్నికల్లో లబ్ధిపొందాలని చూస్తున్నాడు. ఈ నాలుగు సంవత్సరాల కాలంలో తెలంగాణకు వ్యతిరేకంగా నిలిచిన వారందరినీ రాజకీయ పునరేకీకరణ పేరుతో తమలో ఇముడ్చుకున్న కెసిఆర్ తెలంగాణ ప్రజల ఆత్మాభిమానాన్ని అడుగడుగునా అవమానించిన వాళ్లతో చెట్టాపట్టాలేసుకు తిరిగి నేడు సొరకాయ రాజకీయాలు మొదలెట్టాడు. ఈ సందర్భంలో ప్రజాస్వామిక తెలంగాణ ఆశించిన ప్రజలు మరో దఫా మోసపోకుండా జాగరూకతతో ఉండాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

తెలంగాణ పోరాట వారసత్వాన్ని పుణికి పుచ్చుకొని స్వావలంబన, స్వపరిపాలన కోసం పోరాడిన మేధావులు, ప్రజాస్వామిక వాదులు నేటి వరకు తెరాస అనుసరించిన దళారీ, నిరంకుశ, బూర్జువా, భూస్వామ్య, సామ్రాజ్యవాద విధానాలను వ్యతిరేకిస్తూ బాహాటంగా ముందుకు వచ్చి తమ కళాలను, గళాన్ని ఎక్కుపెట్టాల్సిన సందర్భం ఇది. ప్రజల ఆకాంక్షలను ఎత్తిపట్టాల్సిన అత్యవసర స్థితి ఎంతైనా ఉంది. తెలంగాణ వంటి క్రియాశీల సమాజంలో ప్రజల పాత్ర చాలా కీలకమైంది. కనుక ఆ ప్రజల ఆకాంక్షలకు విరుద్ధంగా ఎవరు నడిచినా వారు చరిత్ర పెంటకుప్పలోకి విసిరివేయబడతారనే వాస్తవాన్ని కెసిఆర్‌కు రుచి చూపించాల్సిన అవసరం నేడున్నది.

దేశంలో అభివృద్ధి జరగాలంటే దేశంలోని భూములు, ప్రకృతి వనరులు సామ్రాజ్యవాదులకు ధారాదత్తం చేయాల్సిందేనని, ఎన్ని నిబంధనలకైనా తలొగ్గి విదేశీ పెట్టుబడులు తెచ్చుకోవాల్సిందే అనే విధానంతో కెసిఆర్, నరేంద్ర మోడీ తీసుకువచ్చిన భూ ఆర్డినెన్స్‌కు పార్లమెంట్‌లో సంపూర్ణ మద్దతు ఇచ్చి, మోడీ ప్రభుత్వానికి అండగా ఉంటూ - ముందస్తు అసెంబ్లీ రద్దు ఒప్పందం కుదుర్చుకున్నారు. ఈ రహస్య ఒప్పందంలో భాగమే రేపు తెలంగాణలో ఎన్నికలు. ఆ చీకటి ఒప్పందంలో భాగంగా దేశ వ్యాప్తంగా గల మేధావుల, హక్కుల నేతల అరెస్టులు - ముఖ్యంగా మన రాష్ట్రంలో విరసం నేత వరవరరావు అరెస్టులను చూడక తప్పదు.

దేశంలో 29వ రాష్ట్రంగా తెలంగాణ ఏర్పడడంతో పాలక వర్గాలు తెలంగాణ రాష్ట్ర ఉద్యమంలో క్రియాశీలంగా పాల్గొన్న మేధావులను తమలో ఇముడ్చుకున్నాయి. ఇది ఒక చేదు వాస్తవం. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం మొదలు, మలి తెలంగాణ సాయుధ పోరాటం వరకు విప్లవ స్రవంతిలో మేధావులు భాగంగా ఉన్నారు. అట్లాగే విప్లవోద్యమం, ప్రజాస్వామిక తెలంగాణ ఆకాంక్షను ఎప్పుడూ పెనవేసుకునే ఉన్నాయి. దేశంలో సమూలమైన మార్పులు కోరుతూ విప్లవ మార్గం అనుసరిస్తూనే తెలంగాణ రాష్ట్ర డిమాండ్‌ను ఎత్తిపట్టింది ఒక సెక్షన్. అయితే తెలంగాణ రాష్ట్రం ఏర్పడితే తమ లక్ష్యం నెరవేరినట్లే అని భావించింది మరో సెక్షన్. ఈ సెక్షన్ తెలంగాణ రాష్ట్రం కోసం మలిపోరాటం ప్రారంభం కాగానే తెలంగాణ బూర్జువా వర్గానికి అనుకూలంగా మారింది. పర్యవసానంగా విప్లవ ప్రజాస్వామిక భావజాలం ఉన్న కొందరు మేధావులు టిఆర్ఎస్ ప్రభుత్వ పథకాలకు ఆకర్షించబడడం ప్రజలకు నష్టదాయకంగా మిగిలింది. ఉదాహరణకు ఈ నాలుగు సంవత్సరాల పాలన చూడవచ్చు.

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో చంద్రబాబు తొమ్మిదేళ్ల పాలనలో విజన్ 2020 అభివృద్ధి పేరిట తెలంగాణలో జరిగిన విధ్వంసానికి, ఇప్పుడు జరుగుతున్న విధ్వంసానికి ఎలాంటి తేడా లేదు. ఆ తొమ్మిదేళ్లు

# ప్రజామేధావుల నిర్బంధం - న్యాయవ్యవస్థ వైఖరి

*రెండు నెలలకు పైగా దేశవ్యాప్తంగా ప్రజా మేధావుల మీద జరుగుతున్న నిర్బంధకాండ పట్ల న్యాయస్థానాలు వ్యవహరిస్తున్న తీరు రాజ్యస్వభావాన్ని అర్థం చేసుకోవడానికి సరైన సాధనమని అంటున్నారు* **ఎన్. వేణుగోపాల్**

పుణె పోలీసులు ఆగస్ట్ 28న దేశవ్యాప్తంగా దాడులు, సోదాలు జరిపి, సుధా భరద్వాజ్, గౌతమ్ నవ్లాఖా, వరవరరావు, అరుణ్ ఫరేరా, వర్నన్ గోంజాల్వేస్‌లను అరెస్టు చేసిన భీమా కోరేగాం హింసాకాండ కేసు గత రెండు నెలలుగా రోజుకొక మలుపు తిరుగుతూ రాజ్యస్వభావాన్ని అర్థం చేసుకోవడానికి తగిన పాఠ్య పుస్తకంగా మారుతున్నది. ఈ కేసు ఎక్కడ ప్రారంభమైందో, ఎలా వంకరలు తిరుగుతూ వచ్చిందో చూస్తే, మన దేశంలో పోలీసు వ్యవస్థ ఎంత అబద్ధాల పునాది మీద నిర్మితమయిందో తేలుతుంది. పైపై చూపులకు కూడ స్పష్టమైపోయే అబద్ధాల కేసుతో వ్యవహరించడంలో కింది మెజస్ట్రేటు కోర్టునుంచి పై సుప్రీం కోర్టు దాకా ప్రదర్శించిన మెతక వైఖరి, మిలాఖత్తు వైఖరి చూస్తే న్యాయవ్యవస్థ ఎన్ని మాటలు చెప్పినప్పటికీ, అంతిమంగా వర్గపోరాట సందర్భంలో తాను పాలకవర్గ రాజ్యాంగయంత్రంలో అవిభాజ్యమైన భాగాన్నని చూపుకుంటుందో తేలుతుంది.

అది అబద్ధపు కేసు అనీ, నిజంగా భీమా కోరేగాం హింసాకాండకు బాధ్యులైన శంభాజీ భిడే, మిళింద్ ఎక్బోటే, తదితర హిందుత్వ తీవ్రవాదులను తప్పించడానికి పుణె పోలీసులు చేస్తున్న ప్రయత్నమనీ ఇప్పటికే తేటతెల్లమయింది. ఈ అబద్ధపు కేసును పోలీసులు తయారు చేస్తున్న తీరు, పది నెలలుగా అమలుచేస్తున్న చట్టవ్యతిరేక కార్యకలాపాలు వివరంగా చూస్తే ఈ వ్యవస్థ ఎంత దుర్మార్గంగా, అబద్ధాలకోరుగా, అమానవీయంగా, ప్రజా ఉద్యమాల పట్ల కక్షసాధింపు వైఖరితో ఉందో స్పష్టమవుతుంది.

భీమా కోరేగాం యుద్ధానికి రెండువందల సంవత్సరాలు నిండిన సందర్భంగా ఆ ఉత్సవానికి ఊరేగింపుగా వెళ్తున్న దళితులపై జనవరి 1న హింసాకాండ జరిగింది. ఒక దళితుడి హత్య, దళితుల ఆస్తి విధ్వంసం, దాడులు, దళితులు గౌరవించే ఒక చారిత్రక కట్టడమైన సమాధిని కూల్చివేయడం జరిగాయి. ఈ హింసాకాండ జరిగిన వెంటనే

---

విస్తృతంగా చర్చించబడిన స్వావలంబన, స్వపరిపాలన, నీళ్లు, నిధులు, నియామకాలు అనే అంశాలు ఇప్పుడు కెసిఆర్ చెప్పిన బంగారు తెలంగాణలో చర్చకు రావాల్సిందే! ప్రజలు కొంతవరకు భాగస్వాము లయ్యారు కాని, స్వావలంబన దిశగా సాగని అవే చంద్రబాబు విధానాలను కెసిఆర్ కొనసాగించాడు.

రాష్ట్రంలో రైతాంగ ఆత్మహత్యలు ఆల్‌టైం రికార్డులుగా సాగుతున్నాయి. పౌర ప్రజాస్వామిక హక్కులు కాలరాయబడ్డాయి. నక్సలైట్ల ఎజెండాను అమలు చేస్తానన్న కెసిఆర్ వరుస ఎన్‌కౌంటర్లకు పాల్పడ్డాడు. రియల్ ఎస్టేట్ మాఫియా, ఇసుక మాఫియాలను బలోపేతం చేశాడు. దళితులకు, పేదలకు, బడుగు బలహీన వర్గాలకు భూ పంపిణీ పథకం మూలన పెట్టాడు. ఆదివాసి చట్టాలను అమలుపరచకపోగా – హరితహారం పేరుతో పోడు భూములను బలవంతంగా గుంజుకున్నాడు. విమానాశ్రయం పేరుతో 1/70 చట్టాలను బలహీన పరుస్తున్నాడు. కెజి టు పిజి ఉచిత విద్యను అటకెక్కించి, నేడు సమాన విద్య కోసం పోరాడుతున్న అఖిల భారత విద్యా పోరాట యాత్ర నాయకులను, ప్రొఫెసర్లను అక్రమంగా నిర్బంధిస్తున్నాడు.

అనేక ప్రజాకర్షక పథకాలైన గొర్రెలు, బర్రెల పథకాలు, చీరల పంపకం, మిషన్ కాకతీయ, మిషన్ భగీరథ, వివిధ రకాల ప్రాజెక్టుల రీ డిజైనింగ్‌ల పేరుతో ప్రజా ధనాన్ని అప్పనంగా లూటీ చేసి ఖజానాను నింపుకొని ముందస్తుకు తెరలేపాడు. ప్రజల్ని మొత్తంగా మూఢత్వంలోకి దింపాడు.

సందులో సడేమియా అన్నచందంగా కాంగ్రెస్, బిజెపి, టిడిపి లాంటి పార్టీలు అధికార దాహాన్ని తీర్చుకోవాలని వేగంగా పావులు కదుపు తున్నాయి. వీరు స్వావలంబన, వికేంద్రీకరణ, స్వేచ్ఛా, స్వాతంత్ర్యం, ప్రజాస్వామ్యం ప్రాతిపదిక మీద ప్రజలు చేసే పోరాటాలను అణచివేస్తారే తప్ప సమర్థించరు. ఈ విషయాలు మేధావులకు అనుభవంలోకి వచ్చి ఉంటాయి. ఈ సిద్ధాంతాలతో మోసపోకుండా ఈ సామాజిక సెక్షన్లన్నీ ఏకమై తమ డిమాండ్ల సాధన కోసం మరో దఫా పోరాటాలకు సిద్ధం కావాలి. కార్మికులు, ఉద్యోగులు, ఉపాధ్యాయులు, విద్యార్థినీ విద్యార్థులు, యువజనులు, మహిళలు, కవులు, కళాకారులు సమరశీల పోరాటానికి సిద్ధమై ప్రజాస్వామిక తెలంగాణ ఏర్పాటులో ముందుకు వెళ్లాలి. మేధావులు మార్గనిర్దేశం చేయాలి. కార్యోన్ముఖులుగా మిగలాలి. మిలియన్ మార్చ్‌లు, సకల జనుల సమ్మెలు, సాగర హారాలు, హర్తాళ్‌లు లాంటి పిలుపులతో పాలక ప్రభుత్వాలకు ప్రజాబలం తెలిసివచ్చేలా కార్యక్రమాల రూపకల్పన జరగాలి.

టిఆర్ఎస్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత దాని విధులు ప్రజా వ్యతిరేకమైనవనే విషయం ఇప్పటికే రుజువు చేయబడింది. ఏవో కారణాలతో టిఆర్ఎస్ (గత) ప్రభుత్వంలో భాగస్వామ్యం వహిస్తూ వివిధ పదవుల్లో కొనసాగేవారు గాని, మద్దతు తెలిపేవారు గాని ప్రజల ఆకాంక్షలకు అనుగుణంగా తమ పాత్రలను పునర్ నిర్మించుకోవాల్సిన అవసరం, బాధ్యత నేడున్నది.

*(రచయిత ఐఎఫ్‌టియు రాష్ట్ర నాయకులు)* వీ

నమోదైన ఎఫ్ఐఆర్ (ఫస్ట్ ఇన్ఫర్మేషన్ రిపోర్ట్) లో స్పష్టంగా ఆ నేరస్తుల పేర్లు రాసినా వారి మీద ఎటువంటి చర్యా తీసుకోని పోలీసులు, అదే సంఘటన మీద జనవరి 8న పుణెలోని ఒక వ్యాపారి నమోదు చేసిన రెండో ఎఫ్ఐఆర్ మీద మాత్రం చర్యలు ప్రారంభించారు. ఈ రెండో ఎఫ్ఐఆర్ మొదటిసారి భీమా కోరేగాం హింసాకాండను డిసెంబర్ 31న పుణెలో జరిగిన ఎల్గార్ పరిషద్ సభతో జోడించింది. ఆ సభను మావోయిస్టులు ఏర్పాటు చేశారని, అక్కడ ఇచ్చిన ఉపన్యాసాల వల్ల, పాడిన పాటల వల్ల హింసాకాండ జరిగిందని ఆరోపించింది.

అలా భీమా కోరేగాం హింసాకాండకు అసలు బాధ్యులను తప్పించి, దాన్ని మావోయిస్టుల మీదికి నెట్టడంతో ప్రారంభమైన కుటిల యత్నాలు మార్చ్ 6 నాటికి మరొక మలుపు తిరిగి, అప్పటివరకూ కేవలం విధ్వంసం, హత్యా ప్రయత్నం వంటి ఆరోపణలు ఉన్న కేసులో నేరపూరిత కుట్ర ఆరోపణలను చేర్చారు. అంటే ఆ స్థలంలో, ఆ సమయంలో లేనివారిని కూడ నిందితులుగా చేర్చడానికి కుట్ర మొదలయింది.

ఏప్రిల్ 17న నాటికి ఆ కుట్ర మరింత ముందుకు సాగి, ఎల్గార్ పరిషద్‌తో ఎటువంటి సంబంధమూ లేని, ఆ సభకు కనీసం శ్రోతలుగా కూడ వెళ్లని నాగపూర్‌కు చెందిన న్యాయవాది సురేంద్ర గాడ్లింగ్, ఢిల్లీకి చెందిన పరిశోధక విద్యార్థి రోనా విల్సన్ ఇళ్ల మీద, ఎల్గార్ పరిషద్ నిర్వాహకులలో ఒకరైన సుధీర్ ధావ్లె ఇంటి మీద పుణె పోలీసులు దాడి చేశారు.

మే 17 నాటికి కేసును అత్యంత దుర్మార్గమైన చట్టవ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం (అన్ లాఫుల్ ఆక్టివిటీస్ ప్రెవెన్షన్ ఆక్ట్ – ఊపా) పరిధిలోకి తీసుకువచ్చారు. జూన్ 6 నాటికి మరొక మలుపు తిప్పి, రోనా విల్సన్ లాప్ టాప్‌లో ఉత్తరాలు దొరికాయని, ఆ ఉత్తరాలలో ప్రధాని నరేంద్ర మోడీ హత్యకు కుట్ర జరిగిందనే ఆధారాలున్నాయని, కొన్ని ఉత్తరాలు బైటపెట్టారు.

ఆరోజున సుధీర్ ధావ్లే, షోమా సేన్, సుధీర్ గాడ్లింగ్, రోనా విల్సన్, మహేశ్ రౌత్‌లను అరెస్టు చేశారు. ఆ ఉత్తరాలు అబద్ధమనీ, పోలీసుల సృష్టి అనీ ఎందరో మేధావులు, నిపుణులు, చివరికి రాజకీయ పార్టీల నేతలు కూడ ఖండించారు.

ఆ తర్వాత ఆగస్ట్ 28న ఏకకాలంలో దేశవ్యాప్తంగా ఆరు నగరాలలో, పది మంది ప్రజా మేధావుల ఇళ్ల మీద దాడులు, సోదాలు నిర్వహించి, చివరికి వారిలో ఐదుగురిని అరెస్టు చేస్తున్నామని ప్రకటించారు. ఈ దాడులు, సోదాలు, అరెస్టులు ఏ ఒక్క చట్ట నిబంధననూ పాటించకుండా, చట్ట పరిధులను ఉల్లంఘిస్తూ జరిగాయి.

ఇక్కడిదాకా ఎనిమిది నెలల పాటు సాగినది పుణె పోలీసుల అక్రమాల కథ. ఆ తర్వాత కూడ ఆ అక్రమాలు కొనసాగాయి గాని, ఇక్కడి దాకా చూస్తే, హింసాకాండకు బాధ్యులెవరో వారిమీద కేసు పెట్టలేదు. దాఖలైన ఎఫ్ఐఆర్ మీద చర్య తీసుకోలేదు. వారం రోజుల తర్వాత అబద్ధపు ఆరోపణలతో తప్పుడు ఎఫ్ఐఆర్ సృష్టించి, దాని మీద వెంటనే చర్యలు మొదలుపెట్టారు.

ఒక గ్రామంలో ఊరేగింపు మీద జరిగిన హింసాకాండ కేసును పొరుగు నగరంలో జరిగిన సభతో ముడిపెట్టారు. ఆ సభకు నేరపూరిత కుట్ర ఆరోపణను జోడించి దేశవ్యాప్తంగా ఎక్కడి నుంచి అయినా నిందితులను చేర్చే అవకాశం కల్పించుకున్నారు. కేసును మరింత దుర్మార్గమైన చట్టం పరిధిలోకి తెచ్చారు. ఆ సభతో సంబంధం లేని వారి ఇళ్ల మీద చట్టవ్యతిరేకమైన దాడి చేశారు. అరెస్టులు చేశారు. తప్పుడు పత్రాలు సృష్టించి ఆ దాడిలో దొరికాయని చెప్పారు. తాము ఉద్దేశపూర్వకంగా సృష్టించిన తప్పుడు పత్రాలే సాక్ష్యాధారాలన్నట్టుగా ప్రచారసాధనాలను వాడుకుని ప్రజా మేధావుల ప్రతిష్ఠను భంగపరచడానికి ప్రయత్నించారు. చివరికి దేశమంతటా మరిన్ని దాడులు చేశారు. మరిన్ని అరెస్టులు చేశారు.

జనవరి 2 నుంచి ఆగస్ట్ 28 దాకా సాగిన ఈ పోలీసు అక్రమాల కథలోకి ఆగస్ట్ 29న న్యాయస్థానాలు ప్రవేశించాయి. సైద్ధాంతికంగా చూస్తే అప్పటిదాకా పోలీసులు చేసిన అక్రమాలను సవరించడం, పోలీసులు సృష్టించిన గందరగోళాన్ని పరిష్కరించడం, బాధితులకు న్యాయం అందించడం తన బాధ్యతగా గుర్తించి ఆ పనిలోకి దిగవలసిన న్యాయవ్యవస్థ ఆచరణలో మొత్తం వ్యవహారాన్ని మరింత జటిలంగా మార్చింది. నిందితులనూ, వారి కుటుంబాలనూ, న్యాయవాదులనూ, ప్రజాసంఘాలనూ, మొత్తంగా ప్రజాస్వామిక పౌరసమాజాన్నే చట్టపు చిట్టడివిలో దారితప్పేలా, అసలు సమస్యలు వదిలి, చట్టపరమైన చిక్కుముడులను విప్పడమే ప్రధాన పని అయ్యేలా చేసింది.

మొట్టమొదట, ఆగస్ట్ 28న దాడులు, సోదాలు, అరెస్టులు ప్రారంభం కాగానే రొమిలా థాపర్ , దేవకీ జైన్, ప్రభాత్ పట్నాయక్, మాయా దారూవాలా, సతీశ్ దేశ్‌పాండే సుప్రీంకోర్టు తలుపు తట్టారు. ఈ దాడులు, అరెస్టులు చట్టవ్యతిరేకంగా జరుగుతున్నాయనీ, ఈ కేసును దర్యాప్తు చేస్తున్న పుణె పోలీసుల దురుద్దేశాలు స్పష్టంగా కనబడుతున్నాయనీ, అందువల్ల మరొక ఉన్నత, నిష్పాక్షిక విచారణా సంస్థకు ఈ విచారణను అప్పగించాలనీ వాళ్లు కోరారు.

సుప్రీం కోర్టు ఆ విజ్ఞప్తి మీద విచారణను వాయిదా వేసి వెంటనే మాత్రం నిందితులను అరెస్టు చేయగూడదనీ, గృహ నిర్బంధంలో ఉంచాలనీ మధ్యంతర ఉత్తర్వులు ఇచ్చింది. హాస్యాస్పదమైన విషయమేమంటే, గృహ నిర్బంధం అనే మాట భారత శిక్షా స్మృతులలో, చట్టాలలో లేదు. గృహ నిర్బంధంలో ఉంచమని ఆదేశిస్తున్నప్పుడు, అది ఏమిటో నిర్వచించవలసిన సుప్రీం కోర్టు ఆ పని చేయలేదు. ఇక వేరు వేరు రాష్ట్రాల పోలీసులు గృహ నిర్బంధం అనే మాటను తమ ఇష్టం వచ్చినట్టుగా అర్థం చేసుకుని, అమలు చేశారు.

అప్పటికే అరెస్టు చేసి పుణె తీసుకువెళ్లిన వరవరరావు, అరుణ్ ఫరేరా, వర్నన్ గోన్జాల్వెస్‌లను వెనక్కి తీసుకువచ్చారు. సుధా భరద్వాజ్, గౌతమ్ నవ్లాఖాలను వాళ్ల ఇళ్లలోనే ఉంచారు. అందరి ఇళ్ల ముందు పోలీసు కాపలా ఏర్పాటు చేసి, వారిని ఎవరూ కలవకుండా ఆంక్షలు విధించారు.

ఇటు కేసు సుప్రీం కోర్టు ముందుకు రాకముందే సుధా భరద్వాజ్ ను, గౌతమ్ నవ్లాఖాను అరెస్టు చేయడానికి పుణె పోలీసులు అనుసరించిన పద్ధతి చట్టవ్యతిరేకంగా ఉన్నదని, ప్రత్యేకించి వారి అరెస్టుకు ఉపయోగించిన ట్రాన్సిట్ రిమాండ్ అక్రమమైనదని, కనుక ఆ అరెస్టులను కొట్టివేయాలని పంజాబ్–హర్యానా హైకోర్టును, ఢిల్లీ హైకోర్టును కోరగా, ఆ రెండు కోర్టులు కూడ నిందితుల వాదనను అంగీకరించి, వారిద్దరినీ గృహ నిర్బంధంలో ఉంచాలని ఆదేశించాయి.

మరొక పక్క సుప్రీం కోర్టు తన ముందున్న పిటిషన్ మీద సెప్టెంబర్ 6, 17, 19, 20 తేదీల్లో వాదనలు విని 28న తీర్పు ప్రకటించింది. ముగ్గురు న్యాయమూర్తులలో ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ దీపక్ మిశ్రా, న్యాయమూర్తి జస్టిస్ ఎ.ఎం. ఖాన్విల్కర్ ఇద్దరూ ఒక వైఖరి తీసుకోగా, జస్టిస్ డి.వై. చంద్రచూడ్ భిన్నమైన వైఖరి తీసుకున్నారు.

మెజారిటీ తీర్పు ఈ కేసు దర్యాప్తును మరొక సంస్థకు అప్పగించవచ్చునా లేదా అనేదే ప్రధానమైన ప్రశ్నగా తీసుకుని, పుణె పోలీసుల దర్యాప్తును ఆమోదించింది. మిగిలిన విషయాల్లో తాము జోక్యం చేసుకోలేమని, అందులో చట్టపరమైన పరిహారాల కోసం తగిన న్యాయస్థానాలకు వెళ్లాలని సూచించింది.

జస్టిస్ చంద్రచూడ్ మాత్రం పుణె పోలీసుల దర్యాప్తు దురుద్దేశ పూరితంగా ఉన్నదని తెలుతున్నదని, అందువల్ల న్యాయస్థానం పర్యవేక్షణలో మరొక ఉన్నతాధికార సంస్థ దర్యాప్తు చేయాలని అన్నారు. ఈ వాదనలు నాలుగు వారాలు జరగగా ఆ కాలమంతా నిందితుల గృహనిర్బంధం కొనసాగింది. నిందితులు తగిన న్యాయస్థానాలకు వెళ్లి, తగిన చట్టపరమైన సహాయం పొందడానికి గాను మరొక నాలుగువారాల పాటు గృహ నిర్బంధాన్ని పొడిగిస్తున్నామని తుదితీర్పులో అన్నారు.

అప్పటికింకా సుప్రీం కోర్టు సూచన మేరకు చట్టపరమైన పరిహారాల కోసం కింది కోర్టులకు వెళ్లే అవకాశం మిగిలి ఉండింది. ఈ అవకాశాలు కేసు విచారణ జరుగుతున్న పుణె సెషన్స్ కోర్టులో బెయిల్ దరఖాస్తు చేసుకోవడం, ఆయా రాష్ట్రాల హైకోర్టులలో ట్రాన్సిట్ రిమాండ్ లను సవాల్ చేయడం, ముంబాయి హైకోర్టులో అసలు కేసును రద్దు చేయమని (క్వాష్ చేయమని) పిటిషన్ వేయడం. అలాగే అసలు సుప్రీం కోర్టు తీర్పును సవాల్ చేస్తూ, సమీక్ష జరపమని కోరడానికి మరొక అవకాశం ఉండింది. నిందితుల న్యాయవాదులు ఈ అన్ని అవకాశాలనూ వినియోగించుకోవడానికి ప్రయత్నాలు ప్రారంభించారు.

ఢిల్లీ హైకోర్టులో అప్పటిదాకా నిలిపి ఉంచిన గౌతమ్ నవ్లాఖా పిటిషన్ మీద విచారణ సుప్రీం కోర్టు తీర్పు తర్వాత కొనసాగింది. అక్టోబర్ 1న ఆ కేసులో జస్టిస్ ఎస్ మురళీధర్, జస్టిస్ వినోద్ గోయల్‌లు ఇచ్చిన తీర్పులో, గౌతమ్ నవ్లాఖాను అరెస్టు చేయడానికి ఉపయోగించిన ట్రాన్సిట్ రిమాండ్ చట్టబద్ధమైన నిబంధనలను పాటించలేదని, అది చట్టపరంగా చెల్లదని, అందువల్ల గౌతమ్ నవ్లాఖా అరెస్టు గాని, గృహ నిర్బంధం గాని చెల్లవని ప్రకటించారు. ఈ హైకోర్టు తీర్పును సవాల్ చేస్తూ, కొట్టివేయమని కోరుతూ మహారాష్ట్ర రాష్ట్రప్రభుత్వం సుప్రీం కోర్టులో దాఖలు చేసిన పిటిషన్ అక్టోబర్ 29న విచారణకు రానుంది.

ఈలోగా గౌతమ్ నవ్లాఖా, ఆనంద్ తేల్ తుంబ్డే, స్టాన్ స్వామి, అరుణ్ ఫరేరా, వర్నన్ గోంజాల్వెస్‌లు తమ మీద అక్రమంగా చేసిన నేరారోపణలు కొట్టివేయాలని వేసిన కేసులో తీర్పు ఇస్తూ గౌతమ్ నవ్లాఖా, స్టాన్ స్వామిలను నవంబర్ 1 వరకు అరెస్టు చేయగూడదని ముంబై హైకోర్టు ఆదేశించింది.

అలాగే పంజాబ్ హర్యానా హైకోర్టులో అప్పటిదాకా నిలిపి ఉంచిన సుధా భరద్వాజ్ పిటిషన్ మీద విచారణ జరిగితే ఢిల్లీ హైకోర్టు ఇచ్చిన తీర్పు లాంటి తీర్పు వచ్చే అవకాశం కనబడక, ఆ పిటిషన్ ను ఉపసంహరించుకున్నారు.

అదే విధంగా వరవరరావు ట్రాన్సిట్ రిమాండ్ మీద ఆయన సహచరి హేమలత దాఖలు చేసిన పిటిషన్‌ను కూడ తెలంగాణ-ఆంధ్రప్రదేశ్ హైకోర్టు రద్దు చేసింది.

సుధా భరద్వాజ్ ట్రాన్సిట్ రిమాండ్ మీద సవాల్ హైకోర్టులో ఉపసంహరణ జరిగింది గనుక అనివార్యంగా ఆమె పుణెలో బెయిల్ దరఖాస్తు చేసుకోవలసి వచ్చింది. అలాగే, అరుణ్ ఫరేరా, వర్నన్ గోంజాల్వెస్‌లు కూడ పుణెలో బెయిల్ కోరారు. కాని ఈ మూడు బెయిల్ పిటిషన్ల మీద తాత్సారం చేసిన పుణె సెషన్స్ కోర్టు చివరికి, గృహ నిర్బంధం ముగిసే చివరి రోజైన అక్టోబర్ 26న బెయిల్ నిరాకరించింది. ఆ అదను కోసమే పొంచి చూస్తున్నట్టుగా పుణె పోలీసులు వెంటనే అక్టోబర్ 26 రాత్రే వారిద్దరినీ అరెస్టు చేసి పుణె కోర్టులో హాజరుపరిచి, జైలుకు పంపారు. సుధా భరద్వాజ్‌ను అక్టోబర్ 27 ఉదయం ఫరీదాబాద్‌లో అరెస్టు చేశారు.

తన అరెస్టుకు దారితీసిన ట్రాన్సిట్ రిమాండ్‌ను, సోదాను, తన కోసం క్రాంతి, సత్యనారాయణ-పవన, కూర్మనాథ్-అనలల ఇళ్లలో జరిగిన సోదాలను సవాల్ చేస్తూ వరవరరావు తెలంగాణ హైకోర్టులో ఒక రిట్ పిటిషన్ వేశారు. దాని మీద అక్టోబర్ 25న జరిగిన విచారణలో ట్రాన్సిట్ రిమాండ్ వ్యవహారంలోకి వెళ్లకుండానే, గృహ నిర్బంధాన్ని మరొక మూడు వారాలు పొడిగిస్తామని, ఈలోగా తగిన న్యాయస్థానాలలో పరిహారం పొందవచ్చునని జస్టిస్ సి.వి. నాగార్జున రెడ్డి, జస్టిస్ టి. అమర్‌నాథ్ గౌడ్ తీర్పు ఇచ్చారు.

అలా వరవరరావు గృహ నిర్బంధం నవంబర్ 15 దాకా పొడిగించడం జరిగింది. ఈ తీర్పును తమకు కూడ వర్తింపజేసి తమ గృహ నిర్బంధాన్ని పొడిగించాలని అరుణ్ ఫరేరా, వర్నన్ గోంజాల్వెస్‌లు చేసిన విజ్ఞప్తిని ముంబాయి హైకోర్టు తిరస్కరించింది.

ఈలోగా అసలు భీమా కోరేగాం కేసులో మరొక కీలకమైన పరిణామం జరిగింది. భారత న్యాయవ్యవస్థలో ఏ కేసులోనైనా ప్రాసిక్యూషన్ 90 రోజులలోపు నిందితుల మీద చార్జిషీటు సమర్పించకపోతే నిందితులందరికీ వెంటనే బెయిల్ ఇవ్వాలని నిబంధనలు ఆదేశిస్తున్నాయి.

చట్టవ్యతిరేక కార్యకలాపాల నిరోధ చట్టం ఈ నిబంధనను మార్చి, చార్జిషీట్ వేయడానికి మరొక 90 రోజుల అదనపు గడువు ఇచ్చింది. అయితే, ఆ అదనపు గడువు ఇవ్వడానికి నిర్దిష్టమైన ముందస్తు షరతులు విధించింది.

భీమా కోరేగాం కేసులో అటువంటి ముందస్తు షరతులు ఏవీ పాటించకుండానే పుణె సెషన్స్ కోర్టు చార్జిషీట్ దాఖలుకు మరొక 90 రోజుల గడువు పెంచిందని, అది చట్టవ్యతిరేకమైన చర్య అని, అందువల్ల ఈ కేసులో నేరారోపణలను కొట్టివేయాలని నిందితుడు, స్వయంగా న్యాయవాది అయిన సురేంద్ర గాడ్లింగ్ ముంబాయి హైకోర్టులో సవాల్ చేశారు.

ఈ కేసులో తీర్పు చెపుతూ ముంబై హైకోర్టు ఆ వాదనతో ఏకీభవించి, పుణె కోర్టు ఇచ్చిన అదనపు గడువును కొట్టివేసింది. అంటే, అసలు కేసే రద్దయిపోవడమో, నిందితులందరికీ వెంటనే బెయిల్ ఇవ్వడమో అనే స్థితి వచ్చింది. కాకపోతే ఈ తీర్పును సుప్రీం కోర్టులో సవాల్

చేస్తామని అనుమతి తీసుకున్న మహారాష్ట్ర ప్రభుత్వం ప్రస్తుతం సుప్రీం కోర్టులో రివ్యూ పిటిషన్ వేసింది. ఈ రివ్యూ పిటిషన్ కూడ అక్టోబర్ 29న విచారణకు రానుంది.

అలాగే సుప్రీం కోర్టు సెప్టెంబర్ 28న ఇచ్చిన తీర్పు చట్టవ్యతిరేకంగా ఉన్నదని, దాన్ని సమీక్షించాలని వేసిన అప్పీల్ ను సుప్రీం కోర్టు అక్టోబర్ 26న తోసిపుచ్చింది.

ఈ చట్టాల, చట్టనిబంధనల చిట్టడివిలో అసలు విషయాలు దారి తప్పుతుండగానే, పోలీసుల దురుద్దేశపూరిత అక్రమ చర్యలు యథావిధిగా కొనసాగుతూ వచ్చాయి. ఒకవైపు ఆగస్ట్ 29న సుప్రీం కోర్టు తమ దగ్గర ఉన్న ఆధారాలను సెప్టెంబర్ 6న తనకు సమర్పించాలని కోరి ఉండగానే, మహారాష్ట్ర పోలీసులు ఆగస్ట్ 31న ఒక పత్రికా సమావేశం ఏర్పాటు చేసి, మళ్లీ కొన్ని ఉత్తరాలు ప్రచారసాధనాలకు విడుదల చేశారు. కొన్ని ఉత్తరాలలోని భాగాలంటూ చదివి వినిపించారు.

పైన అన్ని న్యాయస్థానాల కేసులలోను, బెయిల్ వాదనలలోను తప్పుడు సాక్ష్యాధారాలు, అబద్ధాల ఉత్తరాలు, కల్పనలు ఇస్తూనే వచ్చారు. వాటిని ప్రచారసాధనాలకు విడుదల చేస్తూ వచ్చారు. ఆ అక్రమ ప్రవర్తన, కూట సాక్ష్యాలు, అబద్ధపు ఆధారాల కల్పన, దురుద్దేశాలు స్పష్టంగా బైటపడుతున్నప్పటికీ, ఇప్పటికి కనీసం పది పన్నెండు మంది న్యాయమూర్తులు ఈ విచారణలో ఉండగా, ఒకరిద్దరు న్యాయమూర్తులు మినహా అందరూ పోలీసుల వాదనలకు, అబద్ధాలకు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, మౌనంగానో మద్దతు తెలుపుతూ వచ్చారు.

ఈ న్యాయవ్యవస్థ ప్రవర్తన న్యాయవ్యవస్థ గురించి మార్క్సిస్టు అవగాహనను బలపరిచేలా ఉంది. న్యాయవ్యవస్థ రాజ్యాంగ యంత్రంలో ఒకానొక భాగం మాత్రమే. అది ఎప్పుడో ఒకప్పుడు అరుదుగా తన ఉనికి కాపాడుకునేందుకు మాత్రమే, ప్రజల్లో విశ్వసనీయత సంపాదించుకునేందుకు మాత్రమే ప్రజానుకూల తీర్పులు ఇచ్చినట్టు నటిస్తుంది. సాధారణంగా మాత్రం వర్గ పాలనను, పాలకవర్గ అక్రమాలను, సొంత ఆస్తి వ్యవస్థను కాపాడడానికే పని చేస్తుంది. వ్యవస్థను ధిక్కరించే వ్యక్తులకూ, సంస్థలకూ అనుకూలమైన తీర్పులు ఇవ్వదు.

ఈ అవగాహన ఉన్నవాళ్లు కూడ ఒక్కోసారి ఈ అవగాహనను మరిచిపోతుంటారు. న్యాయవ్యవస్థ వర్గాతీతమైనదనో, పాలకవర్గ రాజ్యాంగయంత్రానికి భిన్నమైనదనో అమాయకంగా నమ్ముతుంటారు. ఆ నమ్మకాలను వమ్ము చేస్తూ భీమా కోరేగాం కేసులో న్యాయవ్యవస్థ తన అసలు స్వభావాన్ని బైట పెట్టుకుంటున్నది. అయితే అది నేరుగా, సూటిగా ప్రజావ్యతిరేక, రాజ్య అనుకూల తీర్పులు ఇవ్వడంలో కాక, సాచివేతలో, మరొకరి మీద బాధ్యత పెట్టడంలో, అసంబద్ధ వాదనలు చేయడంలో తన స్వభావాన్ని ప్రదర్శిస్తున్నది.

వరుసగా వ్యక్తిగత స్వేచ్ఛ గురించి, ఇష్టపూర్వక జీవనశైలి గురించి, సమానత్వం గురించి, మత స్వేచ్ఛ గురించి ఎన్నో "ప్రజాస్వామిక" "ఉదారవాద" తీర్పులు ఇచ్చిన న్యాయమూర్తులు హఠాత్తుగా వ్యవస్థను మార్చే రాజకీయాచరణ విషయానికి వచ్చేసరికి, విప్లవోద్యమ అవగాహనల విషయానికి వచ్చేసరికి యథాతథవాదులుగా, వ్యవస్థ సమర్థకులుగా, సంప్రదాయవాదులుగా, ఒక్కమాటలో చెప్పాలంటే పోలీసు వ్యవస్థకు అనుబంధంగా మిగిలిపోయారు.

ఈ మొత్తం వ్యవహారంలో ఆశాజనకమైన అంశమేమంటే దేశవ్యాప్తంగా ప్రజాస్వామిక వాదులలో, బుద్ధిజీవులలో, ప్రచార సాధనాలలో ఈ నిర్బంధం మీద వ్యక్తమైన నిరసన, ప్రతిఘటన.

ఈ రెండు నెలలుగా ప్రజా రాజకీయాలకు దొరికిన ప్రచారం, ప్రజాస్వామిక విలువలగురించి, న్యాయవ్యవస్థ గురించి, పోలీసుల అబద్ధాల గురించి జరిగిన విస్తారమైన చర్చ సమాజంలో ప్రజాస్వామిక అవగాహనలను, వ్యవస్థ స్వభావం పట్ల తెలివిడిని పెంచుతుందనే భరోసాతో భవిష్యత్తు మీద ఆశను పెంచుతున్నది.

*(రచయిత వీక్షణం సంపాదకుడు)* వీ

# గృహ నిర్బంధం అంటే?

***రెండు నెలలకు పైగా అనుభవిస్తున్న కొత్త తరహా నిర్బంధాన్ని, దాని పూర్వాపరాలను వివరిస్తున్నారు* వరవరరావు**

**భా**రతీయ శిక్షాస్మృతిలో గృహ నిర్బంధం గురించి విధి నిషేధాలు రచింపబడి ఉన్నట్లు లేదు. నాకు తెలిసి ఎమర్జెన్సీలో జయప్రకాశ్ నారాయణ్, మురార్జీదేశాయ్, పీలూ మోడీ వంటి కొందరిని గృహ నిర్బంధంలో ఉంచారని విన్నాను. అది కూడా కోర్టు కాదు, కేంద్ర ప్రభుత్వం గృహనిర్బంధం పేరుతో వారిని ప్రభుత్వ అతిథి గృహాల్లో నిర్బంధించింది. అయినా ప్రాథమిక హక్కులు కూడ రద్దయిన అత్యయిక పరిస్థితిలో, శిక్షాస్మృతిలో లేని ఆంతరంగిక భద్రతా చట్టం (మీసా) అమలయిన పరిస్థితి సాధారణ స్థితిని (!) పోల్చలేం.

చాలా కాలంగా కశ్మీర్‌లో మాత్రం భారత ప్రభుత్వ హింసా నిర్బంధాలకు వ్యతిరేకంగా హురియత్ నాయకులు ప్రజా ప్రదర్శనకో, బంద్‌కో పిలుపు ఇచ్చినప్పుడుగానీ, భారత ప్రభుత్వ అధినాయకులు కశ్మీర్ పర్యటనకు వెళ్లినపుడో, ఏదయినా ఎన్‌కౌంటర్‌గానీ, సైనిక చర్యగానీ జరిగినపుడో హురియత్ నాయకులు ఎస్.ఎ. గిలానీ, ఫర్వేజ్ ఉమర్, యాసిన్ మలిక్ వంటి వాళ్లను రోజులు, నెలల తరబడి గృహ నిర్బంధంలో ఉంచుతున్నట్లు వింటున్నాం. ఇటీవలి కాలంలో హైదరాబాద్‌లో రాజా సింగ్ వంటి వారి విషయంలో వింటున్నాం.

కాని ఇవన్నీ ప్రభుత్వం ముందస్తుగా అమలుచేస్తున్న నిర్బంధాలుగా కనిపిస్తున్నాయిగానీ అత్యున్నత న్యాయస్థానం ఒక పోలీస్ స్టేషన్‌లో (విశ్రాంబాగ్ పోలీస్ స్టేషన్, పూణె) నమోదయిన భీమా కోరేగాం కేసులో పోలీసులకు కావలసిన వారిని గృహ నిర్బంధంలో ఉంచమని ఉత్తర్వులివ్వడం కొత్త అనుభవంగా ఉన్నది.

ఆ సందర్భంగా అరెస్టయిన ఇద్దరు తమ స్వస్థలాల (ఢిల్లీ, ఫరీదాబాద్) నుంచి ట్రాన్సిట్ వారంట్ ఇవ్వవద్దని హైకోర్టును ఆశ్రయించారు. ముగ్గురిని పూణె కోర్టుకు తీసుకవెళ్లి హాజరుపరిచారు. ఈ ఐదుగురి అరెస్టును సవాల్ చేస్తూ రొమిలా థాపర్ మొదలయిన వాళ్లు సుప్రీం కోర్టులో హెబియస్ కార్పస్ పిటిషన్ వేశారు. ఆ తరువాత సెప్టెంబర్ 5న ఈ ఐదుగురు కూడా అదే విజ్ఞప్తి చేశారు.

అప్పటికే ఆగస్ట్ 29 నుంచి ఈ ఐదుగురి విషయంలో గృహ నిర్బంధం అమలవుతున్నది. సుప్రీం కోర్టు గృహ నిర్బంధంలో ఉంచమని ఆదేశించి సెప్టెంబర్ 21 వరకు వాదనలు విని తీర్పును రిజర్వులో పెట్టింది గాని గృహ నిర్బంధం ఎట్లా అమలుచేయాలో ఆయా రాష్ట్ర ప్రభుత్వాలకు ఏమీ సూచనలు ఇవ్వలేదు.

కనుక ఢిల్లీ (గౌతమ్ నవ్లాఖా), హర్యానా (సుధా భరద్వాజ్), మహారాష్ట్ర (వర్నన్ గోంజాల్వెజ్, అరుణ్ ఫరేరా)ల విషయంలో, నా విషయంలో ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు, పోలీసులు తీసుకునే వైఖరియే చట్టం–శాసనం. ఢిల్లీ పోలీసులను నియంత్రించేది కేంద్ర ప్రభుత్వమేగనుక, కేంద్రంలోని బిజెపి ప్రభుత్వం మావోయిస్టుల విషయంలో, కశ్మీర్ ప్రజల విషయంలో ఏ వైఖరి తీసుకుంటుందో గౌతమ్ నవ్లాఖా విషయంలోనే కాదు, ఆయన కుటుంబం విషయంలో కూడా అదే కఠిన వైఖరి తీసుకున్నారు. ఆయన ఉన్న ఇంటికి ఎర్ర బట్టకట్టి, రాత్రి పడకగది తలుపులు కూడా తీసుకొని పడుకోవాలన్నారు.

నిందితులు గృహ నిర్బంధంలో ఉంటే కోల్పోయే చలన స్వేచ్ఛ వారి సహచరులకు, కుటుంబ సభ్యులకు కూడా వర్తిస్తుందా? సాధారణ శిక్షా స్మృతి ప్రకారం జుడిషియల్ కస్టడీ, జైలు అయితే అక్కడ ఇంటి నుంచి వేరుచేయబడి జైలు అధికారులు, సిబ్బంది పర్యవేక్షణలో ముద్దాయిలు ఉంటారు.

అక్కడ అండర్ ట్రయల్స్‌కు వర్తించే నియమాలు వర్తిస్తాయి. మరి వాళ్ల వాళ్ల ఇళ్లల్లో వాళ్లతోపాటు వాళ్ల కుటుంబ సభ్యులు కూడా నియంత్రణకు గురవుతారా? వాళ్లంతా స్వతంత్ర పౌరులు కదా. అంతేకాదు గౌతం నవ్లాఖా తప్ప మిగతా అందరూ అపార్ట్‌మెంట్స్‌లో ఫ్లాట్స్‌లో ఉంటారు. ముద్దాయిల ఫ్లాట్స్ ముందే కాకుండా అపార్ట్‌మెంట్స్ ముందుకూడా పోలీసు బందోబస్తు పెడితే వాళ్లు మిగతా ఫ్లాట్స్‌లో ఉండేవారిపై కూడా నిఘా కాపలా పెట్టినట్లే కదా.

సుప్రీం కోర్టులో ఇటీవల చర్చకు వస్తున్న ఫిర్యాదులన్నీ కూడా అది ఆధార్ కార్డు విషయంలో కావచ్చు, ట్రాన్స్‌జెండర్ విషయంలో కావచ్చు, శబరిమలైకి 10–50 సంవత్సరాల మధ్య వయసు స్త్రీలను అనుమతించే విషయంకావచ్చు–బాబ్రీ మసీదు విషయంలో గానీ, వ్యక్తి స్వేచ్ఛ, ప్రైవసీ హక్కు, స్త్రీపురుష సమానత్వం, పిల్లలకుండే స్వేచ్ఛ, హక్కుల గురించి, మత విశ్వాస స్వేచ్ఛ గురించి.

ఒకరి స్వేచ్ఛను నియంత్రించే ప్రభుత్వ అధికార హస్తం మరొకరి ముక్కుదాకా సాచడానికి, జోక్యం చేసుకోవడానికి వీలులేదు కదా.

ఒక ఫ్లాట్ ముందర– ఆ ఇంట్లో నిందిత/నిందితుడు మాత్రమే ఉండకపోవచ్చు. సుధా భరద్వాజ్‌ది రెండు గదుల ఫ్లాట్ అట. అందులో ఆమె ఒక గది తనకు కాపలా ఉండే మహిళా పోలీసులకిచ్చి మరొక గదిని తన కూతురుతో పంచుకుంటున్నది. ఆమె చాల మెత్తని మనిషి, మర్యాదస్తురాలు గనుక ఉదయమే ఆ మహిళా పోలీసులకు టీ కూడ చేసి ఇస్తున్నది గానీ, ఆమెనే కాకుండా, ఆమె ఎదిగిన కూతురు ప్రైవసీ విషయంలో కూడా పోలీసుల జోక్యం ఉంటున్నట్లే కదా.

వర్నన్‌ది చిన్నఫ్లాటు – ఆయన సహచరి సుప్రసిద్ధ న్యాయవాది సుసాన్ అబ్రహాం. కొడుకు సాగర్ మేజర్. ఉద్యోగం చేస్తున్నాడు. వాళ్ల

స్వేచ్ఛ? అరుణ్ ఫరేరా స్వయంగా న్యాయవాది. సుసాన్ అబ్రహాంతోపాటు ఆయన ఇదే భీమా కోరేగాం కేసులో నిందితులు కొందరి తరఫున వాదిస్తున్నాడు. ఆయన తన సహచరి, మైనర్ కొడుకుతోపాటు ఒక పెద్ద కుటుంబంతో థానేలో ఉంటాడని విన్నాను వాళ్లందరి స్వేచ్ఛా? వాళ్లందరూ పొందవలసిన న్యాయం, స్వేచ్ఛ?

మహారాష్ట్రలో బిజెపి శివసేనల ప్రభుత్వం అయితే–మోడీ ఫడ్నవీస్‌ల ప్రభుత్వమైతే–తెలంగాణలో ప్రచ్ఛన్న నయా పీష్వాయీ ప్రభుత్వం, తెరాస ప్రభుత్వం.

సెప్టెంబర్ 30న నా ఫ్లాట్‌లో ప్రవేశపెట్టిన రోజే సిఐ భీంరెడ్డి మీడియాతో మాట్లాడవద్దని, రక్త బంధువులను, న్యాయవాదులను తప్ప అనుమతించనని ఫర్మానా వేసి పోయాడు. న్యాయవాదుల పేరుతో ఒకరికన్న ఎక్కువగా, బంధువుల పేరుతో నా ముగ్గురు కూతుళ్లకన్న ఎక్కువగా వస్తున్నారని, రెండు రోజులు గడవక ముందే కోర్టులో వేసి గృహ నిర్బంధం క్యాన్సిల్ చేసుకొని జైలుకు వెళ్లవలసిందని ఉచిత సలహా కూడ ఇచ్చాడు.

'అత్యున్నత న్యాయస్థానం నేను కోరకుండానే కల్పించిన సాపేక్ష స్వేచ్ఛనయినా నేనెట్లా వదులుకుంటాను, అంతగా మీకు శాంతి భద్రతల సమస్య అయితే మీరే కోర్టుకు వెళ్లి గృహ నిర్బంధాన్ని క్యాన్సిల్ చేయించండి' అని చెప్పాను.

ఆయన నాకు మళ్లీ కనిపించలేదు గానీ చిక్కడపల్లి పోలీసు స్టేషన్ నుంచే రిమోట్ కంట్రోల్ చేస్తున్నట్లున్నాడు.

రక్తబంధువైనా సరే దేవులపల్లి అమర్‌ను జర్నలిస్టు అని అనుమతించ లేదు. ఆయన డిజిపితో మాట్లాడినా ప్రయోజనం లేకపోయింది.

నాకు బాల్యం నుంచి తెలిసిన చుక్క రామయ్య, ఎంఎలో నాకు సీనియర్ డా. విజయభారతి, దెబ్బెల నుండే తెలిసిన చెరుకు సుధాకర్, కోదండరామ్, ఇన్నయ్య, గురిజాల రవీందరరావు, చాడ వెంకటరెడ్డి మొదలైన, ఇంకా నా దృష్టికి రాని వాళ్లెందరినో అనుమతించలేదు. డాక్టర్ విజయ భారతిగారు వయసు, అనారోగ్యం వల్ల గీతారామస్వామిని తోడు తెచ్చుకున్నది. చుక్కరామయ్యగారు అయితే తొంబైలో పడుతున్నారు. వీళ్లంతా కేవలం నా ఆరోగ్యాన్ని పరామర్శించడానికి వచ్చారు.

'కేంద్రంలో కల్వకుంట్ల చంద్రశేఖరరావు మంత్రిగా ఉన్నపుడు ఆయన వెంటవెళ్లి చంచల్‌గూడ జైల్లో వివిని కలిసాను. ఇపుడాయన ప్రభుత్వంలో నాకా అవకాశం లేదా' అని అడిగాడు చెరుకు సుధాకర్. ఆయన, ఆయన సహచరి లక్ష్మి విరసంలో సభ్యులు, ఉద్యమ మిత్రులం. బాగ్‌లింగంపెల్లిలో కొద్దిరోజులు దగ్గరలో ఉన్నాం.

కోదండరామ్ విద్యార్థిగా, ఎపిసిఎల్‌సి, ఎచ్ఆర్ఎఫ్ సభ్యుడుగా, ఉపాధ్యాయుడుగా తెలిసినవాడు. తెలంగాణ ఉద్యమంలో తెలంగాణ విద్యావంతుల వేదిక మీద నేనెన్నోసార్లు ప్రసంగించాను. కలిసి పనిచేసిన వాళ్లం. కుటుంబ మిత్రులం.

'జైల్లోనయినా ములాఖత్ ఉంటుంది ఇంట్లో కలవడానికి లేదా – ఆయనతో టీచర్‌గా, రచయితగా పరిచయం ఉంది. కుటుంబంతో అనుబంధం ఉంది' అన్నాడు. 'కేవలం ఆయన ఆరోగ్యం గురించి పరామర్శించడానికి వచ్చాం' అని కూడా అన్నాడు.

చాడ వెంకట్‌రెడ్డి, గుర్రం విజయ్‌కుమార్ మొదలయిన వారితో, వాళ్ల వెంటవచ్చిన వాళ్లతో, డా. చెరుకు సుధాకర్‌తో, ఆయన వెంట వచ్చిన వాళ్లతో, ప్రొ. కోదండరామ్‌తో, ఆయన వెంట వచ్చిన వాళ్లతో, చుక్క రామయ్య గారితో, ఆయన వెంట వచ్చిన వారితో నా సహచరి హేమలత కిందికి వెళ్లి మాట్లాడి రాగలిగిందిగానీ దేవులపల్లి అమర్ విషయంలో ఆ అవకాశం కూడా రాలేదు.

డాక్టర్ విజయభారతి గారయితే వచ్చిపోయాక తెలిసింది. ఎంఎలో క్యాంపస్ నుంచి బొజ్జా తారకం గారితో ఆయన సాహచర్యం నుంచి, అటు బోయి భీమన్నగారి కూతురిగా, ఇటు తారకంగారి సహచరిగా మాత్రమే కాకుండా–ఈ ఇద్దరికన్నా ముందు నుంచి 58 ఏళ్ల నుంచి తెలిసిన సాహిత్య పరిచయం మాది. ఆమె అనారోగ్యంతో వ్యగ్రతతో నా ఆరోగ్యాన్ని పరామర్శించడానికి వచ్చింది.

వీళ్లందరూ–నాకు ముప్పై, ఏభై ఏళ్లకు పైగా తెలిసిన వాళ్లు. కేవలం పరిచయం కాదు స్నేహం, అనుబంధం ఉన్నది.

వీళ్లెవరూ ఇప్పుడు నా రాజకీయాలతో ఉన్నవాళ్లు కాదు. ప్రజాస్వామ్యవాదులు. కాకపోతే వీళ్లెవరూ తెరాస రాజకీయాలలో కూడా ఉన్నవాళ్లు కాదు.

కొద్ది కాలంగా నేను చిన్న చిన్న అనారోగ్యాలకు గురవుతున్నానని, వయసు వల్ల కూడా పరామర్శించాలని వచ్చినవాళ్లు – వీళ్లలో కొందరు చెరుకు సుధాకర్, గాదె ఇన్నయ్య, గురిజాల రవీందర్, కోదండరామ్‌లు ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో తెరాసకన్నా ముందు నుంచి, అంటే కెసిఆర్ కన్నా ముందు నుంచి పనిచేస్తున్నవాళ్లు.

నేను ఏభై ఏళ్లుగా నక్సల్బరీ, ప్రజాస్వామిక తెలంగాణ రెండు కళ్లుగా ఉద్యమంలో, ఉద్యమంతో ఉన్నవాణ్ణి.

విరసం నిషేధానికి గురయి, మా అధ్యక్షుడు జి. కళ్యాణరావు, నేను ప్రజా భద్రత చట్టం కింద చంచల్‌గూడ జైయిల్లో ఉన్నప్పుడు నన్ను చూడడానికి కె. చంద్రశేఖరరావు కేంద్ర ప్రభుత్వంలో కార్మిక శాఖ మంత్రిగా వచ్చాడు. వెంట ప్రొఫెసర్ జయశంకర్, మరో ఎనిమిది మంది తెరాస ఎంఎల్ఎలు లేదా స్థానిక నాయకులు ఉన్నారు. అప్పటికి మా మీద ఎనిమిది కేసులు కూడా పెట్టారు.

అది 2005 గ్రామ పంచాయితీ ఎన్నికల కాలం. 3 సెప్టెంబర్ 2005. అప్పటికయితే మావోయిస్టు పార్టీతో రాష్ట్ర ప్రభుత్వం చర్చలకు పిలిచినపుడు పీస్ ఇనిషియేటివ్ కమిటీ తరఫున కన్వీనర్ సూరిశెట్టి సుధాకర్ పిలిచిన సభలో సుందరయ్య విజ్ఞాన భవన్‌లో ఒకే వేదిక మీద ఆయనను చూసిన, ఆయన నాతో చూపులు కలిపిన సందర్భం తప్ప మేమిద్దరం ఎప్పుడూ కలుసుకున్నదీ లేదు, మాట్లాడుకున్నదీ లేదు.

మా ఇద్దరికీ ఒకరి గురించి ఒకరికి అభిప్రాయాలు ఏర్పడడానికి ప్రకటిత అభిప్రాయాలు, ఆచరణ కాకుండా ఇంకేదయినా అదనంగా సమాచారం ఉంటే అది జయశంకర్, మంజీర రచయితల సంఘం నుంచి ఏర్పరుచుకున్నదే అయి ఉండాలి.

కనుక మా పరిచయాన్ని, స్నేహం అని చెప్పడానికి వీలు లేదు. దృక్పథాలు పరస్పర భిన్నమైనవి.

రాగానే ఆరోగ్యాన్ని పరామర్శించి–మీ మీద ఎన్ని కేసులు ఉన్నాయి అని అడిగాడు. అరెస్టు చూపిన ప్రజా భద్రతాచట్టం కాకుండా నాపై, కళ్యాణరావుపై చెరి ఎనిమిది కేసుల్లో ప్రొడక్షన్ వారంట్లు జైలుకు వచ్చాక

వచ్చాయి అని చెప్పాను. 'ఆ కేసులన్నీ ఎత్తివేస్తారు. అదేమంత పెద్ద విషయం కాదు. మనం శాశ్వత శాంతి గురించి మాట్లాడుకుందాం. అందుకని వచ్చాను' అన్నాడు. 'మనమంతా, వచ్చిన మీరు, లోపల ఉన్న నాతో సహా తెల్లబట్టల వాళ్లం. మనం కూడ నాగళ్లు పట్టుకొని దున్నిన నాడు శాశ్వత శాంతి వస్తుంది' అని చెప్పాను. ఆయన వెంట ఉన్నవారిలో ఎవరో మీడియాకు చెప్పినట్లున్నారు. పత్రికల్లో బాక్స్ ఐటమ్‌గా వచ్చింది. (అప్పుడు లిఖితపూర్వకంగా ఆయనకు ఒక విజ్ఞప్తి పత్రం కూడా ఇచ్చాను.)

2014 ఎన్నికలకు ముందు రాజకీయ ఖైదీల, జీవిత ఖైదీల విడుదల-తమ తమ రాజకీయ పార్టీల మానిఫెస్టోలో చేర్చవలసిందని ఆ కమిటీతోపాటు నేను, ఎపిసిఎల్‌సి అధ్యక్షుడు ప్రొఫెసర్ గడ్డం లక్ష్మణ్, కామ్రేడ్ హుస్సేన్, ఆజాద్ పద్మ వెళ్లినపుడు కూడా ఆయనకు చెప్పాను. రాజకీయ ఖైదీలు, జీవిత ఖైదీలదేముంది - మేము అధికారానికి రాగానే వదిలివేస్తాం, మనిషి కోరుకున్న అన్నిటికన్నా విలువైనది స్వేచ్ఛ అని మాకాయన పాపిలాన్ (తెలుగులో 'పంజరం'గా డాక్టర్ ఎం.వి. రమణారెడ్డి అనువదించాడు) కథ చెప్పాడు.

మావోయిస్టు ఎజెండా - మైనస్ తుపాకీ ఎట్లా అమలు చేయాలో మాట్లాడుకుందాం అని నలభై అయిదు నిమిషాలు చర్చించాడు. ఎస్.సి., ఎస్.టి. వర్గాల కోసం చట్టపరంగా కేటాయించిన నిధుల నుంచి కొనయినా సరే ప్రతి దళిత కుటుంబానికి మూడెకరాల భూమి ఇస్తానన్నాడు. 'వాళ్ల భూమి వాళ్లకే కొని ఇవ్వడం ఏమిటి? అది వాళ్ల హక్కు భుక్తం' అన్నాను. 'ప్రభుత్వ భూములు చాలకపోతే ప్రైవేట్ భూములు కొనయినా పంచాలి కదా.

ఉదాహరణకు మా తాతల కాలం నుంచి నాకు వచ్చిన పట్టా భూములున్నాయి. మీకూ ఉండొచ్చు' అన్నాడు. 'నాకిప్పుడు లేవు. ఉన్నా అవి దురాక్రమణే. ఎందుకంటే మనం ఇద్దరమూ ఉత్పత్తి కులం నుంచి వచ్చిన వాళ్లం కాద'న్నాను. 'నీతో ఇదే పంచాయితీ' అన్నాడు. బయటికి వచ్చి ఆరోజే మీడియా ముందు ఈ చర్చ అంతా ఇంకా వివరంగా కూడ చెప్పాను.

నేనీసారి ఆగస్టు 28న అరెస్టు కావడానికి ముందురోజు సుందరయ్య విజ్ఞాన భవన్‌లో కౌలురైతులకు, ఆదివాసులకు రైతు బంధు, పట్టాలు, రుణ మాఫీలు, రుణాలు ఇవ్వాలని రైతు సంఘాలన్నీ కలిసి ఏర్పాటు చేసిన విశాల ఐక్యవేదిక సభలో క్లుప్తంగా ఈ రెండు సందర్భాలను గుర్తుచేసి (3 సెప్టెంబర్ 2005, 2014 ఎన్నికలకన్నా ముందు మార్చ్ 23) చర్చల సందర్భంగా మావోయిస్టు పార్టీ, సిపిఐ ఎంఎల్ జనశక్తి-భూసంస్కరణల చర్చలో ప్రతి దళిత కుటుంబ మహిళా యాజమాన్యాన్ని గుర్తించి మూడెకరాల భూమి ఇవ్వాలన్న ప్రతిపాదనతో పాటు భూమి, పశువులు, విత్తనాలు, ఎరువులు కూడా సమకూర్చడం నిజమైన భూసంస్కరణలు అని ప్రతిపాదన పెట్టారని - భూసంస్కరణల చర్చలో అప్పటికే కరీంనగర్ జిల్లాలో భూ సంబంధాల గురించే అధ్యయనం చేస్తూ పోరాడుతున్న రియాజ్‌ను ఎన్‌కౌంటర్‌లో చంపిన విషయం గుర్తుచేశాను.

ఒక్క కౌలురైతులు, ఇనాం భూములు, వక్ఫ్ భూములు చేస్తున్న రైతులే కాకుండా ముప్పై ఏడు రకాలుగా భూమి మీద కష్టం చేస్తున్న భూమి హీనులందరికీ, అవన్నీ ప్రభుత్వ భూములు కాబట్టి పంచాలని అప్పుడు రెండు పార్టీలు ప్రతిపాదించాయని చెప్పాను.

ముగింపుగా ఒక్క రియాజ్ సందర్భంలోనే రాష్ట్రంలో కాంగ్రెస్-తెరాస పొత్తు ప్రభుత్వంలో ఉన్న తెరాస ఎనిమిది మంది మంత్రులు రాజీనామా చేసి ఆ ఎన్‌కౌంటర్‌కు నిరసనగానే కాకుండా కాంగ్రెస్ అనుసరిస్తున్న ప్రపంచ బ్యాంకు అభివృద్ధి నమూనాను వ్యతిరేకిస్తూ ఆ ఒక్కరోజు వాళ్లంతా మాట్లాడారని, ముఖ్యంగా వికారాబాద్ నుంచి ఎన్నికై మంత్రివర్గంలో చేరిన చంద్రశేఖర్ ప్రసంగాన్ని గుర్తుచేశాను.

అదే సమయంలో కేంద్ర ప్రభుత్వంలో ఉన్న ఇద్దరే ఇద్దరు తెరాస మంత్రులు కెసిఆర్, నరేంద్రలు మాత్రం రాజీనామా చేయలేదు. ఇవ్వాళ బిజెపి పాలనకు బేనామీగా పనిచేస్తున్న కెసిఆర్ ప్రభుత్వం-నయీ పీష్వాయీ విధానాలనే అమలు చేయడం ఆశ్చర్యం కాదనడానికే ఇది గుర్తుచేస్తున్నాను.

ఇది కాంగ్రెస్‌లో అర్ధ సింహాసనం పంచుకోవడం కాదు (2004-5లో వలె), ఇప్పుడిది బిజెపి సామంతరాజ్యం. కనుక జైల్లో నా ఆరోగ్యం గురించి కేంద్ర మంత్రిగా పరామర్శించడానికి వచ్చిన కెసిఆర్ తెలంగాణ రాష్ట్రం ఏర్పడి, పూర్తి మెజారిటీతో అధికారానికి వచ్చిన నాలుగున్నరేళ్ల తర్వాత, గృహ నిర్బంధంలో ఉన్న నన్ను పరామర్శించడానికి వచ్చిన నాకు గౌరవనీయులు, స్నేహితులు అయిన వారిని కలవనివ్వకపోవడంలో ఆశ్చర్యం లేదు.

అయినా ఆయన ఈ నాలుగున్నరేళ్ల పాలన కాలంలో కూడ 2015 సెప్టెంబర్ 21 నుంచి చాల సందర్భాల్లో అరెస్టవుతూ, పోలీసులాకప్‌లోకి వెళ్తూ, కేసులు కూడా ఎదుర్కొంటున్న వేలాది మంది ఉద్యమకారుల్లో ఒకనిగా ఇంతకన్న భిన్నంగా ఆయన వ్యవహరిస్తాడని కూడా అనుకోలేదు. ఈ గృహ నిర్బంధాన్ని అమలు చేస్తున్నది ఆయన ప్రభుత్వం. ఆయన పోలీసులే కదా. చిక్కడపల్లి సి.ఐ. అయినా డి.జి.పి. అయినా.

ఆగస్టు 28న పూణె పోలీసులు నాకోసం సెర్చ్ వారంట్ తీసుకొని, నాతోపాటు మూడు ఇళ్లకు వచ్చారు. నా దగ్గరికి ఉదయం 6 గంటలకే వస్తే నా అల్లుళ్ల, కూతుళ్ల ఇంటికి 8:30 గంటలకు వెళ్లారు - అవి నా ఇళ్లే - నేను దొరికే స్థలాలేనని ఆరోపిస్తూ. ఆ సందర్భంలో తెలంగాణ పోలీసు అధికారులు పూణె పోలీసులకు సహకరిస్తూ వ్యవహరించిన తీరు వాళ్ల మాటల్లో వినేవున్నాం.

తెరాస ప్రభుత్వ పోలీసుల నిజ రూపాన్ని, నగ్న రూపాన్ని చూపింది మాత్రం టేకుల క్రాంతి ఇంటి మీద దాడి, సోదా. ఆ ఇంటికి సెర్చ్ వారంట్ లేకుండా పోయారు. అది కేవలం పూణె పోలీసులు తెలంగాణ పోలీసుల, ప్రభుత్వ సహకారం కోరిన తర్వాత తెలంగాణ ప్రభుత్వం కనుసన్నల్లో పోలీసులు ఇచ్చిన ఆఫ్టర్ థాట్. అదనపు నిర్బంధకానుక.

అందుకే అక్కడ క్రాంతి విషయంలోనే కాదు, అతని వృద్ధురాలైన, గుండె వ్యాధిగల తల్లితో ప్రవర్తించిన తీరులో, ఇంట్లో అతని చెల్లెలు, తమ్మునితో వ్యవహరించినతీరులో కూడ ఈ కక్ష కనిపిస్తుంది.

ముఖ్యంగా ఇది సాకుగా 'నమస్తే తెలంగాణ' నుంచి వెంటనే ఆయనను ఉద్యోగం నుంచి తొలగించడంలోనే తెరాస ప్రభుత్వ అత్యుత్సాహ సహకారం స్పష్టమవుతుంది.

*(రచయిత విరసం వ్యవస్థాపక సభ్యులు)* వీ

# ప్రజాస్వామికవాదుల గృహనిర్బంధం

***హక్కుల కోసం పోరాడే ప్రజాస్వామికవాదులను, న్యాయవాదులను, రచయితలను నిర్బంధించి పాలకులు ప్రజలను భయభ్రాంతులకు గురిచేయాలనుకుంటున్నారనీ, దీన్ని ఎదిరించడానికి సంఘటిత శక్తితో పోరాడాలనీ అంటున్నారు* చిమ్మె జాన్ బర్నబాస్**

**2018** ఆగస్టు 28న దేశవ్యాప్తంగా వివిధ రాష్ట్రాలలో వివిధ సంస్థలలో పనిచేస్తున్న అయిదుగురు ప్రముఖులైన రచయితలను, న్యాయవాదులను, నాయకులను అరెస్ట్ చేసి మహారాష్ట్రకు చెందిన పూణే పోలీసులు కోర్టులో హాజరుపరిచే సమయంలో సుప్రీంకోర్టు జోక్యంతో వారంతా ఇప్పటికీ గృహ నిర్బంధంలో ఉన్నారు. వారు ప్రముఖ విప్లవ రచయిత వరవరరావు, ముంబయి హైకోర్టు న్యాయవాదులు వెర్నాన్ గోన్‌సాల్వెస్, అరుణ్ ఫెరీరా, ఫరీదాబాద్‌కు చెందిన సుధా భరద్వాజ్ (న్యాయవాది, కార్మిక నాయకురాలు), న్యూఢిల్లీకి చెందిన పియుడిఆర్ నాయకుడు గౌతమ్ నవలఖాలు.

వీరి మీద ప్రధాన అభియోగం పూణేకు దగ్గరలోని భీమా కోరేగావ్ ప్రాంతంలో గత ఏడాది డిసెంబర్ 31న దళిత (మహర్) మృతవీరుల సంస్మరణ సభకు ముందు, తర్వాత చోటుచేసుకున్న హింసాత్మక సంఘటనలకు సంబంధించి సాగుతున్న దర్యాప్తులో భాగంగానే, పైన పేర్కొన్న 5 మందికి మావోయిస్టు పార్టీతో ప్రత్యక్ష, పరోక్ష సంబంధాలు ఉన్నాయని పూణే పోలీసులు ఆరోపిస్తున్నారు. అంతే కాకుండా వీరంతా ప్రధాన మంత్రి నరేంద్రమోడీ హత్యకు కుట్ర పన్నారనే ఆరోపణ చేస్తున్నారు పూణే పోలీసులు.

ఈ ఐదుగురి అరెస్ట్‌తో పాటు మరికొందరి ఇళ్లపై దాడి చేసి, సోదాలు నిర్వహించారు. వీరు న్యాయవాది సుసాన్ అబ్రహాం (ముంబయి), ఫాదర్ స్టాన్లీ స్వామీ (రాంచీ), ప్రొఫెసర్ ఆనంద్ తేల్‌తుంబ్డే (గోవా), హైదరాబాద్‌కు చెందిన జర్నలిస్టు క్రాంతి టేకుల, వరవరరావు గారి కుమార్తెల ఇళ్లలోనూ అక్రమంగా ప్రవేశించి సోదాలు నిర్వహించారు.

ఇప్పుడు అరెస్టయిన (ప్రస్తుతం నిర్బంధంలో ఉన్న) వీరంతా రహస్య జీవితం గడుపుతున్నవారు కాదు. అంతేకాకుండా వివిధ రంగాలలో విషయ నిపుణులు, విశేష ఖ్యాతి గడించినవారు. అన్నింటికన్నా దేశ వ్యాప్తంగా పేద ప్రజల కోసం, దళిత, ఆదివాసి వర్గాల కోసం, కార్మికుల కోసం పోరాడుతున్నవారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల పాశవిక నిర్బంధాన్ని అడుగడుగునా ఎదుర్కొంటున్నారు. ఈ దేశంలో పౌరులపై అమలు జరుగుతున్న పాశవిక నిర్బంధాన్ని, ప్రాథమిక హక్కుల ఉల్లంఘనలను ప్రశ్నిస్తున్నవారు, పౌరుల పట్ల నిబద్ధతతో పనిచేస్తున్నవారు. వీరంతా కూడా రాజకీయ భిన్నాభిప్రాయాల విశ్వాసాలతో పనిచేస్తున్నవారే. వీరంతా కేవలం రాజ్యాంగ హక్కుల పరిరక్షణలో మాత్రమే ఏకాభిప్రాయం కలిగియున్నారు. వీరిని మహారాష్ట్ర పోలీసులు ఒకే గాటన కట్టి, ప్రధాన మంత్రి హత్యకు కుట్రపన్నారని, ఒక లేఖ లభ్యమైందని చెప్పడం అంతా ఒక పెద్ద కుట్ర, మోసం, దగా. మహారాష్ట్ర బిజెపి ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వ సహకారంతో ఆడుతున్న డ్రామా కట్టుకథ మాత్రమే.

అరెస్ట్ సమయంలో కూడా ఏమాత్రం న్యాయశాస్త్ర ప్రమాణాలను, నిబంధనలను, సుప్రీంకోర్టు మార్గదర్శకాలను పాటించలేదు. పైగా అనుచితంగా ప్రవర్తించారు. కుటుంబ సభ్యుల పట్ల అగౌరవంగా ప్రవర్తించారు.

చరిత్రలో భీమా కోరేగావ్‌కు ఒక ప్రత్యేక స్థానమున్నది. 200 ఏళ్ల క్రితం ఆధిపత్య కులాలపై పోరాడి విజయం సాధించిన దళిత మృతవీరుల స్మారక చిహ్నం అక్కడుంది. భీమా కోరేగావ్ పోరాట ద్విశత వేడుకలు కావడంతో 2017 డిసెంబర్‌లో జరిగిన సదస్సుకు భారీ ఎత్తున దళితులు హాజరయ్యారు.

సదస్సు జరిగిన రోజే ఘర్షణలో ఒక దళితుడు చనిపోయాడు. చాలా మంది దళితులు గాయపడ్డారు, ఆస్తులు ధ్వంసమయ్యాయి. ఈ ఘర్షణలకు ప్రధాన కారకుడైన హిందూ ఆజాదీ అధ్యక్షుడు మిలింద్ ఎగ్బోటేను అరెస్ట్ చేశారు. ఇంతవరకూ ఆ కేసు విచారణ ప్రారంభమవ్వ లేదు. ఏ పరిస్థితిలో ఉందో కూడా తెలియడం లేదు. ఎగ్బోటేకు మాత్రం బెయిల్ ఇచ్చి వదిలేశారు. కానీ అదే సభలో ఉపన్యసించినవారు రెచ్చగొట్టడం వల్లనే ఘర్షణ జరిగి దళితుడు చనిపోయాడని పోలీసులు ఆరోపిస్తున్నారు.

2018 జూన్‌లో మహారాష్ట్ర దళిత నాయకుడు సుధీర్ ధావ్లే, న్యాయవాది సురేంద్ర గాడ్లింగ్, మానవ హక్కుల కార్యకర్త మహేశ్ రౌత్, ప్రొఫెసర్ షోమాసేన్, రాజకీయ ఖైదీల హక్కుల కమిటీ నాయకుడు రోనా విల్సన్‌లను అరెస్ట్ చేశారు. వీరంతా భీమా కోరేగావ్ సదస్సుకు వెళ్లలేదు. వాస్తవానికి ఈ సదస్సును సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్ పి.బి. సావంత్, ముంబయి హైకోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్ కోల్సే పాటిల్, డా. బి.ఆర్. అంబేద్కర్ మనుమడు ప్రకాశ్ అంబేద్కర్‌లు ప్రారంభించారు, ఉపన్యసించారు. అయితే ఈ ముగ్గురిని పోలీసులు ఇంతవరకు విచారించనూ లేదు, లేదా వారిపై ఎలాంటి అభియోగ పూర్వకమైన నోటీసులు జారీ చేయలేదు. అంటే, ఇదొక కట్టుకథనేది స్పష్టమవుతున్నది.

దేశంలోని ప్రముఖులంతా ఈ అరెస్టులను తీవ్రంగా ఖండించారు. సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తి జస్టిస్ మార్కండేయ కట్జూ మొదలుకొని అనేక మంది న్యాయ కోవిదులు, రచయితలు, సామాజిక కార్యకర్తలు తీవ్రంగా ఖండించారు.

క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ సెక్షన్ 41 (ఎ) ప్రకారం నేరారోపణలు ఎదుర్కొంటున్న వ్యక్తులకు నోటీసులు జారీ చేస్తూ, వారి నుంచి వివరణలు, సమాధానం కోరవచ్చు పోలీసులు. అంతేకాకుండా నేరానికి సంబంధించి వారికున్న సమాచారాన్ని గాని లేదా వారి సంబంధాన్ని

గాని రాబట్టవచ్చును. ఇంకా, నేరారోపణలు ఎదుర్కొంటున్న వ్యక్తులకు, పోలీసులు అధికారులు కూడా తమ నేరారోపణలను తోసిపుచ్చుతూ, తాము నేరం చేయలేదంటూ చెప్పే వాదనలను కూడా అంగీకరించే అవకాశాలు కూడా ఇవ్వగలగాలి. అదే సెక్షన్ 41 (ఎ) సిఆర్‌పిసి తాత్వికత ఉద్దేశం. అంతేకాని పోలీసులు తమ ఇష్ట ప్రకారం ప్రవర్తించడానికి వీలులేదు. ఒక మాటలో చెప్పాలంటే నేరారోపణలు ఎదుర్కొంటున్న వ్యక్తులకు తమ నేరం గురించి వారికి తెలియజేయడమే ఈ 41 (ఎ) నోటీసు సారాంశం. అంతేకాని నేర నిర్ధారణకు రావడం, పోలీసుల అత్యుత్సాహం తప్ప మరోకటి కాదు.

అందుకే వరవరరావు గారి విషయంలో సుప్రీంకోర్టు త్వరగా, తీవ్రంగా స్పందించింది. ఇది పోలీసుల అత్యుత్సాహం తప్ప మరొకటి కాదని స్పష్టం చేసింది. అంతే కాకుండా 'అసమ్మతి ప్రజాస్వామ్య భద్రత కవచం లాంటిది. ప్రజాస్వామ్య వ్యవస్థలో నిరసన తెలిపే అవకాశం ఇవ్వకపోతే అది ప్రెజర్ కుక్కర్‌లా పేలిపోతుంది' అంటూ సుప్రీంకోర్టు న్యాయమూర్తి జస్టిస్ డి.వై. చంద్రచూడ్ వ్యాఖ్యానించారు.

ప్రజల హక్కులకు భంగం కలుగకుండా, వారిపై వచ్చిన ఆరోపణలు సరైనవి కావని చెప్పుకునే అవకాశం కూడా ఆరోపణలు ఎదుర్కొంటున్న వ్యక్తికి ఇవ్వాలి. కాని ఇక్కడ పూణే పోలీసులు, విచారణాధికారులు అత్యుత్సాహం ప్రదర్శిస్తూ, హక్కులకు భంగం కలిగే విధంగా ప్రవర్తించారు.

అంతేకాకుండా సుప్రీంకోర్టు కూడా ఆరోపణలు ఎదుర్కొంటున్న వ్యక్తుల 'వ్యక్తిగత స్వేచ్ఛ, జీవించే హక్కు' (రాజ్యాంగం ఆర్టికల్ 19, 21)లకు పూణే పోలీసులు భంగం కలిగించారని పూర్తిగా నిర్ధారణకు వచ్చింది. అయితే మహారాష్ట్ర డిజిపి నుంచి వివరణలు కోరుతూ నోటీసులు జారీ చేసింది. అయితే అంతవరకూ పైన తెలిపిన ఐదుగురినీ గృహ నిర్బంధానికి ఆదేశించడం మాత్రం సరిగా లేదు. భారత రాజ్యాంగంలోగాని లేదా క్రిమినల్ ప్రొసిజర్ కోడ్‌లోగాని ఎక్కడా గృహ నిర్బంధం అనే పదం లేదు. ఇస్తే బెయిల్ బాండ్స్ ద్వారా వారిని విడుదలైనా చేయాలి లేదా మొత్తం నేరారోపణలను తప్పుగా భావిస్తూ, వాటిని కొట్టివేస్తూ తీర్పయినా ఇవ్వాలి. అంతేకాని రోజుల తరబడి గృహనిర్బంధంలో ఉంచడం కూడా 'వ్యక్తిగత స్వేచ్ఛ'ను హరించినట్లే. దీనిని సుప్రీంకోర్టు పరిగణలోకి తీసుకోవాలి. లేదా మహారాష్ట్ర పోలీసులు (పూణే) చెపుతున్న ఆరోపణలలో ఏదో ఒక రహస్యం దాగి ఉన్నట్లుగా సుప్రీంకోర్టు అయినా భావిస్తూ ఉండి ఉండాలి. ఈ రెండింటిలో ఏదో ఒకటి వాస్తవం అయి ఉండాలి. వాస్తవం ఎప్పుడూ నిర్దిష్టంగా ఉంటుంది. అంతేకాని అటూ ఇటూ వంకర టింకరగా ఉండదు.

'గృహ నిర్బంధం' అనగా 'గృహం' పోలీసుల వలయంలో ఉంటుంది. ఆరోపణలు ఎదుర్కొంటున్న వ్యక్తి గృహంలోనే ఉండాలి. బయటికి రాకూడదు. దానికన్నా జైలే కొంత మేలు. ఎందుకనగా భోజన వసతి, పుస్తకాలు అన్నీ జైలు అధికారులు ఇవ్వవలసి ఉంటుంది. కొంత ప్రశాంతంగానైనా ఉంటుంది. 80 సంవత్సరాలున్న వరవరరావు గారిపై 'గృహ నిర్బంధం' అనేది పూర్తిగా అప్రజాస్వామికం, రాజ్యాంగ హక్కుల ఉల్లంఘన కిందకే వస్తుంది.

గృహ నిర్బంధాన్ని పొడిగిస్తూ పోవడం కూడా సుప్రీంకోర్టు ఏదో విధంగా పోలీసులకు నేరాన్ని నిరూపించడానికి కొంత అవకాశాన్ని ఇస్తున్నట్లు కనబడుతున్నది. అనేక శిక్షల కేసులను అప్పీలు-రివిజన్ పిటిషన్‌లలో సుప్రీంకోర్టు జోక్యం చేసుకుంటూ, వ్యక్తుల వ్యక్తిగత జీవిత పరిస్థితులను పరిగణనలోనికి తీసుకుంటుంది. ఇక్కడ కూడా ఎంతో సుదీర్ఘ అనుభవమున్న సుప్రసిద్ధ రచయిత వరవరరావు గారు హైదరాబాద్ కేంద్రంగా సాదాసీదా జీవితం గడుపుతూ, అనేక ప్రజా సంఘాలకు ఒక దిక్సూచిలాగా మార్గ నిర్దేశనం చేస్తూ, తన జీవిత చరమాంకంలో ఉంటున్నాడు.

ఒక సూపర్ సీనియర్ (80 సంవత్సరాలు) వయస్సు ఉన్న వ్యక్తిపై ఎలాంటి ఆరోపణలు ఉన్నప్పటికీ వయస్సు రీత్యా కూడా గృహ నిర్బంధం నుంచి విడుదలకు సుప్రీంకోర్టు ఆదేశించవచ్చును. లేదా మొత్తం ఆరోపణలపై ఒక ప్రత్యేక విచారణ కమిటీ (జుడీషియల్) ని వేస్తూ అంతవరకూ దేశంలో ఎక్కడైనా తిరుగగలిగే అవకాశం ఇవ్వాలి. ఇలాంటివి లేకుండా 15 రోజుల నుంచి కేవలం గృహ నిర్బంధంలో ఉంచడం శోచనీయం. ఆయనను ప్రజలతో కలవనివ్వాలి, మాట్లాడనివ్వాలి, సభలలో పాల్గొననివ్వాలి.

ప్రధాన మంత్రి హత్యకు కుట్ర పన్నారనే ఆరోపణ (లేఖ) లో కూడా నేతి బీరకాయలో నెయ్యిని వెతికినట్లు ఉంటుంది. దీనిపై స్పందిస్తూ అనేక మంది రిటైర్డ్ ఐఎఎస్/ఐపిఎస్ అధికారులు, న్యాయమూర్తులు, న్యాయ కోవిదులు తమ తమ సంతకాలతో ఆరోపణలను ఖండిస్తూ రాష్ట్రపతికి, సుప్రీంకోర్టుకు, కేంద్ర ప్రభుత్వానికి వివిధ రూపాలలో పత్రికల ద్వారా తెలియజేశారు. 'వాస్తవం' కాని ఆరోపణలు నిరూపించడమనేది పోలీసులకు శక్తిని మించిన పని. అది కేవలం కుట్రలు, కుతంత్రాలతో సాధ్యం కావచ్చు తప్ప వాస్తవ విరుద్ధం.

భవిష్యత్తులో ఈ దేశంలో ప్రజల హక్కుల కోసం పనిచేసే న్యాయవాదులకు, ప్రజా సంఘాల నాయకులకు ఈ గృహ నిర్బంధాలు ఒక హెచ్చరిక లాంటివి. బిజెపి నేతృత్వంలోని కేంద్ర ప్రభుత్వం రాజ్యాంగ వ్యవస్థలనన్నింటినీ తమ చెప్పుచేతల్లో పెట్టుకొని, కలుషితం చేస్తూ, ప్రజా నాయకులను ఏదో ఒక రకమైన క్రూరమైన నిర్బంధానికి గురిచేస్తూ అక్రమ కేసులతో వేధిస్తూ ఉన్నారు. దీనిని మరింత పట్టుదలతో, దీక్ష-దక్షతలతో ఎదుర్కోవడమే మనముందున్న సవాలు. ఆ సవాలును స్వీకరిస్తూ మరింత సంఘటిత శక్తితో, కలిసివచ్చే శక్తులనన్నింటినీ కూడగట్టుకొని పోరాడడమే మనందరి కర్తవ్యం.

*(రచయిత న్యాయవాది, ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యుడు)* వీ

*పాఠకులు ఫిర్యాదులు, సమాచారం కోసం వీక్షణం కార్యాలయానికి పనిదినాల్లో ఉదయం 10:30 నుండి సాయంత్రం 6.00 గంటలలోగా స్వయంగా లేదా ఫోన్ ద్వారా సంప్రదించవచ్చు. మిగతా సమయాల్లో ఫోన్ చేస్తే అది ఫ్యాక్స్‌లోకి వెళ్లి మీకు జవాబు రాదు. అప్పుడు మీరు ఫోన్ ఎత్తికూడా మాట్లడడంలేదని అనుకునే అవకాశం ఉంది. ఇది గమనించగలరు. – సం.*

# సీవెండి కొండల్లో అసలు తగాదా

*విశాఖ మన్యంలో ఆదివాసి ఎంఎల్ఎల హత్యలకు సీవెండి కొండల్లోని ఆదివాసులను నిర్వాసితులను చేస్తున్న బాక్సైట్ తవ్వకాలే కారణమని అంటున్నారు* **కొమ్మ సూర్యారావు**

ఈ రోజూ, ఆ రోజూ అని లేదు, ఏరోజైనా, మీరెంత మందినైనా చంపేయొచ్చు. యు అర్ ఎంపవర్డ్ టు కిల్. ప్రతి నిమిషం మీరెంత సంపదనైనా దోచేయొచ్చు. దానికోసం ఏదైనా చేసేయొచ్చు. అడవులు నరికేయొచ్చు. గుట్టలు దొలిచేయొచ్చు. ఆదివాసులను అణిచేయొచ్చు, తరిమేయొచ్చు, చంపేయొచ్చు. ఆడవాళ్లను చెరిచేయొచ్చు. పసిపిల్లలను చిదిమేయొచ్చు. భూములు గుంజేయొచ్చు. గనులను మింగేయొచ్చు.

ఊద్చే చీపుళ్ల నుండి ఎగిరే యుద్ధ విమానాల దాకా, మన్నైనా, మట్టైనా, గడ్డైనా, గొడ్డైనా, బర్రె, గొర్రె, ఇసక, రాయి, రప్ప, ఏదైనా అన్నీ మీకు దోపిడీ వనరులే! బంగారు కమీషన్ల బాతులే! ఈ రాజ్యం మీది. చట్టాలు మీ కాళ్ల కింద చెప్పులు. కోర్టులు మీ దూడూ బసవన్నలు. పోలీసు మీది, సైన్యం మీది, తుపాకులు మీవి, బాంబుల విమానాలు మీవి. ఆఖరికి మా ఓట్లు, మా చెమట బొట్ల కోట్లూ మీవే!

ఏళ్లు గడిచి, దశాబ్దాలు, శతాబ్దాలు గడిచి, ఒకింత సోయొచ్చి, ఇక దోచింది చాలురా నాయనా! ఇంకిక్కడి కాపండని మేం గీతగీసి నిలబడితే, గొంతెత్తి నిరసిస్తే, మా అడవులు నరకొద్దంటే, మా గుట్టలు మింగొద్దంటే, మా భూమి, మా నీరు, మా గాలి మాకొదిలేయమంటే.. అది తిరుగుబాటు, దేశద్రోహం, నక్సలిజం, మావోయిజం ఐపోద్ది. మేమంతా టెర్రరిస్టులమైపోతాం! మావోయిస్టు కుట్రదారులమైపోతాం! అర్బన్ నక్సలైట్లమైపోతాం!

ఈ భూమ్మీద నివసించే హక్కులన్నీ కోల్పోతాం! ఎవరి కడుపు మండిందో, ఎవరి కంటగింపయ్యిందో, మీ పాలకులో లేక మా బాధితులో ఎవరైనా కావచ్చు విశాఖ మన్యం, అరకులోయ గత, ప్రస్తుత శాసన సభ్యులనిద్దరిని మొన్న సెప్టెంబర్ 23న హత్య చేశారు.

హత్య చేసింది మావోయిస్టులని మీ పోలీసుల లెక్క. ఇది మావోయిస్టుల చర్య కావచ్చు, కాకపోవచ్చు. సీవెండి కొండలపై కన్నేసిన మీలోని ముఠాలే ఈ పని చేసుండొచ్చు! ఈ చర్య మావోయిస్టులదైతే ప్రకటిస్తారు, కాకపోతే ఖండిస్తారు. నాయకులు దొరికితే ఎత్తుకెళ్లి కోరికలు కోరి, అవి తీరితే వదలనూ వచ్చు, తీరకపోతే చంపనూవచ్చు. ఇదివరలో ఇదే వాళ్ల ఆచరణ. చంపిందెవరైనా లొల్లి మట్టుకు సీవెండి కొండల్లో నిధి నిక్షేపాల కోసమే!

ఈ లొల్లిలో చనిపోయింది ఇద్దరు అరకు శాసనసభ్యులు. ఒకరు, కిడారి సర్వేశ్వర రావు అనే ఆంధ్రప్రదేశ్ ప్రస్తుత శాసనసభ్యుడు. మరొకరు అతని వెంబడే ఉన్న సివేరి సోమ అనే మాజీ శాసనసభ్యుడు. ఇద్దరూ ఆదివాసులే!

ఆదిలో, ఇద్దరూ ఆదివాసుల హక్కులకై పోరాడినవారే! మెల్లగా పాలకుల పంచన చేరి పాలకుల చేతుల్లో పావులుగా మారి, చూపు మార్చుకున్నారు. ఆలోచన మార్చుకున్నారు, సంపాదన నేర్చుకున్నారు. ఎంగిలి మెతుకులకు అమ్ముడుపోయారు. మన్యం దోపిడీదారుల కొమ్ము కాసేరు. పాలకుల ప్రయోజనాల్లో భాగమయ్యారు. ఆదివాసుల ప్రయోజనాలను మరిచారు. మన్యానికి అన్యాయం తలపెట్టారు. ఆదివాసుల మనుగడను తమ స్వప్రయోజనాలకు, వారి దొరబాబుల దోపిడీకి, ధనదాహానికి తాకట్టు పెట్టారు. ఆదివాసుల ఉద్యమాలను తాము వారిలో భాగంగా నిలబడి, బలపర్చాల్సిన వీరు పాలకుల్లో భాగమైపోయారు. దేనికోసం? తూరుపు కనుమల్లో, మన్యం కొండల్లో అరకు లోయలో దాగున్న సీవెండి కోసం. సీవెండి కావాలంటే, బాక్సైట్ రాయి ఈ కొండల్లోంచి, గుట్టల్లోంచి తవ్వితీయాలి.

మా మన్యం కొండల్లో సీవెండి మీద మీ కన్నుపడింది. మా పచ్చని కొండలు దొలిచి సీవెండిని దోచేసి కోట్లకు పడగలెత్తడానికి మీ బినామీ కంపెనీలను రంగంలోకి దించారు. మా బతుకులు బుగ్గి చేయడానికి పథకాలు రచించుకున్నారు. పైకి గిరిజనుల జీవితాల్లో కొత్త వెలుగులు నింపడానికి ఈ తవ్వకాలని బాకాలూదారు. ఆదివాసులను అందలా లెక్కిస్తామని, ఆకాశానికెత్తి ఊరేగిస్తామని ఊదరగొట్టేరు. అప్పట్లో ప్రజల మనిషినని పాదయాత్రలు చేసి, మన్యం ఆదివాసులకు స్వర్గం చూపిస్తానని, రాష్ట్రంలో జలయజ్ఞం చేసి సిరులు పండిస్తానని బొంకులు బొంకి నేలకూలిన ఆ నేత చేసిందేమిటో అందరికన్నా మన్యం ఆదివాసులకే ఎరుక.

అప్పుడే ఆయన జిందాల్ కంపెనీని దించాడు రంగంలోకి, మా మన్యంలోకి. ఆయన మాయలో పడి మేం మత్తులో ఉండగానే జిందాల్ వాడ్ని బాక్సైట్ రాయి తవ్వేసుకొమన్నాడు. పరాయి అరబ్బు రస్ అల్ ఖైమా అన్రాక్ కంపెనీని రంగంలోకి దింపాడు, బాక్సైట్ రాయిని శుద్ధిచేసి సీవెండిని రాబట్టడానికి. వీళ్లకి మధ్యన తన బినామీలను చొప్పించాడు. అలా అప్పటివరకు మా పక్కనున్న ఒరిస్సా కొండలకే పరిమితమైన బాక్సైట్ దోపిడీ మా దాకా పాకిపోయింది. మేం మత్తు నుండి మేలుకుని కళ్లు తెరిచే లోపే ఇదంతా జరిగిపోయింది. ఇదంతా చేసినాయన విమానం కూలి తునాతునకలైపోయాడు. ఏ నల్లమల అడవుల నుండి నక్సలైట్లను శాంతి చర్చలకు పిలిచి చర్చలు జరుపుతూనే, వెనుక నుండి ఊచకోతలు కోసినాడో అదే నల్లమలలో కూలిపోయాడు.

రాష్ట్రాన్ని ప్రపంచబ్యాంకు పాదాలచెంత పెట్టిన మరో టక్కుటమారాల హైటెక్ మనిషి అహంకార ప్రదర్శనతో అధికారం కోల్పోయి ప్రతిపక్షంలో ఉండి మామీద ఎనలేని ప్రేమ ఒలకబోశాడు. అప్పుడు బాక్సైట్ తవ్వకాలు అన్యాయం, అక్రమం, మన్యం గిరిజనుల వనరులు కొల్లగొట్టటం అన్నోడు అధికారంలోకొచ్చిన మర్నాడే కీర్తన మార్చి కొత్త సంకీర్తన మొదలెట్టాడు. మేం కొత్త మార్గం కనుగొన్నామన్నాడు. గిరిజనుల భాగస్వామ్యంతోనే బాక్సైట్ నిధులు తవ్వి, వాళ్ల నెత్తులకెత్తి మన్యం అభివృద్ధి చేస్తామని

కంత్రీ కార్పొరేట్ సంస్థలకు తీపి కబురు అందించాడు.

మొన్న నేలకొరిగిన సివేరి సోమ ఆ హైటెక్ మనిషి తరఫున ఊరూరా ఈ రాగం మాకు వినిపించినోడే! కిడారి అన్నోడు అటుపక్క నిలబడి బాక్సైట్ తవ్వితే తలనరికి పాతరేస్తాం అన్నోడే! ఈ మాటలతో జనం వీడికి ఓట్లేసి గెలిపించారు. సివేరి సోమను ఓడించారు. కిడారి పార్టీ అధికారంలోకి రాలేక పోయింది. ఓడి పోయిన సోమ పార్టీ మెజారిటీతో అధికారంలోకొచ్చింది. అటుదిటు, ఇటుదటు మారినా, కుడి ఎడమైనా పోయేదేముంటుంది? హైటెక్ మనిషి కిడారిని కొనేశాడు, సోమను వానితో కలిపేశాడు. కార్పొరేట్ కంపెనీలతో కొత్త వ్యూహం రచించాడు. వీళ్లిద్దరి ఆదివాసీ పుట్టుకను ఉపయోగించుకుని సీవెండి కొండల్లో, మన్యం అడవుల్లో పాగావేసి దుమ్ము రేపాలని చూశాడు. కానీ అది పారలేదు, కథ అడ్డం తిరిగింది.

మేం ఈసారి ముందే మేల్కొన్నాం! పాలకుల హైటెక్ ట్రిక్కులను ముందుగానే పసికట్టాం. తీర్మానించుకున్నాం. మా వాళ్లైనా సరే, మా ఆదివాసీ ద్రోహులకు గుణపాఠం చెప్పాలనుకున్నాం.

మావోయిస్టులని కొందరు మా కొండల్లో, మా కోనల్లో, మా మధ్యలో తిరగబట్టినారు. చెప్పబట్టినారు. మీ కొండలు మీవేనని, మీ వనరులు మీవేనని, మీ పాలన మీదేనని, సాయుధమై పోరండని. మాతోనే మా సైన్యం నిలబెట్టినారు. మాకూ సమజయ్యింది. మా నీరు, మా అడవి, మా నేల మాకే కావాలి! మా ఊళ్లో మా రాజ్యం కావాలి! నేల ఎవరిదో, ఆ నేలలో ఖనిజం కూడా వారిదే! అని మేము గీతగీసి నిలబడ్డాం. హైటెక్కుల ట్రిక్కులు, కార్పొరేట్ల కబ్జాలు సాగనియ్యం! సీవెండే కాదు, ఏ వెండైనా, ఏకొండైనా మా అనుమతి లేకుండా తవ్వనివ్వం అని ప్రకటిస్తున్నాం!

*(**నోట్:** మా ఊళ్లలో అల్యూమినియం పాత్రలను సీవెండి పాత్రలని పిలిచేవారు. సీవెండి కావాలంటే లేటరైట్ కొండలు తవ్వాలి. ఈ లేటరైట్‌తో కలిసి ఉన్న ఒకరకం రాయి బాక్సైట్. మన దేశంలో దొరికే బాక్సైట్ ఎక్కువగా తూర్పుకనుమల్లో, అదీ ఒరిస్సాలో అమితంగా ఉంది. ఆ సానువుల్లో ఉన్న విశాఖ మన్యం, తూర్పుగోదావరి ఏజన్సీ ప్రాంతంలో పుష్కలంగా ఉంది. లేటరైట్ కొండల నుండి బాక్సైట్ తవ్వి తీసి, నీటితో శుద్ధి చేసి, మిలియన్ల కిలోవాట్ల విద్యుత్‌తో కరిగించి పెద్ద తతంగం చేస్తే అల్యూమినా అనే పదార్థం వస్తుంది. దాన్ని మరింత ప్రాసెస్ చేస్తే వాడుకకు, పారిశ్రామిక రంగానికి కావలసిన, మనం నిత్యం చూస్తున్న, వాడుతున్న అల్యూమినియం వస్తువులు అందుబాటులోనికి వస్తాయి. అందుకే పోలవరాలు, హై మెగా విద్యుత్ ఉత్పత్తి కేంద్రాలు, అంతకు అంతగా బొగ్గు తవ్వకాలు.)*

*(రచయిత సామాజిక కార్యకర్త,*
*గనుల తవ్వకాల వ్యతిరేక ఐక్య వేదిక, విశాఖ మన్యం)* వీ

# నా వ్యాసం శీర్షిక మార్చారు!

**- బి.ఎస్.రాజు**

*అక్టోబర్ నెల వీక్షణానికి నేనో వ్యాసం రాసి పంపించాను. ఆ వ్యాసానికి నేను పెట్టిన పేరు: 'ఈ వ్యవస్థ నుండి ఉద్యోగ కల్పనను ఆశించవచ్చా?' అని. అక్టోబర్ 2వ తేదీ వీక్షణం సంపాదకవర్గ సమావేశంలో పత్రిక తిరగేసే క్రమంలో నా వ్యాసం 'ఉద్యోగ కల్పనను ఆశించవచ్చా?' అనే శీర్షికతో రావడం గమనించాను. అంటే తల నరికి పారేసారు. తోకను మిగిల్చారు. ఇదేమిటి? ఎందుకు ఇలా చేశారు? అని అదే సమావేశానికి అధ్యక్షత వహించిన వీక్షణం సంపాదకులను ప్రశ్నించాను. ఎందుకు నా వ్యాసం పేరు కత్తిరించి వేశారని? ఆయన టక్కున నాకు చెప్పిన సమాధానం 'శీర్షిక పేరు నిడివి ఎక్కువ అవ్వడం మూలంగా అలా వెయ్యాల్సి వచ్చింది' అని. ఆ సమాధానంతో నేను సంతృప్తి చెందలేదు సరికదా! మరింత ఆవేదనకు గురయ్యాను. నా ఆవేదనకు కారణం, నా వ్యాసానికేదో అన్యాయం చేశారని కాదు. అసలు సబ్జెక్టుకే ద్రోహం చేశారని. అసలు ఈ కోణంలో వారు ఆలోచించక పోవడం, యథాలాపంగా సమాధానం చెప్పడం బాధాకరం.*

*'ఈ వ్యవస్థ నుండి ఉద్యోగ కల్పనను ఆశించవచ్చా?' అనే శీర్షిక నుండి 'ఈ వ్యవస్థ నుండి' అనే పదాన్ని తొలిగించి కేవలం 'ఉద్యోగ కల్పనను ఆశించవచ్చా?' అని వేయడం అంటే తల తోకలేని శీర్షికను రచయిత తన వ్యాసానికి పెట్టినట్టే కదా! నా వ్యాసం ద్వారా నేను చెప్పదల్చుకున్న విషయం; ఈ వ్యవస్థలో ఎన్ని పిల్లిమొగ్గలు వేసినా, ఉద్యోగ కల్పన అసాధ్యమని; ఈ వ్యవస్థను మార్చుకోవడమే ఇప్పటి యువత కర్తవ్యమని, నూతన వ్యవస్థ స్థాపనతోనే ఉద్యోగకల్పన సాధ్యపడుతుందని, అటువంటి వ్యవస్థలు కొనసాగిన చరిత్ర అధ్యయనం ద్వారా ఆ యా వ్యవస్థల్లో ప్రణాళికా బద్ధంగా ఉద్యోగకల్పన ఎలా సాధ్యపడిందో తెలుసుకొమ్మని చెప్పడం నా వ్యాసానికి నేను పెట్టుకున్న లక్ష్యం. అందుకే 'ఈ వ్యవస్థ నుండి ఉద్యోగ కల్పనను ఆశించవచ్చా?' అని పేరు పెట్టాను.*

*అలా కాక 'ఉద్యోగ కల్పనను ఆశించవచ్చా?' అంటే వ్యాసానికి కాళ్ళు, చేతులు, మెదడు లేనట్లే!*

*ఇంకా బాధాకర విషయమేమంటే : శీర్షిక పేరు పొడవుగా ఉండడం వల్ల తెగ్గొట్టి వేశామని చెప్పడం, అంతకన్నా వేరే మార్గం లేక అలా చేశామని సంపాదకులు చెప్పడం. అంటే వ్యాసంలో విషయానికి, శీర్షికకు పెట్టిన పేరుకు అనుబంధం, లింకు లేనట్లేనన్నమాట! అది అప్రధానమేనా? సరే! సంపాదకులు అన్నట్లే ఒప్పుకుందామనుకున్నా అది కుదరలేదు. ఎందుకో చూడండి: 'ఈ వ్యవస్థ నుండి ఉద్యోగ కల్పనను ఆశించవచ్చా?' అనే శీర్షికలో ఉన్నవి 18 అక్షరాలు. 'ఉద్యోగ కల్పనను ఆశించవచ్చా?' అన్నదాంట్లో ఉన్నవి 12 అక్షరాలు. 6 అక్షరాలకు సరిపడా జాగాలేదనేది సంపాదకుల సమాధానం.*

*ఇదే సంచికలో వచ్చిన మార్కండేయ కట్జూ అనువాద వ్యాసం పేరు: 'మరొక ఎమర్జెన్సీ దిశగా ప్రయాణిస్తున్న భారత్?' నిడివి 18 అక్షరాలు. మరి, దీన్ని సెట్ చేయడానికి జాగా సరిపోయినప్పుడు, 18 అక్షరాలే ఉన్న నా వ్యాస శీర్షిక తల ఎందుకు తెగ్గొట్టినట్టు? వచ్చిపడ్డ టెక్నికల్ ఇబ్బంది ఏమిటి? ఒకవేళ అలా అనుకున్నా, భావం చెడకుండా 'ఈ వ్యవస్థ ఉద్యోగ కల్పన చేయలేదు' అని పెట్టొచ్చు. భావం చెడకుండా సందర్భోచితంగా శీర్షిక పేరు ఎడిట్ చేసి వేయడం వీక్షణం అనేక మార్లు చేసింది. అటువంటిది ఇక్కడ ఎందుకు ఇలా జరిగిందో తెలియదు.*

*('ఉద్యోగ కల్పనను ఆశించవచ్చా?' అనే శీర్షికతో వీక్షణం అక్టోబర్ సంచికలో అచ్చయిన, నా వ్యాసం అసలు పేరు : 'ఈ వ్యవస్థ నుండి ఉద్యోగ కల్పనను ఆశించవచ్చా?' అని తెలుసుకోగలరు. పాఠకులు దయచేసి ఈ విషయం గమనించ మనవి. – బి.ఎస్.రాజు)* వీ

# విధ్వంసక పాలనకు హెచ్చరిక తిత్లీ

*విధ్వంసక అభివృద్ధి నమూనాను అమలు చేస్తున్న పాలకుల చర్యల వల్ల ఏర్పడుతున్న ప్రకృతి ప్రకోపాలకు సామాన్య ప్రజలు బలవుతున్నారనీ, తిత్లీ బీభత్సం నుంచైనా పాలకులు కనీస గుణపాఠం నేర్చుకోవాలనీ అంటున్నారు* **దుప్పల రవికుమార్**

అక్టోబర్ 6న అండమాన్ సముద్ర ఉపరితలంలో ఏర్పడిన అల్పపీడనం తర్వాత రెండు రోజులు అదే విధంగా కొనసాగి ప్రయాణిస్తూ ఎనిమిది నాటికి వాయుగుండంగా మారి బంగాళాఖాతంలోకి ప్రవేశించింది. కాని మర్నాటికి చాలా వేగంగా అది బలపడి తీవ్ర తుఫాను పెనుగాలిగా రూపుదిద్దుకుంది. రెండో తరగతి హరికేన్ సామర్థ్యాన్ని సంతరించుకుంది. వాతావరణ శాఖ దీనికి ముందుగానే తిత్లి తుఫాను అని పేరు కూడా పెట్టింది. 11న ఒరిస్సా మీదుగా ప్రయాణించి సాయంత్రం ఐదు గంటల నుంచి అర్ధరాత్రి పన్నెండు గంటలలోపు శ్రీకాకుళం జిల్లా ఉద్దానం ప్రాంతంలో భూమి మీద విరుచుకుపడింది (లాండ్‌ఫాల్). మరుసటి రోజు అంటే అక్టోబర్ 12న పూర్తిగా బలహీనపడి వాయుగుండంగా మారి పశ్చిమ బెంగాల్‌లోకి ప్రవేశించింది. కుండపోత వర్షాలు, పెనుగాలులతో దక్షిణ భాగపు పశ్చిమ బెంగాల్‌ను వణికించింది. 2018లో మనదేశంలో ఏర్పడిన తుఫానులలో పెను విధ్వంసం సృష్టించిన తుఫానుగా రికార్డు నమోదు చేసింది. వారం రోజులలో ఈ తిత్లి తుఫాన్ మొత్తంగా ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలలో సుమారుగా ఆరు వేల కోట్ల రూపాయల (ప్రాథమిక అంచనా) నష్టాన్ని మిగిల్చి మాయమైంది.

శ్రీకాకుళం జిల్లాలో ప్రవేశించేప్పటికి తుఫాను గాలుల వేగం గంటకు 120 కిలోమీటర్లే ఉన్నప్పటికీ, ఉద్దానం ప్రాంతం మీద విరుచుకు పడినప్పటికీ వాటి వేగం గంటకు 140 కిలోమీటర్లకు చేరుకుందని అంచనా. ఆ రాత్రిపూట తిత్లి తుఫాను సృష్టించిన బీభత్సం రెండు మూడు రోజులకు గాని పూర్తిగా బయటి ప్రపంచానికి తెలియరాలేదు. గుడ్డిలో మెల్లగా రాత్రిపూట కావడం వల్ల ప్రాణనష్టం పదితో ఆగింది. పగటిపూట తుఫాను శ్రీకాకుళంలో ప్రవేశించి ఉంటే జననష్టం భారీగా పెరిగి ఉండేది. దాదాపు పన్నెండు మండలాలకు చెందిన 1,802 గ్రామాలలో జన జీవితాన్ని అతలాకుతలం చేసిన ఈ తుఫాను దగ్గర దగ్గర రెండు వేల కోట్ల రూపాయల నష్టాన్ని కలిగించినట్టు ఒక అంచనా.

మొత్తంగా మనం తుఫానును ఎదుర్కొన్న తీరులో రెండు దశలున్నాయి. తుఫాను రాక ముందు ఎంతమేరకు ప్రజలను అప్రమత్తం చేశామన్నది ఒక దశ కాగా, తుఫాను వచ్చిన తరువాత ఏ విధంగా ప్రజలను ఆదుకున్నామన్నది ముఖ్యమైన రెండవ దశ. ఇంతకు నాలుగేళ్ల ముందు (2014లో ఇదే తేదీన) వచ్చిన హుద్‌హుద్ తుఫాన్ కళింగాంధ్రలో సృష్టించిన విధ్వంసపు చేదు జ్ఞాపకాలు ఇంకా చెదరకముందే, ఇప్పుడు తిత్లీ తుఫాను కళింగాంధ్ర తీరానికి మానని గాయం చేసింది.

హుద్‌హుద్ తుఫానులో గాలుల వేగం గంటకు 170 కిలోమీటర్లు ఉన్నప్పటికీ మృతుల సంఖ్య మూడుకు మించకుండడానికి తోడ్పడిన సాంకేతిక శాస్త్ర సహాయం ఈసారి అందలేదు. తిత్లీ తుఫాను రాకనైతే ఊహించారు గాని, గాలుల వేగాన్ని వాతావరణ నిపుణులు అంచనా వేయలేకపోయారు. సముద్ర తీర ప్రాంతంలో హెచ్చరికలైతే చేశారు గాని, మైదాన ప్రాంత ప్రజలను అప్రమత్తం చేయలేకపోయారు. ఇంత ఉధృతంగా గాలులు వీస్తాయని వాతావరణ శాఖ హెచ్చరించకపోవడం వల్ల తుఫానును ఎదుర్కోవడానికి ఇటు ప్రజలు గాని, అటు ప్రభుత్వం గాని సన్నద్ధంగా లేరు.

గోరుచుట్టు మీద రోకటిపోటులాగా గాలులు సృష్టించిన విధ్వంసం తెలుసుకునే లోపు ఒరిస్సాలో కురిసిన భారీ వర్షాల కారణంగా శ్రీకాకుళం జిల్లాలోని నదులు ఉప్పొంగి ప్రవహించడం మొదలుపెట్టాయి. వరద వచ్చేస్తోందన్న వదంతులు వ్యాపించాయి. 12 నాటికి వంశధారలోకి ఎగువ వర్షపు నీటి చేరిక వల్ల గంట గంటకూ నదిలో నీరు ఎక్కువ కాసాగింది. ఒక దశలో 1,71,317 క్యూసెక్కుల నీటి ప్రవాహం నదిలో ఉండింది. 1980లో వచ్చిన భారీ తుఫానుకు 4 లక్షల క్యూసెక్కులకు వంశధార వరద ప్రవాహం చేరిన తర్వాత మళ్లీ ఇప్పుడు తరువాతి రికార్డు స్థాయికి వెళ్లింది.

నదిలో నీరు ఉరవడిగా సముద్రంలోకి చేరేటట్లు 24 గేట్లు ఎత్తివేశారు. మరుసటి రోజు కూడా ఎడతెగకుండా ఒరిస్సాలో కురిసిన వర్షాల వల్ల అక్కడి పంటలన్నీ నీట మునగడంతో భగల్ డ్యాం గేట్లు ఎత్తేయడంతో ఇచ్ఛాపురం వద్ద శ్రీకాకుళం జిల్లాలో ప్రవేశించే బాహుదా నదిలో లక్షన్నర క్యూసెక్కుల వరద ప్రవాహం వచ్చినట్టు ఒక అంచనా. దీంతో ఇచ్ఛాపురం మండలంలోని సుమారు 74 గ్రామాల పంట పొలాలలోనికి నీరు కొట్టుకొచ్చింది. బాహుదా నదిలోని నీరు సముద్రంలో కలవడానికి పట్టిన వారంరోజుల పాటు వందలాది ఎకరాలలోని వరిపంట నీటమునిగి కుళ్లిపోయింది.

తొలి మూడు రోజుల్లో పదుల సంఖ్యలో పశువులు కళ్లముందే నీటిలో కొట్టుకుపోతున్నా రైతులు నిస్సహాయంగా చూస్తూ ఉండిపోయారు. ఉప్పొంగిన వంశధార, నాగావళి, బాహుదా నదులకు ఆనుకుని ఉన్న గ్రామాల ప్రజలకు బాహ్య ప్రపంచంతో సంబంధాలు తెగిపోయాయి. కరెంటు లేక, మంచినీరు లేక, ఆహారం లేక బిక్కుబిక్కుమని చూస్తున్న వేలాది గ్రామస్తులకు సహాయం చేద్దామన్నా తొలి మూడురోజులు దారి దొరకలేదు.

తుఫాను రోజు రాత్రి సుమారు ఏడు గంటలపాటు ప్రచండంగా వీచిన గాలులకు సిక్కోలు జిల్లాలో జరిగిన విలయం వర్ణించడానికి వీలులేనిది. ఉత్పాతాన్ని సరిగ్గా ప్రభుత్వం అంచనా వేయలేకపోవడం వల్ల ప్రజలు అప్రమత్తంగా లేరు. సిక్కోలు వాసులు ఆ రాత్రిపూట గంటకు

140 కిలోమీటర్ల వేగంతో వీచిన గాలులను భయ విహ్వలతతో చూస్తూండిపోయారు. ఆ నిశిరాత్రి గాలులు రేపిన సుడి ఘోషను మౌనంగా వింటూ బిక్కచచ్చిపోయారు. వర్షపాతం పెద్దగా నమోదు కాకపోవడం ఒక ఉపశమనం.

జీడిమామిడి, కొబ్బరి, టేకు, మామిడి చెట్లు లక్షల సంఖ్యలో వేళ్లతో నేలకొరిగిపోయాయి. సుమారుగా ఏడు వందల గ్రామాలలో రైతులు ఇళ్లు కూలిపోయి, లేదా పైకప్పులు ఎగిరిపోయి నిరాశ్రయులయ్యారు. పన్నెండు మండలాలలో వేల సంఖ్యలో కరెంటు స్తంభాలు ఒరిగిపోవడం వల్ల దాదాపు వారం రోజుల పాటు ఉద్దానం ప్రజలు రాత్రిపూట చిమ్మచీకటిలో గడపాల్సి వచ్చింది. (విద్యుత్ పునరుద్ధరణ పనులకు గోదావరి జిల్లాల నుంచి వచ్చిన కార్మికులు భోజనాలు దొరకక ఇబ్బందులు పడ్డారు. వివిధ ప్రమాదాలలో అనేక మంది గాయపడగా, ఒకరు మరణించారు).

జిల్లా వ్యాప్తంగా వరిపంట నీట మునిగిపోయింది. ఒకటిన్నర లక్షల ఎకరాలలో వరిపంటకు నష్టం వాటిల్లగా, మరొక లక్ష ఎకరాలలో ఉద్యాన పంటలకు తీవ్ర నష్టం ఏర్పడినట్లు గుర్తించారు. జీడిపిక్క, కొబ్బరిపీచు, గ్రానైట్ తదితర పరిశ్రమల పైకప్పులు ఎగిరిపోవడం లేదా కూలిపోవడం వంటి ప్రమాదాలతో పారిశ్రామిక రంగానికి కోలుకోలేని దెబ్బ తగిలింది. ఇచ్ఛాపురం మండలం తేలుకుంచి గ్రామంలో నివాసం ఉంటున్న అనేక విదేశీ విహంగాలు నేలకొరిగాయి.

అదీ ఇదీ అని లేకుండా అన్ని రంగాలలో కడుపు దేవుకుపోయేట్టు, కోలుకోవడానికి ఏళ్లూపూళ్లూ పట్టేటంత నష్టం మిగిల్చింది ఈ తిత్లీ తుఫాను. జిల్లాలోని పన్నెండు మండలాలను తీవ్ర తుఫాను ప్రభావిత ప్రాంతాలుగా అధికారులు గుర్తించారు. టెక్కలి నియోజకవర్గంలోని టెక్కలి, కోటబొమ్మాళి, సంతబొమ్మాళి, నందిగాం, మెళియాపుట్టి, పలాస నియోజకవర్గంలోని పలాస, మందస, వజ్రపుకొత్తూరు, ఇచ్ఛాపురం నియోజకవర్గంలోని ఇచ్ఛాపురం, కవిటి, కంచిలి, సోంపేట మండలాల లోని దాదాపు అన్ని గ్రామాలు తుఫాను తాకిడిని ఎదుర్కొని రెక్కలు తెగిన పక్షిలా పడిపోయినవే.

శాస్త్రీయంగా ఆలోచించలేని పౌర సమాజం భావోద్వేగపరమైన నిర్ణయాలు తీసుకుంటుంది. పాలకుల పబ్బం గడవాలంటే ఉండాల్సింది అటువంటి సమాజాలే. అప్పుడే వారి పని సులువు. నూతనంగా ఏర్పాటయిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి తొలిసారథిగా వచ్చిన ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు ప్రజల భావోద్వేగాలను తన రాజకీయ పరమపద సోపానపటానికి మెట్లుగా వాడుకోవడం అంటే ఎక్కడలేని సరదా. ఏలినవారి బులబాటం తీర్చడానికి వందిమాగధ మీడియా తోడైతే ఎలా ఉంటుందో తెలుసుకోవాలంటే తుఫాను తీరందాటి వెళ్లిపోయిన తర్వాత కళింగాంధ్రను చూస్తే సరి. కేంద్రంతో ఎడముఖం పెడముఖం చేసుకున్న చంద్రబాబుకు నిత్యం ప్రజలలో పూనకం తేవడానికి ఏదో ఒక సాకు కావాలి.

బాబ్లీపైన వచ్చిన చిన్నపాటి కోర్టు ఆర్డరయినా, వ్యాపారస్తులపైన జరిగే సిబిఐ దాడులైనా, పారిశ్రామిక సదస్సులైనా, మరేవైనా అక్కరకు వస్తాయి. అలాంటిది విలయం సృష్టించిన ప్రకృతి ప్రతాపం.. చంద్రబాబుకు ఒక చక్కటి అవకాశం.

వెంటనే ఆయన తన మకాం శ్రీకాకుళానికి మార్చేశారు. అక్కడితో ఊరుకోలేదు. 15 మంది మంత్రులు, 30 మంది ఐఏఎస్ అధికారులు, 90 మంది డిప్యూటీ కలెక్టర్లను శ్రీకాకుళానికి రప్పించారు. తుఫాను ప్రభావం పడని శ్రీకాకుళం పట్టణంలో వీరందరి బస. అక్కడి నుంచి ప్రతి రోజూ గ్రామాలను పర్యటించడం, ప్రజలకు మంచినీరు, ఆహారం వంటి కనీస సౌకర్యాలు అందేటట్టు చేయడం, విద్యుత్ పునరుద్ధరణ పనులు చూడడం, చెట్లు పడిపోవడం వల్ల ప్రయాణాలకు ఆటంకంగా మారిన రోడ్లను క్లియర్ చేయడం, అన్నిటికంటే ముఖ్యంగా నష్టాన్ని అంచనా వేసి బాధితులకు సరైన నష్టపరిహారాన్ని అందే ఏర్పాట్లు చూడడం.. వారం రోజులపాటు నాటకీయ ఫక్కీలో ముఖ్యమంత్రి తుఫాను అనంతర సహాయ కార్యక్రమాలు దగ్గరుండి పర్యవేక్షించారు. స్థానిక, జాతీయ మీడియా దృష్టిలో పడడం వరకు విజయం సాధించారు.

కాని ప్రభువులను స్తుతించే పత్రికలలోనే తుఫాను వెళ్లిన పన్నెండో రోజు కూడా, 'కేవలం అధికారుల అసమర్థత వల్లనే' అనుకోండి, ఇంకా చీకట్లోనే గ్రామాలు ఉండడం, ప్రజలకు ఆహారం అందకపోవడం, తుఫాను నష్టం ఒక అంచనాకు రాకపోవడం, గ్రామాలకు వెళ్లే రోడ్ల సదుపాయం పునరుద్ధరణ కాకపోవడం వార్తలుగా వస్తున్నాయి. అయితే మునుపటిలా కాకుండా, ఇప్పుడు పెరిగిన సామాజిక మాధ్యమాల వాడకం అసలు నిజాలను కొంతయినా బయటపెడుతున్నాయి.

చంద్రబాబుకు నిజాలు తెలియజెప్పాలనుకున్న గ్రామస్తులపై 'విపక్షం కుట్ర' అని ముద్రవేసి ఎదురుదాడికి దిగారు. దాంతో పోలీసులకు తమ విధులు వెంటనే గుర్తొచ్చి ఎక్కడికక్కడ 'అక్రమంగా వచ్చిన ఇతర గ్రామాల' (ఇతర దేశాల ప్రజలు కాకపోవడం గమనించాలి) ప్రజలను అరెస్టులు చేశారు. కాని మిగతా మంత్రులను మాత్రం పెద్దగా ఇబ్బంది పడనివ్వలేదు బాధిత గ్రామస్తులు. తమ గ్రామాలలోకి రానివ్వకుండా, జిల్లా కేంద్రం నుంచే 'టెలి కాన్ఫరెన్సులతో విస్తృత సమావేశాలు, నిర్దుష్ట చర్యలు' తీసుకునే సౌకర్యం కళింగాంధ్ర ప్రజలు కలుగజేశారు.

మెళియాపుట్టి మండల కేంద్రంలో రైతులు ఆగ్రహంతో మండల రెవిన్యూ అధికారి కార్యాలయాన్ని ధ్వంసం చేశారు. వజ్రపుకొత్తూరు మండలంలో రైతులు రోడ్ల దిగ్బంధనం చేశారు. ఇవన్నీ చిన్న చిన్న వీడియోలుగా సోషల్ మీడియాలో ఒకరి నుంచి మరొకరికి విస్తృతంగా ప్రచారం పొందాయి.

మొత్తంగా తుఫాను అనంతర చర్యలలో ప్రభుత్వం ఘోరంగా విఫలమైందనే చెప్పాలి. స్థానిక మండల పాలక వ్యవస్థ, పోలీసు యంత్రాంగం వెనువెంటనే స్పందించి ప్రజలను ఆదుకోవడంలో, సహాయ పునరావాస కార్యక్రమాలు చేపట్టడంలో, మంచినీరు, విద్యుత్ పునరుద్ధరణలలో దారుణంగా విఫలమయ్యాయి.

పర్యావరణంలో కలుగుతున్న మార్పుల ఫలితంగానే భూకంపాలు, తుఫానులు, సునామీలు, విపరీతమైన ఎండలు వంటి ప్రకృతి ఉత్పాతాలు సంభవిస్తున్నాయని శాస్త్రవేత్తలు హెచ్చరిస్తున్నారు. పెరుగుతున్న సాంకేతిక పరిజ్ఞానం ముంచుకొస్తున్న ముప్పును హెచ్చరించగలదే కాని, ప్రజలకు ఎటువంటి సాయం చేయగలిగే పరిస్థితి ప్రస్తుతానికి లేదు. దీనిని మనం సమర్థంగా అధిగమించడానికి ప్రభుత్వం అనేక జాగ్రత్తలు తీసుకోవలసి ఉంది. 2006లోనే జాతీయ విపత్తుల నివారణ సంస్థ (ఎన్‌డిఎంఎ)ను ఏర్పాటు చేసుకున్నాం. దాంతోపాటు 2009లో జాతీయ విపత్తుల సహాయ సైన్యాన్ని (ఎన్‌డిఆర్ఎఫ్) కూడా జాతీయస్థాయిలో రూపొందించాం.

ప్రతి ఏటా తుఫానులు సర్వసాధారణమైన మనకు ఈ సరికే ఏ స్థాయి ప్రకృతి విపత్తు వచ్చినా దానిని ఎదుర్కొనే సత్తా, సామర్థ్యం

# గద్దర్ కొత్త మజిలీ - చర్చనీయాంశాలు

*నాలుగు దశాబ్దాలకు పైగా విప్లవ రాజకీయాలకూ ప్రజా ఉద్యమాలకూ స్వరంగా ఉండిన గద్దర్ పార్లమెంటరీ రాజకీయాల వైపు చూడడం అనే కీలక పరిణామంలో చర్చనీయాంశాలేమిటో వివరిస్తున్నారు* **దివాకర్**

**త**న పాటతో, ఆటతో, మాటతో, హావభావాలతో లక్షలాది మంది ప్రజలను ఉగ్రరూతలూగించిన, విప్లవాభిమానులుగా మార్చిన, ఉత్తేజ పరిచిన గద్దర్ కాంగ్రెస్ రాజకీయాలకు దగ్గరవుతున్నారని, కాంగ్రెస్ పార్టీకి ఉన్న లౌకిక, ప్రజాస్వామిక విలువల గురించి కితాబులిస్తున్నారని, కాంగ్రెస్ సభలకు వెళ్లమని ప్రజలకు పిలుపు ఇస్తున్నారని చూసి ఆయన ఇంతకాలం ప్రచారం చేసిన రాజకీయాల అభిమానులు, సాధారణ ప్రజలు విచారానికి, గందరగోళానికి గురవుతున్నారు. సాయుధపోరాట మార్గాన్ని విడనాడి పార్లమెంటరీ మార్గాన్ని సమర్థిస్తున్నందుకు కొందరు ఆయనకు ఆహ్వానం పలుకుతున్నారు. దశాబ్దాలుగా ఆయనను, ఆయన ప్రాతినిధ్యం వహించిన రాజకీయాలను వ్యతిరేకిస్తూ వస్తున్నవారు ఇవాళ తమ వ్యతిరేకతను వెళ్లగక్కడానికి మరొక అవకాశం దొరికినట్టు ప్రవర్తిస్తూ, విపరీత వ్యాఖ్యలు చేస్తున్నారు. మొత్తం మీద విప్లవ రాజకీయ శిబిరంలో, తెలుగు సమాజంలో ఈ కీలక పరిణామాన్ని ఎలా అర్థం చేసుకోవాలనే అంశం తీవ్రమైన చర్చనీయాంశంగా మారింది.

"తన ప్రభావంలో వందలాది మందిని అడవులకు పంపించి, వారి మరణాలకు కారణమైన గద్దర్ ఇప్పుడు ఆ రాజకీయాలను వదులుకోవడం సిగ్గుచేటు. అలా వదులుకుంటున్నందుకు ఆ మృతుల కుటుంబాలకు క్షమాపణలు చెప్పాలి."

"బుల్లెట్ మార్గం వదిలి బాలెట్ మార్గం చేపట్టడం ఆహ్వానించదగినదే గాని గతంలో తనవల్ల ప్రాణాలు పోగొట్టుకున్నవారి కుటుంబాలకు ఏం చెపుతారు?"

"నక్సలైట్ రాజకీయాల దివాళాకోరుతనానికి ఇది నిదర్శనం."

"ఎన్నికల బహిష్కరణ నినాదం ఆచరణ సాధ్యం కానిదనీ, కుహనా విప్లవ నినాదమనీ ఈ పరిణామం చూపుతున్నది."

"విప్లవోద్యమం వదిలేసి ఎందరు వెళ్లిపోలేదు, దళితుడు గనుకనే గద్దర్‌ను విమర్శిస్తున్నారు."

"గద్దర్ ఎప్పుడో విప్లవ మార్గాన్ని వదిలేశాడు. ఇప్పుడు కొత్తగా జరుగుతున్నదేముంది?" వగైరా వగైరా ఎన్నో ప్రతిస్పందనలు చెలరేగుతున్నాయి. ఈ ప్రతిస్పందనలలో ప్రతి ఒక్కదానిలోనూ ఎంతో కొంత నిజం ఉండవచ్చు గాని, ఆ నిజం స్వల్పమైనదే. ప్రస్తుత పరిణామం ఈ తక్షణ వ్యాఖ్యల కన్న మించినది, లోతైనది. చారిత్రక నేపథ్యంలో అర్థం చేసుకోవలసినది.

---

సంపాదించి ఉండాల్సింది. కాని, మన ఆదర్శాలకు, వాస్తవిక ఆచరణకు నడుమ అఖాతమంత తేడా ఉండడంవల్ల తుఫాను వచ్చిన ప్రతిసారి చిగురు టాకులా నిలువెల్లా వణికిపోతున్నాం. పాలనను పడకేయించి, యావత్తు ప్రభుత్వ యంత్రాంగమంతా విపత్తు నివారణలోనే మునిగి తేలిపోతోంది. ప్రజల సానుభూతి కోసం నాయకులు, నాయకుల సాయం కోసం ప్రజలు చేతులు దేబరించుకుంటూ నిల్చునేలా చేస్తున్నాం. ఈ తీరంతా మారాలి.

తిత్లీ బీభత్సం నుండి ఇంకా తేరుకోకముందే యాధృచ్ఛికంగా విశాఖపట్నంలో తీరప్రాంత క్రమబద్ధీకరణ మండలి (కోస్టల్ రెగ్యులేటరీ జోన్ – సిఆర్‌జడ్) పబ్లిక్ హియరింగ్ జరిగింది. అది జరగడానికి ముందురోజే శ్రీకాకుళంలో రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు ఉద్దానంలో పారిశ్రామిక వాడ (ఇండస్ట్రియల్ పార్క్) ఏర్పాటు చేస్తామని ప్రకటించడమే కాకుండా ఇచ్ఛాపురం నుంచి విశాఖపట్నం వరకు బీచ్‌రోడ్ ఏర్పాటు చేస్తానని ప్రకటించారు. ఇది గత కొన్నేళ్లుగా చంద్రబాబు కంటోన్న కల. తీరంవెంబడి నాలుగులైన్ల రోడ్డును నిర్మించాలని ఆయన ఉబలాటం.

సిఆర్‌జడ్ నిబంధనలు పాటించకపోవడం వల్లనే తీరప్రాంతం పెను ప్రమాదానికి గురైందని మేధావులు గగ్గోలు పెడుతుంటే, మరోవైపు కార్పొరేట్ వాణిజ్య ప్రయోజనాలు సిద్ధింపజేయడానికి అవే నిబంధనలకు పాలకులే తూట్లు పొడవడానికి ప్రయత్నాలు చేయడం. వాటి పర్యవసానంగా ప్రకృతి బీభత్సాలు చోటుచేసుకున్నప్పుడు విధ్వంసానికి గురైన సామాన్య ప్రజల జీవితాలను ఉద్ధరిస్తానని మళ్లీ అదే నాయకులు చెప్పడం ద్వంద్వం లేదా విరోధాభాస కాకుంటే మరేమిటి!

తీరం వెంట సహజ సిద్ధంగా పెరుగుతున్న మడ అడవులు, సరుగుడు చెట్లు, బీల భూములు, ఉప్పు నీరు మంచినీరు కలిసే ప్రాంతాలు (బ్రాకిష్), కొండల మీద పెరిగే వృక్ష సముదాయాలు మొదలైన వాటి పెరుగుదల కోసం ప్రభుత్వం పైసా పెట్టుబడి పెట్టనవసరం లేదు. సముద్రం చుట్టూ ఉండే ఈ కానపీ సహజసిద్ధంగా తుఫానుల గాలులను, వర్షపు ఉధృతిని కొంతవరకు తట్టుకుని ఆపగలుగుతాయి. వాటిని దాటిన తరువాతే మనుషులను సమీపిస్తాయి.

దురదృష్టవశాత్తు ఉన్న అన్ని పర్యావరణ పరిరక్షణ చట్టాలను తుంగలో తొక్కి మాస్టర్‌ప్లాన్‌లు రూపొందించి, అన్ని అక్రమ నిర్మాణాలకు, ఇతర పనులకు పచ్చాజెండాలు ఊపుతున్నాం. తుఫాను బీభత్సాలు ఎదురైనప్పుడు మనల్ని మనం కాపాడుకోలేక ప్రజలను దిక్కులేని వాళ్లను చేస్తున్నాం. కనీసం ఈ తిత్లీ తుఫానైనా, అది కళింగాంధ్ర నేలపై చేసిన గాయమైనా మన పాలకుల కళ్లు తెరిపిస్తుందా? వారి విధ్వంసక అభివృద్ధి పాలన నమూనాను వెక్కిరించే ఈ ప్రకృతి విపత్తు వారికి కనువిప్పు కాగలదా!?

*(రచయిత సిక్కోలు బుక్ ట్రస్ట్ నిర్వాహకులు)* వీ

ఈ పరిణామం, ప్రతిస్పందనలు కూడ సరిగ్గా సోవియట్ యూనియన్ పతనం నాటి స్థితిని గుర్తుకు తెస్తున్నాయి. సోవియట్ యూనియన్‌ను సోషలిజానికి చిహ్నంగా చూసినవాళ్లు దాని పతనంతో తీవ్రమైన నిరాశకు గురికావడం సహజమే. కాని అప్పటికి ఇరవై ఏళ్లకు పైగా అది సోషలిస్టు దేశం కాదనీ, సోషల్ సామ్రాజ్యవాదంగా మారిపోయిందనీ చెపుతున్న వాళ్లలో కొందరు కూడ దిగ్భ్రాంతి పడ్డారు. అది సోషల్ సామ్రాజ్య వాదమైనా అది కూలిపోవడం సోషలిజం పతనమేనని అనుకున్నారు. ఇక సాధారణ ప్రచారసాధనాలు, ప్రజానీకం కూడ దాన్ని సోషలిజం పతనంగానే భావించారు.

గద్దర్ విప్లవ రాజకీయాలను వదిలిపెట్టి బూర్జువా పార్లమెంటరీ రాజకీయాల వైపు చూడడం, సోవియట్ యూనియన్ పతనం అనే ఈ రెండు పరిణామాల మధ్య పూర్తిగా సరిసమానమైన పోలిక లేకపోవచ్చు గాని కొన్ని సమానాంశాలు మాత్రం ఉన్నాయి.

గద్దర్ కొత్త నిర్ణయం పట్ల తీవ్రమైన అభిప్రాయాలు వెలువడడానికి ప్రధానమైన కారణం ఆయనకు ప్రజల హృదయాల్లో ఉండిన గౌరవనీయమైన స్థానమే. ఆ విపరీతమైన అభిమానం కలిగించిన లోతైన నిరాశే. ఆ ప్రజాభిమానం పుట్టిపెరిగి ఈ స్థాయికి రావడానికి నాలుగున్నర దశాబ్దాల చరిత్ర ఉంది. ఆయన వ్యక్తిత్వంలోని, కళానైపుణ్యంలోని, ప్రభావశీల శక్తిలోని అనేక విశిష్ట అంశాలున్నాయి. అందువల్ల ఆ ప్రజాభిమానం రూపొందిన ఆ సుదీర్ఘమైన క్రమం గురించీ, ఆ క్రమంలోని లోటుపాట్ల గురించీ మాట్లాడుకోకుండా, కేవలం ఇవాళ్టి పరిణామంపై అలవోకగా ఏదో ఒక చిల్లర వ్యాఖ్య చేయడం అనుచితం.

గద్దర్‌ను ఒక వ్యక్తిగా మాత్రమే చూడడమైనా, ఒక విప్లవోద్యమ, ప్రజా ఉద్యమ ఉత్పత్తిగా, ప్రచారకుడిగా మాత్రమే చూడడమైనా పొరపాటు అవుతుంది. ఆయనలో కనీసం 1971 నుంచి 2013-14 దాకా నలభై సంవత్సరాలకు పైగా ఈ రెండు అంశాలూ విడదీయరానంతగా కలగలిసిపోయాయి. వ్యక్తిగా ఎంత గొప్ప కళాకారుడో, విప్లవోద్యమ, ప్రజా ఉద్యమగళంగా అంత శక్తిమంతుడిగా ఆయన కొనసాగారు. ఆటలో, పాటలో, మాటలో, హావభావాలలో, ముఖంలో, అభినయంలో గద్దర్ ప్రతిభ అసాధారణమైనది.

అయితే అందులో ఆయన వ్యక్తిగత ప్రతిభ పాత్ర ఎంతటిదో, ఆ ప్రతిభను ఎప్పటికప్పుడు ఆదరిస్తూ, తీర్చిదిద్దుతూ, సవరిస్తూ, మెరుగు పరుస్తూ వచ్చిన ఆయన సామాజిక జీవితం పాత్ర కూడ అంతటిదే. గద్దర్ ఒక వ్యక్తి మాత్రుడుగా మాత్రమే మిగిలిపోక, ఒక శక్తిగా పరిణమించడం వెనుక ఐదు దశాబ్దాల విప్లవోద్యమ చరిత్ర, తెలుగుసీమలో ప్రజాజీవనం మీద విప్లవోద్యమం వేసిన అపారమైన ప్రభావం, వేలాది అమరవీరుల అశేష త్యాగాలు, తెలంగాణ మౌఖిక కళా సంప్రదాయపు ప్రత్యేకతలు, దళిత జీవిత నేపథ్యం వంటి ఎన్నో అంశాల మేలు కలయిక ఉంది. కనుక ఆయనలోని గుణాలకైనా, లోపాలకైనా, వ్యక్తిగత, సామాజిక, రాజకీయ జీవితంలోని ఒడిదుడుకులకైనా, ప్రస్తుత పరిణామాలకైనా ఆయననో, ఉద్యమాన్నో విడిగా బాధ్యులను చేయడం సరికాదు. అలాగే ఈ పరిణామం ఏదో హఠాత్తుగా జరిగిన పరిణామంగా చూడడం కూడ సరికాదు.

నాలుగు దశాబ్దాల పైబడిన గద్దర్ విప్లవ జీవితం నానాటికీ పైపైకి ఎగుస్తూ సాగిన సరళరేఖ కాదు. నిజానికి తెలుగుసీమలో విప్లవోద్యమ గమనమే అటువంటి ఊర్ధ్వముఖ సరళరేఖ కాదు. అనేక అంతరాలతో, ఎత్తుపల్లాలతో, చిక్కుముడులతో, గెలుపు ఓటములతో, వైవిధ్యంతో, వైరుధ్యాలతో సాగుతున్న సంక్లిష్ట సమాజంలో ఒక వ్యక్తి జీవితమైనా, ఒక సామాజిక నిర్మాణపు పరిణామమైనా అలా నల్లేరు మీద బండి నడక లాగ ఏకరీతిగా సాగిపోవడానికి అవకాశమే లేదు.

ఇంకా సమగ్రమైన తెలుగుసీమ విప్లవోద్యమ చరిత్ర రచన జరగలేదు గనుక ఆ సంక్లిష్టతలన్నిటినీ ఇక్కడ ప్రస్తావించడం సాధ్యం కాదు గాని, ఇక్కడ చర్చనీయాంశమైన గద్దర్ జీవితానికి సంబంధించినంత వరకే చూస్తే ఆయన విప్లవ జీవితంలో కనీసం ఐదు దశలున్నాయి. మొదటిది 1971 నుంచి 1985 దాకా సాగిన ఉత్థాన దశ, రెండవది 1985 నుంచి 1990 దాకా సాగిన నిర్బంధ, అజ్ఞాతవాస దశ. మూడవది 1990 నుంచి 1992 దాకా సాగిన పునరుత్థాన దశ. నాలుగవది 1992 నుంచి 2004 దాకా సాగిన ఒడిదుడుకుల దశ. ఐదవది 2004 నుంచి 2012 దాకా సాగిన తెలంగాణ ఉద్యమ దశ. ఈ దశల మధ్య కచ్చితమైన విభజన రేఖలు గీయడం కూడ సాధ్యం కాదు. తర్వాతి దశలో ముందరి దశ ప్రభావాలు కనబడతాయి. ప్రతి దశలోనూ ఆ దశకు భిన్నమైన లక్షణాల వ్యక్తీకరణలూ కనబడతాయి. ప్రతి దశలోనూ మంచి చెడుల, విజయ వైఫల్యాల చిక్కుముడి కనబడుతుంది.

గ్రామీణ దళిత కుటుంబ నేపథ్యం నుంచి వచ్చిన కళాదృష్టి, తండ్రి నుంచి అందిన అంబేడ్కర్ ఆలోచనాధార, ఉస్మానియా ఇంజనీరింగ్ కాలేజ్ విద్యార్థిగా విప్లవ విద్యార్థి ఉద్యమ ప్రభావం, వ్యక్తిగతంగా అద్భుతమైన గాన, అభినయ ప్రతిభ కలిసి 1970-71 నాటికే, ఇరవై ఒకటి, ఇరవై రెండు ఏళ్లకే గుమ్మడి విఠల్ బాబు గాయకుడిగా, కళాకారుడిగా ఎదిగారు. ప్రభుత్వ సమాచార శాఖ కోసం బుర్రకథ దళంలో ప్రదర్శనలు ఇస్తుండగా బి. నర్సింగరావు నాయకత్వంలో సికిందరాబాద్ శివారు గ్రామం అల్వాల్‌లో నడుస్తుండిన ఆర్ట్ లవర్స్ దృష్టిలో పడ్డాడు. అప్పటికే ఆర్ట్ లవర్స్ విప్లవోద్యమ ప్రభావంలో, విరసం ప్రభావంలో, నేరుగా చెరబండరాజు, కొండపల్లి సీతారామయ్యల ప్రభావంలో ఉంది. సహజంగానే విఠల్ బాబు ఆ ప్రభావంలోకి, ఒకరకంగా తన మూలాల్లోకి తాను, వచ్చారు. అలా ఆయన రాసిన మొదటి పాట 'ఆపుర రిక్షోడో, రిక్షెంట నేనొస్త' అప్పటికి కొండపల్లి సీతారామయ్య నాయకత్వంలోని పార్టీ పత్రికగా వెలువడుతుండిన 'పిలుపు' 16 నవబర్ 1972 సంచికలో విబి గద్దర్ పేరుతో వెలువడింది. అదే ఊపున ఆయన డజనుకు పైగా పాటలు రాశారు. ఆ తొలిరోజుల పాటల్లో ఎక్కువ భాగం సికిందరాబాదు పరిసర ప్రాంతాల ప్రజలు పాడుకునే పాటల బాణీలు తీసుకుని విప్లవ భావజాలాన్ని ప్రచారం చేయడానికి ప్రయత్నించారు. ఈ పాట అచ్చు కావడానికి కనీసం ఎనిమిది నెలల ముందు నుంచే జననాట్యమండలి అనే నిర్మాణ రూపం కూడ ఏర్పడి బొల్లారం, యాప్రాల్ వంటి పరిసర గ్రామాల యువ కళాకారులతో పనిచేయడం ప్రారంభించింది.

నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాలు దారుణ దమనకాండకు గురై, విప్లవోద్యమం తాత్కాలిక వెనుకంజ స్థితిలో ఉన్నప్పుడు, విప్లవోద్యమాన్ని పునర్వికసింపజేయడానికి జరుగుతున్న ఉధృతమైన ప్రయత్నాలలో ఆ పాటల ద్వారా జననాట్యమండలి, గద్దర్ భాగస్వాములు అయ్యారు. ఆ ప్రయత్నాల్లో భాగంగానే ఆ ఒకటి రెండు సంవత్సరాల్లో తెలంగాణ

వ్యాప్తంగా జరిగిన అనేక సభల్లో ఆయన ఈ పాటలు పాడారు. అవి వాటి సారాంశం వల్ల, సందేశం వల్ల, గద్దర్ పాడిన తీరు వల్ల, సహచరుల గాన, వాద్య సహకారం వల్ల విస్తృతమైన ప్రజాదరణ చూరగొన్నాయి. అలా అవి ప్రజల్లో వ్యాపించిన తర్వాతనే, బహుశా ప్రజల స్పందనను బట్టి మార్పులూ చేర్పులూ జరిగిన తర్వాతనే, మొదటిసారిగా సృజనలో అచ్చు కావడం మొదలయింది. జూన్ 1973 సంచికలో ఒక పాట, జూలై సంచికలో నాలుగు పాటలు, ఆగస్ట్ సంచికలో మూడు పాటలు, సెప్టెంబర్ సంచికలో నాలుగు పాటలు, అక్టోబర్ సంచికలో ఒక పాట ప్రచురించిన సృజన, ఆ పాటలన్నిటినీ కలిపి 1973 అక్టోబర్ 7-9ల్లో వరంగల్ లో జరిగిన విప్లవ రచయితల సంఘం మొదటి సాహిత్య పాఠశాల నాటికి 'వి బి గద్దర్ పాటలు' పుస్తకం ప్రచురించింది. అది గద్దర్ రంగప్రవేశం. ఒకరకంగా చెప్పాలంటే ఆ తర్వాత నాలుగు దశాబ్దాల పాటు జరిగిందంతా ఉజ్వలమైన చరిత్ర.

ఆ తర్వాత ఇందిరాగాంధీ నియంతృత్వ పాలన ఎమర్జెన్సీ విధించి దేశాన్ని చీకటికొట్టుగా మార్చేవరకూ జరిగిన రెండు సంవత్సరాల కాలం విప్లవోద్యమ నిర్మాణంలో కీలకమైనది. విప్లవ విద్యార్థి ఉద్యమం విజృంభించి రాడికల్ విద్యార్థి సంఘంగా నిర్మాణరూపం తీసుకుని రాష్ట్రవ్యాప్తంగా విస్తరించింది. రాడికల్ యువజన సంఘం నిర్మించడానికి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. రాడికల్ విద్యార్థి సంఘం, జననాట్యమండలి, విప్లవ రచయితల సంఘం కార్యకలాపాలు ప్రజల్లోకి చొచ్చుకుపోయాయి. ఎమర్జెన్సీ విధింపుతో ఈ బహిరంగ కార్యకలాపాలన్నిటి పైన ఆంక్షలు మొదలయ్యాయి. రాడికల్ విద్యార్థి నాయకులు కొందరు జైలు పాలయ్యారు, కొందరు అజ్ఞాతవాసానికి వెళ్లారు. విరసం నాయకులలో అత్యధికులు జైలు పాలయ్యారు. ఈ సమయంలో గద్దర్‌ను కొద్దిరోజుల పాటు నిర్బంధించి, వేధించి వదిలేశారు.

ఎమర్జెన్సీ ముగియగానే దేశవ్యాప్తంగానూ, రాష్ట్రంలోనూ వెల్లువెత్తిన ప్రజాస్వామిక ఉద్యమాల ఉరవడిలో మళ్లీ రాడికల్ యువజన సంఘం, రైతుకూలీ సంఘం, సింగరేణి కార్మిక సమాఖ్యల ఏర్పాటు, విస్తృతమైన ప్రజా పోరాటాలు, భూపోరాటాల వెల్లువలో జననాట్యమండలి పాట, గద్దర్ పాట మళ్లీ ఒకసారి పతాక స్థాయికి ఎగశాయి. ఈ క్రమంలో గద్దర్ కొన్ని వందల పాటలు రాశారు. విప్లవోద్యమంలో భాగంగా ఎందరో కవులు సృష్టించిన వందలాది పాటలకు తన గళం ఇచ్చారు. గద్దర్ రాసిన పాటలూ, ఇతరులు రాసిన పాటలూ కూడ ఆయన పేరు మీదనే ప్రచారమయ్యాయి. ఒక సంస్థగా జననాట్యమండలి నిజమైన ప్రజా సాంస్కృతిక సామూహిక కృషి ప్రారంభించి డజన్ల కొద్దీ ప్రజాకళారూపాలను వెలుగులోకి తెచ్చి, వాటి సందేశాన్ని విప్లవీకరించింది. నిరక్షరాస్యులైన ఎందరో కవులూ గాయకులూ జననాట్యమండలి వేదికల మీద ప్రాచుర్యంలోకి వచ్చారు. 1978 నాటికి జననాట్యమండలి పాటలు అనే పుస్తకం రూపు దిద్దుకుని, ఎప్పటికప్పుడు కొత్త కొత్త పాటలు చేర్చుకుంటూ, కనీసం యాభై సార్లు పునర్ముద్రణ పొంది, కొన్ని లక్షల కాపీలు ప్రజల్లోకి వెళ్లాయి. జననాట్యమండలి పాటలు అనే పేరుతో మాత్రమే కాక మరొక ఇరవై, ముప్పై పేర్లతో ఈ పాటల పుస్తకాలు వెలువడ్డాయి. ఆదివాసి పోరాటాల చిత్రణగా ఇంద్రవెల్లి కాల్పుల తర్వాత వెలువడిన రగల్ జెండా బాలే రాష్ట్రంలోనూ, దేశవ్యాప్తంగానూ వందలాది ప్రదర్శనలు జరిగాయి.

ఈ అద్భుతమైన తెలుగు విప్లవ, ప్రజా కళారూపాల, పాటల చరిత్ర సూక్ష్మ వివరాలతో సహా సమగ్రంగా ఇంకా నమోదు కావలసే ఉన్నది గాని, ఒక ఉజ్జాయింపు లెక్క చెప్పాలంటే, గడిచిన యాభై ఏళ్లలో విప్లవోద్యమం కనీసం వెయ్యిమంది కవులనూ, గాయకులనూ, పదివేల పాటలనూ, వందకు పైగా కళారూపాలనూ సృష్టించింది, విప్లవీకరించింది. కనీసం ఐదు వేల సభలలో ఈ పాటలు, కళారూపాలు హోరెత్తాయి. కనీసం మూడు కోట్ల మంది ప్రజలను చేరి ఉంటాయి. విప్లవోద్యమం, అన్ని ప్రజా సంఘాలు, జననాట్యమండలి సాగించిన ఈ అపారమైన, మహత్తరమైన కృషిలో గద్దర్ కు తప్పనిసరిగా అత్యంత ప్రధానమైన స్థానం ఉంది. ఈ క్రమంలో జననాట్యమండలి అంటే గద్దర్, గద్దర్ అంటే జననాట్యమండలి అన్నంతగా ఆయన ప్రతిష్ఠ పెరిగిపోయింది. ఇదంతా మొదటి దశ.

ఇలా విప్లవోద్యమం, విప్లవ రాజకీయాల ప్రభావం అప్రతిహతంగా ముందుకు వెళ్తున్న సందర్భంలో, 1985లో తిరిగి అధికారానికి వచ్చిన ఎన్ టి రామారావు ప్రభుత్వం 'ఆట పాట మాట బంద్' అని ఈ విప్లవ రాజకీయ ప్రచారం మీద భయానకమైన నిర్బంధం ప్రారంభించింది. 1985 మేలో రాజమండ్రిలో జరగవలసిన రైతుకూలీ సంఘం మహాసభలను అడ్డుకోవడం, సభల ఏర్పాట్లు చూస్తున్న వలంటీర్లను అరెస్టు చేయడంతో ప్రారంభించి, 1986 జనవరిలో పలాసలో జరగవలసిన విరసం సభలను అడ్డుకోవడం దాకా, ఏ సభలూ సమావేశాలూ జరగనివ్వలేదు. వారానికి ఒక బూటకపు ఎన్‌కౌంటర్‌తో ప్రజలలో భీతావహాన్ని సృష్టించడానికి పోలీసులు ప్రయత్నించారు.

1985 సెప్టెంబర్ 3న పట్టపగలు వరంగల్ రహదారి మీద ఊరేగింపులోంచి పక్కకు వెళ్లిన పోలీసులు, పౌరహక్కుల సంఘం నాయకుడు, పిల్లల వైద్యుడు డా. రామనాథం క్లినిక్‌లో చొరబడి, ఆయనను కాల్చి చంపారు. ఈ దమనకాండ గురించి దేశవ్యాప్తంగా ప్రచారం చేయడానికి, ప్రజల నిరసన కూడగట్టడానికి వెళ్లిన బృందంలో గద్దర్ కూడ సభ్యుడుగా ఉన్నారు. గద్దర్ మళ్లీ తిరిగి రాష్ట్రానికి వస్తే ప్రాణాలతో ఉంచుతారా అనే వాతావరణం నెలకొంది. ఆ ప్రచారయాత్ర నుంచే గద్దర్ అజ్ఞాతంలోకి వెళ్లారు. దాదాపు మూడు సంవత్సరాలు ఆయన ఎక్కడ ఉన్నారో, ఏమి చేశారో తెలియని స్థితి ఏర్పడింది. ఇందులో ప్రధాన భాగం ఆయన ఉత్తర భారత నగరాలలో సానుభూతిపరుల ఇళ్లలో గడిపారు. దాదాపు ఒక సంవత్సరం అజ్ఞాతవాసంలో ఉన్నారు. చివరికి 1989లో ఆయన రచనలు బైటికి రావడంతో, 'ప్రతి పాట వెనుకా ఒక కథ ఉంది' అనే శీర్షికతో తన పాటల్లో కొన్నిటికి ఆయన రాసిన వివరణలు ఆంధ్రజ్యోతి వారపత్రికలో వారంవారం వెలువడడంతో, ఆయన మళ్లీ బహిరంగ ప్రజాజీవితంలో ఉండే స్థితి రావాలని ఎందరో మేధావులు, బుద్ధిజీవులు, ప్రజాస్వామిక ప్రియులు ప్రభుత్వానికి విజ్ఞప్తులు, సూచనలు చేయడం మొదలయింది.

ఈ నేపథ్యంలో రాష్ట్రంలో 1989 నవంబర్‌లో జరిగిన ఎన్నికలలో తెలుగుదేశం ప్రభుత్వం దిగిపోయింది. ప్రజాస్వామిక హక్కులను పునరుద్ధరిస్తానని ఎన్నికల వాగ్దానం చేసిన కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. 1990 జనవరిలో హైదరాబాదులో విరసం ద్విదశాబ్ది సభలు పెద్ద ఎత్తున జరిగి, విప్లవోద్యమానికి ప్రజామద్దతు తగ్గిపోలేదని, అది అంతస్స్రవంతిగా యథాతథంగా కొనసాగుతున్నదని,

లేదా పెరిగిందని బైటపడింది. ఈ పూర్వరంగంలో జననాట్యమండలి పద్దెనిమిదవ వార్షికోత్సవాల సందర్భంగా ఫిబ్రవరిలో హైదరాబాద్‌లో జరిగిన సభలో గద్దర్ అజ్ఞాతం నుంచి బైటికి వచ్చారు. ఒక లక్ష మందితో హైదరాబాద్‌లో జరిగిన ఆ సభ విప్లవోద్యమం పట్ల, జననాట్యమండలి పట్ల, గద్దర్ పట్ల ప్రజల్లో ఎంతటి ఆదరాభిమానాలున్నాయో బహిర్గతం చేసింది.

అప్పటి నుంచి 1992 మే 21న నేదురుమల్లి జనార్ధనరెడ్డి ప్రభుత్వం పీపుల్స్ వార్ మీద, ఆరు ప్రజాసంఘాల మీద నిషేధం విధించే వరకూ సాగినది 1978-85 కాలంతో పోల్చదగిన ఒక గొప్ప పునరుత్థాన దశ. ఆ రెండు సంవత్సరాలలో రాష్ట్ర వ్యాప్తంగా డజన్ల కొద్దీ చిన్నా పెద్దా సభలు జరిగాయి. జననాట్యమండలి పునరుద్ధరణ జరిగింది. శిక్షణా తరగతులు జరిగాయి. ఒక రాష్ట్ర కేంద్రం మాత్రమే కాక, దాదాపు ప్రతి జిల్లాలో జననాట్యమండలి దళాలు, బృందాలు ఏర్పడ్డాయి. విప్లవోద్యమ నాయకత్వంలో ఎన్నోచోట్ల భూపోరాటాలు, భూఆక్రమణలు, ప్రజాసమస్యల మీద ఉద్యమాలు, ప్రజా పంచాయితీలు జరిగాయి. ఈ వరదలో ఎంత కొత్తనీరు వచ్చిందో, ఎంత ఉత్సాహ ఉద్వేగాలు వెల్లువెత్తాయో అంత కాకపోయినా కొంతమేరకు చెత్త కూడ కొట్టుక వచ్చింది. వ్యక్తివాదం, సామూహిక కృషి కన్న ఎక్కువగా వ్యక్తిగత ప్రతిష్ఠ కోసం పాకులాడడం, స్వార్థం, ఆర్థిక అరాచకత్వం వంటి సమస్యలు తలెత్తాయి. మొత్తంగా ఉద్యమంలోనే తలెత్తిన ఈ సమస్యలు ఉద్యమ నాయకులుగా ఉండిన వ్యక్తులలోనూ, ప్రభావశీల వ్యక్తిత్వాలుగా ఎదిగిన నాయకులలోనూ కూడ పొడసూపాయి. గద్దర్ కూడ వ్యక్తిగా వీటికి దూరంగా లేరు.

1992లో నిషేధం విధించిన ప్రజా సంఘాల జాబితాలో జననాట్య మండలి పేరు లేనప్పటికీ, జననాట్యమండలి కార్యక్రమాలకు వేదికలు కల్పించే సంస్థలన్నీ నిషేధానికి గురయ్యాయి. జననాట్యమండలి ఒక బహిరంగ సంస్థగా పని చేయలేని స్థితి తలెత్తింది. కొద్ది సంవత్సరాలు గడిచేసరికి జననాట్యమండలి, రహస్య నిర్మాణంగా, సాయుధ దళాలతో పాటు పనిచేస్తున్నదని కూడ పత్రికలు రాయడం మొదలు పెట్టాయి. అంతకు ముందున్న నిర్మాణమంతా దాదాపుగా కనబడకుండా పోయి, గద్దర్ ఒంటరిగా మిగిలారు. ఏవైనా సభల్లో ఒక్కరే మాట, పాట, ఆట సాగించడానికి, లేదా అప్పటికి దొరికిన ఏ ఇద్దరు ముగ్గురి కోరస్‌తోనో పాటలు పాడడానికి ఆయన పాత్ర తగ్గిపోయింది. ఒకవైపు వ్యక్తివాద ఛాయలు పెరుగుతుండడం, మరొకవైపు సమష్టి ఆచరణకు మార్గాలు మూసుకుపోవడం అనే స్థితికి గద్దర్ లోనయ్యారు.

అలా నిషేధం తర్వాత దాదాపు పది పన్నెండేళ్ల గద్దర్ సామాజిక జీవితంలో ఎన్నో ఒడిదుడుకులు తలెత్తాయి. అద్భుతమైన రచనా, గాన, ప్రదర్శనా నైపుణ్యం వల్ల తనకు అందిన స్థానం కేవలం తన కృషి వల్లనే సాధ్యమయిందని, ప్రజా ఉద్యమం, సమష్టి కృషి కూడ తన కన్న తక్కువేనని ఆయన భావించడం ప్రారంభించారు. ఉద్యమనాయకులే తన పాటల ప్రభావంలో ఉద్యమంలోకి వచ్చారని, వారికన్న తానే ఎక్కువని తనకు తాను అతిశయం ప్రకటించుకున్నారు. అలా సామూహికతకు, నిర్మాణ క్రమశిక్షణకు దూరమవుతూ తన వ్యక్తిగత సంబంధాలకు, నిర్ణయాలకు ఎక్కువ పాత్ర ఇస్తూ వచ్చారు. ఎక్కువమంది ప్రజలను చేరుకోగలిగే సానుకూలత, దిగజారుడు విలువలకూ, వ్యాపార విలువలకూ నిలయమనే ప్రతికూలత ఉన్న సినిమా రంగం పట్ల ఎటువంటి వైఖరి తీసుకోవాలనే అంశంలో విప్లవోద్యమంతో విభేదించారు. విప్లవోద్యమ ఉధృతి క్రమంలో ప్రజల కోరిక మేరకు రూపొంది విస్తరించిన ప్రజా పంచాయతీ అనే రూపాన్ని తారుమారు చేసిన స్వార్థపరశక్తులు తమ వ్యాపార పంచాయతీలను పరిష్కరించే స్థానం కూడ విప్లవోద్యమ నాయకులు తీసుకోవాలని ఒత్తిడి చేసినప్పుడు గద్దర్ దానికి తలవంచారు. ఒక సమయంలో పెద్ద పెద్ద ఆస్తి పంచాయతీలు ఆయన దగ్గర పరిష్కారమవుతాయనే వదంతులు విపరీతంగా ప్రచారంలోకి వచ్చాయి.

ఎవరికైనా విస్తారమైన ప్రజాజీవితంలో ఉన్నందువల్ల వ్యాపారవేత్తలతో, పార్లమెంటరీ రాజకీయ నాయకులతో సహా అన్ని రంగాల వ్యక్తులతో సంబంధాలు ఏర్పడడం సహజమూ అవసరమూ అవుతుంది. కాని ఆ సంబంధాల మీద ఎటువంటి నియంత్రణ విధించుకోవాలో, అవి ఎటువంటి ప్రభావం నెరపుతున్నాయో గద్దర్ పరీక్షించుకోలేకపోయారు. అవి వ్యక్తిగత సన్నిహిత సంబంధాలుగా మారుతున్నప్పుడు, తన విప్లవ ప్రతిష్ఠకు తగిన జాగ్రత్తలు తీసుకోలేకపోయారు. ఒక ఉన్నతాదర్శం కోసం ప్రారంభించిన పాఠశాల ఆస్తిగా మారి, భాగస్వాములతో వివాదాలు కూడ చెలరేగి, అప్రతిష్ఠకు దారితీసింది. ఇవన్నీ అలా ఉంచి వ్యక్తిగత సంబంధాలలో, కళా ప్రదర్శనల్లో వ్యక్తివాద శైలి, అహంకారం, తూలనాడడం, సహచరులను చిన్నచూపు చూడడం వంటి ధోరణులు తలెత్తాయి. ఈ పరిణామాల ఫలితమో, కారణమో గాని కళానైపుణ్యం కూడ గతంతో పోలిస్తే తరుగుతున్నదన్న భావన అభిమానులలో ఏర్పడింది. గతంలో విప్లవోత్తేజం ఉన్న స్థానంలో క్రమంగా హాస్యం, తేలికపాటితనం పెరిగిపోయాయి. సరిగ్గా ఈ సమయంలోనే రాష్ట్రంలో బలం పుంజుకున్న అస్తిత్వవాద, దళిత రాజకీయ వాదనల్లో కొన్నింటినైనా ఆయన ఆమోదించడం, తన గళంలో పలికించడం మొదలుపెట్టారు.

నిజానికి గద్దర్‌లో ఇవాళ ఏ మార్పు చూసి ఆయన అభిమానులు నిరుత్సాహపడుతున్నారో, ఆ మార్పుకు మూలం ఈ ఒడిదుడుకుల దశలో ఉంది. ఎంత హఠాత్తుగా వచ్చిందనుకునే మార్పు కూడ నిజానికి హఠాత్తుగా ఏమీ రాదు. పరిమాణాత్మక మార్పుగా దీర్ఘకాలం సాగి, గుణాత్మక మార్పుగా కనబడినప్పుడే అదేదో హఠాత్తుగా జరిగిందని అనుకోవడం అలవాటు.

ఈ ఒడిదుడుకుల దశలో గద్దర్‌ను ప్రజలవైపే నిలబెట్టడానికి, ఆయనలో పొడసూపుతున్న ధోరణులను విమర్శించడానికి, సరిచేయడానికి, ఆయనకు మరింత ప్రాధాన్యత ఇచ్చి, ఆయనలో ప్రజా ఉద్యమ నిబద్ధతను కాపాడడానికి, పెంచడానికి ఎన్నో ప్రయత్నాలు, చర్చలు జరిగాయి. ఆయన సహచరులు, మిత్రులు ఈ ప్రయత్నాలు చేశారు. ఈ ఒడిదుడుకుల కాలంలోనే ఆయన క్రమశిక్షణా రాహిత్యాన్ని, సినిమాకు పాటలు ఇవ్వడాన్ని, వ్యక్తిగత ప్రవర్తనను ప్రశ్నిస్తూ ఆయనను ఉద్యమ నిర్మాణం నుంచి సస్పెండ్ చేశారని ఒక దినపత్రిక వార్త రాస్తే ఆయన ఆ వార్తను ఖండిస్తూ ఆ పత్రిక ఎదుట దీక్ష చేశారు. విప్లవోద్యమ నిర్మాణం ఆయన మీద చర్య తీసుకున్నదనీ, తీసుకోలేదనీ ఎన్నో ఊహాగానాలు పత్రికల్లో వచ్చాయి.

ఇవి ఇలా ఉండగా, 1997 ఏప్రిల్ 6న ఆయన ఇంట్లోనే ఆయన మీద జరిగిన హత్యాప్రయత్నం, కాల్పులు ఆయన పట్ల ప్రజల్లో సానుభూతిని పెంచాయి. పాలకవర్గాలు ఆయన ప్రాణాలకు హాని తలపెడుతున్నాయని మరొకసారి బైటపడి ప్రజలు ఆయన పట్ల మరింత ఆదరణ పెంచుకున్నారు. ఒక తుపాకి తూటాను శరీరం నుంచి తొలగించడం వీలు కాకపోవడంతో, అది తన శరీరంలో ఉందని ఆయన పదేపదే ప్రస్తావిస్తుండడంతో ఆయన తప్పులు చేశారనుకునేవాళ్లు కూడ ఆయన పట్ల సానుభూతి, ఆదరణ ప్రకటించే స్థితి వచ్చింది.

ఒకవైపు ఆయన మీద క్రమశిక్షణా చర్యలు తీసుకుంటున్నారని, విమర్శిస్తున్నారని వార్తలు వస్తున్నప్పటికీ, 1997లో ఎన్‌కౌంటర్ మృతదేహాల స్వాధీన కమిటీ ఆయన నాయకత్వంలోనే ఏర్పడింది. 2001లో ఆయన అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితి ప్రధాన కార్యదర్శి అయ్యారు. 2002లో ప్రభుత్వానికీ పీపుల్స్‌వార్‌కూ మధ్య జరగబోయిన చర్చల్లో ప్రతినిధిగా ఎంపికయ్యారు. 2004లో జరిగిన చర్చల్లో ఒక ప్రతినిధిగా ఉన్నారు. ఇటీవలి దాకా కూడ విప్లవాభిమానులు, ప్రజలు ఆయనను విప్లవోద్యమ ప్రచారకుడిగానే గుర్తిస్తూ వచ్చారంటేనే ఒకవైపు క్రమశిక్షణా చర్యలు, లేదా చర్చలు, సవరింపు ప్రయత్నాలు జరుగుతున్నప్పటికీ ఆయనను విప్లవ శిబిరంలో ఉంచుకోవడానికే, ఆయన ప్రతిష్ఠను, స్థానాన్ని, కృషిని గౌరవించడానికే ప్రాధాన్యత ఉండిందని అనుకోవలసి ఉంటుంది. మరొకవైపు అంతకన్న చిన్న తప్పులు చేసినవారిమీద చర్య తీసుకున్న ఉద్యమం, గద్దర్ మాత్రం ఎన్ని తప్పులు చేసినా ఆయన పట్ల ఉదారంగా ఉంటున్నదని విమర్శలు కూడ వచ్చాయి.

ఈ ఒడిదుడుకుల దశ కొనసాగుతుండగానే తెలంగాణలో ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం ఊపు అందుకుంది. మూడు దశాబ్దాలుగా ఈ ఉద్యమాన్ని సమర్థిస్తున్న, 1990లలోనే తెలంగాణ జనసభ ఏర్పాటు చేసిన విప్లవోద్యమం సహజంగానే ఈ ఉద్యమంలో భాగం పంచుకుంది. అంతకు ముందు నుంచే ఈ ఉద్యమంలో పాల్గొంటున్న గద్దర్ చర్చల తర్వాత దాదాపు పూర్తికాలం తెలంగాణ ఉద్యమ కార్యకర్త అయ్యారు. 2010లో విప్లవోద్యమ చొరవతోనే ఏర్పాటయిన తెలంగాణ ప్రజాఫ్రంట్‌కు స్థాపక అధ్యక్షుడయ్యారు. దాదాపుగా అంతకు ముందరి దశ నుంచే ఆయనలో పార్లమెంటరీ రాజకీయాల పట్ల మోజు ఉండేది. అది తెలంగాణ ఉద్యమంలో మరింత బలపడింది. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర డిమాండ్ వర్గపోరాటంలో భాగం కాదనీ, ఆ డిమాండ్‌పై ఉద్యమంలో పాల్గొనే టప్పుడు సాయుధపోరాట రాజకీయాలు అవసరం లేదనీ, పార్లమెంటరీ మార్గంలో సాధించగలిగినదేననీ వాదనలు ముందుకు తెచ్చారు. తెలంగాణ ఇవ్వకుండా తలాయిస్తున్న కాంగ్రెస్‌కు వ్యతిరేకంగా ఎవరితోనైనా ఐక్యసంఘటన కట్టవచ్చునని వాదించి, హైదరాబాద్‌లో జరిగిన ఒక బహిరంగ సభావేదిక మీద భారతీయ జనతా పార్టీ నాయకుడు ఎల్‌కె అద్వానీతో కలిసి కనిపించారు. దళితవాద వాదనల స్వరం పెంచారు. ఇటువంటి చర్చల తర్వాత, అనేక రాజకీయ, సైద్ధాంతిక విభేదాల తర్వాత 2012లో ఆయన తెలంగాణ ప్రజా ఫ్రంట్ నుంచి కూడ తప్పుకున్నారు.

ఇక ఆ తర్వాత గడిచిన ఆరు సంవత్సరాలలో ఆయన ప్రయాణం ఏయే మార్గాలలో సాగిందో, ఎన్ని మజిలీలలో ఆగిందో వివరించడం కూడ అసాధ్యం. కొన్ని వేదికల మీద దళితవాదం మాట్లాడారు. కొన్ని వేదికల మీద తెలంగాణ రాష్ట్ర సమితి పాలనకు ఆమోదం తెలిపారు. కొన్ని వేదికల మీద సిపిఐ, సిపిఎంలను సమర్థిస్తూ ఇన్నాళ్లూ రివిజనిస్టులు అని విమర్శించినందుకు క్షమాపణలు కోరారు. సిపిఎం ఏర్పాటు చేసిన టి మాస్ వేదికల మీద ప్రధాన స్థానం వహించారు. తానే ఒక రాజకీయ పార్టీ స్థాపిస్తానన్నారు. ఎన్నికల రాజకీయాల్లో ప్రవేశిస్తాననీ, ముఖ్యమంత్రి స్థానంపై తన చూపు ఉందనీ అన్నారు. దైవభక్తిని, ఆధ్యాత్మికతను ప్రదర్శించారు. మరొకవైపు తనది బుద్ధుడి మార్గం అన్నారు.

ఇటువంటి ఎన్నో పరిణామాల తర్వాత జరిగిన ఘటనే ప్రస్తుతం ఢిల్లీ వెళ్లి సోనియా గాంధీనీ, రాహుల్ గాంధీనీ కలవడం. ప్రస్తుతం నయా భూస్వామ్యాన్నీ, ఫాసిజాన్నీ ఓడించడానికి, లౌకిక, ప్రజాస్వామిక రాజ్యాంగాన్ని కాపాడడానికి కాంగ్రెస్ ను సమర్థించాలని అంటున్నారు. రాహుల్ గాంధీ సభకు వెళ్లమని ప్రజలకు పిలుపు ఇస్తున్నారు.

'ఈ కాంగ్రెస్ రాజ్యంలో మన కడుపు నిండదురో' అని 1972లో మొదటి పాటలో రాసిన దగ్గరి నుంచి మూడు దశాబ్దాలకు పైగా ఏ కాంగ్రెస్‌ను విమర్శిస్తూ వచ్చారో, అది లౌకిక, ప్రజాస్వామిక పార్టీ అని భ్రమ పడడం మొదలుపెట్టారు. ఒకే తానులో ముక్కలయిన పాలకవర్గ ముఠాలలో ఒకటి నయా భూస్వామ్యమనీ, ఫాసిజమనీ, మరొకటి అందుకు వ్యతిరేకమనీ భ్రమకు లోనవుతున్నారు.

ఈ పరిణామ క్రమమంతా చూస్తే గద్దర్ ప్రస్తుత నిర్ణయం ఒక దీర్ఘకాలిక క్రమపు ఫలితంగానే జరిగిందని, తార్కికమైనదని అర్థమవుతుంది. ఇది గద్దర్ అనే ఒక వ్యక్తి తప్పులు ఎంచడం అనే సమస్య కాదు. చర్చనీయాంశం గద్దర్ కాదు. కాగూడదు. ఆయన క్షమాపణలు చెప్పాలనో, మరణాలకు బాధ్యుడనో, విప్లవద్రోహం చేశాడనో, ఇన్నాళ్లూ విమర్శించిన పార్లమెంటరీ పందుల దొడ్డిలో ప్రవేశిస్తున్నాడనో అన్నంత మాత్రాన ఈ చర్చ అర్థవంతమైన నిర్ధారణలకు దారితీయదు.

అసలు తెలుగు సమాజంలో, విప్లవోద్యమంలో ఇటువంటి రాజకీయ పరిణామాలు ఎందువల్ల జరుగుతున్నాయనే విశాలమైన చర్చకు ఇది పునాది కావాలి. ఆ చర్చ గద్దర్‌ను ఒక ధోరణిగా గుర్తించాలి. ఆ ధోరణి తలెత్తే భూమిక ఏదో గుర్తించాలి. భవిష్యత్తులో అటువంటి ధోరణులు తలెత్తకుండా ఏ జాగ్రత్తలు తీసుకోవాలో చర్చించాలి.

ఆ చర్చలో ప్రధానమైన అంశాలు నాలుగు: 1) విప్లవోద్యమ కార్యకర్తలలో, నాయకులలో, ప్రచారకులలో ఉండవలసినంత నిబద్ధత, తాత్విక పటుత్వం, సిద్ధాంతపరమైన చైతన్యం ఎందుకు ఉండడం లేదు? 2) విప్లవ రాజకీయాలవైపు ఉన్నవారు పార్లమెంటరీ రాజకీయాలను, ఎన్నికల బహిష్కరణ నినాదాన్ని ఇంత తేలికగా, పైపైన అర్థం చేసుకోవడం సరైనదేనా? 3) మొత్తంగా వర్గ రాజకీయాలను, పాలకవర్గంలోని ముఠా తగాదాలను విశాలంగా, లోతుగా అర్థం చేసుకోవలసిన విప్లవకారులు కాంగ్రెస్‌కు, భారతీయ జనతా పార్టీకీ మధ్య, ఆ మాటకొస్తే పాలకవర్గాలలోని వివిధ ముఠాల మధ్య ఇంతగా తేడా చూడడం, ఒకరి కన్న ఒకరు మేలనుకోవడం సరైనదేనా? 4. ఒక సామాజిక ఉద్యమంలో వ్యక్తుల పాత్రను, వ్యక్తుల లోటుపాట్లను, వ్యక్తుల వైఫల్యాలను, పతనాన్ని ఎలా అర్థం చేసుకోవాలి?

*(రచయిత సామాజిక ఉద్యమ కార్యకర్త)* వీ

# వ్యవస్థల పక్షపాతపు పనితీరు

***భారత నిఘా వ్యవస్థ సిబిఐ లాంటి ప్రభుత్వ రంగ సంస్థలను అధికారంలో ఉన్న పాలకులు తమ స్వార్థ ప్రయోజనాల కోసం వాడుకుంటున్నారని అంటున్నారు వికసిత***

**2018** అసెంబ్లీ ఎన్నికల సందర్భంగా మరోసారి విచారణ సంస్థల పనితీరు చర్చనీయాంశమైంది. గతంలో రేవంత్‌రెడ్డి ఓటుకు నోటు వివాదం సమయంలో ఆ సంస్థల పనితీరు గురించి చర్చ జరిగింది. ఇప్పుడు తెలుగుదేశం పార్టీకి చెందిన సి.ఎం. రమేశ్‌పై ఐటి దాడులు జరగగా ఇది కూడా విస్తృతమైన చర్చకు దారితీసింది. ఈ సందర్భంగా దేశంలోని వివిధ సంస్థల, వ్యవస్థల గురించి మాట్లాడుకోవాల్సి వచ్చింది.

సెంట్రల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్ (సిబిఐ) అనేది భారతదేశపు ప్రధాన దర్యాప్తు సంస్థ. అగ్రగామి పోలీస్ విచారణ సంస్థ. కేంద్ర ప్రభుత్వ పరిధిలో ఉండే ఈ సంస్థ ఆర్థిక నేరాలు, ప్రత్యేక నేరాలు, అవినీతి కేసులు, ఇతర వివాదాలకు సంబంధించిన కేసులను దర్యాప్తు చేస్తుంది. డిజిపి స్థాయి అధికారి దీనికి డైరెక్టరుగా వ్యవహరిస్తాడు. డైరెక్టర్ పదవి కాలం రెండేళ్లు. ఆ కింద ఐఆర్ఎస్ హోదా మొదలుకొని కానిస్టేబుల్ హోదా వరకు అనేక విభాగాల అధికారులు పనిచేస్తుంటారు.

ప్రధానమంత్రి చైర్‌పర్సన్‌గా, ప్రతిపక్ష నాయకుడు, సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి లేదా అతను ప్రతిపాదించిన వ్యక్తి సభ్యులుగా ఉండే కమిటీ డైరెక్టర్ నియామకాన్ని చేపడుతుంది.

సాధారణంగా దేశంలోని అతిపెద్ద నేరాలకు సంబంధించిన విచారణల, దర్యాప్తుల కోసం ప్రభుత్వాలు, కోర్టులు సిబిఐ దర్యాప్తుకు ఆదేశిస్తుంటాయి. కేంద్ర ప్రభుత్వ ఉద్యోగుల, కేంద్ర ప్రభుత్వ పరిధిలోని సంస్థల ఉద్యోగుల వివాదాలు, కేంద్ర ప్రభుత్వ ఆర్థిక వ్యవహారాల వివాదాలు, ప్రభుత్వ చట్టాల ఉల్లంఘనలు, పెద్ద పెద్ద మోసాలు, కుంభకోణాలు, రాష్ట్రాల వ్యవస్థీకృత నేరాలు వంటి కేసుల విషయంలో సిబిఐ దర్యాప్తు చేపడుతుంది.

సిబిఐని అటు ప్రభుత్వాలు ఇటు ప్రతిపక్ష పార్టీలు, ప్రజలు, కోర్టులు చాలా ప్రతిష్ఠాత్మక సంస్థగా చూస్తుంటాయి. కనుకనే ఏ చిన్న సంఘటన జరిగిననూ ప్రతిపక్షాలు సిబిఐ దర్యాప్తును డిమాండ్ చేయడం, ప్రభుత్వాలు సాధ్యమైనంతలో ఆ దర్యాప్తుకు ఆదేశించకపోవడం, సిబిఐ దర్యాప్తుకు ప్రభుత్వాలు ఆదేశించగానే ఉద్యమకారులు శాంతించడం, ప్రజలు కూడా ఆయా కేసుల్లో న్యాయమైన తీర్పు వస్తుందని భరోసాతో ఉండడం, కోర్టులు కూడా కచ్చితమైన న్యాయం కోసం తరచు సిబిఐ దర్యాప్తుకు ఆదేశించడం వంటివన్నీ ఆ సంస్థ మీద ఆయా వర్గాలకున్న అపారమైన నమ్మకాన్ని సూచిస్తుంటాయి. అయితే ఆ నమ్మకాన్ని నిలుపుకోవడంలో సిబిఐ అనేకసార్లు విఫలమైంది. ఆ వైఫల్యానికి ఆయా కాలాల్లో పనిచేసిన అధికారులు కారణమే అయినా కూడా ప్రధాన కారణం మాత్రం అధికారంలో ఉండే ప్రభుత్వాలే. డైరెక్టర్ స్థాయి నుంచి కిందిస్థాయి దాకా అధికారులను భయానికో, భక్తికో ప్రలోభపెట్టి ఆయా కేసులను పలచబరచేలా చేసేదంతా ప్రభుత్వాలలోని పెద్ద మనుషులే.

ప్రధానమంత్రి స్థాయి మొదలుకొని మంత్రుల దాకా కేసుల తీవ్రతను బట్టి సిబిఐ విచారణను పలుచబరచే వాళ్ల పాత్ర కొనసాగుతుంటుంది. ఏ పార్టీ అధికారంలో ఉంటుందనే దాంతో సంబంధం లేకుండా ఈ ప్రలోభాలు జరుగుతుంటాయి. అందుకే సుప్రీంకోర్టు ఒక సందర్భంలో సిబిఐని 'పంజరంలో చిలక' అని అభివర్ణించింది. 'ఈ చిలక ఎప్పుడూ తన ప్రభువు మాటనే పలుకుతుంది' అని అన్నది. ఆశ్రిత పక్షపాతం, తప్పుడు దర్యాప్తులు, అవినీతి వంటి అవలక్షణాలు కూడా సిబిఐలోకి క్రమంగా ప్రవేశిస్తూ వచ్చాయి. వాటి కారణంగా దర్యాప్తులు దారితప్పుడం జరిగేవి. కృష్ణానంద్ త్రిపాఠి అనే వ్యక్తి కోరిన ఆర్‌టిఐ సమాచారంలో సిబిఐలోని సంస్థాగత అవినీతిని ప్రశ్నించినందుకు అతన్ని సిబిఐ అధికారులు బెదిరించినట్లుగా ఆరోపణలు వచ్చాయి.

సాధారణంగా సిబిఐకి కేటాయించబడే కేసులు చాలా సున్నిత మైనవిగా, జాతీయ ప్రాధాన్యత కలిగినవిగా ఉంటాయి. ఈ కేసులు సిబిఐకి పోయేకంటే ముందే ఆయా ప్రాంతాల పోలీసుల పరిధిలో కేసులు నమోదై ఉంటాయి. అప్పుడు స్థానిక పోలీసుల అంతర్గత సంస్థాగత ప్రభావం సిబిఐ దర్యాప్తు పైన ఉంటుంది. అదే విధంగా దేశంలోని ప్రముఖులైన వ్యక్తుల కేసుల దర్యాప్తు సమయంలో సిబిఐ ఎంతో మందకొడిగా వ్యవహరించిందని పి.వి. నరసింహారావు, జయలలిత, లాలూ ప్రసాద్ యాదవ్, మాయవతి, ములాయం సింగ్‌యాదవ్ వంటి నాయకుల కేసుల్లో విచారణ జరపకుండా గానీ, నిర్దోషులుగా విడుదల జరిగేలా గానీ సిబిఐ వారికి సహకరించిందనే వాదన ఉంది.

అయితే సిబిఐ లాంటి సంస్థలు పక్షపాతంతో వ్యవహరించడం ఇప్పటి రేవంత్‌రెడ్డి కాలం నాటిదే కాదు, దశాబ్దాల క్రితం నుండే ఈ ధోరణి ప్రారంభమై ఉంది.

1986 బోఫోర్స్ కుంభకోణం సమయంలో దర్యాప్తు జరిగే క్రమంలో అందులోని ప్రధాన నిందితుడైన అట్టావియో కత్రోచిని దోషిగా నిలబెట్టే ప్రధాన సాక్ష్యాధారాలను సిబిఐ సేకరించలేకపోయింది. కత్రోచి బ్యాంక్ అకౌంట్స్ విషయంలో కూడా సిబిఐ నిర్లక్ష్యంగా వ్యవహరించింది. దీనికి ప్రధానమైన కారణం అప్పుడు ప్రధానిగా ఉన్న రాజీవ్‌గాంధీ, ఆ తర్వాత అధికారంలో ఉంటూ వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వాలే. హవాలా కుంభకోణంలో కూడా అదే జరిగింది. పెద్ద తలకాయలు ఇమిడి ఉన్న ఆ కేసులో సిబిఐ ఉద్దేశపూర్వకంగానే సాక్ష్యాలను చూపలేకపోయింది. న్యాయమూర్తి స్వయానా చట్టం ముందు నిలబడే ఒక్క సహజ సాక్ష్యం కూడా లేదని వ్యాఖ్యానించాడు. అట్లా ఎల్.కె. అద్వాని, వి.సి. శుక్లా, అర్జున్ సింగ్, మాధవరావు సింధియా, ఎన్.డి. తివారి, ఆర్.కె. ధవన్, మదన్‌లాల్ ఖురానా వంటి హేమా హేమీలు సులభంగా కేసుల నుంచి బయటపడ్డారు.

రాజకీయాలు, ప్రభుత్వాలు సిబిఐని అంతగా నియంత్రిస్తూ వచ్చాయి. అందుకే వినిత్ నారాయణ్ అండ్ అదర్స్ వర్సెస్ యూనియన్ ఆఫ్ ఇండియా కేసు (1996) లో సుప్రీంకోర్టు సిబిఐని పర్యవేక్షించే పనిని సెంట్రల్ విజిలెన్స్ కమిషన్ తీసుకోవాలని తీర్పు చెప్పింది. అలాగే ప్రియదర్శిని మిట్టూ హత్య కేసులో హంతకుడు ఉన్నత స్థాయి పోలీస్ అధికారి కుమారుడు. అందుకే సిబిఐ ఉద్దేశపూర్వకమైన నెమ్మదితనం పాటించి కేసును నిర్వీర్యం చేసింది. కోర్టు స్వయంగా సిబిఐ పనిలోకి ఆ పోలీస్ ఆఫీసర్ చొరబడ్డాడని వ్యాఖ్యానించి సిబిఐని మందలించింది.

1992లో కేరళలోని కొట్టాయం హాస్టల్‌లో మరణించిన ఒక నన్ కేసులో సిబిఐ చేసిన ఐదింటికి ఐదు దర్యాప్తులూ ఎలాంటి కేసు పురోగతిని సాధించలేకపోయాయి. భోపాల్ గ్యాస్ ఘటనలో యూనియన్ కార్బైడ్ సిఇఒ వారెన్ అండర్సన్‌ను కేసు నుంచి తప్పించేలా రాజకీయ పార్టీలు, వాటి నాయకులు సిబిఐపై ఒత్తిడి పెడుతూ వచ్చారు. 2జి స్పెక్ట్రమ్ కేసులో కూడా సిబిఐ పనితీరును సుప్రీంకోర్టు ఎన్నిసార్లు మందలించినా సిబిఐ పట్టించుకోలేదు. చివరకు స్వయాన సుప్రీంకోర్టే దర్యాప్తును పర్యవేక్షించే పనికి పూనుకుంటే గాని నిందితుల అరెస్టులు జరగలేదు. ఇలా చెప్పుకుంటూ పోతే బోలెడన్ని ఉదాహరణలున్నాయి.

ఒక్క మాటలో చెప్పాలంటే స్వతంత్ర ప్రతిపత్తితో వ్యవహరించాల్సిన సిబిఐ రాజకీయ చట్రంలో బందీ అయిపోయింది. నిక్కచ్చిగా వ్యవహరించి న్యాయం అందించాల్సిన సమయంలో పక్షపాత వైఖరిని ప్రదర్శించి దేశంలో దర్యాప్తు సంస్థల, విచారణ సంస్థల పనితీరును సందేహాస్పదం చేసింది. రాజకీయాల జోక్యం సమిసిపోనంత వరకు సిబిఐలో మెరుగదలను ఆశించలేం.

ఇక ఇప్పటి విషయానికి వస్తే రేవంత్‌రెడ్డిపై సిబిఐ దాడులకు, సి.ఎం. రమేశ్‌పై ఐటి దాడులకు ఒక రాజకీయ వర్గానికి అనుకూలంగా వ్యవహరించే ధోరణి కారణమై ఉంది. ఐటి దాడులే చూద్దాం. సాక్షాత్తు కుంభకోణాల పేరిట ఎన్‌డిఎ ప్రభుత్వంలోని ఎందరో నాయకుల పేర్లు బయటపడ్డాయి. ప్రతి రాష్ట్రం లోనూ రాజకీయ నాయకులు, పారిశ్రామిక వేత్తలు, సినీ వర్గాలు, ఆటగాళ్లు వంటి ఎందరో ఇన్‌కమ్ టాక్స్ కట్టడం లేదనే ఆరోపణ లున్నాయి. బహిరంగంగా వందల, వేల కోట్ల రూపాయలు చేతులు మారుతున్న అంశాలు బయటపడ్డాయి. వాళ్లు ఆన్ పేపర్ చూపించిన ఆస్తులకే టాక్స్ కట్టని ఉదాహరణలు బోలెడున్నాయి.

చూపించని ఆస్తుల మీద దాడిచేసి పట్టుకోవడం ఊసే ఉండదు. ఇవన్నీ వదిలేసి సి.ఎం. రమేశ్‌పై మాత్రమే దాడులు జరగాలా? అనే ప్రశ్న తలెత్తి బిజెపికి, తెలుగుదేశంకు సంబంధాలు దెబ్బతిన్నందునే ఈ దాడులని ఎవరైనా భావిస్తే తప్పేముంది? ఎన్నికల సందర్భంలో రేవంత్‌రెడ్డిని జైళ్లో ఉంచితే లబ్దిపొందవచ్చనే ఆలోచనే సిబిఐని ప్రభావపరిచి రేవంత్ రెడ్డిని అరెస్ట్ చేయించడానికి దారితీసిందని భావించడంలో తప్పేముంది? నిజానికి రేవంత్‌రెడ్డి, సి.ఎం. రమేశ్‌ల పైనే కాదు, దేశవ్యాప్తంగా రోజూ వందల కొద్దీ దాడులు నిరంతరాయంగా కొన్ని ఏళ్ల పాటు జరిగితే గాని ఈ దేశంలోని అక్రమాస్తులు, అవినీతి సొమ్ము బయటకు రాదు. సిబిఐ, ఐటి సంస్థలకు అట్లాంటి అవకాశమున్నా కేవలం కొందరినే ఎందుకు టార్గెట్ చేస్తారనే ప్రశ్న రాకమానదు.

అంటే ఆయా సంస్థల లక్ష్యం దేశం బాగుపడదమా? రాజకీయాలు, వాటి నాయకులు లాభపడడమా? అనే సందేహం కూడా కలుగుతుంది. కేవలం ఈ విచారణ సంస్థలే కాదు, దేశంలోని అతి ప్రధానమైన సైనిక, పోలీస్ వ్యవస్థలు కూడా ఈ రోజు పూర్తిగా రాజకీయాల చేతుల్లో బందీ అయిపోయి ఉన్నాయి. దుర్మార్గంగా ప్రజల హక్కులను కాలరాస్తున్నాయి. కశ్మీర్ నుంచి తమిళనాడు దాకా దేశమంతా అదే విధంగా ఉంది.

నిన్నటికి నిన్న భీమా కోరేగాం విషయమే తీసుకుందాం. హింస ప్రేరేపించిన శంభాజి భీడే, మిలింద్ ఎక్బోటేల బెయిల్ పిటిషన్లను మూడు కోర్టులు నిరాకరించినా పోలీసులు మాత్రం అరెస్టు చేయలేదు. గానీ, రోనా విల్సన్ ల్యాప్‌టాప్‌లో తలాతోక లేని ఏదో లేఖ దొరికిందని, దాని ఆధారంగా వరవరరావు గారిని, గౌతమ్ నవ్లఖ, అరుణ్ ఫెరిరా, సుధా భరద్వాజ్, వెర్నన్ గొంజాల్విస్‌లను అరెస్ట్ చేశారు.

అంతకు ముందు ఎలాంటి నోటీస్ లేకుండా, కారణాలు చెప్పకుండా షోమాసెన్, సురేంద్ర గాడ్లింగ్, సుధీర్‌ధావ్లే, మహేశ్‌రావత్, రోనా విల్సన్‌లను అరెస్ట్ చేశారు. దౌర్జన్యంగా వ్యవహరించారు. దేశంలోని ప్రముఖుల పట్లనే ఇలా వ్యవహరిస్తున్నారంటే రాజకీయాల ప్రభావంతో సాధారణ ప్రజల, పేద ప్రజల పట్ల పోలీసులు ఎట్లా వ్యవహరిస్తారో అర్థం చేసుకోవచ్చు. అందుకే ఆజాద్ కేసు సందర్భంలో సుప్రీంకోర్టు 'భారత రిపబ్లిక్ తన పిల్లలను తానే చంపుకుంటుందా?' అని ప్రశ్నించింది. ఈ రోజు అన్యాయమైన పనితీరును కనబరుస్తున్న భారతదేశ వ్యవస్థలన్నింటికీ ఈ మాట ఒక చెంపపెట్టు. ఆ తీర్పు ఇచ్చిన న్యాయ వ్యవస్థతో సహా దేశంలోని వ్యవస్థలపై, అధికార గణంపై, సంస్థలపై రాజకీయ జోక్యం పూర్తిగా పోయి నిష్పక్షపాత, న్యాయపూరితమైన పనితీరు దిశగా ఆయా సంస్థలు, వ్యవస్థలు, అధికారులు పనిచేసే విధంగా భూమిక ఏర్పడితే గాని వాటిలో మెరుగుదలను ఆశించలేము.

అయితే పార్లమెంటరీ డొల్ల ప్రజాస్వామ్యంలో ఈ మార్పు సాధ్యం కాదనే వ్యక్తిగత అభిప్రాయాన్ని కాసేపు పక్కనబెట్టి, అతిపెద్ద ప్రజాస్వామిక దేశంలో ఆ దిశగా ప్రయత్నాలైనా జరగకూడదా? అనేది పూర్తి ప్రజాస్వామిక పరిధిలోని ప్రశ్నే అవుతుంది కనుక దానికి జవాబు దొరికే సమయం కోసం ఎదురు చూడడమే ఇప్పుడు చేయాల్సిన పని.

*(రచయిత సామాజిక విశ్లేషకులు)* వీ

**వచ్చే సంచికలలో...**

- పాలకవర్గం అణచివేతలో స్త్రీ లోకం - డా. కత్తి పద్మారావు
- లేబర్ అడ్డాలో మా అనుభవాలు - బి. కావేరి, పి.శశికుమార్, ఎం. నాగరాజు
- చైతన్యంతోనే సురక్షితమైన భవిష్యత్తు - ఆర్. లక్ష్మి
- విద్య ద్వారానే విప్లవాత్మక మార్పులు - బోరెడ్డి మధుసూదన్ రెడ్డి

# రాజ్య నిఘా నేత్రానికి సుప్రీం పచ్చజెండా

***వ్యక్తిగత స్వేచ్ఛకు, గోప్యతకు భంగం కలిగించే ఆధార్‌కు అనుకూలంగా తీర్పు రావడం రాజ్యాంగాన్ని, ప్రజాస్వామ్యాన్ని భ్రష్టు పట్టించడమేననీ, ఇది కార్పొరేట్ వ్యాపార, నిఘా వర్గాలకు పనికొచ్చే సాధనమనీ అంటున్నారు బైరెడ్డి సతీష్***

గోప్యత (ప్రైవసీ) అనేది జీవించే హక్కు, వ్యక్తిగత స్వేచ్ఛలో అంతర్భాగమని దానికి ప్రాథమిక హక్కుగా గుర్తింపునిస్తూ సుప్రీంకోర్టు 2017 ఆగస్టులో తీర్పు వెలువరించింది. ఆ తర్వాతి క్రమంలో స్వలింగ సంపర్కుల అంశం, శబరిమలలో మహిళల ప్రవేశం, వివాహేతర సంబంధాల వంటి అంశాలలో ఇచ్చిన తీర్పులు వ్యక్తుల సేచ్ఛా పరిరక్షణకు గ్యారంటీని ఇస్తాయని, ప్రగతిశీలమైనవని (మత చాందసుల వ్యతిరేకత ఎంత ఉన్నప్పటికినీ) అవన్నీ ఆహ్వానింపదగిన తీర్పులని దేశ వ్యాప్తంగా చర్చ జరుగుతున్నది. ఈ తీర్పుల పరంపరలోనే వచ్చినటువంటిది ఆధార్ రాజ్యాంగబద్ధత పైన సుప్రీంకోర్టు ఇటీవలి తీర్పు.

గోప్యతపైన వచ్చిన ముగింపులో భాగంగానే ఆధార్ తీర్పు ఉంటుందని భావించిన వారందరికి పాక్షిక మోదాన్ని మాత్రమే మిగిల్చింది. ఏ గుర్తింపులేని వ్యక్తులకు, అనామకులుగా మిగిలిపోకుండా ప్రత్యేక గుర్తింపు సంఖ్యను కెటాయించి వారికంటూ ఓ గుర్తింపు నందిస్తామని కేంద్రం తెలిపింది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అందించే వివిధ సంక్షేమ, అభివృద్ధి పథకాలు, సేవలు అర్హులైన లబ్ధీదారులకు మాత్రమే అందేలా, అవినీతిని అరికట్టేలా ఈ కార్డును అందిస్తున్నామన్నది. ఇది స్వచ్ఛందంగా మాత్రమే తీసుకోవచ్చని మొదట తెలిపిన కేంద్ర ప్రభుత్వం కాలక్రమంలో అనేక రంగాలకు విస్తరింపచేసి ఆధార్ పైన ఆధారపడడాన్ని అనివార్యం చేసింది.

2009లో ఆనాటి యుపిఏ ప్రభుత్వం మొదలు పెట్టిన ఈ భారీ ప్రాజెక్టును చేపట్టే బాధ్యతను యూనిక్ ఐడెంటిఫికేషన్ అథారిటీ ఆఫ్ ఇండియా (యుఐడిఎఐ) కి అప్పగించింది. ఈ సంస్థ అనేక దేశ విదేశీ కంపెనీల సహాయంతో అవుట్ సోర్సింగ్ విధానం ద్వారా పౌరుల వేలి ముద్రలు, ఐరిస్, ముఖ చిత్రాలు వంటి బయోమెట్రిక్ వివరాలతో పాటు వ్యక్తిగత వివరాలను సేకరించి 12 అంకెల గుర్తింపు సంఖ్యతో కూడిన ఆధార్‌ను అందివ్వడం మొదలు పెట్టింది.

యుద్ధ ప్రాతిపదికన దేశ వ్యాప్తంగా ప్రత్యేక ఏర్పాట్లు చేసి మరీ కార్డును జారీ చేశారు. ఈ కార్డును జారీ చేసే ప్రక్రియ ఇవాళ ఒక నిరంతర కార్యక్రమంగా రూపొందింది. అది సాధారణ ప్రజలను ఎటువంటి స్థితికి తీసుకెళ్లిందంటే ప్రభుత్వ పథకాల లబ్ధీ మాట ఏమోగాని, కార్డు లేకపోతే మాకసలు ఏ గుర్తింపు ఉండదేమో, పౌరులమే కాదేమో అనే మనోస్థితిలోకి నెట్టివేసేలా ప్రభుత్వాలు వ్యవహరిస్తున్నాయి.

నేడు కేంద్రంలో అధికారంలో ఉన్న పార్టీ నాడు ఆధార్ కార్డును వ్యతిరేకించింది. అదే పార్టీ నేడు రెట్టించిన ఉత్సాహంతో ఆధార్‌ను ముందుకు తీసుకెళ్లే లక్ష్యంలో భాగంగానే ఆధార్‌ను సిమ్ కార్డులకు, గ్యాస్ పొందడానికి, పాన్ కార్డుకు, పాస్‌పోర్ట్, డ్రైవింగ్ లెసెన్సు ఒక్కటేమిటి సమస్త రంగాలకు విస్తరింపచేయడమే కాకుండా ఆధార్ లేనిదే జీవితం సాగదనేలా వ్యవహరిస్తున్నది.

2016లో సవరించిన ఆధార్ బిల్లును చట్టంగా రూపొందించే క్రమంలో రాజ్యసభలో మెజారిటీ లేకపోవడంతో దానిని బైపాస్ చేసే క్రమంలో భాగంగా ఈ బిల్లును ద్రవ్యబిల్లుగా లోక్‌సభ స్పీకర్‌తో ఆమోదింప చేసుకొని రాజ్యసభతో నిమిత్తం లేకుండానే లోక్‌సభలో సునాయాసంగా ఆమోదింప చేసుకున్నది. ప్రభుత్వం అందించే వివిధ సంక్షేమ అభివృద్ధి పథకాలకు నిధులను భారత సంఘటిత నిధి నుండి అందించబడతాయి కాబట్టి దీనిని ద్రవ్య బిల్లుగానే పరిగణించాలని వాదిస్తూ వస్తున్నది. ఇలా చేయడం వల్ల రాజ్యసభ ఆమోదం అవసరం లేకపోవడం, న్యాయ సమీక్ష నుండి తప్పించుకునే వీలుండడం అనేవే కేంద్రం మదిలో ఉన్న అంశాలు.

ఆధార్ చట్టాన్ని వ్యతిరేకించే వాళ్లకేమీ ఏకాభిప్రాయం లేదు. రాజకీయ కారణాలతోనే కాంగ్రెస్ వ్యతిరేకిస్తున్నది. రాజ్యసభలో బిజెపికి మెజారిటీ లేదు కాబట్టి ద్రవ్య బిల్లుగా ప్రవేశపెడితే రాజ్యసభ ప్రమేయం ఉండదు కాబట్టి అసలు ఇది ద్రవ్య బిల్లే కాదన్నది కాంగ్రెస్ వాదన.

గత ఆరు సంవత్సరాల కాలంలో ఆధార్‌ను సవాల్ చేస్తూ 27 పిటిషన్లు దాఖలు చేయబడ్డాయి. ఆయా పిటిషన్‌దారుల మధ్యలో కూడా ఆధార్ పట్ల ఒకే అభిప్రాయం లేదు. ఆధార్ ప్రాథమిక హక్కయిన వ్యక్తి స్వేచ్ఛను, గోప్యతను హరించి వేస్తుందని, అణచివేత సాధనంగా రాజ్యం ఉపయోగించుకుంటుందని అసలు మొత్తంగా పౌరుల్ని తన కనుసన్నల్లో కదిలే యంత్రాలుగా మార్చివేసి సంపూర్ణ అధికారయుత రాజ్యంగా (టొటాలిటేరియన్ రిజిమ్) గా మారే ప్రమాదం ఉందన్నది ఒక వాదన. ఇది ఒక సాధారణ బిల్లు అని ద్రవ్య బిల్లుగా ఎలా ప్రవేశపెడతారని, రాజ్యసభను ఇంత కీలకమైన అంశంగా ఎలా బైపాస్ చేస్తారని ఇది విశిష్టమైన ప్రజాస్వామిక సంస్థ అయిన పెద్దల సభను అవమానించడమే కాక ఇది రాజ్యాంగ విరుద్ధమని వాదించే పిటిషనర్లు కూడా ఉన్నారు.

ఆధార్ రాజ్యాంగ బద్ధమే కాకుండా పౌరసేవలకు అవసరంతో పాటు వారికంటూ గుర్తింపునిస్తుందని వాదిస్తూనే ప్రభుత్వం వివిధ ప్రైవేట్, విదేశీ కంపెనీల సహాయంతో సేకరిస్తున్న పౌరుల వివరాల సంపూర్ణ పరిరక్షణ ప్రమాదంలో పడుతుందని అది విదేశీ, శత్రు రాజ్యాలకు చిక్కుతుందని భావించే వాళ్లు ఈ పిటిషన్‌లు వేసిన వాళ్లలో ఉన్నారు.

అసలు ఆధార్ అవసరం లేదన్నవాళ్ల నుండి ఆధార్ అవసరమే కాని అది దుర్వినియోగం కాకుండా డేటా పరిరక్షణ ప్రధానం అనే వాదన వల్ల, ఫేస్‌బుక్ కేంబ్రిడ్జ్ ఎనలిటికా వ్యవహార నేపథ్యంలో దేశ వ్యాప్తంగా తీవ్రమైన చర్చోప చర్చలు జరగడం వల్ల కూడా సుప్రీం తీర్పుపై సర్వత్రా ఆసక్తి నెలకొనింది.

ఈ క్రమంలో ప్రభుత్వం ఆధార్‌తో దేశ భద్రత ముడిపడి ఉన్నదని, పౌరులెవరో కానివారెవరవో ఇట్టే తెలిసిపోవడం కాకుండా సంక్షేమ,

అభివృద్ధి కార్యక్రమాలతో పాటు ఇతర ప్రభుత్వ సేవలు దుర్వినియోగం అవకుండా, దుబారా అరికట్టడమే కాకుండా అవినీతి ఆగిపోయి పాలనలో సమర్థత పెరిగి అనేక వర్గాలకు ప్రాతినిధ్యంతో పాటు ప్రయోజనాలు పెరుగుతాయని వాదించింది. సమ్మిళిత అభివృద్ధి జరుగుతుందని బలంగానే వాదించింది. ఆధార్‌ను వ్యతిరేకిస్తే అనేక వర్గాలు అభివృద్ధికి అవలనే మిగిలిపోతాయని భయపెట్టింది కూడా.

ప్రభుత్వం చేసిన వాదనలు మౌలికంగా రెండు రకాలు. ఒకటి దేశ భద్రత, రెండు సంక్షేమ అభివృద్ధి పథకాల చేరవేత. నిజానికి ఈ రెండు డొల్ల వాదనలే. ఆధార్ కార్డును అందించే మొత్తం ప్రక్రియా అంతా కూడా ప్రైవేట్, బడా విదేశీ సంస్థల సహకారంతో సమన్వయంతో చేస్తున్నదే కాబట్టి ప్రభుత్వ నియంత్రణ సంపూర్ణంగా ఉండే అవకాశం లేదు. అసలు ఈ మొత్తం ప్రక్రియనే ప్రమాదంలో పడేలా ప్రైవేట్, విదేశీ కంపెనీలు వాటి ప్రయోజనాల కోసం వ్యవహరించవచ్చు.

అమెరికా భద్రతా సంస్థ అయిన ఎన్ఎస్ఏ గూఢాచారి సంస్థ అయిన సిఐఏని కాదని లేదా వాటి ప్రయోజనాలకు విరుద్ధంగా వ్యవహరించగలిగే విదేశీ సంస్థలు ఏమీ లేవు. అసలు మొత్తంగా ప్రపంచ వ్యాప్తంగా ప్రతి పౌరుని డేటాను గుప్పిట్లో పెట్టుకోవాలనే పన్నాగం ఎలాగూ అమెరికా చేస్తూనే ఉంది. ఈ మొత్తం ప్రక్రియలో ఏ దశలోనైనా ఈ కంపెనీలు రాజీ పడిపోకుండా పనిచేస్తాయన్న గ్యారంటీ ఏమీ లేదు. కాబట్టి పౌరుల వివరాల గోప్యత అనేది సాధ్యం కాదని తేలిపోతున్నది.

13 వేల కోట్ల రూపాయలకు పైగా పంజాబ్ నేషనల్ బ్యాంకును మోసం చేసి సురక్షితంగా సరిహద్దులు దాటిన నీరవ్‌మోడీ ఆధార్ కార్డు లేకపోడం వల్లనే బయట పడగలిగిండా? అప్పులు ఎగ్గొట్టి విదేశాల్లో కింగ్‌లా ఉన్న కింగ్‌ఫిషర్ యజమాని విజయ్ మాల్యాకు ఆధార్ కార్డు ఉన్నా ఏం చేయగలిగింది ఈ ప్రభుత్వం?

పాలితుల వల్ల ప్రమాదం కంటే ఈ దేశంలో పాలకుల వల్లే ప్రమాదాలెక్కువ. ఆధార్‌ను అప్యాయంగా పెట్టుకునే 'దేశ భక్తులు' దేశంలో మతకల్లోలు సృష్టించి అంతర్గత భద్రతను ఆపదలో పడేసినప్పుడు ఆధార్ ఆపలేకపోయింది కదా! ఆధార్‌ను ప్రజా పంపిణీ వ్యవస్థను అనుసంధానం చేసిన తర్వాతే ప్రజలు మరింత ఆహార అభద్రతకు గురవుతున్నారు. వృద్ధులు, పిల్లలు, మహిళలు, గిరిజనులు, వికలాంగులు ఈ సంక్షోభానికి మరింత గురయ్యారు. జార్ఖండ్, బీహార్, ఉత్తరప్రదేశ్, దేశ రాజధాని ఢిల్లీలో సైతం ఆధార్ అనుసందానం అనేక ఆకలి చావులకు కారణం అయింది.

ఆధార్ లేకపోవడం వల్ల అర్హత కోల్పోవడం ఒక సమస్య అయితే ఆధార్ ఉండి అనుసందానం కాక, అయినా సాంకేతిక లోపంతో సరిపోల్చుకోలేక లక్షలాది మంది లబ్ధిదారులు నిత్యావసరాలకు దూరంగా నెట్టివేయబడ్డారు. బిజెపి పాలిత రాష్ట్రమైన రాజస్థాన్‌లో ఆధార్ ఉన్నప్పటికీ 25 శాతం వరకు పిడిఎస్‌లో వస్తువులు పొందలేకపోయారు. 100 కోట్లు ఎన్ఆర్ఇజిఎస్ పథకం కింద రావల్సిన వేతనాలు పొందలేక పోయారు.

ఈ దృష్టాంతాలు ఇలా ఉంటే అసలు ఆధార్‌ను వివిధ సంక్షేమ పథకాలకు అనుసందానించాక ప్రభుత్వం అనేక పథకాలకు ఇస్తున్న సబ్సిడీలను తగ్గించి వేసింది. లబ్ధిదారులూ తగ్గిపోతున్నారు. ఆధార్ లేకపోవడం, ఉన్నా సరిపోలకపోవడం (అథంటికేషన్)తో పాటు చాలీచాలని బడ్జెట్‌ను సంక్షేమ పథకాలకు కేటాయించడం అసలు కారణం.

సమాజంలో అత్యంత దయనీయ స్థితికి నెట్టివేయబడ్డ దళిత, గిరిజన, మైనారిటీ బలహీన వర్గాలే మళ్లీ బాధితులవుతున్నారు. వారి కోసమే ఉద్దేశించబడిన పథకమే అయినప్పటికీ ఆధార్ లేకపోవడం, ఉన్నా మ్యాచ్ కాకపోవడం మళ్లీ వారిని బాధితులుగా మార్చివేస్తున్నది.

నిజంగా ఏదైనా ప్రత్యేక గుర్తింపును ఇచ్చే సందర్భంలో ప్రత్యేక ప్రయోజనాలు కూడా కలగాలే కాని ఉన్న ప్రయోజనాలు ఊడిపోయేలా వ్యవహారం నడుస్తున్నది. ప్రజల మనుగడకు ఆధారాన్ని చూపాల్సిన ప్రభుత్వాలు ఆధార్‌ను నిర్బంధంగా రుద్దుతున్నాయి. సంక్షేమ వ్యయాన్ని, సబ్సిడీలను తగ్గిస్తున్న ప్రభుత్వం ఆధార్ ప్రాజెక్టుకు మొత్తంగా ఒక లక్షా యాభై వేల కోట్లు వెచ్చించి అమలు జరుపుతున్నది. 2011 జనాభా గణనకు కేవలం 2,200 కోట్లు మాత్రమే వ్యయమైందనే విషయం గమనార్హం. ప్రజల సంక్షేమం రాజ్యం బాధ్యతయినప్పుడు ఆధార్ పేరుతో పౌరుల వ్యక్తిగత వివరాలను బలవంతంగా సేకరించడం, నిరాకరించే స్వేచ్ఛ ఉన్నప్పటికీ పాలకులు సంక్షేమాన్ని నిరాకరించడమంటే రాజ్యాంగ హక్కుల్ని ఉల్లంఘించడమే.

ప్రభుత్వం ఆధార్‌ను ప్రత్యేక గుర్తింపు పత్రం అని చెబుతున్నప్పటికీ ఆ కార్డును అప్పటికే ఉన్న అనేక రకాల గుర్తింపు కార్డుల ఆధారంగానే జారీ చేస్తున్నది. ఒక్కో రాష్ట్రంలో ఒక్కో తరహా విధానంలో అనేక పథకాలు అమలవుతున్నప్పుడు, రాష్ట్రాల వారీగా అర్హతలను నిర్దేశించే ప్రాతిపదికలు మారుతున్నప్పుడు ఆధార్‌ను ప్రధాన శరతుగా విధించడం వారి హక్కుల్ని కాలరాయడమే. నిజానికి ఏ పథకానికి అర్హతను నిర్దేశించడానికి ఆధార్ ప్రాతిపదిక కానేకాదు. సామాన్య ప్రజల పైన అది ఒక అదనపు భారం తప్ప. సంక్షేమ లబ్ధిని పొందే అర్హతలను రూపొందించే ప్రామాణికాలు ప్రధానం అవుతాయి తప్ప ఆధార్ మాత్రమే దాన్ని నిర్ణయించే స్థితికి రావడమనేది హక్కుల్ని నిరాకరించడమే.

ఒకవైపు ఆధార్ స్వచ్ఛందం అంటూ తప్పకుండా తీసుకొని తీరాల్సిన స్థితికి ప్రజలను నెట్టివేసింది ప్రభుత్వం. సేవల్లో నాణ్యతను, ప్రమాణాలు పెంచడం కంటే అసలైన అభివృద్ధిని అందించడం కంటే ఆధార్ మాత్రమే అత్యవసరమనేలా యుద్ధ ప్రాతిపదికన చేపట్టడమనేది వ్యాపార ప్రయోజనాలకు, రాజ్య నిఘా యంత్రాంగానికి పనికొచ్చేదే తప్ప మరే ప్రయోజనమూ ఉండదు.

పౌరుని ప్రతి కదలికను కనిపెట్టే నిఘా నేత్రం ఆధార్. ప్రయాణం చేయాలన్నా ఆధార్ అవసరం అవడంతో ఏ వ్యక్తి ఎక్కడ ప్రయాణం చేస్తున్నాడో, ఏఏ ప్రాంతాలను సందర్శిస్తున్నాడో తెలిసిపోతుంది. సిమ్ కార్డులను పొందడానికి ఆధారే ఆధారం కావడం ఓ వైపు, లొకేషన్ పేరుతో గూగుల్‌కి ప్రతి వ్యక్తి కనెక్ట్ కావడంతో వ్యక్తుల కదలికలు, వారి సంభాషణలు వారి వ్యక్తిగతం కాకుండా పోయినవి.

మరోవైపు పౌరుల వివరాలు చేతికి చిక్కడంతో బడా వ్యాపార సంస్థలు ప్రత్యేకించి కార్పొరేట్ సంస్థలకి తమ వ్యాపార ఉత్పత్తులకు అనువైన వినియోగదారులను గుర్తించే పని సులబమైపోయింది. ప్రతినిత్యం ఏదో ఒక వ్యాపార ప్రకటనో, పిలుపో మనల్ని వెంటాడుతూనే ఉంటున్నది. వ్యక్తుల అవసరాలు, వారి ఉద్యోగం, సంపాదనా వివరాలు, అలవాట్లు, అభిరుచులు వంటి వాటిని చాలా సులభంగా కంపెనీలు కనిపెట్టేస్తూ వినిమయవాద సంస్కృతిని విస్తరింపచేయడానికి విచ్చలవిడిగా కార్యక్రమాలు చేపడుతున్నాయి.

రిలయన్స్ సంస్థ అయితే ఏకంగా జియో పేరుతో వంద కోట్లకు పైగా ప్రజల వివరాలను కస్టమర్ల పేరుతో సంపాదించుకున్నది. ఇవాళ

సమాచారమే సంపదైపోయింది. జియో ఫోన్లు, సిమ్‌ల కోసం సంపాదించిన సమాచారమంతా వాళ్లిస్తున్న ఉచిత సేవలకు వారు వెచ్చిస్తున్న డబ్బుకంటే కొన్ని రెట్ల సంపాదనను వారికి సమకూర్చి పెడుతున్నది. కనీసం ప్రభుత్వ రంగ సంస్థ అయినా ఓ మేరకు పౌరుల వివరాలు ఇవ్వడానికి కారణం కనపడుతున్నది కాని జియో పేరుతో ఉచిత సేవల మాటున ఉన్న వ్యాపార ప్రయోజనాలేమిటో తరువాతి కాలంలో ఎలాగూ బయటపడింది.

ప్రజలు సమర్పించుకున్న ఆధార్ వివరాలతో ప్రైవేట్ కంపెనీలు మరో వ్యాపార కార్యకలాపానికి పాల్పడవన్న గ్యారంటీ ఏమీ లేదు. ఆ పత్రాలను ఉపయోగించి వారే నెలకొల్పిన బ్యాంకుల్లోనే అకౌంట్లు తెరవవచ్చు, దొంగ డబ్బును దాచుకునే వీలును కల్పించుకోవచ్చు. సాధారణ ప్రజలకు రావలసిన ప్రయోజనాలను కూడా సులభంగా కొట్టేయవచ్చు.

ప్రైవేట్ టెలికాం కంపెనీలు ప్రజల ఆధార్ కార్డు పత్రాలను ఉపయోగించి ప్రభుత్వం చెబుతున్న అసాంఘిక శక్తులకు సిమ్ కార్డులను అందివ్వవన్న గ్యారంటీ ఏమీ లేదు కదా! ప్రభుత్వం చెబుతన్నటువంటి దేశ విచ్ఛిన్న, అసాంఘిక చర్యలుగా పిలువబడే అనేకనేక చర్యలు ఆధార్ ముందూ ఉన్నాయి ఆధార్ అమలోకి వచ్చిన తర్వాత ఉన్నాయి.

ఆధార్ దేశ భద్రతకు ఎంతో అవసరమని గొంతుచించుకునే వాళ్ల వల్ల జరిగిన దుర్మార్గాలు కూడా అవిచ్ఛిన్నంగా కొనసాగుతూనే ఉన్నాయి. గోప్యత ప్రాథమిక హక్కు అని తీర్పునిచ్చిన నేపథ్యంలో, అది మనీ బిల్ కాదని, దాని రాజ్యాంగ బద్ధతను ప్రతిపక్షాలు నిరసించిన నేపథ్యంలో సుప్రీంకోర్టు తీర్పు పైన ఆసక్తి నెలకొని ఉన్న వెలుగులోనే ఆ తీర్పును విశ్లేషించుకోవాలి.

ఐదుగురు సభ్యులు కలిగిన సుప్రీం బెంచ్ వెలువరించిన తీర్పులో నలుగురు ఆధార్ రాజ్యాంగ బద్ధమే అని సమర్థించగా జస్టిస్ చంద్రచూడ్ మైనారిటీ అసమ్మతి తీర్పును వినిపించారు. 1448 పేజీల తీర్పు మధ్యతరగతికి ఊరటనిచ్చేలా ఉన్నా సాధారణ పౌరునికి ఆధార్ అనివార్యమయ్యేలానే ఉంది. ప్రధాన న్యాయమూర్తి దీపక్ మిశ్రా నేతృత్వంలో వెలువడిన ఈ తీర్పు పౌరుల నుండి కనీస వివరాలు మాత్రమే తీసుకొని విస్తృత ప్రయోజనాలను అందించేలా ఉన్నది కాబట్టి మొత్తంగా కొట్టిపారెయ్యలేమని వ్యాఖ్యానించింది.

ఆధార్ దానికదే విస్తృత ప్రయోజనాలను అందిస్తుందనేలా వ్యాఖ్యానించడం ఆశ్చర్యకరంగా అనిపించక మానదు. ఆధార్ బిల్లును మనీ బిల్లుగా రూపొందించడాన్ని సమర్థిస్తూనే మనీ బిల్లు న్యాయ సమీక్ష పరిధిలోకి రాదన్న వాదనను కొట్టి పారేసింది. సంక్షేమ ఫలాలు పొందాలనుకుంటే ఆధార్ అనివార్యమంటూ వాటి అవసరం లేనివాళ్లు ఆధార్‌ను నిరాకరించవచ్చు అంటూనే పాన్ కార్డుకు, ఆదాయ పన్ను చెల్లింపుకు ఆధార్‌ను తప్పనిసరి చేయడం పరస్పర విరుద్ధంగా అనిపిస్తున్నది. సిమ్ కార్డులు, బ్యాంకు, ఇన్సూరెన్సూ, పోటీ పరీక్షలు, యుజిసి, నీట్ లాంటి వాటికి ఆధార్ ముడి పెట్టవద్దని ఆదేశించింది. ఆధార్ కార్డు లేదన్న కారణంగానే అర్హులైన ఏ లబ్ధిదారునికి అందాల్సిన ప్రయోజనాలను నిరాకరించకూడదని స్పష్టం చేసింది.

జాతీయ భద్రతా దృష్ట్యా పౌరుల గుర్తింపు వివరాలను వెల్లడి చేయాలన్న సెక్షన్ 32 (2) కొట్టివేసింది. డేటా లీక్ అయిన సందర్భంలో యుఐడిఎఐ మాత్రమే కేసుల్ని ఫైల్ చేయాలనే 47వ సెక్షన్‌ను కొట్టివేయడమే కాకుండా సాధారణ పౌరులకు కూడా ఆ అవకాశాన్ని కలిపించింది. ప్రైవేట్ వ్యక్తులు, సంస్థలకు కూడా ఆధార్ కార్డును డిమాండ్ చేసే అధికారం ఇచ్చిన సెక్షన్ 57ను కూడా కోర్టు కొట్టివేసింది. పౌరుల డేటా భద్రత కోసం పార్లమెంట్ చట్టం తీసుకురావాలని సూచించింది. సిమ్ కార్డులు పొందడానికి ఆధార్ అవసరం లేదంటూనే ఆ అవసరం ఉందని ప్రభుత్వం భావిస్తే ఆధార్‌ను తప్పసరి చేస్తూ చట్టం తీసుకురావచ్చని వెల్లడించింది.

ఒకచోట అవసరం లేదని చెబుతూనే మరోచోట అనివార్యం చేయడంలో కొంత ఊరటే తప్ప మొత్తం మీద ఆధార్‌ను నెత్తిన రుద్దే పనిని మరో రూపంలో చేసింది. బ్యాంకింగ్‌కు ఆధార్ అవసరం లేదంటూనే పాన్‌కార్డుకు ఆధార్ తప్పనిసరి చేయడం ఆధార్ తప్పించుకునే అవకాశం లేదని పరోక్షంగా చెప్పకనే చెప్పింది.

పెద్దల సమ్మతితో పిల్లలకు ఆధార్‌లో వివరాలు నమోదైనప్పటికీ వాళ్లు పెద్దయ్యాక ఆధార్ నుండి బయటకు వచ్చే స్వేచ్ఛ వారికి ఉంటుందని చెప్పినా పిల్లలు పెద్దయ్యేలోపు పాన్‌కార్డ తప్పనిసరి అవుతుంది. తక్షణంగా మధ్యతరగతికి ఏదో ఊరట ఉన్నట్లు అనిపించినా అంతిమ సారంలో ఎవ్వరూ ఆధార్ ఉచ్చును తప్పించుకోలేరనే సుప్రీం స్పష్టం చేసింది.

రాజ్యం తన ఇష్టానుసారం పౌరుల సమ్మతి లేనిదే వారి వివరాలను వాడకూడదని, ప్రైవేట్ వ్యక్తులకు, సంస్థలకు అందించరాదని స్పష్టం చేసింది కాని ఈ మొత్తం ప్రాజెక్టును నడుపుతున్నది పెద్ద పెద్ద ప్రైవేట్, విదేశీ కంపెనీలతోనే అనే విషయాన్ని కోర్టు పరిగణలోకి తీసుకోలేదు. పౌరుల వ్యక్తిగత వివరాలను సేకరించే దశలోనే అవి అనేక శక్తుల చేతుల్లోకి వెళ్లిపోతాయనేది సుస్పష్టం. నూతన ఆర్థిక విధానాల శకం మొదలయ్యాక అన్ని సంక్షేమ బాధ్యతల నుండి తప్పుకుంటూ మరోవైపు అంతా ప్రైవేట్ రంగమే చూసుకుంటుంది అనే కుంటి సాకులు చెబుతున్న ప్రభుత్వానికి ఆధార్ అవసరం ఎందుకొచ్చిందనే అంశం కోర్టు తీర్పులో ప్రతిఫలించలేదు.

దేశ భద్రత పరంగా చూసినా యుఐడిఎఐ నిర్వహించే సెంట్రల్ ఐడెంటిటీస్ డేటా రిపాజిటరీ (సిఐడిఆర్) ను ఇవాల ఉన్న సాంకేతిక పరిజ్ఞానంతో హాక్ చేయడం పెద్ద కష్టమైన పనేమి కాకపోవచ్చు. గోప్యత అంశంలో సుప్రీంకోర్టు తీర్పుకు ఆధార్ అంశంలో కోర్టు వచ్చిన ముగింపుకు వైరుధ్యం కనిపిస్తున్నది.

ఓ వైపు గోప్యతను ప్రాథమిక హక్కుగా గుర్తిస్తూనే దానికి విరుద్ధంగా ఉన్న ఆధార్‌ను ఆ హక్కును భంగ పరిచే అంశంగా కాకుండా ఏవో కొన్ని సాంకేతిక అంశాలకు మాత్రమే పరిమితమవడమే కాకుండా ప్రాజెక్టు మొదలయ్యి చాలా కాలం అయింది చాలా దూరం వచ్చింది. కాబట్టి వెనుకకు వెళ్లలేమనో, వెళ్లకూడదనుకోవడం వల్లనేమో ఇలాంటి తీర్పు వచ్చింది.

రాజ్యాంగం ద్వారా ఏర్పడిన రాజ్యసభను విస్మరించడానికి ఆధార్‌ను ద్రవ్య బిల్లుగా మార్చడం రాజ్యాంగాన్ని, ప్రజాస్వామ్యాన్ని భ్రష్టు పట్టించడమే కాకుండా మనిషి అస్తిత్వాన్ని 12 అంకెల సంఖ్యకు మాత్రమే కుదించడం అత్యంత శోచనీయమన్న జస్టిస్ చంద్రచూడ్ మాటలు విస్మరించలేనివి. వ్యాపార ప్రయోజనాలకి, రాజ్య నిఘా నేత్రంగా పనికొచ్చే పనిముట్టే ఆధార్. గతంలో వ్యక్తిగత స్వేచ్ఛ, గోప్యత అంశంలో సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పును తానే సరిదిద్దుకున్నట్లు ఆధార్ తీర్పును కూడా భవిష్యత్తులో సరిదిద్దుకుంటుందని ఆశిద్దాం.

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

# రాఫెల్ కొనుగోళ్లలో భారీ అవినీతి

*దేశ భద్రతకు సంబంధించిన కొనుగోళ్లలో అవినీతికి, ఆశ్రిత పక్షపాతానికి పాల్పడుతున్న బిజెపి ప్రభుత్వం తీరును దుయ్యబడుతూ, రాఫెల్ విమానాల విషయంలో ప్రభుత్వ రంగ సంస్థ ఎచ్ఎఎల్‌ను కాదని రిలయన్స్ కంపెనీ భారీ లాభాలు చేకూర్చుకునేందుకు తోడ్పడిందని అంటున్నారు* **డా. ఎ పున్నయ్య**

**భా**రత రక్షణ రంగ వ్యవస్థ మరోసారి రాజకీయ అవినీతి కుంభకోణానికి కేంద్ర బిందువైంది. స్వతంత్ర భారత ఏలికలో ఆశ్రిత పక్షపాతానికి మరోమారు భారత రక్షణ రంగమే ఆలవాలమైంది. నాటి బోఫోర్స్ కుంభకోణాన్ని తలదన్నే విధంగా నేడు రాఫెల్ ఒప్పందం పాలకుల చారిత్రక అతిపెద్ద అవినీతి కుంభకోణంగా మిగిలిపోనుంది. ఈ నేపథ్యంలో రు. 58,000 కోట్ల విలువైన అవినీతి జరిగిందని ప్రధాన ప్రతిపక్ష పార్టీ కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ (కాగ్)కు రెండుసార్లు ఫిర్యాదు చేసింది. ప్రధాని మోడీ ఏకపక్షంగా తీసుకున్న నిర్ణయంపై ఫోరెన్సిక్ ఆడిట్ నిర్వహించి పార్లమెంట్‌కు వాస్తవాలను వెల్లడించాలని కాగ్ డైరెక్టర్ రాజీవ్ మహర్షికి విజ్ఞప్తి చేసింది.

మరోవైపు ఈ ఒప్పందంలో తీవ్రమైన అవినీతి జరిగిందని (సిబిఐ) కేంద్ర దర్యాప్తు సంస్థ డైరెక్టర్ అలోక్ వర్మకు అధికార పార్టీ సీనియర్ సభ్యులు, కేంద్ర మాజీ మంత్రి అరుణ్ శౌరి, ప్రముఖ న్యాయవాది ప్రశాంత్ భూషణ్‌లు దర్యాప్తుకు డిమాండ్ చేశారు.

ఈ ఒప్పందం జరిగే సమయానికి ఆర్‌డిఎల్‌కు కనీసం రక్షణ పరికరాల తయారీ యూనిట్ గాని, పరిశ్రమల శాఖ నుంచి లైసెన్స్‌గాని లేవని మాజీ మంత్రి యశ్వంత్ సిన్హా బృందం సిబిఐకి చేసిన ఫిర్యాదులో వివరించింది.

ప్రతిపక్ష, అధికార పక్షాల అభ్యర్థనలతో దర్యాప్తు సంస్థలు, కాగ్ విచారిస్తున్న నేపథ్యంలో రాఫెల్ యుద్ధ విమానాల వివాదంలో కొత్త మలుపు చోటుచేసుకుంది. అనిల్ అంబానీకి చెందిన రిలయన్స్ డిఫెన్స్ సంస్థను భారత్‌లో ఆఫ్‌సెట్ పార్టనర్ (భాగస్వామి)గా చేసుకోవడం తప్పనిసరి (మాండేటరి) అని చెప్పే అంతర్గత ఒప్పంద పత్రాన్ని ఫ్రాన్స్‌కు చెందిన ఆన్‌లైన్ పరిశోధనాత్మక పత్రిక మీడియా పార్ట్ బయటపెట్టింది. ఈ ఒప్పందంలో రిలయన్స్ డిఫెన్స్‌ను భాగస్వామిగా భారత ప్రభుత్వమే ప్రతిపాదించిందనీ, ఈ విషయంలో ఫ్రాన్స్‌కు మరో అవకాశమేది లేదనీ ఆ దేశ మాజీ అధ్యక్షుడు ఫ్రాన్స్‌వా హోలన్ గతంలో వెల్లడించిన విషయం ధృవీకరణ జరిగింది.

**రాఫెల్ ఒప్పంద వివరాలు ఇవ్వండి – కేంద్రాన్ని కోరిన సుప్రీంకోర్టు**

రాఫెల్ ఒప్పందంపై ఆరోపణ, ప్రత్యారోపణలు, మీడియా కథనాలు, స్థూలంగా భారత రాజకీయాలను కుదిపివేస్తున్నాయి. మరోవైపు రాఫెల్ యుద్ధ విమానాల కొనుగోలు, ఒప్పంద నిర్ణయాల ప్రక్రియకు సంబంధించిన వివరాలను ఈ నెల 29 లోగా సీల్డ్ కవర్‌లో కోర్టుకు సమర్పించాలని సుప్రీంకోర్టు ఆదేశాలను జారీచేసింది. సుప్రీంకోర్టు రాఫెల్ వివాదాన్ని విచారణకు స్వీకరించిందంటే అందులో అవినీతి జరిగినట్లు అంగీకరించినట్లే.

ఈ డీల్‌లో అత్యంత ముఖ్యమైన విషయాలు – 126 యుద్ధ విమానాల అవసరముందన్న రక్షణ శాఖ ప్రతిపాదన పక్కనపెట్టి 36 యుద్ధ విమానాలను ఎందుకు నిర్ణయించారు? 95 శాతం పాత డీల్ పూర్తయింది. పాత డీల్ ధర ఒక్కొక్క విమానం ఖరీదు రు. 526 కోట్లు ఉండగా, కొత్తగా దాదాపు 300 శాతం పెరుగుదలతో రు. 1670 కోట్లకు ఎందుకు పెరిగింది? ఆఫ్‌సెట్ పార్టనర్‌గా రక్షణ, ఆయుధాల తయారీ రంగంలో దాదాపుగా ఎనిమిది దశాబ్దాల పైగా అనుభవం ఉన్న ప్రభుత్వ రంగ సంస్థ హిందూస్థాన్ ఏరోనాటిక్స్ సంస్థను (ఎచ్ఎఎల్) కాదని ఏ మాత్రం అనుభవం లేని నష్టాలతో దివాలా తీసిన రిలయన్స్ అంబానీ సంస్థను ఎందుకు ఎంపిక చేసుకున్నారు?

కాంట్రాక్టరు, సబ్ కాంట్రాక్టరును మార్చాలంటే కూడా ప్రభుత్వ అనుమతి తీసుకోవాలనే మార్గదర్శకాలు ఉన్నప్పటికీ, హల్‌ను మార్చి రిలయన్స్ సంస్థకు డీల్ మార్చే విషయంలో ప్రభుత్వ అనుమతి ఎందుకు తీసుకోలేదు?

ఫ్రాన్స్ పర్యటన సమయంలో ప్రధాని మోడీ బృందంలో రక్షణమంత్రి లేదు కాని అంబానీ ప్రత్యక్షంగా ఎందుకు పాల్గొన్నారు? అనే పలు అంశాలతో పాటు ఫ్రాన్స్ మాజీ అధ్యక్షుడు హలన్ సహచరి నిర్మించిన సినిమాకు అంబానీ స్పాన్సర్ చేసినట్లు వచ్చిన అనేక వ్యవహారాలపై విచారణకు అదేశించాలని ఇద్దరు న్యాయవాదులు వినీత్, ఎం.ఎల్. శర్మలతో పాటు మరికొందరు దాఖలు చేసిన వేరువేరు పిటిషన్లపై ప్రధాన న్యాయమూర్తి రంజన్ గోగోయ్ నేతృత్వంలోని ముగ్గురు సభ్యులతో కూడిన ధర్మాసనం విచారణను స్వాగతించడం హర్షనీయమే.

అయితే దేశ రక్షణకు సంబంధించిన అంశాలతో ప్రమేయం ఉన్నందున, జాతీయ భద్రతా ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకుని ఒప్పంద వివరాలను బహిర్గతం చేయలేమని, కేంద్రం తరపున హాజరైన అటార్నీ జనరల్ కె.కె. వేణుగోపాల్ కోర్టుకు తెలిపారు. మరొక అడుగు ముందుకేసి నిరాధారమైన ఆరోపణలతో దాఖలు చేసిన ఈ పిటిషన్లను కొట్టి వేయాల్సిందిగా కోర్టుకు విజ్ఞప్తి చేశారు. ఇవి ప్రజా ప్రయోజనాల వ్యాజ్యాలు కావని కేవలం రాజకీయ లబ్ధి పొందేందుకు మాత్రమే ఈ పిటిషన్లు దాఖలు చేశారని ఆరోపించారు. ఈ ఒప్పంద వివరాలతో పాటు యుపిఎ, ఎన్‌డిఎ ప్రభుత్వ పాలనా కాలంలో విమానాల కొనుగోలు ధరలను పోల్చుతూ వివరాలను సీల్డ్ కవర్‌లో కోర్టుకు అందజేయాలని సుప్రీంకోర్టు ప్రభుత్వాన్ని కోరారు.

ఈ పరిణామాల నేపథ్యంలో ఇరు వర్గాల వాదన విన్న సుప్రీంకోర్టు ధర్మాసనం కేవలం రాఫెల్ ఒప్పంద నిర్ణయ ప్రక్రియకు సంబంధించిన వివరాలను మాత్రమే ఈ నెల 29 లోగా సీల్డ్ కవర్‌లో అందించాలని కేంద్ర ప్రభుత్వాన్ని ఆదేశించింది. అనంతరం తదుపరి విచారణ 31కి వాయిదా వేసింది. దీంతో ఈ విషయంపై దేశంలో అంబానీలపై, ప్రధాని మోడీ అంతరంగిక ఒప్పందాలపై అటు స్వపక్షంలోనూ, ఇటు ప్రతిపక్షంలోనూ తీవ్ర రాజకీయ చర్చకు తెరలేసింది.

**ఆఫ్‌సెట్ పార్ట్‌నర్‌గా రిలయన్స్ డిఫెన్స్ - ప్రధాని అధికారిక ప్రకటన**

కాగ్, సిబిఐ, సుప్రీంకోర్టు విచారణలతో అట్టుడుకుతున్న రాఫెల్ కుంభకోణానికి ఫ్రాన్స్ ఇన్వెస్టిగేటివ్ జర్నల్ మీడియా పార్ట్ రాఫెల్ ఒప్పందంపై మరో బాంబు పేల్చింది. ఆఫ్‌సెట్ పార్ట్‌నర్‌గా అనిల్ అంబానీ సంస్థ రిలయన్స్ డిఫెన్స్‌ను మాత్రమే ఎంచుకోవాలని మోడీ సర్కారు కచ్చితమైన నిబంధనను డస్సాల్ట్ ముందు పెట్టిందని గతంలో వెలువరించామని అది వాస్తవమని నిరూపించే డస్సాల్ట్ కంపెనీ పత్రాలు ఇవేనంటూ సంచలనాత్మకంగా మీడియా పార్టుకు సంబంధించిన పత్రాలను విడుదల చేసింది.

ఈ కీలక పత్రాల్లో డస్సాల్ట్ కంపెనీ ఉన్నతాధికారి లోయిక్ సీగాలెన్ తన సిబ్బందికి భారత్‌తో కుదిరిన రాఫెల్ ఒప్పందం గురించి వివరించారు. రు. 58 వేల కోట్ల విలువైన ఈ యుద్ధ విమానాల ఒప్పందం భారత్‌తో కుదరాలంటే ఆఫ్‌సెట్ పార్ట్‌నర్‌గా రిలయన్స్ డిఫెన్స్‌ను ఎంచుకోవాలన్న కచ్చితమైన (మ్యాండేటరీ) నిబంధన వచ్చిందనేది ఈ పత్రాల సారాంశం. గతంలో ఫ్రాన్స్ మాజీ అధ్యక్షుడు ఫ్రాంకోయిన్ హోలన్ కూడా ఇదే విషయాన్ని బయటపెట్టినాడు. దీన్నిబట్టి ఈ మొత్తం వ్యవహారంలో ప్రధాని మోడీ ప్రత్యక్షంగానే అనిల్ అంబానీ రిలయన్స్ సంస్థను ఆఫ్‌సెట్ పార్ట్‌నర్‌గా ఎంపిక చేసినట్లు స్పష్టమవుతుంది. పై పెచ్చు హిందుస్థాన్ ఏరోనాటిక్స్ లిమిటెడ్‌ను కాదని, రిలయన్స్ డిఫెన్స్‌ను ఎంచుకోవడం పద్ధతి ప్రకారం పారదర్శకంగా జరిగిందని, ఇందులో ఎలాంటి ఒత్తిడి లేదని ప్రధాని మోడీ చేసిన వ్యాఖ్యలు పూర్తిగా అబద్ధాలని మీడియా పార్టు బట్టబయలు చేసింది.

**ఫ్రెంచ్ కార్మిక సంఘాల నివేదికలోని అంశాలు**

ఫ్రాన్స్‌కు చెందిన పోర్టెయిల్ ఏవియేషన్ అనే బ్లాగ్ తాజాగా డసో ఏవియేషన్‌లోని సిఎఫ్‌డిటి, సిజిటి అనే రెండు కార్మిక సంస్థలకు సంబంధించిన పత్రాలను వెలువరించింది. 2017 మే 11 నాటి సమావేశంలో కాంట్రి పార్టీ అంశాన్ని ప్రధానంగా ప్రస్తావించారు. ఈ ప్రస్తావనంత ఫ్రెంచ్ భాషలో ముంద్రించారు. అందులో సిజిటి కార్మిక సంఘం ప్రకటన ప్రకారం డసో రిలయన్స్ ఏరోస్పేస్ పేరుతో నాగపూర్‌లో ఒక సంస్థను ఏర్పాటు చేయడాన్ని వివరిస్తూ భారత్‌లో తయారీపై పూర్తి ప్రజెంటేషన్ చేశారు.

భారత్‌కు రాఫెల్ యుద్ధ విమానాల ఎగుమతి కాంట్రాక్టును పొందడం కోసం ఈ కాంట్రి పార్టీని డసో ఏవియేషన్ ఆమోదించడం తప్పనిసరి అయిందని సిజిటి కార్మిక సంఘానికి డస్సాల్ట్ కంపెనీ ఉన్నతాధికారి 'లోయిక్ సెగాలెన్' వివరించాడు. ఫ్రెంచ్ భాషలో కాంటె పార్టీ అంటే పరిహారం అని అర్థం. దీన్ని ప్రతికూల అర్థంలో ప్రత్యుపకారం అని కూడా వాడవచ్చు. మరో ప్రధాన కార్మిక సంఘమైన సిఎఫ్‌డిటి సమావేశంలో కూడా భారత్‌లో ఆఫ్‌సెట్ పార్ట్‌నర్‌ను ప్రస్తావించారు. రాఫెల్ ఒప్పందంలో భారత్ విధించిన తప్పనిసరి ఎంపికే రిలయన్స్ డిఫెన్స్ అని పేర్కొన్నారు. ఈ రెండు కార్మిక సంఘాల మినిట్స్‌ను పరిశీలించినా రిలయన్స్‌నే ఆఫ్‌సెట్ పార్ట్‌నర్‌గా తీసుకోవాలనేది భారత్ మాండేటరీగా అర్థమవుతుంది.

**ఆధునిక సాంకేతిక భారతానికి తలమానికం - హాల్ (ఎచ్ఎఎల్)**

రాఫెల్ ఒప్పందంలో ఆఫ్‌సెట్ పార్ట్‌నర్‌గా రక్షణ రంగ ఉత్పత్తులలో దాదాపు ఏడు దశాబ్దాలకు పైగా అనుభవం ఉన్న ప్రభుత్వ రంగ సంస్థ హాల్ (ఎచ్ఎఎల్) ను ఎంచుకోకుండా కేంద్ర ప్రభుత్వం ప్రత్యేకించి మోడీ తీవ్రంగా అవమానించారు. నిజానికి హాల్ సాధారణ కంపెనీ కాదు. ఇది దేశ వైమానిక రంగానికి చెందిన వ్యూహాత్మక సంపద సృష్టికర్త. ఆధునిక సాంకేతిక భారతానికి తలమానికమైన హాల్‌పై పథకం ప్రకారం దాడి చేసి ధ్వంసం చేస్తున్నారు. హాల్ ఉద్యోగుల దేశభక్తిని, సాంకేతిక సామర్థ్య శక్తిని అవమాన పరిచినారు.

ఈ అవినీతి ఒప్పందం ఏకంగా దేశ భవిష్యత్తును కాలరాసింది. రిఫ్రిజిరేటర్ లాంటి చిన్న పరికరాలను తయారు చేసేందుకు కూడా స్థలం, కర్మాగారం పెట్టుబడి లేని సంస్థతో రక్షణ ఒప్పందాలు కుదుర్చుకోవడం విచారకరం. ఇది స్వతంత్ర భారత సాంకేతికాభివృద్ధికే సిగ్గుచేటు. 1965లో జరిగిన పాకిస్తాన్ యుద్ధంలో అమెరికా తయారు చేసిన ఎఫ్-86 యుద్ధ విమానాలను హాల్‌లో తయారైన యుద్ధ విమానాలు కడు సమర్థవంతంగా ఎదుర్కొన్నాయి. సుఖోయ్, మిరాజ్ వంటి యుద్ధ విమానాలను తయారు చేసిన 'హాల్' రాఫెల్ యుద్ధ విమానాలను తయారు చేయలేదా అనేది సర్వత్ర చర్చ జరుగుతుంది.

**జాయింట్ పార్లమెంటరీ కమిటీ (జెపిసి) కి వెనుకడుగు వేస్తున్న ప్రభుత్వం**

రాఫెల్ ఒప్పందంలో వాస్తవాలు పారదర్శకంగా వెలుగులోకి రావాలంటే జాయింట్ పార్లమెంటరీ కమిటీ (జెపిసి) ఏర్పాటు చేయాలి. నిజంగా రాజకీయంగా ఎలాంటి ఆశ్రిత పక్షపాతం లేదంటే ధైర్యంగా జెపిసితో విచారణ జరిపించాలి. జాయింట్ పార్లమెంటరీ కమిటీలో నిష్పత్తి ప్రకారం అన్ని రాజకీయ పార్టీల లోక్‌సభ, రాజ్యసభ ప్రాతినిధ్యం ఉంటుంది. నేడు లోక్‌సభ, రాజ్యసభలో బిజెపి మిత్రపక్షాలకే మెజారిటీ ఉంది. జెపిసి వేసినా కూడా బిజెపి మిత్రపక్షాలదే మెజారిటీ తీర్మానం జరుగుతుంది. అయినా ఎందుకు జెపిసిని వేయడం లేదు? పార్టీ సభ్యులు మెజారిటీ ఉన్న కమిటీని ఎందుకు విశ్వసించడం లేదు? తప్పు చేయనప్పుడు భయం ఎందుకు?

జెపిసి వేస్తే అన్ని డాక్యుమెంట్లను ఆ కమిటీ ముందుపెట్టాలి. డాక్యుమెంట్లు బయటకు వస్తే నిజా నిజాలు బయటకు వస్తాయి. తప్పు నిరూపణ జరిగితే రక్షణ మంత్రితో సహా ఎవరినైనా విచారణ చేయవచ్చు. ఆధారాలు బలంగా ఉంటే చివరికి ప్రధాన మంత్రినైనా విచారణ చేయవచ్చు. అందుకే దీనిని మనీ పార్లమెంట్‌గా పిలుస్తారు.

ప్రభుత్వం జెపిసిని వేయకుండా సుప్రీంకోర్టు విచారిస్తుందన్న సాకుతో దాట వేస్తుంది. సుప్రీంకోర్టు కేవలం డిసిషన్ మేకింగ్ ప్రాసెస్ మాత్రమే విచారిస్తుంది. ధర గురించి మాట్లాడను అని చెప్పింది. 126 విమానాలు

36 విమానాలుగా ఎందుకు తగ్గాయి? ఇవి తగ్గించడానికి బదులుగా 110 యుద్ధ విమానాల తయారీని ఒక (సంస్థ) సీరిస్ కంపెనీకి అప్పగించి అందులో గౌతమ్ అదానిని ఇండియా పార్టనర్‌గా చేర్చడానికే కదా! మేకిన్ ఇండియా గురించి రోజూ మాట్లాడే మోడీ ట్రాన్స్‌ఫర్ ఆఫ్ టెక్నాలజీ గురించి ఎందుకు మాట్లాడడం లేదు? ఇవన్నింటికి హేతుబద్ధంగా సమాధానం దొరకాలంటే జాయింట్ పార్లమెంట్ కమిటీ ద్వారా విచారించాల్సిందే. దేశ భద్రతకు సంబంధించిన ఒప్పందాలను ప్రజాస్వామ్యబద్ధంగా, దేశ క్షేమం కొరకే అయినపుడు జెపిసి డిమాండ్‌కు నీళ్లు నములాల్సిన పనిలేదు. అది నిజంగా దేశ సంక్షేమం దృష్ట్యా వేల కోట్ల ఆదాయాన్ని దేశం దాటి పోకుండా చూస్తే జెపిసి అభినందిస్తుంది కదా! అంతకన్నా ప్రశంస ప్రభుత్వానికి ఇంకొకటి ఏముంటుంది. కాబట్టి వాస్తవాలను ప్రజల ముందుంచాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

**కాగ్ నిశితంగా నిగ్గుతేల్చాల్సిన అంశాలు**

దేశంలో ఏ ఒప్పందాలనైనా, ఎలాంటి ప్రభుత్వ పరంగా జరిగిన లావాదేవీల దస్తావేజులనైనా పరిశీలించే సుప్రీం అధికారం కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ (కాగ్) కు ఉంది. కాబట్టి మొదటగా డస్సాల్ట్, హాల్‌ల మధ్య కుదిరిన అవగాహన ఒప్పంద డాక్యుమెంట్స్‌ను పరిశీలించాలి. డస్సాల్ట్ కంపెనీ ప్రధానాధికారి హాల్ మంచిదని కితాబిచ్చిన పత్రాలను సమీక్షించాలి. డస్సాల్ట్ వార్షిక నివేదికలతో పాటు ఫ్రాన్స్ ప్రభుత్వం విడుదల చేసిన బులెటిన్స్, గతంలోని డస్సాల్ట్ సిఇఒ, హాల్ చైర్మన్ పత్రికా సమావేశాలకు విడుదల చేసిన పత్రాలు నిషితంగా పరిశీలించాలి. అన్ని అధికారిక డాక్యుమెంట్లు నేడు పబ్లిక్ డొమైన్‌లో లభ్యమవుతున్నవి. మొత్తంగా 2007 నుండి నేటివరకు జరిగిన పరిణామాలపై తన విశ్లేషణలను పూర్తి చేయడం కోసం కాగ్ తీవ్ర స్థాయిలో కసరత్తు చేయాలి. ప్రధాని మోడీ ఏకపక్షంగా తీసుకున్న నిర్ణయంపై ఫోరెన్సిక్ ఆడిట్ నిర్వహించి పూర్తిస్థాయి నివేదకను తయారు చేసి పార్లమెంట్ సమావేశాల్లో సమర్పించాలి.

**సిబిఐ అడుగులు ఎవరి వైపు?**

రాఫెల్ యుద్ధ విమానాల ఒప్పందంలో మోడీ ప్రభుత్వంపై అవినీతి ఆశ్రిత పక్షపాతం లాంటి తీవ్ర అభియోగాలతో జాతీయ దర్యాప్తు సంస్థకు అధికార, ప్రతిపక్ష నేతల పిర్యాదుల పరంపరలు కొనసాగుతున్నాయి. ఈ డీల్ విషయంలో ప్రధాని మోడీ, రక్షణ శాఖ మాజీ మంత్రి మనోహర్ పారికర్ అధికార దుర్వినియోగానికి పాల్పడ్డారని సిబిఐకి ఇచ్చిన అభియోగ పత్రాల్లో వ్యక్తం చేశారు. యుద్ధ విమానాల తయారీకి ప్రైవేట్ కంపెనీని ఆఫ్‌సెట్ పార్టనర్‌గా చేర్చడమనేది మిలియన్ డాలర్ల ప్రశ్న. యుపిఎ హయాంలో ప్రతిపాదించిన రాఫెల్ డీల్‌లో ప్రభుత్వ రంగ సంస్థ హాల్ (ఎచ్ఎఎల్) భాగస్వామిగా ఉండేది. రక్షణ పరికరాల తయారీలో అపార అనుభవం ఉన్న హాల్‌ను తప్పించి, ఏ అనుభవం లేని రిలయన్స్ డిఫెన్స్ లిమిటెడ్‌ను ఒప్పందలోకి లాగడంలో ప్రధాని ప్రత్యేక శ్రద్ధపై పలు అనుమానాలకు తావిస్తుంది. అవినీతి నిరోధక చట్టం 1988లోని క్లాజ్ ప్రకారం అధికార దుర్వినియోగానికి పాల్పడ్డారని ఫిర్యాదు పత్రాల్లో పేర్కొన్నారు. ఫ్రాన్స్ నుంచి 36 రాఫెల్ విమానాలు కొనుగోలు చేయనున్నట్లు 2015 ఏప్రిల్ 10న మోడీ ప్రకటించారు. అదే సమయంలో ఆర్‌డిఎల్, ఫ్రెంచ్ కంపెనీ డస్సాల్ట్ ఏవియేషన్‌ల మధ్య జాయింట్ వెంచర్‌గా ఏర్పాటయ్యేందుకు ఆఫ్‌సెట్ పార్ట్‌నర్ ఒప్పందం జరిగింది. ఒప్పందంపై ప్రధాని మోడీ ప్రకటనకు కేవలం 12 రోజుల ముందే ఆర్‌డిఎల్ ఓ కంపెనీగా రిజిస్టర్ అయింది. ఈ ఒప్పందం కుదిరే సమయానికి ఆర్‌డిఎల్‌కు కనీసం కంపెనీ ఏర్పాటుకు అవసరమైన స్థలం కూడా లేదు.

2015 జూన్ 16న నాగపూర్ సమీపంలోని మిహాన్‌లో 289 ఎకరాల స్థలం కోసం మహారాష్ట్ర ప్రభుత్వానికి ఆర్‌డిఎల్ దరఖాస్తు చేసుకుంది. కేవలం 10 వారాలలో ప్రభుత్వం స్థలం కేటాయించినట్లు ఆర్‌డిఎల్ జారీ చేసిన ప్రకటన పత్రంలో ఉంది. ఇందులో మోడీ సర్కార్ అనిల్ అంబానీకి ఎంత బలమైన ఆశీస్సులందించిందో స్పష్టమవుతుంది. 289 ఎకరాల భూమిని అత్యంత చౌక ధరకు కేవలం రు. 64 కోట్లకు అనీల్ అంబానీకి ఇప్పించడం ద్వారా అక్షరాల మోడీ ప్రభుత్వం అధికార దుర్వినియోగానికి పాల్పడ్డట్టు అర్థమౌతుంది. కష్టాల్లో, నష్టాల్లో ఉన్న మిత్రున్ని ఆదుకునేందుకు దేశ సార్వభౌమత్వాన్ని సహితం పక్కకు పెట్టి అనీల్ అంబానీకి చెందిన ఆర్‌డిఎల్ కంపెనీకి రాఫెల్ డీల్‌లో భాగస్వామ్యం కల్పించారనేది వర్ధమాన చర్చ. అనీల్ అంబానీకి చెందిన 2జి స్పెక్ట్రమ్ లాంటి పలు కంపెనీలు లక్షల కోట్ల మేర అప్పుల్లో కూరుకుపోయి కోలుకోలేని స్థితిలో ఉన్నవేళ, అదే వ్యక్తి నేతృత్వంలోని డిఫెన్స్ కంపెనీకి పెట్టుబడులు ఎలా సమకూరుతాయని ఆర్థిక వేత్తలు ప్రశ్నిస్తున్నారు.

మిత్రునికి సహాయం చేద్దామని పదిరోజుల్లో పురుడుపోసుకున్న ఆర్‌డిఎల్‌కి అప్పనంగా వేల కోట్లు దోచి పెట్టడానికే ఈ ఒప్పందంలో అనీల్ అంబానీకి చోటు దక్కేలా మోడీ చొరవ చూపారు. ఈ విషయం సామాన్యపౌరుని వరకు అర్థమౌతున్న తరుణంలో సిబిఐ దేశ సార్వభౌమత్వాన్ని, ప్రభుత్వ రంగ సంస్థల భవిషత్తుపై ఆలోచిస్తుందా? లేక మోడీ ముందు మోకరిల్లుతుందా? వేచి చూడాల్సిందే. ఇదే కనుక జరిగితే దేశంలో కేవలం ఈ దేశ రక్షణ కోసమే నిరంతరం పనిచేసే ఎచ్ఎఎల్ వంటి సంస్థలు క్రమంగా కనుమరుగవడమే కాక, రక్షణ రంగ వ్యవస్థపై తీవ్ర ప్రభావం పడుతుంది. ప్రభుత్వాల అండతో కోట్లు కూడ బెట్టుకోవాలనే ప్రైవేట్ వ్యక్తుల, శక్తుల ప్రభావం నాణ్యతలేని, బాధ్యతలేనితనం, ముమ్ముందు ఆయుధ ఉత్పత్తులపై కూడా పడి దేశ భద్రతకు పెనుముప్పుగా మారే ప్రమాదం ఉంది. కేంద్ర దర్యాప్తు సంస్థ (సిబిఐ) అత్యంత కీలకమైన రక్షణ రంగంలో జరిగిన అవినీతి చీడను కూకటి వేళ్లతో పెకిలించి దోషులు ఎంతటి వారైనా నిష్పక్షపాతంగా దర్యాప్తు జరిపి దేశ అత్యుత్తమ దర్యాప్తు సంస్థగా నిరూపించుకొని నిలబడాల్సిన అవసరముంది.

***తాజాకలం:*** అనేక అవినీతి ఆరోపణలతో దర్యాప్తు తీవ్రమవుతున్న తరుణంలో అక్టోబర్ 24న అర్ధరాత్రి పూట ప్రధానమంత్రి కార్యాలయం అత్యవసర సమావేశాన్ని ఏర్పాటు చేసి సిబిఐ డైరెక్టర్ అలోక్ వర్మ, స్పెషల్ డైరెక్టర్ రాకేశ్ ఆస్థానాలను సెలవులపై పంపించింది. మరో 13 మంది అధికారులను బదిలీ చేసింది. తెలంగాణకు చెందిన, ఒడిశా క్యాడర్‌కు చెందిన ఐపిఎస్ అధికారి ఎం. నాగేశ్వరరావును తాత్కాలిక సిబిఐ డైరెక్టర్‌గా నియమించింది.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ యూనివర్సిటీ)* వీ

# మోడీ ఎన్నికల అస్త్రంగా పాకిస్తాన్

*భారత్-పాకిస్తాన్ నాయకులు తమ ఎన్నికల ఎత్తుగడల్లో భాగంగానే కశ్మీర్ సమస్యను దౌత్యపరంగా పరిష్కరించకుండా, అగ్నికి ఆజ్యం పోస్తూ తమ రాజకీయ ప్రయోజనాలకు వాడుకుంటున్నారని అంటున్నారు* **ఎ. నర్సింహారెడ్డి**

పాక్ ప్రధానమంత్రిగా ఇమ్రాన్‌ఖాన్ పగ్గాలు చేపట్టిన నాటి నుంచి భారత్-పాక్ సంబంధాలు ఏ మలుపు తిరుగుతాయోనన్న ఆసక్తి అందరిలో కనిపించింది. పరిస్థితులు సానుకూలంగా మారతాయన్న ఆశాభావం వ్యక్తమైంది. ఇరు దేశాల మధ్య ఎంతో కాలంగా కాల్పులు తప్ప మాటలు కరువైపోయిన స్థితి ఉంది. ఇమ్రాన్ ఎన్నికల్లో విజయం సాధించగానే మోడీ ఆయనకు అభినందన సందేశం పంపాడు. దానికి ఇమ్రాన్ ఇచ్చిన ప్రత్యుత్తరంలో భారత్‌తో చర్చలకు సిద్ధమేనని సంసిద్ధత వ్యక్తం చేశాడు. 'భారత్ ఒక అడుగు ముందుకు వేస్తే తాను రెండు అడుగులు వేస్తానని' ఎన్నిక కాగానే పాక్ ప్రధాని ఇమ్రాన్‌ఖాన్ చొరవ చూపడం ఆహ్వానించదగ్గ పరిణామం. పాకిస్తాన్ ప్రధాని విజ్ఞప్తి మేరకు ఉభయ దేశాల విదేశాంగ మంత్రులు ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీ సమావేశాల సందర్భంగా పరస్పరం మాట్లాడుకోబోతున్నట్టు భారత విదేశాంగ శాఖ సెప్టెంబర్ 20న ప్రకటించింది. ఏయే అంశాలు మాట్లాడాలన్నది ఇంకా నిర్ణయించలేదంటూ దీనిని శాంతి చర్చల ఆరంభంగా మాత్రం చూడవద్దని పేర్కొంది. పాకిస్తాన్ ప్రతిపాదనను ఆమోదిస్తూనే, ఈ భేటీకి అనవసరపు ప్రాధాన్యం ఇవ్వకూడదని భారత్ భావించడానికి త్వరలో రానున్న ఎన్నికలే ప్రధాన కారణం.

**భారత్-పాక్ దాయాదుల పోరు**

భారత్ పాక్‌తో కుటుంబాల రక్తసంబంధ వారసత్వంగా తగువులాడు తోంది. భౌగోళికంగా, వాణిజ్యపరంగా పాకిస్తాన్‌తో మన సంబంధాలు మంచిగా ఉండవలసిన సమయాల్లో ఇరుదేశాలు సంయమనం పాటించక ఉద్రిక్తతలకు తావిస్తున్నాయి. ఇరుదేశాల మధ్య 3,323 కి.మీ. సరిహద్దు ఉంది. దీనిలో 1225 కి.మీ. సరిహద్దు పాకిస్తాన్ ఆక్రమిత కశ్మీర్ భూభాగానికి సంబంధించినదే. ఆక్రమిత పాకిస్తాన్‌లో కశ్మీర్‌ని అజాది కశ్మీర్, గిల్గిట్ కశ్మీర్‌లు ఉన్నాయి. ఏడు దశాబ్దాల ఇరుదేశాల చరిత్రలో చర్చల ద్వారా ఫలితాలను సాధించుకోలేకపోయాయి. బెలూచిస్థాన్‌లో ఉగ్రవాదానికి భారత్ కారణమని పాకిస్తాన్ ఆరోపిస్తుంటే, సరిహద్దు ఉగ్రవాదాన్ని కశ్మీర్‌లో పెంచి పోషిస్తున్నది పాకిస్తాన్ అని భారత పాలకులంటున్నారు.

పటాన్‌కోట్ ఉగ్రవాద చర్యల అనంతరం 2016 జనవరిలో ఇస్లామాబాద్‌లో జరగవల్సిన చర్చలకు ప్రతిష్టంభన ఏర్పడింది. పాకిస్తాన్ ఆక్రమిత కశ్మీరు సరిహద్దులో మనదేశం 2016 సెప్టెంబర్ సర్జికల్ స్ట్రైక్స్ జరిపినట్టు ప్రకటించింది. సర్జికల్ దాడులతో ఉగ్రవాదాన్ని దెబ్బకొట్టామని ఆనాటి రక్షణ మంత్రి మనోహర్ పారిక్కర్ గంభీర ప్రకటన చేసినప్పటికీ, కశ్మీర్ లోయలో ఉగ్రవాద దాడులు మరింత పెరిగాయి. దేశీయ ఉగ్రవాదులు తయారవడం, ఎన్‌కౌంటర్ సమయాలలో ప్రజలు పెద్ద ఎత్తున గుమికూడి, రాళ్ల దాడులు చేసే ఉద్యమకారులు మిలిటెంట్లకు సహకరిస్తూ సాయుధ బలగాలను అడ్డుకోవడమనే ఒక కొత్త పరిణామస్థాయికి చేరుకుంది. ప్రజల క్రియాశీల మద్దతుతో పనిచేస్తున్న నూతనతరం కశ్మీరీ యువ మిలిటెంట్లు భారత సాయుధ బలగాల ఆగడాలను తీవ్రంగా ప్రతిఘటించడం ప్రభుత్వానికి తలనొప్పిగా మారింది.

2016లో బుర్హాన్‌వనీ ఎన్‌కౌంటర్ తర్వాత ఉగ్రవాద సంస్థల్లోకి కశ్మీర్ యువత అధికంగా చేరుతున్నారని అనేక నివేదికలు తెలిపాయి. కశ్మీర్‌లో భద్రతా బలగాల అణచివేత పెరుగుతున్నకొద్దీ ఈ చేరికలూ పెరుగుతున్నాయని మీడియా విశ్లేషిస్తుంది. కాగా, ఉగ్రవాద సంస్థల్లోకి ఉన్నత చదువులు చదివినవారు చేరుతుండటం నూతన పరిణామం. ఈ ఏడాది మేలో ఉగ్రవాద సంస్థలో కలిసిన కశ్మీర్ ప్రొఫెసర్ మొహమ్మద్ రఫి భట్ ఎన్‌కౌంటర్‌లో మరణించిన విషయం తెలిసిందే. ఉగ్రవాదిగా మారిన పిఎచ్‌డి స్కాలర్ మనన్ బషీర్‌వనీ మరో సహచరుడితో ఎన్‌కౌంటర్‌లో మృతి చెందాడు. కశ్మీర్‌లో సాధారణ పౌరుల మృతుల సంఖ్యా భారీగా పెరుగుతోంది. ఇప్పుడు మహిళా విద్యార్థినీలు కూడ సైన్యానికి, పోలీసులకు వ్యతిరేకంగా ప్రతిఘటిస్తున్నారు.

**లేఖలకే పరిమితమైన చర్చలు**

భారత్-పాకిస్తాన్‌ల మధ్య స్నేహ సుహృద్భావ వాతావరణం పాదుకొల్పే చర్చలకు తెరతీయాల్సిన తరుణమిది. మంచి ఇరుగు పొరుగు దేశాలుగా ఉందామనీ, అర్థవంతమైన, నిర్మాణాత్మకమైన చర్చలు కొనసాగిస్తూ ఉగ్రవాదం లేని దక్షిణాసియా ఏర్పాటుకు కృషి చేద్దామని ఇమ్రాన్‌కి రాసిన లేఖలో ప్రధాని నరేంద్ర మోడీ పిలుపునిచ్చారు. అంతేకాదు, ఇమ్రాన్‌ఖాన్‌తో మోడీ ఫోన్‌లో కూడా మాట్లాడారు. కశ్మీర్‌తో సహా వాస్తవాధీన రేఖకు సంబంధించిన వివాదాల పరిష్కారానికి చర్చలే మార్గమని పాకిస్తాన్ ప్రధాని ఇమ్రాన్‌ఖాన్ ప్రకటించారు. దీనికి కొనసాగింపుగా స్వాతంత్ర్య దినోత్సవాన్ని పురస్కరించుకొని పాక్ జైళ్లలో మగ్గుతున్న భారత ఖైదీలు 300 మందిని విడుదల చేశారు. అదేవిధంగా మన దేశం కూడా ఏడుగురు పాకిస్తానీ పౌరులకు తమ చెర నుంచి విముక్తి కలిగించింది. ఇది స్వాగతించదగిన పరిణామం.

శాంతియుత సంబంధాల కోసం భారత్ నిత్యమూ సిద్ధమేనంటూ మోడీ రాసిన లేఖకు జవాబుగా ఇమ్రాన్ ఏకంగా ఓ సుదీర్ఘ లేఖ రాశారు. ఇమ్రాన్‌ఖాన్ రాసిన లేఖలో తీవ్రవాదం సహా ఉభయదేశాల మధ్య వైషమ్యాలకూ వ్యతిరేకతలకూ మూలకారణాలుగా ఉన్న సమస్త

అంశాలనూ చర్చించడానికి సిద్ధమన్నారు. కశ్మీర్, సియాచిన్, సర్‌క్రీక్, వాణిజ్యం, పౌర సంబంధాలు ఇత్యాదివన్నీ అందులో ఏకరువు పెట్టారు. వాజపేయి రెండు దేశాల మధ్య శాంతికోసం కాంక్షించారని ప్రస్తుతించారు. విదేశాంగ మంత్రుల స్థాయిలో భేటీ జరిగినప్పుడే శాంతి ప్రక్రియను ఎలా ముందుకు తీసుకుపోగలిగేదీ స్పష్టంగా నిర్ణయించుకో గలమని అంటూ ఇస్లామాబాద్‌లో జరగబోయే సార్క్ సమావేశానికి రమ్మంటూ మోడీని ఆహ్వానించారు కూడా. విదేశాంగ మంత్రుల భేటీని ఖరారు చేసుకోవడానికి కొద్దిరోజులుగా రెండు దేశాల మధ్యా మాటా మంతీ జరిగింది.

దీర్ఘకాలంగా రెండు దేశాల మధ్య ఉద్రిక్తతలు నెలకొని సరైన సంబంధాలు లేని సమయంలో ఇద్దరు ప్రధానులు ఆచీతూచి వ్యక్తం చేసిన అభిప్రాయాలు బాగానే ఉన్నాయి కాని అంతమాత్రాన సరిపోవు. రెండు దేశాల రాజధానుల్లోను ఒకరిపై ఒకరికి అతి తక్కువగా ఉన్న విశ్వాసాన్ని పరిగణలోకి తీసుకోవాలి. ఉభయదేశాల నేతలు రాజకీయ వాస్తవ పరిస్థితులను గుర్తించాలి. రెండు దేశాల్లోనూ పాలకవర్గాలు, మత ఛాందస శక్తులు శాంతి చర్చలకు విఘాతం కలిగించేలా వ్యవహరిస్తున్న వాస్తవాన్ని గమనంలోకి తీసుకోవాలి. పాకిస్తాన్‌లో సైన్యం, మత ఛాందసవాద శక్తులు భారత్‌కు వ్యతిరేకంగా ఉగ్రవాదాన్ని ఎగదోయడానికి ప్రయత్నిస్తుంటే, భారత్‌లో మిత, మతవాద బిజెపి సర్కారు ఆ దేశంతో ఘర్షణ వైఖరిని అనుసరించడానికే ప్రాధాన్యత ఇస్తున్నది. మోడీ సర్కారు నాలుగున్నరేండ్లుగా ఆ దిశగా తీసుకున్న సానుకూల చర్యలేవీ లేవంటేనే దాని ధోరణి స్పష్టమవుతోంది.

టెర్రరిస్టులకు మద్దతు ఇవ్వడంపై భారతదేశం వ్యక్తం చేస్తున్న ఆందోళనను పరిగణనలోకి తీసుకొని, దాన్ని విరమించుకోవడం ద్వారా ఉపఖండంలో శాంతి భద్రతలు నెలకొనడానికి దోహదం చేస్తున్నామన్న మంచి అభిప్రాయాన్ని ఇమ్రాన్ వ్యక్తం చేశాడు. అలాగే మోడీ కూడా సార్క్ దేశాల కార్యకలాపాలను పునరుద్ధరించేందుకు అంగీకరించడమేకాక ఇస్లామాబాద్‌లో జరుగవలసి ఉన్న ఆ సమ్మిట్‌లో పాల్గొనడం ద్వారా భారత సుహృద్భావాన్ని వ్యక్తం చేస్తూ సానుకూల వాతావరణాన్ని కల్పించినట్లవుతుంది. కశ్మీర్ ప్రజల్లో భరోసా కల్పించే చర్యలు మోడీ సర్కారు చేపట్టాలి. అయితే ఈ చర్యలన్నీ ఆచరణలోకి రావడానికి ఇద్దరు నేతలూ ఎంతగానో కృషి చేయవలసి ఉంటుంది. కశ్మీర్ సమస్యను రెండు వైపులా సంకుచిత రాజకీయ ప్రయోజనాల కోసం వాడుకోకుండా విజ్ఞత ప్రదర్శించాల్సి ఉంది. ఇందుకు చిత్తశుద్ధితో ప్రయత్నించడం సంయమనం పాటించడం ముఖ్యం.

ఉభయ దేశాల మధ్య ఉద్రిక్తతలు తగ్గితే వాణిజ్య సంబంధాలు వృద్ధి చెందడమేగాక, శాంతి, సుస్థిరతలు నెలకొంటాయనడంలో సందేహం లేదు. ఇమ్రాన్‌ఖాన్‌ను భారత హై కమిషనర్ కలుసుకుని మన క్రికెట్ క్రీడాకారులు సంతకాలు చేసిన బ్యాట్‌ను అందించడం ద్వారా సుహృద్భావాన్ని వ్యక్తం చేశారు. తాజాగా పాక్ విదేశాంగ మంత్రి షా మహమూద్ ఖురేషీ కూడా దౌత్యమార్గంలో రెండు దేశాల మధ్య సాధారణ సంబంధాలు నెలకొనాలన్న అభిలాషను వ్యక్తం చేశారు. ఇందుకు కశ్మీర్ సమస్య పరిష్కారం కావలసివుందన్న అభిప్రాయాన్ని కూడా ఆయన వ్యక్తం చేశారు. ఈ క్రమంలో ఉభయ దేశాల మధ్య వాణిజ్యం, సాధారణ సంబంధాలు ఏర్పాటు చేసుకోవడం ద్వారా క్రమేపీ అపరిష్కృత సమస్యల పరిష్కారానికి రెండు ప్రభుత్వాలు కృషి చేయాల్సి ఉంది. భారత్‌తో చర్చల ప్రక్రియను పునరుద్ధరించడంతోపాటు ఘర్షణాత్మక వైఖరి విడనాడి స్నేహ సంబంధాలు నెలకొల్పడానికి పాక్ ముందుకు రావాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

ఇమ్రాన్‌ను ప్రధానిని చేయడంలో సైనిక పాత్ర ఉందనే వాస్తవం విస్మరించరానిది. ఆయన కేబినెట్‌లో అత్యంత కీలకమైన విదేశాంగ, రక్షణ, అంతరంగిక భద్రత శాఖలు సైన్యం అనుకూలుర చేతిలోనే ఉన్నాయి. మొత్తం 21 మంది కేబినెట్‌లో 12 మంది గతంలో సైనిక పాలకుడు పర్వేజ్ ముషారఫ్ మంత్రివర్గంలో పనిచేసినవారే. కాబట్టి పాక్ ప్రభుత్వంపై మున్ముందు సైన్యం పట్టు ఎంత ఉంటుందో స్పష్టమవుతూనే ఉంది. పాకిస్తాన్ రాజకీయాలను నడిపించేది మతం, సైన్యం, అమెరికాలేనన్నది అందరికీ తెలుసు. పాక్ గత చరిత్రను గమనిస్తే అమెరికా భౌగోళిక రాజకీయార్థిక ప్రయోజనాలకు తోడ్పడింది. పాక్ సైన్యం ఉగ్రవాదులకు దన్నుగా నిలిచింది.

## ఎన్నికల వేళ పాక్ అస్త్రం

మధ్యప్రదేశ్, రాజస్థాన్, ఛత్తీస్‌గఢ్ రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికలు, 2019 పార్లమెంటు సార్వత్రిక ఎన్నికలు ఎంతో దూరంలో లేవు. సర్వేల అంచనాలలో బిజెపికి ఆశాజనకమైన ఫలితాలు వెలువడడం లేదు. అన్ని సర్వేలలో మోడీ గ్రాఫ్ పడిపోతున్నది. అంతే, రెండు సంవత్సరాల నుండి అటకెక్కిన పాకిస్తాన్ గోల, దేశభక్తి అంశాలు తెరపైకి వచ్చాయి. సెప్టెంబర్ 29ను 'సర్జికల్ స్ట్రైక్స్‌డే'గా పాటించాలని, దేశంలోని అన్ని యూనివర్సిటీలు, విద్యాసంస్థలు తప్పనిసరిగా పాల్గొనాలని యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ (యుజిసి) ప్రకటించింది. విద్యార్థుల్లో బిజెపి- సంఘ్ పరివార్ తరహా దేశభక్తిని నూరిపోయడానికి పథకాలను రచించారు. ఆర్మీ మాజీ సైనికాధికారులతో చర్చలు, ఎగ్జిబిషన్లు ఏర్పాటు, గ్రీటింగ్‌కార్డుల అమ్మకాలు, పోస్టింగులు మొదలగు కార్యక్రమాలు విద్యార్థులు చేయాలని ఆదేశాలు పంపింది.

మోడీ సర్జికల్ దాడుల ద్వితీయ వార్షికోత్సవాన్ని పురస్కరించుకుని 'మన్ కీ బాత్'లో భారత సైనికశక్తిని కీర్తిస్తూనే పాకిస్తాన్‌కు పలు హెచ్చరికలు చేశారు. శాంతి కొరకు ఆత్మగౌరవాన్ని బలిపెట్టడానికి సిద్ధంగా లేమన్నారు. ఇకపై పాకిస్తాన్ ఎటువంటి దుశ్చర్యలకు పాల్పడినా ఘాటైన సమాధానం చెప్పాలని నిర్ణయించుకున్నట్టు చెప్పారు. అసెంబ్లీ ఎన్నికలు, సార్వత్రిక ఎన్నికలు సమీపిస్తున్న నేపథ్యంలో మరోమారు పాకిస్తాన్ ప్రధాన విలన్‌గా తెరమీదకు రాబోతున్న సంకేతాలు ఇవి. ఆత్మగౌరవం ముందు మిగతా ఏమైనా దిగదుడుపేనని అందరికి తెలుసు. అయితే, అది పొరుగుదేశమైన పాకిస్తాన్‌కు మాత్రమే పరిమితమా లేక సామ్రాజ్యవాద అమెరికా విషయంలోనూ వర్తిస్తుందా? అన్నదే సంశయం.

ఇరాన్ నుంచి చుక్క చమురు కొన్నా ఊరుకునేది లేదు అంటూ అమెరికా అధ్యక్షుడు ట్రంప్ హెచ్చరికలు చేస్తున్నారు. తాను గీసిన గీత దాటి ఇరాన్ వైపు కన్నెత్తి చూసినపక్షంలో శిక్ష తప్పదంటూ అమెరికా చేస్తున్న బెదరింపులకు లొంగిపోయి మిమ్ములను ధిక్కరించేంత వారమా? అంటూ మన పాలకులు వినయంగా తలూపుతున్నారు. చమురు దెబ్బకు అన్నిరంగాలూ కునారిల్లుతూ, నిత్యావసరాల ధరలు నానాటికీ హెచ్చుతూ, దేశ ఆర్థిక వ్యవస్థ బలహీనపడుతున్న ఇంతటి సంక్షోభ స్థితిలోనూ మోడీ ప్రభుత్వానికి ఆత్మగౌరవం ఎందుకు గుర్తుకు రావడంలేదు. ట్రంప్ మన నెత్తిన కూర్చుంటే ఆత్మగౌరవాన్ని నిలుపుకోవాలన్న స్పృహను కోల్పోయి

అమెరికా ప్రాపకం కోసం ఇరాన్‌ను కాదని తమ ప్రజలను అష్టకష్టాల్లోకి నెట్టడానికి సిద్ధపడుతున్నవారు ఆత్మగౌరవం గురించి మాట్లాడడం విచిత్రంగా ఉంది.

మరోవైపు ఆత్మగౌరవం వంటి పెద్ద పెద్ద మాటలు మాట్లాడడం విడ్డూరంగా ఉంది. రాఫెల్ కుంభకోణం, రూపాయి మారక విలువ పతనం, ఆకాశానంటుతున్న పెట్రోల్-డీజిల్ ధరలు, మాల్యాలు-నీరవ్‌లు బ్యాంకులకు అప్పులు ఎగ్గొంటి దర్జాగా దేశం విడిచి పారిపోయిన సంఘటనలు మోడీకి బాధ కలిగించడం లేదు.

పాకిస్తాన్ ప్రధాని ఇమ్రాన్‌ఖాన్ రాసిన లేఖకు స్పందనగా ఐరాస సమావేశాల సందర్భంగా న్యూయార్క్‌లో ఇరు దేశాల విదేశాంగ మంత్రులు సుష్మా స్వరాజ్, మహమూద్ ఖురేషి సమావేశమవుతారని సెప్టెంబర్ 20న ప్రకటించిన భారత్, 24 గంటలు కూడా తిరక్క ముందే ఈ భేటీని రద్దు చేస్తున్నట్లు వెల్లడించడం బాధాకరం. చర్చలకు సరేనని, వెనువెంటనే కాదంటూ అవే పాత వాదనలతో పాకిస్తాన్‌ను విమర్శిస్తూ, ఆగస్ట్ చివరలో గద్దెనెక్కిన ఇమ్రాన్ అసలు రంగు ఇంతలోనే బయట పడిందని వ్యాఖ్యానిస్తూ మోడీ ప్రభుత్వం చేస్తున్న విన్యాసాలన్నీ ఎన్నికల నేపథ్యంలో జరుగుతున్నవేనని ఎవరికైనా అర్థమవుతుంది. యూటర్న్ తీసుకోవడానికి మోడీ ప్రభుత్వం చూపిన కారణాలు నిర్హేతుకం. వాస్తవాధీన రేఖ వెంబడి, కశ్మీర్‌లోను హింసను పాకిస్తాన్ తాజాగా ప్రేరేపిస్తుందన్న ఆరోపణతో న్యూయార్క్ భేటీని రద్దు చేశామని మోడీ ప్రభుత్వం చేస్తున్న వాదన సత్యదూరం. ఈ కారణాలు రాత్రికి రాత్రే వైఖరి మార్చుకునేంత తీవ్రమైనవి కావు. ప్రభుత్వం చూపిన కారణాలు అంతర్జాతీయ సమాజాన్ని, పాకిస్తాన్‌ని సంతృప్తిపరచకపోయినా, కనీసం దేశ ప్రజలకు నమ్మశక్యంగా ఉన్నా బాగుండేది. పాకిస్తాన్ విషయంలో తప్పటడుగులు వేయడం మోడీ ప్రభుత్వానికి కొత్తేమీ కాదు.

**కుంటిసాకుతో చర్చలకు విముఖత**

ఇక చర్చలే తరువాయి అనుకుంటున్న సమయంలో హఠాత్తుగా సరిహద్దుల్లో బిఎస్ఎఫ్ జవాన్‌ను ఉగ్రవాదులు హింసించి చంపారన్న ఘటన సెప్టెంబర్ 19న చోటుచేసుకుంది. కశ్మీర్‌లో పాక్ ప్రేరేపిత ఉగ్రవాదుల దాడులు, ఉగ్రవాదులను కీర్తిస్తూ పోస్టల్ స్టాంపులను పాకిస్తాన్ విడుదల చేయడాన్ని భారత్ తప్పుపడుతుంది. కానీ, ఈ పరిణామాలు పాకిస్తాన్‌తో చర్చలు జరపాలని నిర్ణయించుకున్న తరువాత చోటు చేసుకున్నవా? అంతకుముందు జరిగినవా? అని తర్కించి చూస్తే, కశ్మీర్‌లో సెప్టెంబర్ 21న ముగ్గురు పోలీసుల హత్య మినహా మిగతా పరిణామాలు భేటీ నిర్ణయానికి ముందు చోటుచేసుకున్నవేనన్నది స్పష్టం. హిజ్బుల్ ముజాహిద్దీన్ నాయకుడు బుర్హాన్ వనిపై పోస్టల్ స్టాంపుల విడుదల ఇమ్రాన్‌ఖాన్ ప్రభుత్వం ఏర్పడక ముందే అంటే గత జూలైలోనే జరిగింది. పరిస్థితినంతటిని ప్రధాని మదింపు వేశాకే భారత్, పాక్ విదేశాంగ మంత్రుల భేటీకి నిర్ణయించారు. అప్పుడు ఈ అంశాలు గుర్తుకు రాలేదా? లేక రానున్న అయిదు రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికలు, వచ్చే ఏడాది మేలో జరగనున్న పార్లమెంటు ఎన్నికల్లో పాక్ వ్యతిరేకతను రెచ్చగొట్టడానికి ఇది ఆటంకంగా ఉంటుందని బిజెపి భావించి అర్థాంతరంగా భేటీని రద్దు చేసిందా అన్న సందేహాలు వ్యక్తమవుతున్నాయి.

జమ్మూ కశ్మీర్‌లో ముగ్గురు పోలీసుల కిడ్నాపు, హత్య సెప్టెంబర్ 21న వెలుగు చూసింది. జమ్మూ కశ్మీర్‌లో ఇటువంటి ఘటనలు తరచూ జరుగుతుంటాయి. సరిహద్దు ఆవలి నుంచి ఉగ్రవాదులను ఎగదోయడానికి పాకిస్తాన్ సైన్యం, అక్కడి మత ఛాందసవాద శక్తులు ఎప్పుడూ ప్రయత్నిస్తూ ఉంటాయి. భారత్ వ్యతిరేకతను రెచ్చగొట్టడం ద్వారా అక్కడి సైన్యం, మత ఛాందసవాద శక్తులు పబ్బం గడుపుకుంటాయి. రెండు వైపులా ఇటువంటి శక్తులు ఉన్నాయి. తీవ్రవాద చర్యలకు అవకాశం ఇవ్వకుండా కశ్మీరీ ప్రజల్లో విశ్వాసాన్ని పెంపొందించేందుకు సాయుధ బలగాల ప్రత్యేకాధికారాల చట్టం ఉపసంహరణ, కశ్మీర్‌కు గరిష్ఠ స్వయం ప్రతిపత్తి కల్పించే ఆర్టికల్ 370, ఆర్టికల్ 35ఎను పరిరక్షించడం వంటి చర్యలు చేపట్టడానికి బదులు దీనిని భద్రతాపరమైన సమస్యగా కేంద్రంలోని బిజెపి ప్రభుత్వం చూస్తున్నంత కాలం కశ్మీర్‌లో హింసను అదుపు చేయడం అసాధ్యం. కశ్మీర్ సమస్యకు రాజకీయ పరిష్కారం కనుగొనాలన్నా, ఉగ్రవాదాన్ని అరికట్టాలన్నా భారత్, పాక్‌ల మధ్య చర్చలు విజయవంతం కావాలి. కశ్మీర్‌కు ప్రస్తుతం మూడో దేశంలో ఇరు దేశాల జాతీయ భద్రతా సలహాదారుల మధ్య రహస్యంగా జరుగుతున్న చర్చలను అధికారికంగా కొనసాగించాలి.

కశ్మీర్‌లోని అన్ని పక్షాలతో సమగ్ర చర్చలు జరపడం ద్వారా ఉగ్రవాద సంస్థలను ఒంటరి చేయొచ్చు. ఈ మార్గాన్ని విడిచిపెట్టి కశ్మీర్‌ను ఖాకీల వనంగా మార్చడం ద్వారా శాంతిని పునరుద్ధరించాలనే బిజెపి ప్రభుత్వ వైఖరి ప్రమాదకరమైనది. కశ్మీర్ సమస్యను సామాజికార్థిక, జాతుల సమస్యగా పరిగణించకుండా, శాంతిభద్రతల సమస్యగా భావించి సాయుధ బలగాలను ఉసిగొలిపితే తీవ్ర పరిణామాలు చోటు చేసుకుంటాయి. సైన్యం ఆగడాల వల్ల, ప్రజల పౌర ప్రజాతంత్ర హక్కుల అణచివేత వల్ల కశ్మీర్‌లో ఉగ్రవాద దాడులు మరింతగా పెరిగాయి. ఈ ఏడాది ఇంతవరకు వాస్తవాధీన రేఖ వెంబడి జరిగిన కాల్పుల్లో మూడు డజన్ల మంది దాకా భద్రతా దళ జవాన్లు చనిపోయారు. జమ్మూ కశ్మీర్‌లో సుమారు 20 మంది పోలీసులు బలయ్యారు. గత కొద్ది నెలలుగా పరిస్థితి మరింత దిగజారుతూ వస్తోంది. భారత్-పాక్ విదేశాంగ మంత్రుల మధ్య చర్చలు, సామరస్య వాతావరణం నెలకొనడం విచ్ఛిన్నకర శక్తులకు ఎంతమాత్రమూ గిట్టదు. చర్చలు అన్నప్పుడల్లా అటుఇటు ఉగ్రవాద శక్తులు పేట్రేగడానికి కారణమిదే. నిజానికి ఉగ్రవాదులు వాడుతున్న ఆయుధాలపై మేడ్ ఇన్ అమెరికా, ఫ్రాన్స్, యుకెలని తెలుస్తూనే ఉన్నది. వారికి ఆయుధాలు సరఫరా చేస్తున్నవారు ఏమి ఆశించి చేస్తున్నారు.

కశ్మీర్ సమస్యకు శాశ్వత రాజకీయ పరిష్కారం కనుగొనాలన్నా, ఉగ్రవాదాన్ని సమర్థవంతంగా అరికట్టాలన్నా భారత్, పాక్ మధ్య చర్చలు పునరుద్ధరించడం అత్యంతావశ్యకం. దేశ సార్వభౌమత్వం, ప్రాదేశిక సమగ్రతకు ముప్పు తెచ్చే శక్తుల పట్ల అప్రమత్తంగా ఉంటూనే చర్చల ప్రక్రియను పునరుద్ధరించాలి. మూడో పక్షం జోక్యానికి ఏమాత్రం అవకాశమివ్వరాదు. ఇందుకు భారత్, పాక్ రాజకీయ నాయకత్వాలకు చిత్తశుద్ధి అవసరం. ఆ చిత్తశుద్ధే ఇప్పుడు లోపించింది. దేశ సార్వభౌమత్వం, దక్షిణాసియాలో శాంతి సుస్థిరత సాధించాలంటే విచ్ఛిన్నకర శక్తులు, ఉగ్రవాదుల పట్ల అప్రమత్తంగా ఉంటూనే చర్చల ప్రక్రియను పునరుద్ధరించాలి. భారత్-పాక్ విదేశాంగ మంత్రుల సమావేశం 2015లో చివరిసారిగా జరిగింది. ఆ తర్వాత 2016లో పఠాన్‌కోట్ వైమానిక స్థావరంపై పాక్ భారీ దాడికి పాల్పడడంతో ద్వైపాక్షిక చర్చలను భారత్ ఏకపక్షంగా నిలిపివేసింది. 2016లో పాకిస్తాన్‌లో జరిగిన సార్క్ సమావేశాన్ని భారత్ బహిష్కరించింది.

# నీతి తప్పిన నీతి అయోగ్ విద్యా విధానం

*సామ్రాజ్యవాద అభివృద్ధి నమూనాలో భాగంగానే విద్య కార్పొరేట్ వ్యాపార సరుకుగా మారిపోయిందనీ, ఈ విధానానికి వత్తాసు పలుకుతూ నీతి అయోగ్ ప్రభుత్వ విద్యారంగాన్ని నీరుకార్చే ప్రయత్నం చేస్తోందనీ అంటున్నారు* **బి. రామకృష్ణ**

**2017-18** నుండి 2019-20 వరకు మూడేళ్లకు సంబంధించి నరేంద్రమోది ప్రభుత్వం ఆగస్ట్ 2017లో నీతి అయోగ్ కార్యాచరణ ఎజెండాను విడుదల చేసింది. ఈ అధికారిక డాక్యుమెంట్ లోని 20వ అధ్యాయంలో విద్యా విధానాన్ని ప్రకటించారు. అభ్యసన ఫలితాలను మెరుగుపరచడమే నేడు భారత పాఠశాల విద్యా వ్యవస్థ ముందున్న ప్రధానమైన లక్ష్యమని తెలిపారు. సర్వశిక్ష అభియాన్, విద్యా హక్కు చట్టం ద్వారా మౌలిక వసతులను గుర్తించడం, అందించడంపై దృష్టి పెట్టారని, దీంట్లో చాలా వరకు విజయం సాధించబడిందని చెప్పారు.

2015-16లో స్థూల నమోదు నిష్పత్తి (జిఇఆర్) 1-5 తరగతులలో 99.2 శాతం, 6-8 తరగతులలో 92.8 శాతం ఉన్నదని, ఎలిమెంటరీ పాఠశాలల్లో ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి 24:1 శాతం, సెంకండరీ పాఠశాలల్లో ఇది 27:1 శాతం ఉందని వివరించారు. దురదృష్టవశాత్తు ఎక్కువ మంది టీచర్లతో ఎక్కువ మంది పిల్లలను పాఠశాలలకు రప్పించ గలిగినా విజయం అనేది ఎక్కువ విద్య అందించడంగా మారలేదని, తరగతికి తగిన అభ్యసన స్థాయిల్లో వెనుకబడుతున్నారని ప్రథమ్ ఎఎస్ఇఆర్ నివేదిక, నేషనల్ అచీవ్‌మెంట్ సర్వే (ఎన్ఎఎస్) లు చెబుతున్నాయని బాధపడుతున్నట్లుగా చెప్పుకొచ్చారు. ఈ సర్వేల ఫలితాలు మౌలిక వసతులు అనేది విద్యను మెరుగుపరచడానికి సహాయపడదని సూచిస్తున్నాయని నీతి అయోగ్ డాక్యుమెంట్ చెప్పింది.

ఈ డాక్యుమెంట్ చెబుతున్న నమోదు కాని ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి కాని ప్రభుత్వ, ప్రైవేట్ పాఠశాలల్లో దేంట్లో అనేది స్పష్టంగా చెప్పలేదు. నమోదును రెండింటిలో కలిపే అనుకోవాలి. ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి మాత్రం ప్రభుత్వ పాఠశాలల్లోనే అని అనుకోవాలి. నమోదు గురించి చెప్పినవారు వివిధ స్థాయిల్లోని డ్రాప్ అవుట్‌ల సమాచారం ఇవ్వలేదు.

మౌలిక వసతులు అందించినప్పటికీ, తక్కువ ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి ఉన్నప్పటికీ కనీస అభ్యసన ఫలితాలలో వెనుకబడి ఉన్నాయని ప్రైవేట్ పాఠశాలలతో పోల్చినప్పుడు ప్రభుత్వ పాఠశాలల్లో ఫలితాలు

---

**ముగింపు**

పాక్, ముస్లిం వ్యతిరేకతను రెచ్చగొట్టి ఎన్నికల పబ్బం గుడుపుకోవాలని బిజెపి చూస్తున్నది. కాబట్టి చర్చల ప్రక్రియ పట్ల చిత్తశుద్ధి ప్రదర్శిస్తుందనుకోవడం భ్రమే అవుతుంది. ఇందుకు గత అనుభవం కూడా ఉంది. వాజ్‌పేయి ప్రభుత్వం పర్వేజ్ ముషారఫ్‌తో అగ్రా చర్చలు జరిపినప్పుడు కార్గిల్ యుద్ధం వచ్చింది. ఆ యుద్ధాన్ని అడ్డుపెట్టుకొని జాతీయవాదాన్ని రెచ్చగొట్టి 1999 ఎన్నికల్లో రాజకీయంగా లబ్ది పొందింది. అటు పాకిస్తాన్‌లో మత ఛాందసవాదులు, ఉగ్రవాద బృందాలు, సైన్యం భారత వ్యతిరేకతతో ఉంటాయి. భారత్‌తో సత్సంబంధాలంటే అవి ఏ మాత్రం ఇష్టపడవు. ఈ నేపథ్యంలో ఇమ్రాన్ ఏ మేరకు స్వతంత్రంగా వ్యవహరిస్తారన్నది అనుమానమే. ఆయనకు నిజంగా ఎంత కార్యనిర్వాహణ స్వేచ్ఛ ఉంటుందో కూడ అర్థం చేసుకోవచ్చు. అసలు సైన్యం జోక్యం వల్లనే ఇమ్రాన్ అధికార పీఠమెక్కారన్నది కూడ అందరికి తెలుసు. ఎన్ని అనుమానాలు, మరెన్ని పరిమితులు ఉన్నా ఉభయ దేశాల మధ్య సంబంధాల మెరుగుదలకు ఏకైక మార్గం మాత్రం చర్చలే. రెండు దేశాల మధ్య సంబంధాల పునరుద్దరణకు ముందు సరిహద్దుల్లో వాస్తవాధీన రేఖ వద్ద కాల్పుల విరమణను అమలుచేయాలి. అప్పుడే రెండు దేశాలూ పెద్ద ముందడుగు వేసినట్టుగా భావించవచ్చు.

చర్చల ప్రతిస్థంభన వల్ల మనదేశానికి ఒరిగేది ఏమిలేదు, మరింత ఉద్రిక్తతలు తప్ప. నిజానికి కశ్మీర్ సమస్య నిరంతరం రాజుకుంటుండడం ఇరుదేశాల పాలకులకు రాజకీయ అవసరం. అందువల్ల దాన్ని ఎప్పటికీ సజీవంగానే ఉంచడంలో ఇరుదేశాల పాలకులు తరతమ స్థాయిలో శాంతచర్చలకు, ఒప్పందాలకు విఘాతం కలిగిస్తుంటారు. భారత్, పాక్‌లు దేశ విభజన కాలం నుంచి ఆస్తుల కోసం కొట్లాడుకునే దాయాదుల్లా కీచులాడుకుంటూనే ఉన్నారు. నిజానికి 1947 ఆగస్ట్ 16 వరకు మనది ఒకే నాగరికత. సింధు నాగరికత, హరప్పా మొహంజదారో నాగరికత మన ఇరువురిది. వేల సంవత్సరాల చరిత్ర కలిగిన భారత్, పాక్‌లు శాంతి సంబంధాలతో సహజీవనం చేశారు. ఈ రెండు దేశాలు సామరస్యంతో ముందుకు వెళ్తే భారత ఉపఖండంలో శాంతి నెలకొంటున్నది.

గత ఏడు దశాబ్దాలుగా కశ్మీర్ ప్రజల స్వయం నిర్ణయాధికార ప్రజాస్వామిక హక్కును పణంగా పెట్టి ఇరు దేశాల పాలకులు రాజకీయ పబ్బం గడుపుకుంటున్నారు. ఎన్నికల సమయంలో పాక్ పట్ల కఠిన వైఖరి చేపడుతామని ప్రచారం చేసి ఓటర్లను ఆకట్టుకునేందుకు, అధికార పార్టీపై వ్యతిరేకత పెరగకుండా ప్రజలను వారి మౌలిక సమస్యల నుంచి పక్కదారి పట్టించేందుకు కశ్మీర్ సమస్య సజీవంగా కొనసాగించడం బిజెపి పాలకులకు అవసరం. ఇరుదేశాల పాలకులు తమ అధికారాన్ని సుస్థిరం చేసుకునేందుకు దాయాది దౌత్యాన్ని తమ రాజకీయ లబ్ధి కొరకు ప్రయోగిస్తున్నంత కాలం శాంతిచర్చలు ఫలప్రదమయ్యే అవకాశమే లేదు. 2019 సార్వత్రిక ఎన్నికలు జరిగి నూతన ప్రభుత్వం ఏర్పడేవరకు పాక్‌తో ద్వైపాక్షిక చర్చల పురోగతిని ఆశించలేం కాని, అందాక ఉభయ దేశాల మధ్య వాతావరణం చెడకుండా కాపాడుకోవడం ప్రధానం.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

దారుణంగా ఉన్నాయని చాలా కన్విన్సింగ్‌గా చెప్పే ప్రయత్నం చేసింది డాక్యుమెంట్.

2010 నుండి 2014 వరకు ప్రభుత్వ పాఠశాలలు 13,500 పెరిగాయని, అయితే వాటిలో నమోదు 1.13 కోట్లు పడిపోయాయని, దీనికి సమాంతరంగా ప్రైవేట్ పాఠశాలల్లో 1.85 కోట్లు నమోదు పెరిగిందని తెలిపింది. 2014-15 విద్యా సంవత్సరంలో 50 మంది విద్యార్థుల కంటే తక్కువగా, సుమారు 29 మంది ఒక్కో పాఠశాలలో ఉన్న ప్రభుత్వ పాఠశాలలు 3.7 లక్షలు ఉన్నాయని, ఇది మొత్తం ప్రభుత్వ పాఠశాలల్లో 36 శాతం అని ఈ డాక్యుమెంట్ వివరించింది. ఉపాధ్యాయుల గైర్హాజరు, బోధనలో తక్కువ సమయం గడపడం, నాసిరకం చదువులు అనేవి ప్రభుత్వ పాఠశాలల్లో పిల్లలు తగ్గిపోవడానికి సరైన అభ్యసన ఫలితాలు రాకపోవడానికి కారణాలుగా చెప్పారు.

పాఠశాల అనడానికి ఉండాల్సిన కనీస అవసరాలు, అవి నిజంగా సమకూర్చబడని పాఠశాలల సమాచారం ఇచ్చి ఉంటే దారుణమైన విషయాలు తెలిసేవి. ఈ డాక్యుమెంట్‌లోనే చెప్పబడుతున్న సగటున 29 మంది విద్యార్థులున్న ప్రాథమిక పాఠశాలల్లో (36 శాతం) విద్యా హక్కు చట్టం ప్రకారమే చూస్తే ఇద్దరే టీచర్లు ఉంటారు. తెలంగాణ ప్రభుత్వం 2016లో అసెంబ్లీలో ప్రవేశపెట్టిన పత్రం ప్రకారం 67 శాతం ప్రాథమిక పాఠశాలల్లో ఇద్దరే టీచర్లు ఉంటారు. తరగతికి ఒక గది, ఆటస్థలం, గ్రంథాలయం, తాగునీరు, మరుగుదొడ్లు, భవనాలు, మొదలగు కనీస అవసరాలు ఇటువంటి పాఠశాలల్లో ఉంటాయని అనుకోవడం అత్యాశో, అమాయకత్వమో అవుతుంది. ఇవన్నీ సక్రమంగా అందజేయ బడినట్లుగా నీతి అయోగ్ డాక్యుమెంట్ ఫోకస్ చేసే ప్రయత్నం చేసింది.

ప్రభుత్వ పాఠశాలల్లో ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి 24:1 శాతంగా ఉందని, ఇది ఉండాల్సిన ఉపాధ్యాయుల కంటే ఎక్కువగానే ఉన్నారనే అభిప్రాయాన్ని కల్పించే ప్రయత్నం చేస్తూ క్షేత్రస్థాయి వాస్తవాలను పాతరేస్తుంటారు. మొత్తం విద్యార్థులు, మొత్తం టీచర్ల సంఖ్యను బట్టి ఈ నిష్పత్తిని చెబుతుంటారు. కాని ఒక్కో పాఠశాలలో ఒక్కో తరగతికి ఎంత మంది టీచర్లున్నారనేది దాచేస్తుంటారు. కనీసం ప్రతి తరగతికి ఒక టీచర్, ఒక గది లేకుండా ఒకరిద్దరే టీచర్లు ప్రాథమిక పాఠశాలల్లో అన్ని తరగతులకు ఏక సమయంలో ఒకే గదిలో బోధించడం ఎంత దుర్భరమో ఎక్కడా వివరించరు. పిల్లల శారీరక, మానసిక, మేధోపరమైన వికాసాలకు తోడ్పడే సహ పాఠ్య అంశాలను అందించడానికి కావల్సిన కనీస విద్యా వాతావరణం కల్పించకుండా ఫలితాలు రావడం లేదని మాట్లాడుతుంటారు. అభ్యసన ఫలితాలు సాధించబడడం లేదని ఎంతో బాధపడిపోతున్నట్లు నటిస్తుంటారు.

దేశ వ్యాప్తంగా చాలా ప్రభుత్వ పాఠశాలల్లో నమోదు తగ్గిపోతున్నదని, వాటిని చిన్న, మిగులు పాఠశాలలని అంటున్నారు. ఇటువంటి పాఠశాలల్లో అన్ని వసతులను కల్పించడం దుబారా ఖర్చు అని ధర్మతర్కం చేస్తుంటారు. వీటిని కలిపి ఒకే పాఠశాలగా రూపొందించడానికి హేతుబద్ధీకరణ, విలీనం, బలోపేతం చేయడం వంటి పేర్లతో ప్రభుత్వ పాఠశాలల సంఖ్యను కుదించేస్తున్నారు. సరైన సమయంలో, సరైన సంఖ్యలో, సరైన ప్రాంతంలో ప్రభుత్వ పాఠశాలలను నెలకొల్పి వాటిలో కనీస విద్యా సౌకర్యాలను అందించకుండా ప్రభుత్వ పాఠశాలల పక్కనే ప్రైవేట్ పాఠశాలలను నెలకొల్పుతూ పోవడానికి అనువైన విధానాలను చేపట్టిన చరిత్రను కావాలనే దాచేస్తుంటారు.

ఇలా గత మూడు నాలుగు దశాబ్దాలుగా చేస్తూ వచ్చిన కుతంత్రాలను వాటివెనుకున్న పెట్టుబడిదారుల, భూస్వామ్య ప్రభువుల ప్రయోజనాలను ఎక్కడా కూడా ప్రస్తావించరు. విద్యా వ్యాపారీకరణ చెందడానికి పడిన పునాదులను, ఇవ్వాళ పెద్ద ఎత్తున విద్య అమ్మకపు కొనుగోలు వస్తువుగా మారిన ప్రస్థానాన్ని తెలియజెప్పరు. ఈ నిజాలను నిశ్శబ్దంగా సమాధి చేస్తుంటారు. వీటిపై ఎటువంటి పరిశోధనలు గాని, అధ్యయనాలను గాని చేయరు.

విద్యను వ్యాపారీకరణ, కార్పొరేటీకరణ చేయడానికి చట్టసభల్లో గాని, వాటి ఆవలగాని నేరపూరితమైన విద్యా విధానాలను రూపొందిస్తూ, కొన్నిసార్లు అలా కూడా రూపొందించ కుండానే నేరుగా అమలు చేస్తూ పోతున్నారు. మోడీ ప్రభుత్వం అధికారంలోకి వచ్చినప్పటికి నుండి నిర్దిష్టమైన విద్యా విధానాన్ని అధికారికంగా ప్రకటించలేదు కాని కొన్ని డాక్యుమెంట్లలో సూచనల రూపంలో ప్రస్తావించింది. 2017 ఆగస్ట్‌లో నీతి అయోగ్ పత్రంలో నిర్దిష్టంగా సూచనలు చేసింది.

పాఠశాల విద్యకు సంబంధించిన కార్యాచరణ ప్రణాళికలో ఫలితాల వైపు విద్యా వ్యవస్థను నిర్దేశించాలని సూచించారు. 2వ, 3వ తరగతుల నుండే అభ్యసన ఫలితాలను వార్షిక శాంపిల్ ఆధారిత మాపన వ్యవస్థను రూపొందించాలని, అందుకోసం నేషనల్ అచీవ్‌మెంట్ సర్వే వంటి వాటిని ఉపయోగించుకోవచ్చని, వాటి ద్వారా లోపాలను గుర్తించి మెరుగైన మూల్యాంకన పద్ధతుల వైపు ఆలోచించవచ్చని తెలిపారు. పాఠశాల విద్యా నాణ్యత సూచిక (ఎస్ఇక్యుఐ) ద్వారా పాఠశాలల్లో ఫలితాలను తెలుసుకుని తగు మద్దతును అందించాలని తెలిపారు. ఫలితాల మాపనంపై ఎంతో శ్రద్ధను కేంద్రీకరిస్తున్న డాక్కుమెంట్ నాణ్యతా ప్రమాణాలను పెంపొందించడానికి తీసుకోవల్సిన చర్యలను గాని, దార్శనికతను గాని, ఒక విధానాన్ని గాని ప్రకటించలేదు.

విద్యా హక్కు చట్టం భవనాలు, ఆట స్థలాలు, ఉపాధ్యాయులు, గ్రంథాలయాలు వంటి వనరులపై శ్రద్ధ పెడుతున్న క్రమంలో అభ్యసన ఫలితాలు క్రమేపి పడిపోతున్నాయని చెబుతూ విద్యా హక్కు చటాన్ని వసతుల కల్పన కోసం కాకుండా, పాఠశాలలకు వెళ్లే హక్కుగా కాకుండా, నేర్చుకునే హక్కుగా సవరించాలని సూచన చేశారు. 1-8 తరగతి వరకు తరగతి వారీగా సబ్జెక్టుల వారీగా అభ్యసన ఫలితాలను రూపొందించి వాటిని సాధించడానికి నిరంతర సమగ్ర మూల్యాంకనాన్ని అమలు చేసేలా మార్గదర్శకాలను రూపొందించాలని, 2017 ఫిబ్రవరి 20న విద్యా హక్కు చట్టం నియమాలు-2010లోని సెక్షన్ 23 (2) కు సవరణ చేయడం అనేది ముందదుగని ప్రస్తావించారు. దీని ప్రకారం అభ్యసన సూచికలను తయారుచేసి ప్రతి విద్యార్థికి సంబంధించిన రాష్ట్ర స్థాయి మాపన వ్యవస్థ ప్రణాళికను తయారు చేసుకోవాలని తెలిపారు. ఫలితాల గురించి మాట్లాడే డాక్కుమెంట్, అవి రాకపోవడానికి గల కారణాలను సహేతుకంగా పరిశోధించింది లేదు.

విద్యార్థుల సాధనా స్థాయిలను అనుసరించి పాఠశాలల గుర్తింపును కొనసాగించేలా గుజరాత్ రాష్ట్రం విద్యాహక్కు చట్టం నియమాలను రూపొందించి మార్గం చూపెట్టిందని మెచ్చుకోలుగా మాట్లాడారు. అయితే

ఇతర రాష్ట్రాల వనరుల సమకూర్పుపై శ్రద్ధపెట్టే కేంద్ర ప్రభుత్వ విద్యా హక్కు చట్టం నియమాలనే పాటిస్తున్నామని చెప్పారు. విద్యా హక్కు చట్టంలో తెలిపిన వసతులు చాలా వరకు పాఠశాలల్లో కల్పించడం లేదనే వాస్తవాన్ని కప్పిపెట్టి సరిపోను వసతులు కల్పించబడినట్లు చిత్రీకరిస్తున్నారు. మొక్కలకు సరైన పోషకాలు, సరైన సమయాలలో, సరిపోయినన్ని పాళ్లలో అందితే ఆరోగ్యవంతమైన పెరుగుదల ఫలసాయం సాధ్యపడుతుందనేది సహజ సూత్రం. దీనికి భిన్నంగా పోషకాలు అందించడం కాదు, ఫలితాల పైనే కేంద్రీకరించాలని అనడం నేల విడిచి సాము చేయడం అవుతుంది. అంతేకాదు ప్రమాదం కూడా.

విద్యా హక్కు చట్టంలో తెలిపిన వసతులను సమకూర్చడం చాలాకష్టం అని, అవేవి లేకుండానే ఫలితాలు సాధించవచ్చని, అలా సాధిస్తున్నామని, పరీక్షల్లో మంచి ఫలితాలు తెస్తున్నామని, ర్యాంకులు, గ్రేడులు, మార్కులు రాబడుతున్నామనే వాదనలు ముందుకు తెస్తున్నారు. ఈ విషయంలో విద్యా హక్కు చట్టాన్ని ఎత్తివేయాలని లేదా సవరించాలని దేశవ్యాప్తంగా ప్రైవేట్ యాజమాన్యాలు సంఘటితం అవుతున్నాయి. ఈ మధ్యకాలంలో ఈ విషయంపై ఢిల్లీలో నిరసనలు తెలిపారు. కేంద్ర ప్రభుత్వం కూడా ఇదే అభిప్రాయంతో ఉన్నట్లుగా నీతి అయోగ్ విద్యా విధానం అంతటా ప్రతిబింబిస్తున్నది.

ప్రైవేట్ పాఠశాలల్లో పాటించబడుతున్న మార్కులు, ర్యాంకులు, గ్రేడ్ల వెంట ఉరుకులు పరుగులు, విపరీతమైన వత్తిళ్లతో కూడిన చదువులు, ఆటలు, పాటలు తదితర సహ పాఠ్యాంశాలు లేకుండా, సామాజిక స్పృహ, స్పందనలు విలువలు లేకుండా, పరీక్షల్లో ఫలితాల కోసం రుబ్బుడు కార్యక్రమాలు, పరీక్షల పరీక్షలు నిర్వహించడం, ర్యాంకులు/ గ్రేడ్‌లు/మార్కులు తప్ప చదువులకు మరే అర్థం లేదన్నట్లుగా పాఠశాల విద్యా లక్ష్యాలను కుదించేస్తున్న ప్రైవేట్ పాఠశాలల ప్రమాదకర ఆచరణలను ముందుకు తెస్తున్నది నీతి అయోగ్ డాక్యుమెంట్.

సమగ్ర వికాసం కోసం నిర్దేశించబడిన సహ పాఠ్యాంశాల గురించి చర్చనే లేదు. పాఠశాల విద్య వెనుక ఉన్న తాత్వికత, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక ఆధారాలను ప్రస్తావించకుండా, విలువలతో కూడిన మానవ నిర్మాణం జరగడానికి సహకరించే పాఠశాల వ్యవస్థను నిర్మించడం ఎలా అన్నదానికంటే ఫలితాల వైపు మళ్లండి అనే విధానం విద్యా లక్ష్యాలను ఎంత సంకుచితంగా కుదించి వేశారో స్పష్టం అవుతున్నది.

విద్యా హక్కు చట్టం ప్రకారం 1-8 తరగతి వరకు ప్రతి విద్యార్థిని నిరాటంకంగా పై తరగతులకు ప్రమోట్ చేయాలని, దీనివల్ల అకస్మాత్తుగా బోర్డు పరీక్షలను ఎదుర్కోవల్సి రావడంవల్ల పిల్లలు ఒత్తిడికి గురవుతున్నారని, మాస్ చీటింగ్‌కు పాల్పడుతున్నారని వివరించింది డాక్యుమెంట్. ఇక్కడ దాచేసే విషయమేమంటే ప్రతి తరగతిలో నిరంతరం మూల్యాంకనం ఉంటుందన్నది. పిల్లలందరూ తప్పనిసరిగా నిరంతరంగా మూల్యాంకనం చేయబడుతారు. చేయబడాలి కూడా. అలా పిల్లలందరికీ ప్రోగ్రెస్ రిపోర్టులు ఇవ్వబడతాయి. డిటెన్షన్ విధానాన్ని ప్రవేశపెట్టాలనే తలంపుతో ఈ వాదనను ముందుకు తెచ్చింది నీతి అయోగ్ డాక్యుమెంట్.

సరైన బోధనాభ్యాసన ప్రక్రియలతో, ప్రతీ పిల్లవానిపై ప్రత్యేకమైన శ్రద్ధ చూపబడేలా ప్రతి తరగతి మొత్తంగా పాఠశాల వ్యవస్థ తీర్చిదిద్దబడితే, పిల్లలు ప్రతిరోజు బడికి వచ్చేలా సామాజిక, ఆర్థిక స్థితిగతులు మెరుగుపరచబడితే కనీస అభ్యసన ఫలితాలు రాకుండా ఉండడం సాధ్యంకాదు.

తరగతిలో 20కి మించని విద్యార్థులు, కనీసం తరగతికో టీచర్, ఒక గది, తదితర కనీస విద్యా సౌకర్యాలు ఉన్నప్పుడు నిరంతర సమగ్ర మూల్యాంకనం గాని, చక్కని నాణ్యతా ప్రమాణాల విద్య అందించ బడకుండా పోదు. అప్పుడు కూడా అభ్యసనా ఫలితాలు రాలేదంటే కరికులమ్‌నో, బోధనాభ్యసన ప్రక్రియలో, ఉపాధ్యాయ శిక్షణా సంస్థలనో, ఎస్‌సిఇఆర్‌టిలనో, ఎన్‌సిఇఆర్‌టి, సిబిఎస్‌ఇలనో, పర్యవేక్షణా యంత్రాంగాలో వైఫల్యం చెందాయని అనుకోవాలి.

2014-15 సంవత్సరంలో 20 మంది కంటే తక్కువ నమోదైన ప్రభుత్వ పాఠశాలలు ఒక లక్ష ఉన్నాయని, వాటిలో సుమారుగా ప్రతి పాఠశాలలో 12.7 విద్యార్థులు ఉన్నారని, ప్రతి విద్యార్థిపై సంవత్సరానికి 80,000 రూపాయలను ఖర్చు చేస్తున్నారని తెలిపింది. అలాగే 50 మంది కంటే తక్కువ నమోదైన పాఠశాలలు 3.7 లక్షలున్నాయని, వాటిలో సుమారుగా ప్రతి పాఠశాలలో 29 మంది విద్యార్థులు ఉన్నారని, ప్రతి విద్యార్థిపై సంవత్సరానికి 40,800 రూపాయలు ఖర్చవుతన్నాయని చెబుతూ, పిల్లలు తగ్గిపోతూ ఖర్చు పెరుగుతున్నదని చెప్పడం జరిగింది.

ప్రభుత్వ పాఠశాలలను మెరుగుపరిచి ఖర్చును తగ్గించుకోవడానికి గాను ప్రైవేట్ శక్తుల పాత్రను ఉపయోగించుకోవాలనే సూచన చేశారు. ఎడ్యుకేషన్ ఓచర్ అంటే ప్రభుత్వ పాఠశాలలు పెట్టే ఖర్చును అందించి మరెక్కడైనా చదువుకొమ్మని చెప్పడాన్ని ముందుకు తెచ్చారు. స్థానిక ప్రభుత్వాల పాఠశాలల సేవలను కొనడం అంటే ప్రైవేట్ వ్యక్తులను, సంస్థలను ప్రభుత్వ పాఠశాలల్లోకి ఆహ్వానించి వారి సేవలను వినియోగించుకుని తగు మొత్తాన్ని వారికి అందచేసే పద్ధతిని సూచించడం జరిగింది. ప్రభుత్వ ప్రైవేట్ భాగస్వామ్యాన్ని (పిపిపి) ప్రోత్సహించాలని, ప్రభుత్వ పాఠశాలలను ప్రైవేట్ రంగం దత్తత తీసుకోవాలని, దత్తత అంటే ఉచితంగా అని కాదు ప్రతి విద్యార్థికి ఇంత అని లెక్కించి డబ్బును చెల్లించడంగా ఉండే విధానాన్ని ఆలోచించాలనే సూచన చేశారు.

మొత్తం మీద ప్రభుత్వాలకు పాఠశాలలను నడపడం చేతకాదని చెప్పదలుచుకున్నాయి. ఇది ప్రభుత్వాలు తమ చేతులు దులిపేసుకుని ప్రైవేట్ వారికి మరింత గేట్లు తెరవడమన్న మాట. ఇప్పటికే సగానికి పైగా పాఠశాల విద్యార్థులు ప్రైవేట్‌లోకి తోసివేయబడ్డారు. ఇక మిగిలిన వారున్న ప్రభుత్వ పాఠశాలలను కూడా ప్రవేట్ వారికి ఈ రూపంలో అందించబోతున్నారు.

ఒక ప్రాంతంలో ఒకే పాఠశాల, అందులో చాలినన్ని విద్యా వసతులు, సరైన బోధనాభ్యాసన ప్రక్రియలు కొనసాగించినప్పుడు అభ్యసన ఫలితాలు రాకుండా ఉండే పరిస్థితేమి ఉండదు. ఇలా కాకుండా రకరకాల పాఠశాలలను ప్రత్యేకించి ప్రైవేట్ పాఠశాలలను, అందులో కూడా ఎక్కువ డబ్బుపోసే వారికి ఒక చదువు, తక్కువ చెల్లించే వారికి మరో చదువు. ఉన్నోడికి ఒక చదువు, లేనోడికి మరో చదువు అనే అంతరాల దొంతరల పాఠశాల వ్యవస్థలను పెంచి పోషిస్తూ, విద్యా ప్రమాణాల గురించి, అభ్యసన ఫలితాల గురించి తెగ బాధపడిపోతున్నట్లు నటిస్తుంటారు. కామన్ స్కూల్ వ్యవస్థ గురించి ప్రస్థావించకపోవడం అనేది ఈ డాక్యుమెంట్‌లోని లోపం మాత్రమే కాదు పెద్ద మోసం దగా.

ఉన్నత విద్యకు సంబంధించిన సూచనలు కూడా పాఠశాల విద్యా విధానానికి భిన్నంగా ఏమీ లేవు. ప్రపంచ స్థాయి విశ్వవిద్యాలయాలుగా

20 విశ్వవిద్యాలయాలను పేర్కొనాలని, అందులో 10 ప్రభుత్వ, 10 ప్రైవేట్‌వి ఉండాలని సూచించారు. ఈ పదింటిలో కూడా రెండింటికి అత్యధిక నిధులు సమకూర్చాలని, ఈ అన్నింటికి అన్ని విషయాలలో పూర్తి స్థాయి స్వయం ప్రతిపత్తి ఇవ్వాలని, వాటిపై ఎలాంటి నియంత్రణలు ఉండకూడదని సూచించారు.

విశ్వవిద్యాలయాలకు సంబంధించి 3 అంచెల వ్యవస్థను ప్రతిపాదించారు. మొదటి అంచెలోని విశ్వవిద్యాలయాలలో కోర్సులు, కరిక్యులమ్, బోధనా సమయం, బోధనాభ్యసనం, మొదలగు వాటి విషయంలో పూర్తి స్వేచ్ఛను కలిగి ఉంటాయి. వీటికి పరిశోధనా సిబ్బంది విదేశాల నుండి లేదా స్థానిక పరిశోధనా సంస్థల నుండి ఆకర్షించే సేచ్ఛ ఉంటుంది. ఇవి ప్రపంచ స్థాయిలో పోటీ పడతాయని, వీటిలో ప్రపంచ స్థాయి ఉన్నత ప్రమాణాలుంటాయని వీటికి అదనపు వనరులు అందించాలని సూచించారు.

రెండవ అంచెలో ఉండే విశ్వవిద్యాలయాలు ఉద్యోగ ఉపాధి కేంద్రీకృత విద్యను అందిస్తాయి. వీటిపై తక్కువ నియంత్రణ ఉంటుంది. మార్కెట్‌లో ఉద్యోగావకాశాలను అనుసరించి ప్రవేశ విధానాలను, కరికులమ్, కోర్సులను నిర్ణంచుకునే వెసులుబాటు వీటికి ఉంటుంది. వీటిని అవి తమ విద్యార్థులకు కల్పించిన ప్లేస్‌మెంట్స్ ఆధారంగా మాపనం చేయాలని సూచించారు.

మూడవ అంచెలో ఉండే విశ్వవిద్యాలయాలు మొదటి రెండు అంచెల్లోకి రాకుండా మిగిలిపోయి, ఉన్నత విద్యను కావాలనుకునే వారికి అవకాశాలను కల్పిస్తాయి. ఇవి అధిక నియంత్రణలో ఉంటాయని, వీటిలో ప్రస్తుతం పరిశోధనల్లో గాని, ఉద్యోగావకాశాల కల్పనలో గాని వెనుకబడి ఉన్న విశ్వవిద్యాలయాలు ఉంటాయి. ఇవి నిరంతరంగా వెనుకబడిపోతూ ఉంటే వాటిని మూసేయాలనే సూచన చేశారు.

ఉన్నత విద్యకు సంబంధించి వివక్షతలతో కూడిన విధానాన్ని ప్రకటించారు. ఇది రాజీవ్ గాంధీ హయాంలో తీసుకురాబడిన నవోదయ విద్యాలయ వ్యవస్థను గుర్తుకు తెస్తున్నది. అతికొద్ది మందికి ప్రపంచ స్థాయి సౌకర్యాలు, వెసులుబాట్లు అకడమిక్ విషయాలలో యాజమాన్యాలకు పూర్తి స్వేచ్ఛ ఇస్తూ, పెట్టుబడిదారులకు గేట్లు బార్లా తెరిచే పథకాన్ని రచించారు. ఉన్నత పరిశోధనా స్థాయిలని, మార్కెట్ ఉద్యోగావసరాలను తీర్చేవి, వెనుకబడిన ఉన్నత విద్యను కోరుకునే వారికి అందించబడే ప్రమాణాల పరంగా బలహీనంగా ఉండేవనే మూడంచెల విశ్వవిద్యాలయ వ్యవస్థ ఉన్నత విద్యను విడగొట్టి సమాన విద్య కాకుండా అంతరాల దొంతరలున్న విధానాన్ని సాధికారికంగానే నడిపే అసమాన వ్యవస్థను బలపరుస్తూ నీతి అయోగ్ డాక్యుమెంట్ సూచనలను చేసింది. ఈ వ్యవస్థలో పై నుండి కిందికి వెళ్లే కోద్దీ ఎక్కువ నియంత్రణ తక్కువ నిధులు అనే తప్పుడు విధానాన్ని ప్రతిపాదించారు.

కొన్ని ఉన్నత స్థాయి యూనివర్సిటీలలో గరిష్ట స్థాయి స్వయం ప్రతిపత్తిని, స్వయం పాలనను పూర్తిస్థాయి స్వేచ్ఛను ప్రతిపాదిస్తూ బలమైన సూచనలను చేసింది నీతి అయోగ్. యుజిసి నియంత్రణ అధికారాన్ని బలంగా వ్యతిరేకిస్తున్నది. దేశవ్యాప్తంగా అన్ని ప్రాంతాలలో ఉన్నత విద్యను నాణ్యమైన ప్రమాణాలతో, గుణాత్మకమైనదిగా అందరికి అందుబాటులో ఉండేలా అందించాలని నీతి అయోగ్ ప్రతిపాదించలేదు. బాగా వెనుకబడి ఉన్న యూనివర్సిటీలకు అధిక నిధులిచ్చి అన్ని రకాలుగా మెరుగైన స్థాయిలోకి తేవడానికి బోధనా సిబ్బంది నియామకాలను చేపట్టి, మౌలిక వసతులను వెంట వెంటనే కల్పిస్తూ వాటిని ప్రమాణాలతో నడిచేవిగా చేయాలని ఎక్కడా కూడా ప్రస్తావించలేదు. కాని వెనుకబడుతున్న వాటిని మూసేయాలని మాత్రం చెప్పారు. రోగగ్రస్థం చేయబడిన వాటిని రోగ విముక్తులను చేయడానికి బదులు వృథాగా భావించి చంపేసే ప్రతిపాదనలు చేయబడ్డాయి.

ఉన్నత విద్యను సమాజంలోని కింది పొరల్లో ఉన్న అశేష ప్రజల బిడ్డలకు అందించడానికి ప్రమాణాలున్న విద్యను ఎలా అందించాలో చర్చించనే లేదు. గత రెండు దశాబ్దాలకు పైగా యూనివర్సిటీలకు గ్రాంట్స్‌ను సక్రమంగా అందించకుండా, సిబ్బందిని నియమించకుండా, సెల్ఫ్ ఫైనాన్స్‌డ్ కోర్సులను ప్రవేశపెడుతూ మరోవైపు ప్రైవేట్ యూనివర్సిటీలకు గేట్లు బార్లా తెరుస్తూ వస్తున్నాయి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు. ఉన్నత విద్య దాదాపుగా ప్రైవేట్ సంస్థల చేతుల్లోకి వెళ్లిపోయింది. బజారులో వ్యాపార సరుకుగా మారింది. ప్రైవేట్ యూనివర్సిటీలు ఇబ్బడిముబ్బడిగా చాలావరకు ఏ ప్రమాణాలు పాటించకుండానే స్థాపించబడుతున్నాయి. ఉన్నత విద్య పట్టాలను అందిస్తూనే ఉన్నాయి.

పాఠశాలలు, కళాశాలల నుండి నేడు విశ్వవిద్యాలయాలు ప్రైవేట్ రంగంలోకి వెళ్లి సాధారణ ప్రజానీకానికి విద్య అందనిదిగా తయారైనది. అతి కష్టం మీద అందినా నాసిరకం చదువులు అందేలా నీతి అయోగ్ సూచనలు ప్రతిబింబిస్తున్నాయి.

దేశవ్యాప్తంగా ప్రతి జిల్లాలో ఆయా సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక, భౌగోళిక పరిస్థితులకు అనుగుణంగా జాతీయ అంతర్జాతీయ స్థాయి, ప్రమాణాలతో కూడిన యునివర్సిటీలను ప్రతిపాదించలేదు నీతి అయోగ్ డాక్యుమెంట్. ప్రభుత్వ పరంగానే విద్య అందించబడాలనే సూచనలు చేయలేదు. ఓ వైపు ప్రజాస్వామికవాదులు దేశ వ్యాప్తంగా కెజి నుంచి పిజి వరకు ప్రభుత్వమే ప్రమాణాలున్న విద్యను అందించాలని, విద్యా వ్యాపారీకరణను, కార్పొరేటీకరణను రద్దు చేయాలని, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు బడ్జెట్‌లో 10 శాతం, 20 శాతం నిధులు కేటాయించాలని డిమాండ్ చేస్తున్న విషయాన్ని ఈ డాక్యుమెంట్ పట్టించుకోలేదు.

విద్య అనేది ఎప్పుడు కూడా వ్యాపార సరుకుగా మారకూడదని, అది ప్రభుత్వాల తప్పనిసరైన బాధ్యతేనని నీతి అయోగ్ అనుకోవడం లేదు. ఈ ప్రతిపాదనలన్నీ కూడా కొందరికే మంచి విద్య, ఎందరికో నాసిరకం లేదా అసలే లేకుండా చేసేలా ఉన్నాయి. గత మూడు నాలుగు దశాబ్దాలుగా అంతర్జాతీయ ద్రవ్య నిధి సంస్థ, వరల్డ్ బ్యాంక్, అంతర్జాతీయ ఒప్పందం గ్యాట్స్ వాటి వెనుక ఉన్న విద్యను మార్కెట్ వస్తువుగా చూసే ప్రపంచ పెట్టుబడిదారీ శక్తుల ఆలోచనలకు అనుగుణంగానే ఈ ప్రతిపాదనలున్నాయి.

నీతి అయోగ్ ముందుకు తెచ్చిన విద్యా విధానం ప్రజా వ్యతిరేకమైనది. తిరోగమనాన్ని తలకెక్కించుకుని అత్యధిక ప్రజానీకానికి విద్యను అందకుండా చేస్తూ ఒకవేళ అందినా నాసిరకం చదువులను అందించే ప్రమాదకర ప్రతిపాదనలతో ముందుకొచ్చిన నీతి అయోగ్ విద్యా విధానాన్ని తప్పికొట్టాల్సిన చారిత్రక అవసరము మనముందున్నది. దేశ ప్రజలందరికీ ఉన్నత ప్రమాణాలతో కూడుకున్న అలాగే ఉద్యోగ, ఉపాధి గ్యారంటీ చేసే విద్యా విధానాన్ని అమలు చేయించే దిశలో ప్రజా ఉద్యమాలు రావాల్సి ఉన్నది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# ఐదు రాష్ట్రాల్లో ఎన్నికలు

*ఎన్నికలు జరుగనున్న ఐదు రాష్ట్రాల్లో గత ప్రభుత్వాలు ఎన్నికల్లో ఇచ్చిన హామీలు అమలు తీరు ఎలా ఉందో వివరిస్తున్నారు*

**వై. రామచంద్రం**

ఐదు రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికలను నాలుగు దశల్లో జరపడానికి కేంద్ర ఎన్నికల సంఘం అక్టోబర్ 6న ఎన్నికల షెడ్యూల్‌ను విడుదల చేసింది. కేంద్ర ఎన్నికల కమిషన్ షెడ్యూల్ ప్రకారం అసెంబ్లీ ఎన్నికలు మధ్యప్రదేశ్, మిజోరాం నవంబర్ 28న, రాజస్థాన్, తెలంగాణల్లో డిసెంబర్ 7న జరగనున్నాయి. ఛత్తీస్‌గఢ్‌లో రెండు దశల్లో నవంబర్ 12, 20 తేదీల్లో ఎన్నికలు నిర్వహిస్తారు. ఈ ఐదు రాష్ట్రాల ఓట్ల లెక్కింపు, ఎన్నికల ఫలితాలు డిసెంబర్ 11న వెల్లడవుతాయని ఎన్నికల కమిషనర్ తెలిపారు. ఎన్నికలు ప్రకటించిన నాలుగు రాష్ట్రాల్లో పాలన గడువు జనవరి 20 లోపు ముగుస్తుండగా, తెలంగాణ ప్రభుత్వం మాత్రం గడువుకు ముందే అసెంబ్లీని రద్దుచేసి ఎన్నికలకు వెళుతున్నది.

**మిజోరాం**

1972లో మిజోరాం 23వ రాష్ట్రంగా ఏర్పడింది. 40 అసెంబ్లీ స్థానాలున్న మిజోరాం జనాభా 2011 లెక్కల ప్రకారం10,91,014, అందులో పురుషులు 5,52,339; స్త్రీలు 5,38,675. మిజోరాం మొత్తం ఓటర్ల సంఖ్య 7.68 లక్షలు. ఇక్కడ గత పది సంవత్సరాలుగా కాంగ్రెస్ పార్టీ అధికారంలో ఉంది. ఇక్కడ ఇతర పార్టీలున్నప్పటికీ ప్రధాన పోటీ కాంగ్రెస్, మిజోరాం నేషనల్ ఫ్రంట్ మధ్యే ఉంది. 1993 నుంచి ఇక్కడ బిజెపి పోటీ చేస్తున్నప్పటికి ఇప్పటివరకు ఒక్క స్థానాన్ని కూడా గెలువలేదు. మిజోరాంలో స్థానిక సమస్యలు మయన్మార్, బంగ్లాదేశ్, నేపాల్‌ల నుంచి అక్రమ వలసలు, పేదరికం, నిరుద్యోగం., 1997లో మిజోలకు, బ్రూలకు మధ్య ఘర్షణలు జరిగి బ్రూలు ఇతర రాష్ట్రాలకు వెళ్లారు. ఉత్తర త్రిపురలోని శిబిరాల్లో 32 వేల మంది బ్రూలు తలదాచుకుంటున్నారు. కాంగ్రెస్ పార్టీ అధికారంలో ఉన్న ఏకైక రాష్ట్రం మిజోరాం. 10 సంవత్సరాల్లో చేసిన అవినీతి ప్రధానంగా కాంగ్రెస్‌ను వెంటాడుతోంది. ఇక్కడ మొత్తం జనాభాలో క్రైస్తవ జనాభా 87 శాతం ఉంది. ఇక్కడ బిజెపి స్థానిక పార్టీల మద్ధతుతో, ప్రజలను రకరకాల పేర్లతో విభజించి స్థానం సంపాదించుకోవాలని ప్రయత్నిస్తోంది.

**మధ్యప్రదేశ్**

మధ్యప్రదేశ్‌లో మొత్తం 230 అసెంబ్లీ స్థానాలున్నాయి. మొత్తం జనాభా 7,25,98,000. ఓటర్లు 5,03,34,260 మంది ఉన్నారు. ఇక్కడ గత 15 సంవత్సరాలుగా బిజెపి అధికారంలో ఉంది. బిజెపి పాలన పట్ల ప్రజలు తీవ్ర వ్యతిరేకతతో ఉన్నారు. సిట్టింగ్ ఎంఎల్‌ఎల్లో సగం మందికే బిజెపి టికెట్ దక్కే అవకాశం ఉంది. ఈసారి కొత్తవారిని పోటీలో నిలబెట్టే అవకాశాలు ఉన్నాయి. ప్రభుత్వ పథకాలు ప్రజలకు చేరే క్రమంలో పెద్దమొత్తంతో అవినీతి జరిగింది. అట్లాగే ప్రభుత్వం అవాస్ యోజన కింద కట్టించిన గృహాల్లో ఉండడం కంటే తమ పాత మట్టి ఇంట్లో ఉండడమే మేలని అక్కడి ప్రజలు అంటున్న పరిస్థితి ఉంది. నిరుద్యోగుల నుంచి వసూలు చేసిన వందల కోట్ల రూపాయల వ్యాపం కుంభకోణం బిజెపిని ఇంకా వెంటాడుతూనే ఉంది. ఈ కేసుకు సబంధించి ఇంకా 50 మందిపై విచారణ కొనసాగుతోంది. ఈ స్కాంతో సంబంధం ఉన్న 40 మందికి పైగా అనేక కారణాలతో చనిపోయారు. కొందరి మరణం మిస్టరీగా మారింది. వ్యాపం కుంభకోణం ఈ సందర్భంగా బయటికి రాకుండా బిజెపి సర్వశక్తులు ఒడ్డుతోంది. ఈ కుంభకోణం గురించి కాంగ్రెస్ పార్టీ నాయకులు మాట్లాడిన కొద్దిరోజులకే కాంగ్రెస్‌కు చెందిన ముగ్గురు నాయకులకు కోర్టు నోటీసులు పంపింది.

**రాజస్థాన్**

రాజస్థాన్‌లో 200 అసెంబ్లీ స్థానాలున్నాయి. మొత్తం జనాభా 6,85,48,437. అందులో ఓటర్ల సంఖ్య 4,74,79,402. రాజస్థాన్ 40 ఏళ్ల రాజకీయ చరిత్రలో 1985 నుంచి 2013 వరకు జరిగిన ఎన్నికల్లో ప్రతిసారి అధికారంలో ఉన్న పార్టీని మార్చి వేరే పార్టీకి అవకాశం కల్పిస్తున్న పరిస్థితి ఉంది. ఇప్పటి పరిస్థితైతే అధికారంలో ఉన్న బిజెపి పట్ల ప్రజల్లో తీవ్ర వ్యతిరేకత ఉందనే విషయాన్ని ప్రజాభిప్రాయ సర్వేలు వెల్లడిస్తున్నాయి. బిజెపి ప్రభుత్వం తమ ఐదేండ్ల పదవీ కాలంలో రైతుల గురించి పట్టించుకోలేదు. కాని ఎన్నికల షెడ్యూల్ ప్రకటనను రెండున్నర గంటలు ఆపించి తాము తిరిగి అధికారంలోకి వస్తే రైతులకు ఉచిత విద్యుత్ ఇస్తామని ప్రకటించింది. ఎలాగయినా అధికారంలోకి రావాలనే ప్రయత్నంలో భాగంగా ప్రస్తుతం ఉన్న 163 ఎంఎల్‌ఎలలో సగం స్థానాలకు పైగా కొత్తవారిని నిలబెట్టే ప్రయత్నం చేస్తున్నది.

**తెలంగాణ**

పోరాడి సాధించుకున్న తెలంగాణ రాష్ట్రంలో ఎన్నికలు జరగడం ఇది రెండవసారి. 2011 జనాభా లెక్కల ప్రకారం మొత్తం జనాభా 3.50 కోట్లు. 2014లో తెలంగాణ ఏర్పడగానే జరిగిన ఎన్నికల్లో మొత్తం 119 స్థానాలకుగాను 63 స్థానాల్లో తెలంగాణ రాష్ట్ర సమితి (టి.ఆర్.ఎస్.) నెగ్గి ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. ఎన్నో ఏళ్ల నిరీక్షణ, పోరాటాల ఫలితంగా ఏర్పడిన తెలంగాణలో టిఆర్ఎస్ పార్టీ ప్రజల ఆకాంక్షలను ఏమేరకు నెరవేర్చిందో ఒకసారి పరిశీలించాలి.

ఈ నాలుగేళ్ల కాలంలో ప్రభుత్వం ఎన్నికల ముందు ఇచ్చిన హామీల తీరు చూస్తే 24 గంటల కరెంట్, వృద్ధాప్య పింఛన్లు, కళ్యాణ లక్ష్మి, షాదీ ముబారక్ పథకాలు అమలయ్యాయి. మిగిలిన పథకాలు కొన్ని మధ్యలో ఉన్నా, కొన్ని పథకాలు అమలవుతున్న తీరు నామ మాత్రంగానే ఉన్నది. ఇక భూమిలేని దళితులకు మూడెకరాల భూమి, డబుల్ బెడ్‌రూమ్ ఇల్లు నమూనాగా అమలయ్యాయి. మిషన్ భగీరథ పథకం అవసరం లేనిచోట కూడా ఇచ్చి కోట్ల ప్రజా ధనాన్ని వృథా చేస్తున్నారు.

మిషన్ కాకతీయ పథకం సాగుతూనే ఉంది. నిరుద్యోగ సమస్య నిరుద్యోగులను వెంటాడుతూనే ఉంది. ఉద్యమాల ద్వారా సాధించుకున్న తెలంగాణలో ఉద్యమ ఆకాంక్షలు నెరవేరకపోగా ప్రశ్నించడాన్ని కూడా ఈ ప్రభుత్వం సహించలేక ప్రజాస్వామిక గొంతులను నొక్కివేస్తోంది. తెలంగాణ ఉద్యమంలో ప్రజలపై తీవ్ర నిర్బంధాన్ని అమలుపరచడంలో భాగస్తులైన, విద్యార్థుల ఆత్మహత్యలకు కారకులైన ఇతర పార్టీల నేతలను అధికారం, డబ్బు ఆశచూపి టిఆర్ఎస్ పార్టీలో చేర్చుకుంది. పార్టీలు వేరయినా తామంతా ఒక్కటే అనే విషయాన్ని మరోసారి తెలిపింది.

ప్రభుత్వం ఎన్నికలనే కేంద్రంగా చేసుకొని తెచ్చిన రైతు బంధు పథకం అసలు ఉద్దేశం సాగుచేసే రైతులకు పెట్టుబడి సహాయం కింద ఉపయోగపడాలని. కాని అమలుతీరు మాత్రం వ్యవసాయం చేయకపోయినా వందల ఎకరాల పట్టా భూములు ఉండి అవి బీడుగా ఉన్నా సాగుచేయకుండానే లక్షల రూపాయలు అందుతున్నాయి. అదే చిన్న సన్నకారు రైతులు కౌలుకు చేస్తున్న భూములకు పెట్టుబడి సహాయం అందడంలేదు. భూమిలేని వారిని ఈ ప్రభుత్వం మనుషులు గానే చూడడంలేదు. ఈ పథకానికి ఒక పరిమితంటూ లేదు.

గడువు ముగియకముందే టి.ఆర్.ఎస్. పార్టీ ఎన్నికలకు రావడం వెనుక ప్రజల్లో ప్రభుత్వం పట్ల పెరుగుతున్న వ్యతిరేకత ఒకటయితే, రానున్న సార్వత్రిక ఎన్నికల్లో బిజెపితో పొత్తు పెట్టుకుంటే ముస్లిం ప్రజల ఓట్లు రావనేది మరో కారణం. ఇంకో కారణం పార్లమెంట్‌కు, అసెంబ్లీకి ఒకేసారి ఎన్నికలు జరిగితే జాతీయ పార్టీలైన కాంగ్రెస్, బిజెపి ప్రభావంలో ప్రజలు అటువైపే మొగ్గే అవకాశం ఉందని కావచ్చు. పోరాడి సాధించుకున్న తెలంగాణలో ప్రజల ఆకాంక్షలు నెరవేరలేదు. వాటిని సాధించుకోవాల్సి ఉంది. టిఆర్ఎస్ పాలన పట్ల ప్రజలు సంతృప్తిని వ్యక్తం చేస్తున్నది లేదు.

**ఛత్తీస్‌గఢ్**

మధ్యప్రదేశ్ నుంచి విడిపోయిన ఛత్తీస్‌గఢ్ రాష్ట్రంలో 90 అసెంబ్లీ స్థానాలున్నాయి. రాష్ట్ర జనాభా 2,55,45,198. ఓటర్ల సంఖ్య 1.85,45,819. ఛత్తీస్‌గఢ్‌లో గత 15 సంవత్సరాలుగా బిజెపి పాలన కొనసాగుతోంది. కాంగ్రెస్ నుంచి బహిష్కరింపబడ్డ అజిత్‌జోగి బిఎస్‌పితో పొత్తుపెట్టుకోవడంతో కాంగ్రెస్ గెలుపు కష్టంగానే భావిస్తోంది. ఇక్కడి పరిస్థితిని గమనిస్తే కర్ణాటకలో ఏర్పడిన పరిస్థితే ఇక్కడ కూడా ఏర్పడవచ్చుననే అభిప్రాయం ఉంది. దేశ ప్రజలకు చెందాల్సిన ఖనిజ సంపదను పాలకులు విదేశీ బహుళజాతి సంస్థలకు, స్థానిక బడాపెట్టుబడిదారీ సంస్థలకు కట్టబెడుతున్నారు. ఆదివాసి ప్రాంతాల్లోని ప్రజల్ని నిర్వాసితుల్ని చేసి అక్కడి సంపదను దోచుకోవడానికి పాలకులు సహకరిస్తున్నారు. తమ కాళ్లకింది నేల కదిలిపోతుంటే జీవన్మరణ సమస్యను ఎదుర్కొంటున్న ఆదివాసి ప్రజలు కార్పొరేట్ సంస్థలను అడ్డుకునే ప్రయత్నం చేయడంతో పాలకులు వారిపై నిత్యం పోలీసు దాడులకు, అక్కడి స్త్రీలపై అత్యాచారాలకు ఒడిగడుతున్నది. దీన్ని వ్యతిరేకిస్తూ ఉద్యమిస్తున్న ఆదివాసుల్ని నిత్యం వేటాడి చంపుతోంది.

రాజకీయ పార్టీలు తాము అధికారంలోకి వస్తే ప్రజలకు ఏం చేస్తాయో, అట్లాగే అధికారంలో ఉండి ఏమి చేశాయో చెప్పకుండా ప్రత్యర్థి పార్టీలలోని వ్యక్తులను వ్యక్తిగతంగా విమర్శించడం చేస్తున్నాయి. ఎన్నికల్లో గెలువడానికి అధికారంలో ఉన్న పార్టీలు తమ అధికారాన్ని అడ్డంపెట్టుకొని ఇతర పార్టీలను బెదిరించడానికి వాటిపై ఆదాయపన్ను శాఖతో, ఇతర శాఖలతో దాడులు చేయించడం సాధారణమయింది.

ఎన్నికలు జరుగుతున్న ఐదు రాష్ట్రాల్లో కూడా ప్రభుత్వ విధానాల పట్ల ప్రజల్లో తరతమ స్థాయిల్లో వ్యతిరేకత ఉంది. రాజస్థాన్‌లో ప్రభుత్వాన్నే మార్చేంత వ్యతిరేకత ఉంది. అట్లాగే అవినీతి గురించి మాట్లాడిన బిజెపి తాము అధికారంలోకి వస్తే నీతివంతమైన పాలన అందిస్తామని చెప్పింది. అధికారంలోకి వచ్చిన బిజెపి పాలిత రాష్ట్రాల్లో తీవ్రమైన అవినీతిలో కూరుకుపోయింది.

ఈ ఎన్నికలు జరుగుతున్న సమయంలో దేశంలో ఉన్న పరిస్థితి పరిశీలిస్తే చమురు ధరలు అకాశాన్నంటి నిత్యావసర సరుకుల ధరలు పెరిగాయి. దీంతో అట్టడుగు ప్రజలు కొనుగోలు శక్తిలేక వారి జీవితాల్లో సంక్షోభం నెలకొంది. దళితుల ఆహారపు అలవాట్లపై ఆంక్షలు, ఆవు మాంసం తిన్నారని, పశువులను కబేళాలకు తరలిస్తున్నారనే ఆరోపణతో గోరక్షకులు దేశ వ్యాప్తంగా ముస్లింలపై, దళితులపై మూక దాడులు చేస్తూ చంపుతున్న పరిస్థితి. రైతాంగం పండించిన పంటకు గిట్టుబాటు ధరలు లేక అప్పుల్లో కూరుకుపోయి ఆత్మహత్యలు చేసుకుంటున్న పరిస్థితి ఉంది. గిట్టుబాటు ధరల కోసం వేల మంది రైతులు, కూలీలు దేశ వ్యాప్తంగా నిరసనలు వ్యక్తంచేస్తున్నారు. కులం పేరుతో జరుగుతున్న హత్యలు. మహిళలపై పెరిగిపోతున్న అత్యాచారాలు, హత్యలు, పాలకుల అండతో దేశ సంపదను కొల్లగొడుతున్న కార్పొరేట్ సంస్థల నుంచి వనరులను కాపాడుతున్న ఆదివాసులపై నిత్యం దాడులు. ప్రజల పక్షాన గొంతు విప్పుతున్న ప్రజాస్వామిక వాదుల్ని జైళ్లలో నిర్బంధించి ప్రశ్నించే హక్కు లేకుండా చేస్తున్నారు. పెద్దనోట్ల రద్దు వల్ల ప్రధానంగా నిర్మాణ రంగం కుదేలయి లక్షల మంది కార్మికులు ఉపాధి కోల్పోయారు. వస్తు సేవల పన్ను వల్ల వ్యాపార రంగం కుదేలయింది. దేశ ప్రజలను పురోగమనం వైపు నడిపించాల్సిన విశ్వవిద్యాలయాలను ప్రభుత్వం ఆర్ఎస్ఎస్ శక్తులతో నింపి ఆధ్యాత్మిక కేంద్రాలుగా మార్చి తిరోగమనం వైపు నడిపిస్తోంది. ఇవి నేడు దేశప్రజల్ని చుట్టుముట్టిన ప్రధాన సమస్యలు.

పాలకులు ప్రజలను మౌలిక సమస్యల నుండి మళ్లించి ప్రవేశ పెడుతున్న పథకాలను పరిశీలిస్తే ఈ దేశంలో ఎంత పేదరికం ఉందో అర్థమవుతుంది. తాత్కాలిక ఉపశమనాన్నిచ్చే పథకాల కోసం కూడా ప్రజలు పోటీపడుతున్న దీనస్థితి ఉంది. ప్రజల్లో ఉన్న ఆచార సంప్రదాయాలను, వెనుకబాటుతనాన్ని ఆసరా చేసుకొని వారిని భ్రమల్లో ఉంచి పాలకులు అధికారంలోకి రావాలని ప్రయత్నం చేస్తున్నారు.

కేంద్ర, రాష్ట్రాల్లో పార్టీలు మారుతున్నాయి గాని విధానాల్లో మార్పు లేదు. పాలకులంతా సంపన్న దేశాల నిబంధనల మేరకు, ప్రపంచ బ్యాంకు ఆదేశాల మేరకు, స్థానిక కార్పొరేట్ సంస్థల ప్రయోజనాలను నెరవేర్చే లక్ష్యమే ప్రధాన కేంద్రంగా చేసుకొని పనిచేస్తున్నారు. ప్రస్తుతం దేశ రక్షణ రంగంలోని రాఫెల్ యుద్ధవిమానాల కొనుగోలులో జరిగిన కుంభకోణం బయటికి రాకుండా చేయడానికి ప్రభుత్వం సి.బి.ఐ. అధికారులను రాత్రికి రాత్రే మార్చివేసింది.

పాలక పార్టీలు అన్నీ పోటీపడి సంక్షేమ పథకాలను ప్రకటిస్తున్నాయి. దీని అర్థం దేశ విభజన జరిగి ఇప్పటికి 70 ఏండ్లు గడిచినా అట్టడుగు ప్రజల జీవితాల్లో మౌలికమైన మార్పురాలేదనే వాస్తవాన్ని ప్రభుత్వం ప్రకటిస్తున్న పథకాలే తెలియజేస్తున్నాయి. అదే సమయంలో కొద్ది మంది సంపన్నులు ప్రపంచంలోని ధనవంతులతో పోటీ పడుతున్న పరిస్థితి ఇక్కడే ఉంది. ప్రజల జీవితాల్లో మౌలికమైన మార్పు రావాలంటే ఆ మార్పుకు తగిన పరిష్కారాన్ని ప్రజలే ఎంచుకోవాలనే విషయాన్ని పాలకుల పాలనతీరే చెపుతోంది.

*(రచయిత వీక్షణం సహాయ సంపాదకులు)* వీ

# వ్యవసాయ సంక్షోభం - రైతాంగ ఉద్యమాల వెల్లువ

***వ్యవసాయరంగాన్ని నిర్లక్ష్యం చేస్తూ, రైతుల పట్ల వివక్షతో వారి ఆత్మహత్యలకు కారణమవుతున్న కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను దారికి తెచ్చుకోవడానికి మున్ముందు రైతాంగం పెద్దఎత్తున ఉద్యమాలు చేపట్టవలసిందేనని అంటున్నారు ఎస్. ఆశాలత***

భారతదేశంలో 60 శాతానికి పైగా జనాభా ఆధారపడి బతుకుతున్న ప్రాథమిక రంగం నేడు క్రుంగి కునారిల్లుతోంది. వ్యవసాయం చేయడానికి రైతులకు సాయం లేకుండా పోయింది. అత్యధికశాతం రైతులకు సాగుచేసుకోవడానికి సరిపడినంత భూమి లేకా, అరకొరగా ఉన్న స్వంత భూమి లేక కౌలు భూమిలో విపరీతమైన పెట్టుబడులు పెట్టి ప్రకృతి వైపరీత్యాల వల్ల పంటలు సరిగ్గా పండకా, పండిన పంటకు కూడా గిట్టుబాటు ధర లభించక గత 20 ఏళ్లుగా దేశంలో రైతులు తీవ్రంగా అప్పుల పాలవుతున్నారు, మూడు లక్షల 20 వేల మంది రైతులు ఆత్మహత్య చేసుకున్నారు. ఈ సంక్షోభం అంతా పేరుకుపోయి ప్రెజర్ కుక్కర్ పేలినట్లు బద్దలయింది. వేలాది మంది రైతులు వివిధ రాష్ట్రాలలో రోడ్డు మీదకొచ్చి ఆందోళనలకు దిగుతున్నారు.

అంతకుముందు అసంఘటితంగా ఉన్న రైతాంగం ఎక్కడికక్కడ సంఘటితపడి రకరకాల పద్ధతులలో నిరసన తెలియచేస్తున్నారు. రాజకీయ పార్టీలకు చెందిన రైతు సంఘాల సభ్యులే గాక స్వతంత్ర రైతు సంఘాలు కూడా సమాఖ్యలుగా కూటములుగా ఏర్పడి ఉద్యమిస్తున్నారు. మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, తమిళనాడు, ఉత్తరప్రదేశ్, పంజాబ్, తెలంగాణ రాష్ట్రాలలో జరిగిన జరుగుతున్న రైతు ఉద్యమాలలో ఒక ఉమ్మడి ధోరణి, ఉమ్మడి డిమాండ్లు ముందుకొస్తున్నాయి.

2017 జూన్ 1న మహారాష్ట్ర వ్యాప్తంగా రైతులు కిసాన్ క్రాంతి మోర్చా అధ్వర్యంలో రైతుల సమ్మెను ప్రకటించారు. అంతకుముందు ముఖ్యమంత్రి దేవేంద్ర ఫడ్నవీస్‌తో జరిగిన చర్చలు విఫలమవడంతో జూన్ 1 నుండి రైతులు పూణె, ముంబాయి నగరాలకు పాలు, కూరగాయలు, పండ్లు మొదలైన నిత్యావసర ఆహార పదార్థాలను పంపడం ఆపేసి సమ్మె శంఖారావం పూరించారు. అనేక రూపాలుగా సాగిన నిరసనలో హోల్‌సేల్ మార్కెట్లను మూసివేశారు, పాలు, కూరగాయలు నగరాలకు తీసుకెళ్లకుండా హైవేల మీద ట్రక్కులను అడ్డుకున్నారు. పాలు, కూరగాయలు రోడ్ల మీద కుమ్మరించారు, కొన్నిచోట్ల పేదలకు పంచి పెట్టారు. సంపూర్ణ రుణమాఫీ, ఉచిత విద్యుత్తు, పంటలకు గిట్టుబాటు ధరలు, పాల ధర పెంపుదల, స్వామినాథన్ కమిషన్ చేసిన సిఫార్సుల అమలు అనేవి వీరి డిమాండ్లు.

సరిగ్గా అదే సమయంలో మధ్యప్రదేశ్‌లో కూడా రైతులు పెద్ద ఎత్తున ఆందోళనకు దిగారు. నిరసన ఊరేగింపులు, ధర్నాలు చేశారు. వాళ్లు కూడా రుణమాఫీ, గిట్టుబాటు ధరలు, సాగునీటి గ్రాంట్లు, పంట నష్టానికి బీమా చెల్లింపు అనే డిమాండ్లను ప్రభుత్వం ముందుంచారు. వారం రోజుల పాటు వేలాది మంది రైతులు నిరసన ప్రదర్శనలు చేసినప్పటికీ ప్రభుత్వం పట్టించుకోలేదు. పైగా ఉక్కుపాదాన్ని మోపింది. రైతుల ఆందోళన చేయిదాటి పోయిందనే సాకుతో మందసార్‌లో పోలీసులు జూన్ 7న జరిపిన కాల్పులలో ఆరుగురు రైతులు చనిపోయారు, పది మంది తీవ్రంగా గాయపడ్డారు.

దేశంలోని రెండు అతిపెద్ద రాష్ట్రాలైన మహారాష్ట్ర, మధ్యప్రదేశ్‌లలో ఈ రైతాంగ ఆందోళనలు జరగడం యాదృచ్ఛికం కాదు. ఈ రెండు రాష్ట్రాలలోనూ బిజెపి అధికారంలో ఉన్నదనే విషయాన్ని కూడా ఇక్కడ గమనించాలి. ఈ రైతాంగ ఉద్యమాలు ఇతర ప్రాంతాలలో రైతులకు కొంత ఉత్తేజాన్నిచ్చి పోరాటం వైపు నడిపించాయి.

ఇక తమిళనాడులో 2016లో 60 శాతం లోటు వర్షపాతం వల్ల కరువు ఏర్పడింది. ఇది 140 సంవత్సరాల తర్వాత ఏర్పడిన అతి తీవ్రమైన కరువు. పంటలు పండక పెద్ద ఎత్తున రైతులు ఆత్మహత్య చేసుకున్నారు. తమిళనాడు రైతులు 40 వేల కోట్ల రూపాయల కరువు సహాయ ప్యాకేజ్‌ని ప్రకటించాలని, వ్యవసాయ రుణాలను మాఫీ చేయాలని, వ్యక్తిగత రైతులకు గిట్టుబాటు ధరలు ప్రకటించాలని, కావేరీ నది నిర్వహణ బోర్డును ఏర్పాటు చేయాలని డిమాండ్ చేస్తూ 2017 జులై నుండి ఢిల్లీ లోని జంతర్ మంతర్ దగ్గర నిరవధిక ధర్నాకు దిగారు. తమ నిరసనను తెలియచేయడానికి రకరకాల రూపాలలో ప్రదర్శనలు జరిపారు. ఆత్మహత్య చేసుకున్న రైతుల పుర్రెలను ప్రదర్శించారు. నగ్న ప్రదర్శన చేశారు. గడ్డితిన్నారు. రెండు నెలలు గడుస్తున్నా కేంద్ర ప్రభుత్వం పట్టించుకోకపోవడంతో చివరికి మనుషుల మలం తిన్నారు. మనిషి మాంసం తింటామని ప్రకటించారు. వారి నిరసన జులై నుంచి నవంబర్ దాగా నెలల తరబడి సాగింది.

ఈ ఆందోళనల నేపథ్యంలో రైతాంగ ఉద్యమాన్ని మరింత సంఘటితంగా ముందుకు తీసుకెళ్లడానికి జూన్ 2017 లోనే దాదాపు దేశంలోని దాదాపు 200 రైతు సంఘాలు ఒక్కతాటి మీదకు వచ్చి అఖిల భారత రైతు పోరాట సమన్వయ కమిటీగా ఏర్పడ్డాయి. సాగుదారులు, తోటల పెంపకదారులు, మత్స్యకారులు, పాడి రైతులు, కౌలు రైతులు, దళిత, ఆదివాసీ, మహిళా రైతులు, వ్యవసాయ కూలీలు గౌరవప్రదమైన జీవనోపాదులతో సుస్థిరమైన జీవన విధానం గడపడం కోసం పని చేయాలని ఈ కమిటీ నిర్ణయించింది. రెండు నెలల పాటు అన్ని రాష్ట్రాలలో రైతాంగ సమస్యలపై కలిసి వచ్చే అన్ని రైతు సంఘాలను కలుపుకుని చర్చలు నిర్వహించారు.

ఆ చర్చలలో సంపూర్ణ రుణమాఫీ, పంటలకు లాభకరమైన ధరలు అనే రెండు ప్రధాన డిమాండ్లు అందరికీ ఆమోద యోగ్యమైనవిగా ముందుకొచ్చాయి. ఆ డిమాండ్ల ఆధారంగా ఈ కమిటీ రెండు బిల్లుల ముసాయిదాలను కూడా రూపొందించింది. 2017 సెప్టెంబర్, అక్టోబర్ నెలలలో అన్ని రాష్ట్రాలలో కిసాన్ ముక్తి యాత్రలు నిర్వహించి అఖిల భారత రైతు పోరాట సమన్వయ కమిటీ ఆధ్వర్యంలో ఢిల్లీలో పార్లమెంట్ స్ట్రీట్‌లో కిసాన్ పార్లమెంట్ నిర్వహించారు. దేశంలో మొట్టమొదటసారి అంత పెద్దసంఖ్యలో రైతు సంఘాలు చేతులు కలిపి ఉమ్మడి డిమాండ్లపై

దేశ రాజధానిలో ఆందోళన జరపడం ఒక విశేషమైతే మహిళా రైతులు పెద్దసంఖ్యలో పాల్గొని విడిగా మహిళా రైతుల పార్లమెంట్‌ను నిర్వహించడం దీనిలో మరొక విశేషం. మహిళా రైతుల పార్లమెంట్‌ను ఉద్దేశించి ప్రసంగిస్తూ నర్మదా బచావ్ ఆందోళన్ నాయకురాలు మేధా పాట్కర్ ఇదొక చారిత్రాత్మకమైన ఘడియ అని పేర్కొన్నారు. మహిళా రైతులు తమకు భూమి హక్కులు, రైతులుగా గుర్తించడం వంటి సమస్యలపైననే గాక ఇతర డిమాండ్లకు కూడా మద్దతునిచ్చారు. ఈ కమిటీలో అన్ని రకాల వామపక్ష పార్టీల రైతు సంఘాలు పాల్గొనడంతో పాటు పార్లమెంటు స్ట్రీట్‌లో జరిగిన కిసాన్ పార్లమెంటుకు, పార్లమెంటు సభ్యుడు రాజుశెట్టి, అంతకుముందు ఎన్‌డిఎ ప్రభుత్వంలో ఉన్నవారు కూడా పాల్గొని మద్దతు తెలియచేశారు.

2018 మార్చ్ 6 నుండి 12 వరకు 35,000 మందికి పైగా ఆదివాసీ రైతులు నాసిక్ నుండి ముంబాయి వరకు 180 కిలోమీటర్లు 'లాంగ్‌మార్చ్' చేసి తమ డిమాండ్లను సాధించుకున్న చారిత్రిక సంఘటన దేశంలో ఎంతో మంది ఉద్యమకారులలో ఉత్తేజాన్ని నింపింది. సిపిఐ (ఎం) పార్టీకి అనుబంధమైన అఖిల భారత కిసాన్ సభ నాయకత్వంలో రైతులు, వ్యవసాయ కూలీలు మండుటెండలో రోజుకి 30 కిలోమీటర్లు నడిచి అత్యంత క్రమశిక్షణతో ముంబయి నగరంలోకి ప్రవేశించి, ముంబాయి ప్రజలకు, పరీక్షలు రాసే విద్యార్థులకు ట్రాఫిక్ ఇబ్బందులు కలగకుండా రాత్రంతా నడిచి ఆజాద్ మైదానానికి చేరుకున్నారు. మహిళలు, పిల్లలు, వృద్ధులు ఆరు రోజుల నడకతో పాదాలు వాచిపోయి, బొబ్బలు కట్టి రక్తమోడుతూ తమ డిమాండ్లు సాదించుకోవడం కోసం దృఢ నిశ్చయంతో మహారాష్ట్ర శాసనసభను ముట్టడించడానికి ప్రవాహంలాగా కదిలారు. మహారాష్ట్రలో రైతుల లాంగ్‌మార్చ్‌లో భూమి కావాలనేదే ప్రధాన డిమాండ్‌గా ముందుకొచ్చింది. తాము సాగుచేస్తున్న అటవీ భూమికి పట్టాలు ఇవ్వాలనీ, తమ భూమిని ప్రాజెక్టుల కోసం సేకరించవద్దనీ ఆదివాసీ రైతాంగం డిమాండ్ చేశారు. దానితో పాటు రేషన్ కార్డులు ఇవ్వాలి, వృధ్యాప్య పెన్షన్లు ఇవ్వాలి, పంట నష్టం చెల్లించాలి, రుణ మాఫీ చెయ్యాలి అనేవి కూడా వారి డిమాండ్లలో ఉన్నాయి. 'వీళ్లంతా అసలు రైతులే కాదు' అని ముందు రోజు ప్రకటించిన మహారాష్ట్ర ముఖ్యమంత్రి దేవేంద్ర ఫడ్నవీస్ ఆ తర్వాత నాలిక కరుచుకుని 24 గంటలలో రైతులు పెట్టిన డిమాండ్లన్నీ ఒప్పుకుంటున్నట్లు ప్రకటించాడు.

జనాందోళన్‌లో భాగంగా ఏక్తా మహిళా మంచ్ ఆధ్వర్యంలో 2018 ఆగస్టు 16 నుంచి కేరళ నుండి మధ్యప్రదేశ్ వరకు 6 రాష్ట్రాల గుండా నెల రోజుల పాటు మహిళా భూమి హక్కుల సంవాద యాత్ర జరిగింది. జాతీయ భూసంస్కరణల ముసాయిదా చట్టాన్ని, జాతీయ నివాస హక్కుల చట్టాన్నీ పార్లమెంటులో ప్రవేశ పెట్టి అమలు చేయాలనీ, మహిళలకు భూమి హక్కులు కల్పించి వారిని రైతులుగా గుర్తించాలనీ, జల్ – జంగల్ – జమీన్ వంటి వనరులపై పేదలు, ఆదివాసీలకు అధికారం కలిపించాలనీ డిమాండ్ చేస్తూ ఈ యాత్ర కేరళ, తమిళనాడు, కర్నాటక, ఆంధ్రప్రదేశ్, తెలంగాణ, ఒడిశా, ఛత్తీస్‌గఢ్‌లలో సాగింది. ఈ యాత్ర ప్రయాణించిన ప్రాంతాలలో భూమి హక్కుల కోసం మహిళలు సాగిస్తున్న పోరాటాలకు సంఘీభావం తెలియచేస్తూ వారి సమస్యలను అర్థం చేసుకుంటూ సాగింది. సెప్టెంబర్ 30, అక్టోబర్ 1 తేదీలలో మధ్యప్రదేశ్‌లోని గ్వాలియర్‌లో ఈ యాత్ర ముగింపు సందర్భంగా రెండు రోజుల సదస్సు జరిగింది. సదస్సు తర్వాత అక్టోబర్ 2 న 25,000 మందితో జనాందోళన్ పాద యాత్రగా ఢిల్లీ వైపు బయలుదేరింది. అయితే అక్టోబర్ 9న ప్రభుత్వం ఆందోళనకారులతో సంప్రదింపులు జరిపి వారి డిమాండ్లలో కొన్నింటిని అంగీకరించింది.

సెప్టెంబర్ చివరి వారంలో ఉత్తర్‌ప్రదేశ్‌లోని వివిధ ప్రాంతాల నుండి వేలాది మంది రైతులు భారతీయ కిసాన్ యూనియన్ అధ్వర్యంలో కిసాన్ క్రాంతి యాత్ర పేరుతో నిరసన ఊరేగింపు ప్రారంభించారు. రైతుల రుణమాఫీ, పంటలకు కనీస మద్దతు ధరలు, డీజిల్ ధరల తగ్గింపు, స్వామినాథన్ కమిషన్ సూచనల అమలు – వీరి డిమాండ్లు. 10 రోజుల పాటు ట్రాక్టర్లు, ట్రాలీలలో ప్రయాణించి అక్టోబరు 2న ఉత్తర్‌ప్రదేశ్ ఢిల్లీ సరిహద్దులకు చేరుకున్న రైతుల ఊరేగింపును ఢిల్లీ పోలీసులు బారికేడ్లు పెట్టి ఆపేశారు. అన్ని వేలమంది రైతులు రాజధానిలోకి ప్రవేశిస్తే శాంతిభద్రతలకు భంగం కలుగుతుందని మోడీ ప్రభుత్వం రైతులపై విరుచుకుపడింది. బారికేడ్లను తొలగించి ఢిల్లీలో ప్రవేశించడానికి ప్రయత్నించిన రైతులపై నీటి ఫిరంగులు, టియర్‌గ్యాస్ గోళాలు ప్రయోగించింది. 144 సెక్షన్‌ను ప్రకటించింది. వారి డిమాండ్లను పరిశీలించడానికి ముఖ్యమంత్రులతో ఒక కమిటీని నియమించినట్లు ప్రభుత్వం ప్రకటించినప్పటికీ రైతులు సంతృప్తి చెందలేదు. చివరికి ఢిల్లీ పోలీసులు రైతులను ఢిల్లీ నగరంలోకి ప్రవేశించడానికి అనుమతించిన తర్వాత గృహ మంత్రి, వ్యవసాయ మంత్రితో చర్చల తర్వాత ఈ నిరసన ప్రదర్శన ముగిసింది.

పైన పేర్కొన్నట్లు గత ఏడాదిన్నరగా సాగుతున్న రైతుల ఆందోళనలన్నిటిలో ప్రధానంగా రుణమాఫీ, పంటలకు మద్దతు ధరలు తదితర డిమాండ్లతో పాటు భూమి హక్కుల డిమాండ్ కూడా ముందుకొచ్చింది. అంతకుముందు వరకు అసంఘటితంగా, నిస్తేజంగా ఉన్న రైతులు 2017 నుండి ఒక్కసారిగా ఎక్కడికక్కడ సంఘటితపడి ఆందోళనకు ఎందుకు దిగారో అలోచేస్తే నానాటికీ తీవ్రతరమవుతున్న వ్యవసాయ సంక్షోభం వారిని ఆ పరిస్థితికి నెట్టిందని అర్థమవుతుంది. 2016లో ఎన్‌డిఎ ప్రభుత్వం అమలులోకి తెచ్చిన పెద్దనోట్ల రద్దు వ్యవసాయ రంగంపై పెద్ద ఎత్తున ప్రభావాన్ని వేసి ఈ సంక్షోభాన్ని మరింత తీవ్రతరం చేసింది.

పెద్దనోట్ల రద్దు కారణంగా ఏర్పడిన నోట్ల కొరత వల్ల 2016 ఖరీఫ్ సీజన్‌లో రైతులు పండించిన పంటలకు వారికి చెల్లించాల్సిన డబ్బు అందలేదు. బ్యాంకుల వద్ద రోజుల తరబడి క్యూలలో నిలబడినప్పటికీ నగదు అందక రబీ సీజన్‌లో పెట్టుబడి పెట్టడానికి రైతుల వద్ద డబ్బు లేకుండా పోయింది. ప్రైవేటు వ్యాపారస్తుల వద్ద కూడా అప్పులు పుట్టలేదు. అప్పటికే వ్యవసాయంలో పాతుకుపోయిన వ్యవస్థీకృత సమస్యలకు ఈ నగదుకొరత తోడై దేశంలో చిన్న సన్నకారు రైతాంగం కునారిల్లిపోయింది. దీంతో రైతులకు పోరాటం తప్ప మరొక మార్గం లేకుండా పోయింది.

1960లలో ప్రవేశపెట్టబడిన హరిత విప్లవం రైతులను అధికోత్పత్తి వంగడాలు, వాణిజ్య పంటలు, రసాయన ఎరువుల వాడకం వైపు నెట్టి ఈ సంక్షోభానికి నాంది పలికింది. పంటల సరళిలో విపరీతమైన మార్పు చోటు చేసుకుంది. దేశంలో 65 శాతంగా ఉన్న వర్షాధారిత ప్రాంతాలలో కూడా అధిక సాగునీరు అవసరమయ్యే వాణిజ్య పంటలు వ్యాపించి వ్యవసాయంలో పెట్టుబడులు పెరిగిపోయాయి. ఇక 1990ల తర్వాత దేశంలో ప్రవేశపెట్టబడిన నూతన ఆర్థిక విధానాలు వ్యవసాయ రంగంపై, కార్పొరేట్ రంగం, మార్కెట్ శక్తుల ఆధిపత్యాన్ని నెలకొల్పాయి. వ్యవసాయ రంగానికి ప్రభుత్వం వైపు నుంచి బడ్జెట్ కేటాయింపులు తగ్గిపోయి రైతులకు పంట రుణాలు, సబ్సిడీలు అరకొరగా మాత్రమే అందసాగాయి.

# మౌలిక సౌకర్యాల పరపతి సంస్థలో సంక్షోభం

***పాలకుల అండతో, వ్యవస్థలో ఉన్న లోపాలను ఆసరాగా చేసుకుంటూ కార్పొరేట్ సంస్థలు భారీ ఆర్థిక కుంభకోణాలకు పాల్పడుతున్నాయనీ, ఈ మోసాల వల్ల సామాన్యులు తీవ్రంగా నష్టపోతున్నారనీ అంటున్నారు* లక్ష్మణ్ గడ్డం**

నరేంద్రమోడీ అధికారంలోకి వచ్చిన తొలిరోజుల్లో మేము గవర్నమెంటు కాదు గవర్నెన్సు అందిస్తామన్నారు. అయిదు సంవత్సరాల కాలంలో ఆయన చెప్పిన గవర్నెన్సు గతి తప్పడమే కాకుండా కార్పొరేట్ గవర్నెన్స్ వ్యవస్థ కూడా విఫలమవుతున్నాయని ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ లీజింగ్ అండ్ ఫైనాన్సియల్ సర్వీసెస్ (ఐఎల్&ఎఫ్ఎస్) సంస్థ నిర్వాకం బట్టబయలు చేసింది.

లోకంలో ఏ పరిణామమైన అనూహ్యంగా ఆకస్మికంగా వచ్చి మీద పడదు. మంచి గాని చెడు గాని ఒక పద్ధతి ప్రకారం వరుస క్రమంలో జరుగుతుంది. మరీ ముఖ్యంగా కార్పొరేట్ సంస్థల పరిణామం ఎన్నో వ్యవస్థల పర్యవేక్షణలో జరుగుతుంది కాబట్టి ఉన్నట్టుండి ఆవిష్కరించదు. అయినప్పటికీ నిన్నటివరకు అత్యద్భుతమైన సేవలందిస్తున్నాయని రేటింగ్‌లందుకున్న ఐఎల్&ఎఫ్ఎస్ సంస్థ రాత్రికి రాత్రి చతికిలబడి కళ్లు తేలేసిన ఉదంతం అక్టోబర్ 1న జరిగింది. ప్రపంచంలోనే అత్యంత పటిష్టమైన ఆర్థిక వ్యవస్థల నియంత్రణా వలయం ఉన్న దేశంగా చెప్పుకుంటున్న మన ఆర్థిక వ్యవస్థలోనే ఇది జరగిందంటే నియంత్రణ వ్యవస్థ ఎంత లోపభూయిష్టంగా ఉందో అర్థమవుతుంది.

మన దేశంలో కార్పొరేట్ వంచనలు, కుంభకోణాలు కొత్తేమికాదు. మోసాలకు పాల్పడడం, బయట పడితే ఇతర దేశాలకు పారిపోవడాలు తరచూ జరుగుతూనే ఉన్నాయి. విజయ్‌మాల్యా, నీరవ్ మోడీ, ఉదంతాలు ఇంకా తాజాగానే ఉన్నాయి. ప్రభుత్వాల సహకారం లేనిది ఉన్నట్టుండి విదేశాలకు ఉడాయించడం సాధ్యం కాదని కూడా ప్రజలకు తెలుసు.

ఐఎల్&ఎఫ్ఎస్ అనుబంధ సంస్థ అయిన ఐఎల్&ఎఫ్ఎస్ ట్రాన్స్‌పోర్టేషన్ నెట్‌వర్క్ లిమిటెడ్ తీసుకున్న అప్పులకు వడ్డీలు చెల్లించలేని స్థితికి చేరుకున్నది. అక్టోబర్ 1 నాటికి నాన్‌కన్వర్టెబుల్ డిబెంచర్ల పైన చెల్లించాల్సిన వడ్డీ మొత్తం రు. 20,000 కోట్లు చెల్లించలేని స్థితికి చేరుకున్నాయి. పైగా పైన తెలిపిన డిబెంచర్లపై జూలై 1 నుండి సెప్టెంబర్ 30 వరకు వడ్డీ చెల్లించడానికి సరిపడే నిధులు తమ వద్ద లేవని స్టాక్ ఎక్స్‌చేంజ్‌లకు తెలియజేయడంతో ఐఎల్&ఎఫ్ఎస్ సంస్థ దివాళా భాగోతం బయటకు పొక్కింది. స్మాల్ ఇండస్ట్రీస్ డెవలప్‌మెంట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (సిడ్‌బి)కి చెల్లించాల్సిన రు. 1000 కోట్లు చెల్లించలేక పోయింది. ఆ తర్వాత ఇప్పటికే ఈ సంస్థ రు. 395.46 కోట్ల వడ్డీ చెల్లించలేదని బయటపడింది. చెల్లింపులు చేయలేని స్థితికి చేరుకోవడంతో దివాళా తీసినట్లు కనబడుతుంది. ఈ సంస్థ మొత్తం రు. 91000 కోట్ల మేర రుణాలు తీసుకొన్నది. వీటికి కనీసం వడ్డీ కూడా కట్టలేని స్థితికి చేరుకున్నది.

ఈ ఐఎల్&ఎఫ్ఎస్ హోల్డింగ్ కంపెనీని 1987లో ఎం.జె. ఫేర్వాని స్థాపించారు. మౌలిక ప్రాజెక్టులకు రుణాలివ్వడం, వృద్ధిపరచడం, ఈ సంస్థ ప్రధాన లక్ష్యం. ప్రాథమికరంగ ప్రాజెక్టులకు దీర్ఘకాలిక రుణాలు

---

విత్తనాలు రైతుల చేతిలో లేకుండా పోయాయి. బహుళజాతి కంపెనీలకు అనుబంధమైన దేశీ కంపెనీలు పూర్తి ఆధిపత్యం సంపాదించి విత్తనాలు, ఎరువులు, పురుగు మందులను ఒక ప్యాకేజీగా మార్కెట్ చేయడం మొదలైంది. అనేక విధాలుగా నష్టం కలిగించే జన్యు మార్పిడి విత్తనాలు ప్రవేశించాయి.

విత్తనాల నాణ్యత పట్ల కంపెనీలకు జవాబుదారీతనం లేకుండా పోయి రైతులు తీవ్రంగా నష్టపోసాగారు. భూమి యాజమాన్యం విషయంలో కూడా క్రమంగా మార్పు కనిపిస్తున్నది, పెద్ద రైతులు వ్యవసాయం చేయడం మానేసి వారి భూములను కౌలుకు తీసుకుని సాగుచేసే చిన్న సన్నకారు రైతుల సంఖ్య పెరిగింది.

కౌలు ధరలు పెరగడం, కౌలు రైతులకు సంస్థాగత సహాయం లేకపోవడం చేత వాళ్లు ఎక్కువ పెట్టుబడి పెట్టాల్సి రావడం, పంటల దిగుబడి పెరగకపోవడం, గిట్టుబాటు ధరలు లేకపోవడం? ఇవన్నీ కలసి అత్యధిక శాతం రైతులు అప్పులలో కూరుకుపోయారు. 1995 నుంచి 20 ఏళ్లుగా సాగుతున్న ఈ వినాశకర క్రమానికి పెద్దనోట్ల రద్దు గొడ్డలిపెట్టుగా తోడై రైతు ఉద్యమాలకు ట్రిగర్‌గా పనిచేసి అవి ఊపందుకునేటట్లు చేసింది.

దేశవ్యాప్తంగా మొదలైన రైతు ఉద్యమాలను మరింత తీవ్రతరం చేయడానికి ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. అఖిల భారత రైతు పోరాట సమన్వయ కమిటీ నవంబర్ 28 నుండి 30 వరకు ఢిల్లీ ముట్టడికి పిలుపునిచ్చింది. లక్షమంది రైతులు, వారికి మద్దతు ఇచ్చేవారు అన్ని వైపుల నుండి పాదయాత్రగా ఢిల్లీ చేరుకొని నవంబర్ 29న రాంలీలా మైదాన్‌లో సమావేశమై 30న పార్లమెంట్ స్ట్రీట్ వరకు ఊరేగింపుగా వెళ్లాలని పిలుపునిచ్చారు.

వ్యవసాయ సంక్షోభాన్ని పరిష్కరించడానికి ప్రత్యేక పార్లమెంటు సెషన్‌ను నిర్వహించాలనేది ఈ ఢిల్లీ ముట్టడి ప్రధాన డిమాండ్. జిఎస్‌టి బిల్లును ఆమోదించడానికి బడ్జెట్ సెషన్‌లో ప్రత్యేక సెషన్‌ను నిర్వహించిన ప్రభుత్వం దేశంలో 60 శాతం ప్రజలకు జీవనాధారంగా ఉన్న వ్యవసాయం పై ప్రత్యేక పార్లమెంట్ సెషన్ ఎందుకు నిర్వహించదు అని పి. సాయినాథ్ వంటి పాత్రికేయ నిపుణులు ప్రశ్నిస్తున్నారు. రైతులు సంధిస్తున్న ప్రశ్నలను, వారి డిమాండ్లను ప్రభుత్వం ఇకనైనా పట్టించుకోకపోతే ముమ్ముందు రైతు ఉద్యమాలు మరింత తీవ్రతరం అయ్యే సూచనలు బలంగా కనిపిస్తున్నాయి.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

అందించే అతి పెద్ద నాన్ బ్యాంకింగ్ ఫైనాన్స్ సంస్థగా ఎదిగింది. ఇందులో మొదట్లో వాటాదారులు యూనిట్ ట్రస్ట్స్ ఆఫ్ ఇండియా, సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, ఎచ్‌డిఎఫ్‌సి సంస్థలు ఉన్నాయి.

అయితే క్రమేణా ఎస్‌బిఐ, ఎల్‌ఐసి, జపాన్‌కు చెందిన ఓరిక్స్ కార్పొరేషన్ ఆఫ్ జపాన్, అబుదాబికి చెందిన అబుదాబి ఇన్వెస్ట్‌మెంట్ అథారిటీ వంటి సంస్థాగత మదుపుదారులు కూడా వాటాదారులుగా చేరారు. మార్చ్ 31, 2018 నాటికి ఐఎల్&ఎఫ్‌ఎస్‌లో ఎల్‌ఐసి, ఓరిక్స్‌లో అతిపెద్ద వాటాదారులుగా మిగిలారు.

ఇప్పుడు రు. 1,15,000 కోట్లకు పైగా ఆస్తులు, రు. 91,000 కోట్ల అప్పులు కలిగిన అతిపెద్ద ఆర్థిక దిగ్గజం ఇది. ఈ సంస్థకు అనుబంధంగా మొత్తం 169 కంపెనీలున్నాయి. ఇందులో 24 వేరుగా అనుబంధ సంస్థలు, 135 పరోక్ష అనుబంధ సంస్థలు, 6 జాయింట్ వెంచర్లు, 4 అసోసియేట్స్ కంపెనీలున్నాయి.

అనుబంధ సంస్థలకే అనుబంధ సంస్థలు, విదేశీ అనుబంధ సంస్థలున్న ఏకైక సంస్థఇది. ఇవన్నీ కలసి మార్కెట్లో తీసుకున్న రుణాలు రు. 91000 వేల కోట్లు. ఈ డబ్బంతా సాధారణ ప్రజలు చెమటోడ్చి చెల్లించాల్సిందే. ఈ రుణాల వ్యవహారం పరిమితి దాటిపోయింది. దీని ఈక్విటి మూలధనం కంటే ఎన్నో రెట్లు అప్పులు చేసింది. ఈ క్రమంలో రుణానికి, ఈక్విటికి ఉండాల్సిన 2:1 నిష్పత్తిని దాటిపోయి అది 18:1 శాతానికి చేరుకున్నది. అంటే కంపెనీ వద్ద ఉన్న మూలధనం కంటే ఎక్కువ రుణాలే ఉన్నాయన్నమాట. పైగా సంస్థ తీసుకున్న అప్పులన్నీ స్వల్ప, మధ్యకాలిక రుణాలే. ఈ రుణాలను పెట్టుబడిగా పెట్టిన మౌలిక ప్రాజెక్టులపై ఆదాయం 20-25 సంవత్సరాల తరువాత మొదలవుతుంది. ఈ వివరాలు తెలిసే ఈ నిర్ణయాలు తీసుకున్నారు సంస్థ డైరెక్టర్లు. ఇది నేరం కాదా?

అయితే ఇప్పుడు అప్పుల్లో, చిక్కుల్లో ఇరుక్కొన్నది ఈ సంస్థ. గడువు తేదీల్లో రుణాలు, వడ్డీలు చెల్లించలేని డిఫాల్టర్‌గా నిలిచింది. మిగతా నాన్ బ్యాంకింగ్ ఫైనాన్స్ కంపెనీలన్నీ ఇదే బాట పడతాయనే ఆందోళనతో మదుపర్లు ఈ ఎన్‌బిఎఫ్‌సి కంపెనీల షేర్లను తెగనమ్ముకోవడం వలన మదుపర్లు నష్టాల పాలవుతున్నారు.

దేశంలో అమలవుతున్న దాదాపుగా అన్ని భారీ మౌలిక ప్రాజెక్టులను ఈ సంస్థనే దక్కించుకొనేది. అండర్ గ్రౌండ్ టన్నల్ జోడి లా పాస్ గాని, ఢిల్లీ, నోయిడా టోల్ బ్రిడ్జి గాని గుజరాత్ ఇంటర్నేషనల్ ఫైనాన్స్ టెక్ సిటీ గాని, తిరుపూర్ వాటర్ సప్లై ప్రాజెక్టు గాని, తమిళనాడులోని ఈస్ట్‌కోస్ట్ రోడ్ ప్రాజెక్టు గాని, హైవేరోడ్లు గాని, పోర్టులు గాని ఈ సంస్థ నిర్మించినవే. కోట్ల రూపాయల విలువ చేసే ఇన్ని భారీ ప్రాజెక్టులు చేపట్టిన ఇంత పెద్ద దిగ్గజ సంస్థ ఎట్లా నష్టాలతో కునారిల్లుతుందని మాయం తెలియని సగటు మనిషి తికమక పడుతున్నాడు.

ఈ భారీ ప్రాజెక్టుచే సంస్థను కష్టాలలోకి నెట్టివేసినట్టుగా కార్పొరేట్ వర్గాలు భావిస్తున్నాయి. అనేక కారణాల చేత ప్రాజెక్టులు పూర్తి కాకపోవడం, ఆగిపోవడం, చట్టబద్ధ అనుమతులు సకాలంలో దొరకక పోవడం, భూసేకరణ సమస్యలు ఎదురవడం, కాలక్రమంలో ప్రాజెక్టులు లాభదాయకం కాకపోవడం, నైపుణ్యమైన మానవ వనరుల లోపం మొదలగు అనేక కారణాల వలన సంస్థ మనుగడకు ముప్పు ఏర్పడింది. అంతేకాకుండా మార్కెట్లలో గొప్పలు చాటుకోవడానికి కృత్రిమ ఆర్థిక స్టేట్‌మెంట్లను తయారుచేసి ఆస్తులకు అధిక విలువలు చూపెట్టింది. లాభాలు గడించకపోయినప్పటికీ డివిడెండ్లను ప్రకటించింది. ఎటు నుండి కూడా ఆదాయాలు లేకపోవడం వలన అప్పుల బాట పట్టింది. అయితే ఇలాంటి సంస్థలకు అప్పులు అంత సులభంగా అందడమెట్ల, సాధారణ మనిషికి అవి అందకపోవడం ఎట్లా అనేది విశ్లేషించాల్సిన అంశం.

ఒక ఆర్థిక సంస్థ తను తీసుకున్న రుణాలు ఎగవేసి చేతులెత్తేస్తే తప్ప కళ్లు తెరవని కేంద్ర ప్రభుత్వం ఆగమేఘాల మీద కదిలి వెంటనే బోర్డును రద్దు చేసి నూతన బోర్డును నియమించింది. ఎప్పటి నుంచో ఎదురవుతున్న సమస్యలను పాకాన పడ్డాక పట్టించుకుంటానంటే ఫలితమేముంటుంది. జరగాల్సిన నష్టం అంతా జరిగిపోయింది. ఆర్థిక మార్కెట్‌లో పాల్గొనే శక్తులకు ఎప్పుడో ఈ విషయం తెలిసిపోయింది. రేటింగ్ సంస్థలు రుణపత్రాల రేటింగు కుదించడం మొదలుపెట్టాయి. స్టాక్ మార్కెట్‌పై ప్రభావం పడి నష్టాలకు గురైంది. విదేశీ పెట్టుబడుల పై ప్రభావం పడింది. భవిష్యత్తులో ఎన్‌బిఎఫ్‌సిలలో పెట్టుబడులు పెట్టేందుకు విదేశీ సంస్థలు ముందుకురాని పరిస్థితులు ఏర్పడ్డాయి.

విపత్కర పరిణామాలు విషమించిన తర్వాత స్పందించడం కంటే పరిస్థితులను ముందే పసిగట్టే వ్యవస్థలను నిర్మించడంలో పాలకులు విఫలమయ్యారు. దానికితోడు ఉన్న వ్యవస్థలు కూడా బలహీనం కావడం విస్మయం కలిగిస్తుంది.

ఈ సంస్థలో పెట్టుబడుదారులు సాధారణ మదుపుదారులు కారు. ఎల్‌ఐసి లాంటి దిగ్గజ సంస్థలకు చెందిన సంస్థాగత మదుపుదారులున్నారు ఇందులో. వీళ్లకు ప్రాతినిధ్యం వహించే డైరెక్టర్లు బోర్డులో ఉంటారు. ప్రతి విధాన నిర్ణయాన్ని ఖరారు చేస్తారు. సంస్థ పురోగతిని, అభివృద్ధిని, ఆర్థిక ప్రగతిని ఎప్పటికప్పుడు మదింపు వేస్తుంటారు. సంస్థ ఆర్థిక సౌష్టతను, వాణిజ్య మనుగడను డేగకన్నుతో గమనిస్తూ దానికి రేటింగు ప్రదానం చేసే ఇక్రా, కేర్ లాంటి క్రెడిట్ రేటింగు సంస్థలుంటాయి. ఆర్థిక ప్రగతిని వెల్లడిచేసే ఆర్థిక పట్టీలు, నివేదికలుంటాయి. వాటిని ధృవీకరించే నిష్ణాతులైన ఆడిటర్లుంటారు. ఇన్ని వ్యవస్థలుండగా ఈ సంస్థ దివాళా స్థితికి చేరుకోవడం అందరిని ఆశ్చర్యానికి గురిచేస్తుంది.

దివాళా పరిస్థితి ఏకాయేకిన ఏర్పడే పరిణామం కాదు కనుక ఈ సంస్థ చాలాకాలంగా ఇటు దిశగా ప్రయాణం చేస్తూ వచ్చిందనేది మాత్రం ఖాయం. అయితే రేటింగ్ సంస్థలు అత్యద్భుతమైన పని విధానంలో పయనిస్తుందని భారీ రేటింగులను ఎలా ఇచ్చాయి? ఆర్థిక ప్రగతి నివేదికలు పట్టించుకోకుండా రుణదాతలు ఎలా రుణాలిస్తూ వచ్చారు? సెబి, ఆర్‌బిఐ లాంటి పర్యవేక్షణ సంస్థలు ఈ సంస్థ ఎదుర్కొంటున్న రిస్కును ఎందుకు చూడలేకపోయాయి? ఇవి మిగిలిపోయిన ప్రశ్నలు.

నూతనంగా ఏర్పాటైన బోర్డు ఏమేరకు ఈ సంస్థను గట్టెక్కిస్తుందనేది వేచి చూడాల్సిందే. ముఖ్యంగా సంస్థ చేపట్టి కొనసాగిస్తున్న ప్రాజెక్టులను ఆగిపోకుండా కొనసాగించాల్సి ఉంటుంది. ఇందుకు గాను 169 అనుబంధ సంస్థల పనితీరు సంబంధాలను అధ్యయనం చేయాలి. కేంద్ర ప్రభుత్వం నుండి అదనంగా నిధులను సమకూర్చుకోగలగాలి. సంస్థ ఆస్తులను విక్రయించి మరిన్ని నిధులను సేకరించగలగాలి. రుణదాతలను మరికొంతకాలం ఒప్పించి ఆగేలా చూడగలగాలి. ఇందుకు గాను ప్రాజెక్టులను సమగ్ర సమీక్ష జరిపి లాభదాయకంగా ఉండే ప్రాజెక్టులను గుర్తించగలగాలి. ఇలాంటి అనేక చర్యలు చేపడితే తప్ప సంస్థను పునరుద్ధరించడం సాధ్యం కాదు. సామాన్యుడి మీదపడే భారం తొలగదు. వీ

*(రచయిత అధ్యక్షులు పౌరహక్కుల సంఘం)*

# మార్క్స్ దృష్టిలో పరాయీకరణ - 2

*మార్క్స్ చేసిన సామాజిక విశ్లేషణల్లో అత్యంత మౌలికమైనదైన పరాయీకరణ సిద్ధాంతం గురించి వివరిస్తున్నారు*

**లోకే రాజ్‌పవన్**

*(గత సంచిక తరువాయి..)*

ఈ విషయాన్ని కాసేపు ఇక్కడ ఆపి తర్వాత మార్క్స్ సందర్భంలో కొనసాగిద్దాం. ఇప్పుడు మార్క్స్‌కు ముందరి తత్వవేత్తల, శాస్త్రవేత్తల పరాయీకరణ భావనలను మొదట చూద్దాం. పరాయీకరణ గురించిన అధ్యయనాలలో మనోవిజ్ఞాన శాస్త్రవేత్తలైన సిగ్మండ్ ఫ్రాయిడ్, మాక్స్‌వెబర్, తత్వశాస్త్ర వేత్తలైన హెగెల్, నాథన్ గ్లాజర్, మార్క్స్, ఏంగెల్స్, నియోలెఫ్టిస్ట్‌లైన ఎరిక్‌ఫ్రాం, హర్‌బర్ట్, మార్‌కూస్ మొదలైన వారు తమ అభిప్రాయాలు తెలిపారు. తత్వశాస్త్రంలో హెగెల్ ఫ్యూర్ బాలు పరాయీకరణ భావనను ఆదర్శ దృక్పథంతో పరిశీలించారు. మతం నుండి మానవున్ని వేరు చేయాలన్న భావాన్ని వారు చెప్పారు. సంపూర్ణ చైతన్యం వైపు నిరంతర చర్యలు చరిత్రలో సాగాయని చెప్పారు. మాక్స్‌వెబర్, మనోవైజ్ఞానిక శాస్త్ర వాదులైన సిగ్మండ్ ఫ్రాయిడ్ దృష్టిలో పరాయీకరణమనగా నిస్సహాయత, శక్తిహీనత, తనపట్ల ఇతరులపట్ల అసహ్యత కలగడం, తానొక పశువుననే భావన. కార్ల్ మార్క్స్‌చే ప్రేరణ పొంది సిమ్మెల్, టాల్‌కాట్ పార్సన్స్‌లు సమాజ శాస్త్రంలో పరాయీకరణ భావనను వివరించారు.

ప్రాచీన కాలం నుండి మార్క్స్ వరకు, మార్క్స్ తదనంతర శాస్త్రవేత్తల వరకూ పరాయీకరణను అనేక మంది అనేక రకాలుగా వివరించారు. వారిలో కొందరు ముఖ్యమైనవారి భావాలను చూద్దాం! ప్లేటో గ్రీకు తత్వవేత్త. ఆయన సోక్రటిస్ శిష్యుడు. ఆనాటి రాజనీతి తత్వ విచారకుల్లో ప్లేటో అగ్రగణ్యుడు. ఆదర్శవాదాన్ని ప్లేటో చాలా ముందుకు తీసుకెళ్లాడు. ప్లేటో తన దృక్పథంలోంచి మనిషి ఎవరు? మనిషికి ప్రకృతికి సంబంధం ఏమిటి? మనిషికి సమాజానికి సంబంధమేమిటి? వంటి ప్రశ్నలకు జవాబులు వెతికాడు. ఈ అన్వేషణలోని మనిషి ప్రకృతి నుంచి సమాజం నుంచి దూరమవుతున్నాడనే విషయాన్ని గుర్తించాడు. అట్లా ఎందుకు దూరమవుతున్నాడనే ప్రశ్నకు జవాబు వెతికాడు. కానీ తన ఆదర్శరాజ్య భావనలో పాలకుడే సర్వోన్నతుడు, సర్వజ్ఞుడు, చట్టాల పరిమితికి లోబడి ఉండడం అని చెప్పాడు. ఉత్తమ వైద్యునికి వైద్యశాస్త్ర గ్రంథాలు అవసరం లేనట్లే ఉత్తమ పాలకునికి చట్టాలు అవసరం లేదంటాడు. ఆదర్శ రాజ్యంలో ప్రజలు పాలకునిపై ఆధారపడి ఉండాలని చెప్పాడు. అంటే పరాయీకరణను గుర్తించి ప్లేటో అందుకు పరిష్కారాన్ని కనుగొనే క్రమంలో పాలకున్ని అతని విధానాలను సమర్థించాడు. పరాయీకరణకు మూల కారణం పాలకుడు, పాలక వ్యవస్థే అవుతుందని గుర్తించలేకపోయాడు. ప్లేటో శిష్యుడు అరిస్టాటిల్ మహా మేధావి. చాలా శాస్త్రాలలో ప్రవేశం, ప్రావీణ్యం ఉంది. ప్రజల అసంతృప్తులకు గల కారణాలను ఈయన సరిగ్గానే పట్టుకున్నాడు. విప్లవాలను గురించి చెప్పిన సందర్భంలో ఆర్థిక అసమానతలు, ప్రభుత్వాధికార దుర్వినియోగం వంటి కారణాలు విప్లవాలకు దారితీస్తాయన్నాడు. వాటిని నివారించాలంటే రాజ్యాంగం పట్ల ప్రజలకు గౌరవం చేకూర్చే చర్యలు తీసుకోవాలని, రాజకీయాధికారం కేంద్రీకృతం కాకుండా చూడాలని, అధికార దుర్వినియోగం, అవినీతి, లంచగొండితనం వంటివి లేకుండా చూడాలని సూచించాడు. కానీ ఆయన అన్నిచోట్ల ఇలాంటి ఆలోచనలతోనే ఉండలేకపోయాడు. ప్రజలను పరాయీకరణకు గురిచేసే ప్రధాన కారకమైన పాలక వర్గాల చట్టాలను ఆయన సమర్థించాడు. చట్టాన్ని ఎవరూ ధిక్కరించడానికి వీలులేదు. వ్యక్తులు చట్టాలకు లోబడి జీవించాలి. చట్టానికి స్పష్టమైన ఆధిక్యత ఉండాలని అరిస్టాటిల్ అన్నాడు. అంటే పాలక వర్గాలకు లోబడి జీవించాలని ప్రజలకు స్పష్టంగా చెప్పినట్లే. ఇది పరాయీకరణను మరింత పెంచే బోధనేకాని తగ్గించేది కాదు.

పారిశ్రామిక విప్లవం వచ్చాక పరిశ్రమల వల్ల గ్రామీణ సౌందర్యం నాశనమౌతున్నదనే వాదన బలంగా ముందుకొచ్చింది. మనిషి, అతని జీవితం మారిపోతున్నదనేది ఆ వాదనలోని ప్రధానాంశం. 1789 ఫ్రెంచ్ విప్లవం స్వేచ్ఛ సమానత్వం సౌభ్రాతృత్వం అనే నినాదాలతో అప్పటి వరకు ఉన్న భూస్వామ్య వర్గ అధికారాన్ని కూలదోసి బూర్జువా వర్గాన్ని అధికారంలోకి తెచ్చింది. భూస్వామ్య వర్గంపై తీవ్ర వ్యతిరేకత ఉన్న అనేక మంది ప్రజల వలెనే తన రచనల ద్వారా ఆ వ్యతిరేకతను ప్రదర్శించిన తత్వవేత్త రూసో. బూర్జువా వర్గ విప్లవాన్ని సమర్థించాడాయన. ఆయన తన రచనల్లో మానవ స్వభావం గురించి చర్చించాడు. మానవుడు జన్మతః స్వేచ్ఛాజీవి. అయితే అతడు ప్రతిచోట సంకెళ్లతో బందీగా ఉన్నాడని రూసో తన 'సోషల్ కాంట్రాక్ట్'లో అంటాడు. మానవుని స్వభావం అభివృద్ధి చెందడానికి అనుగుణమైన పరిస్థితులు ఏర్పడలేదని రూసో అంటాడు. అతని నిజమైన సహజమైన మంచితనాన్ని చెడగొట్టి సంస్థలు, భయం, సాంప్రదాయాలు, నాగరికతలు ఏర్పడ్డాయని రూసో వాదిస్తాడు. అందువల్ల స్వేచ్ఛాయుత స్వభావం గల మానవుడు బానిస అయినాడు. ప్రతిచోట బందీకృతుడైనాడంటే అందుకు కారణం సాంప్రదాయాలు, విలువలు, తప్పుడు సంస్కృతే. మనిషి మంచితనాన్ని పెంపొందించే సాంఘిక ఆర్థిక రాజకీయ వాతావరణాన్ని పెంపొందించాల్సింది పోయి దాన్ని నాశనం చేసే సంస్థలు మానవుని జీవితాన్ని కృత్రిమంగా చేశాయని రూసో భావించాడు. అది తన సహజ స్వభావానికి అనుగుణంగా లేకపోవడమే కాకుండా అతని పతనానికి దారితీస్తాయని రూసో అన్నాడు. లోపభూయిష్టమైన కళలు కూడా మానవుని మంచి స్వభావాన్ని చెడగొట్టాయంటాడు. అంటే రూసో పరాయీకరణను నైతికాంశంగా చూశాడని అర్థమవుతుంది. మనిషి పుట్టుకతో మంచివాడు కానీ నాగరికత క్రమంలో పాడవుతాడనడం నాగరికత పరాయీకరణ సాధనమని చెప్పడమే. రూసో స్వంత ఆస్తి విధానాన్ని సమర్థించాడు. అంటే స్వంత ఆస్తి వల్ల కాకుండా సంపద పంపిణి వల్ల మాత్రమే ఈ పరాయీకరణ జరుగుతుందన్నాడు. ఫ్రెంచ్

విప్లవం ద్వారా వచ్చిన బూర్జువా వర్గానికి రూసో అనుకూలం కనుక రూసో ఆ వర్గానికి వ్యతిరేకమైన సంపద రద్దును సూచించలేదు. అయితే నైతిక విద్య అందించడం, ప్రతి మనిషి నేను అమ్ముడు పోవద్దు అనుకోవాలి, సంపదను వ్యతిరేకించాలి అనే కంటితుడుపు పరిష్కారాలను మాత్రం సూచించాడు. సహజంగానే అవేవీ అమలు కాలేదు.

హెగెల్ జర్మనీ తత్వవేత్త. గొప్ప రాజనీతి, తత్వ శాస్త్రవేత్త. ఆయన ప్రకారం వ్యక్తి వికాసం రాజ్యంలోనే సాధ్యమవుతుంది. మానవుడు ఐహిక, ఆధ్యాత్మిక లక్ష్యాలను రాజ్యం ద్వారా సాధించుకోగలడు. అందువలన వ్యక్తి రాజ్యాధికారానికి బద్ధుడై ఉండాలి. రాజ్య ఆదేశాలను పాటించడం ప్రతివ్యక్తి ప్రధాన కర్తవ్యం. హెగెల్ వ్యక్తి స్వేచ్ఛ పట్ల కూడా తన భావాలు ప్రకటించాడు. రాజ్యం వ్యక్తికి కొన్ని హక్కులు ఇస్తుంది. తానిచ్చిన హక్కులను రాజ్యం ఎప్పుడైనా ఉపసంహరించుకోవచ్చు. రాజ్యాధికారానికి విధేయత చూపించడంలోనే వ్యక్తి స్వేచ్ఛ ఇమిడి ఉంటుంది. అందువలన వ్యక్తి సంపూర్ణంగా రాజ్యాధికారానికి బద్ధుడై ఉండాలి. ఇలా చెప్పడానికి హెగెల్‌కున్న గొప్ప నమ్మకం ఏమిటంటే రాజ్యం వ్యక్తి స్వేచ్ఛకు అవరోధాలు కల్పించదనేది. హెగెల్ పరాయీకరణ భావనను తత్వ, సామాజిక, రాజకీయ రంగాలలోకి విస్తృతపరిచాడు. ఒక చైతన్య స్థితే పరాయీకరణ అన్నాడు. ప్రపంచాన్ని గ్రహించే క్రమమే పరాయీకరణ. ప్రపంచం, అందులోని అన్ని అంశాలు బాహ్యంగా ఉన్నాయి. వ్యక్తి దానికి విడిగా ఉన్నాడు. అంటే మనిషికి ప్రపంచం, వస్తువులు వేరుగా ఉన్నాయి. ప్రపంచం పరమభావానికి ఒక రూపం. ఇది బాహ్యం. మనిషికి అవి పరాయి. అంటే పరమభావానికి మనిషి పరాయిగా ఉన్నాడు. చైతన్యం సార్వభౌమాధికారాన్ని ప్రపంచం అభావం చేస్తుంది. బైట ఉన్నదాన్ని గుర్తించే చైతన్య స్థితే పరాయీకరణ. చైతన్యం తనకు తాను గుర్తించుకుంటేనే అంటే స్వీయ చైతన్యంగా ఉంటేనే అంటే ప్రపంచాన్ని ఆలోచించకుండా ఉంటేనే పరాయీకరణ దూరమవుతుంది. ఈ ఆలోచనే పరాయీకరణకు మూలం. అలాగే వస్తువీకరణ పొందిన చైతన్యమే పరాయీకరణ అన్నాడు. వస్తువీకరణలో పరాయితనం ఉందని గుర్తించడం హెగెల్ గొప్ప విజయమే అయిననూ దాన్ని ఆయన భావవాద దృష్టిలో చూడడం మాత్రం అతిపెద్ద పరిమితి.

ప్యూర్‌బా భౌతికవాద కోణంలో పరాయీకరణను అర్థం చేసుకుని వివరించాడు. అతను భౌతికవాది. మనిషి ఒక విగ్రహాన్ని సృష్టించాడు కానీ దానికి అస్తిత్వం ఇచ్చి ఆ విగ్రహానికి తనపై ఆధిపత్యం చెలాయించే హక్కును అధికారాన్నిచ్చాడు. అతని దృష్టిలో దైవభావనే పరాయీకరణ. మనిషికి దైవభావం ఉందంటే అతను పరాయీకరించబడినట్లే అంటాడాయన. దీనికి పరిష్కారంగా మనిషి దైవభావనను వదులుకోవడాన్ని ప్యూర్‌బా సూచించాడు.

ఇవన్నీ మార్క్స్‌కు ముందు ఎన్నో అవకతవకలతో, అసమగ్రతలతో, అశాస్త్రీయంగా విశ్లేషించబడిన పరాయీకరణ భావనలు, శాస్త్రీయమైన సామాజికార్థిక సిద్ధాంతాల జ్ఞానం ఏర్పడని కాలంలో ఎవరికి తోచినట్లు వాళ్లు ఊహించిన, విశ్లేషించిన భావనలు. కానీ మార్క్స్ వచ్చాక అప్పటివరకూ ఉన్న ఆలోచనలు తారుమారయ్యాయి. 1842లో మార్క్స్ జర్మనీలో ఉన్నప్పుడు అడవిలో పడిపోయిన ఎండిన చెట్టుకొమ్మలను ఎవరైనా తీసుకుపోతే శిక్షిస్తామని ప్రష్యన్ ప్రభుత్వం ప్రకటించినప్పుడు అడవి నుంచి సహజ సిద్ధమైన అడవి కట్టెలను మనుషులకు దూరం చేయడమేమిటనే ఆలోచన ఆయనలో పరాయీకరణ భావనను రాజకీయార్థంలో చూసే ఆలోచనను పురిగొల్పింది. రాజ్యం కొందరిదేననే అర్థం నుంచి పరాయీకరణ భావనను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాడు. సోషల్ కాంట్రాక్ట్ ద్వారా ఏర్పరచుకున్న రాజ్యం ప్రజలను సమానంగా చూడాలి గానీ, అలా చూడడం లేదంటే అక్కడ పరాయీకరణ స్థితి ఉందన్నాడు. 1843లో జర్మనీ నుంచి మార్క్స్‌ను బహిష్కరిస్తే పారిస్ వచ్చాడు. అక్కడ ఆయన 'క్రిటిక్ ఆన్ హెగెల్స్ ఫిలాసఫీ ఆఫ్ రైట్' వ్యాసం రాసిన సమయంలోనే ఏంగెల్స్ 'అవుట్ లైన్స్ ఆఫ్ పొలిటికల్ ఎకానమి' అనే వ్యాసం రాశాడు. శ్రమను పరాయీకరించడం శ్రమ ఉత్పత్తులను పరాయీకరించడంలోనే పరాయీకరణ దాగి ఉందని ఏంగెల్స్ రాశాడు. అదే పరాయీకరణను శాస్త్రీయంగా వివరించడానికి మూలం అయింది. ఆ తర్వాత 'కామెంట్ ఆన్ జేమ్స్‌మిల్' అనే వ్యాసం రాశాడు మార్క్స్. మనిషి వస్తువును ఉత్పత్తి చేసినప్పుడు చాలా ఆనందపడతాడు. కానీ ఆ వస్తువు తనది కాదన్నప్పుడు, కాకుండా పోయినప్పుడు బాధపడతాడు. పరాయి అయి పోతాడు. అయినాసరే ఆ వస్తువును వేరొకరు వాడడం చూసైనా ఆనందం పొందుతాడు. కానీ పెట్టుబడిదారీ వ్యవస్థలో ఎవరు వాడుతున్నారో కూడా తెలియని పరిస్థితి ఏర్పడి ఆ ఆనందాన్ని పొందకుండా చేసింది. రెండు ఆనందాల నుంచి మనిషి దూరమైనాడని అందులో రాశారు. అంటే ఆలోచన, చైతన్యం, వస్తువు మొదలైన తాత్వాక, రాజకీయ, సామాజిక అర్థాల నుంచి పరాయీకరణ భావనను మార్క్స్ ఆర్థిక కోణంలోకి తెచ్చాడు. ఎకనమిక్ అండ్ ఫిలాసఫికల్ మాన్యుస్క్రిప్ట్ - 1844 లేదా పారిస్ మాన్యుస్క్రిప్ట్ పుస్తకం రాశారు. తర్వాత 1845-46లో 'జర్మన్ ఐడియాలజీ' పుస్తకం రాశారు. ఈ రెండు పుస్తకాలలో మార్క్స్ పరాయీకరణను గురించి చర్చించారు. శ్రమశక్తి విలువ వల్లనే పరాయీకరణ జరుగుతున్నదని భావించాడు. అన్ని సమాజాలలో పరాయీకరణ ఉన్ననూ పెట్టుబడిదారీ సమాజం దాన్ని చాలా ఉచ్ఛస్థితికి చేర్చిందన్నాడు. నిత్యజీవితంలో శ్రామికుడు ఈ పరాయీకరణను గుర్తించినప్పుడే దాని నుంచి బయటపడడానికి పోరాడతాడని మార్క్స్ తాత్విక స్థాయిలో వివరించాడు. పెట్టుబడిదారీ సమాజంలో నాలుగు రకాల పరాయీకరణలను కార్మికులు అనుభవిస్తారని మార్క్స్ అన్నాడు. ఉత్పత్తి విధానంలోనే ఈ పరాయీకరణ మూలాలు ఉండడం వల్ల అది సమాజమంతా వ్యాపిస్తుంది. అవి - 1) కార్మికుడు ఉత్పత్తి ప్రక్రియ నుంచి పరాయికావడం. 2) కార్మికుడు తన శ్రమ ఫలితం నుంచి పరాయికావడం. 3) కార్మికుడు తనతోటి కార్మికుల నుంచి పరాయి కావడం. 4) కార్మికుడు తన నుంచి తానే, తన మానవ సారం నుంచి తానే పరాయి కావడం. వీటిని గురించి చూద్దాం!

పెట్టుబడిదారీ పూర్వ సమాజాలలో ఉత్పత్తిలో పాల్గొనే ఏ మనిషికైనా తాను చేయబోయే ఉత్పత్తి ఏమిటో ఆ ప్రక్రియ ఎక్కడ మొదలై ఎక్కడ అంతమవుతుందో తెలుసు. అప్పుడు మనిషి ఆ ఉత్పత్తితోనూ ఉత్పత్తి ప్రక్రియతోనూ తనను తాను అనుసంధానించుకో గలిగేవాడు. 'ఇది నా ఉత్పత్తి' అని గర్వపడగలిగేవాడు. ఆ శ్రమ ఫలితం తనకు దక్కకపోయినా, తన శ్రమ ఏమి సాధించిందో ఆ ఉత్పత్తి దారుకు స్పష్టంగా తెలిసి ఉండేది. కానీ పెట్టుబడిదారీ సమాజం ఈ స్థితిని మార్చివేసింది. పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో ప్రధానమైన శ్రమ విభజన ప్రక్రియ ఒక ఉత్పత్తి క్రియను అనేక ముక్కలుగా విడగొట్టి ఒక్కో ముక్కను ఒక్కో విభాగానికి అప్పగించడం వల్ల ఉత్పత్తి ప్రక్రియ ఆద్యంతాలు తెలియకుండా పోయాయి. తాను తయారు చేసుకున్న విడిభాగం ఎందుకు ఉపయోగపడుతుందో కూడా తెలియకుండా ఉంటే ఉత్పత్తి క్రియలో ఎలాంటి సృజనాత్మకత లేకుండా, ఆలోచన లేకుండా కేవలం యాంత్రికంగా తనకు ఇచ్చిన పని చేయడం కార్మికుని కర్తవ్యం

అయిపోయింది. అంటే ఉత్పత్తి ప్రక్రియ కార్మికునికి అపరిచితమైనదిగా, తెలుసుకోవడానికి వీలులేనిదిగా, పరాయిదిగా మారిపోయింది.

పెట్టుబడిదారీ సమాజానికన్నా ముందు కూడా కార్మికునికి శ్రమ ఫలితం దక్కేది కాదు. కానీ తన శ్రమ సాధించిన ఉత్పత్తి కార్మికునికి తెలిసినదిగా, అందుబాటులో ఉండేది పెట్టుబడిదారీ సమాజంలో ఒకపక్క ఉత్పత్తి ప్రక్రియ దూరమైపోవడం వల్ల మరొపక్క ఉత్పత్తి సరకు స్వభావాన్ని సంతరించుకుని మారకపు విలువే ప్రధానమైపోవడం వల్ల కార్మికునికి తన సొంత ఉత్పత్తి కూడా తనకు తెలియనిదిగా మారిపోయింది. తన శ్రమతోనే తయారైన వస్తువు సరకుగా మారి దుకాణంలో బీరువాలో కూచుని సొంత అస్తిత్వం పొంది తనను కొనగల శక్తి ఉంటే తప్ప తనను ముట్టుకోగూడదని శాసించడం మొదలు పెట్టింది. ఆ మేరకు కార్మికునికి శ్రమ ఫలితమైన ఉత్పత్తి కూడా పరాయిదయిపోయింది.

ఉత్పత్తి ప్రక్రియ శ్రమ విభజనకు గురై ముక్కలైపోవడం వల్ల ఉత్పత్తి మారకపు విలువగా, సరకుగా మారి బీరువాలోకెక్కి కూచోవడం వల్ల ఒక కార్మికుడికి, ఆ ప్రక్రియలోను, ఆ సరకులోను ఉన్న మౌలిక మానవ శ్రమ మానవ సారం లాగా కనబడకుండా పోతుంది. అది కేవలం సరకులాగా కనబడుతుంది. అంటే మనుషుల మధ్య మనుషులుగా ఉండవలసిన సంబంధాలు సరకుల మధ్య సంబంధాలుగా మారిపోతాయి. మనిషి తోటి మనుషులతో సంబంధాన్ని గుర్తించలేక పోతాడు. సరకులతో సంబంధాన్ని మాత్రమే గుర్తించ గలుగుతాడు. అంటే మనిషి తోటి మనుషుల నుంచి పరాయి అయిపోతాడు.

మనిషి తోటి మనుషుల నుంచి పరాయి అయిపోవడం అంటే ఆ తోటి మనుషులలోని మానవసారం నుంచి దూరమైపోవడమే. మానవ సారమంటే మానవ సంబంధాల సమాహారమే. ఇతర మనుషులలోని మానవసారం నుంచి దూరం కావడమంటే మానవ సంబంధాల నుంచి దూరం కావడమే. అంటే తనలోని మానవసారం నుంచి కూడా దూరం కావడమే. అట్లా పెట్టుబడిదారీ సమాజంలో విశ్వవ్యాప్తమైన పరాయీకరణ వల్ల మనిషి తన నుంచి తానే పరాయి అయిపోతాడు.

ఇవీ ఆ నాలుగు రకాల పరాయీకరణలు. మార్క్స్ ఈ పరాయీకరణ భావనను హెగెల్ నుంచి గ్రహించి దానికి సామాజిక ఆర్థిక ప్రాతిపదికను అందించారు. మార్క్స్ వివరణలో పెట్టుబడిదారీ వ్యవస్థలో శ్రమ నిర్వహణకు మానవుని శ్రమశక్తి అమ్మకానికి యోగ్యమైన వస్తువుగా మార్చగల ప్రభావాన్ని కలిగి ఉంటుంది. మానవ శ్రమ ఫలితంగా ఉత్పత్తి అయిన వస్తువు ఆ తర్వాత శ్రమకు వ్యతిరేకమైన పరాయి వస్తువుగా, స్వతంత్ర శక్తిగా రూపొందుతుంది. శ్రామికుని శ్రమశక్తి భౌతిక వస్తువుగా రూపాంతరం చెందుతుంది. మార్క్స్ పరాయీకరణ భావాన్ని హెగెల్ నుంచి గ్రహించినప్పటికీ దాన్ని అతనికి భిన్నంగా వివరించాడు. హెగెల్ పరాయీకరణ, ఆబ్జెక్టిఫికేషన్‌లను పర్యాయ పదాలుగా వాడగా, మార్క్స్ అవి రెండూ ఒకే అర్థాన్ని ఇవ్వవన్నాడు. పెట్టుబడిదారీ వ్యవస్థలో పెట్టుబడి పూర్తి ఆధిక్యత వహించగా శ్రామికుడు కేవలం శ్రమనందించే వ్యక్తిగా మారతాడు. ఈ వ్యవస్థ మానవుని స్వంత శ్రమ ఫలితంగా తయారైన వస్తువు నుంచి వేరుచేస్తుంది. మానవుని శ్రమ ఫలితం పరాయి వస్తువుగా మారుతుంది. ఎంత ఎక్కువగా శ్రామికుడు పనిచేస్తే అంత ఎక్కువగా తన శ్రమ ఫలితంగా తయారైన వస్తువుల చేత నియంత్రణకు గురవుతాడు. ఉత్పత్తి పెరిగినకొద్దీ మనిషి క్షీణతకు గురవుతాడు. తను శ్రమించి పనిచేసి ఉత్పత్తి చేసిన వస్తువులు వ్యక్తికి చెందవు. అవి పెట్టుబడికి చెందుతాయి. శ్రామికుడు తన శ్రమశక్తిని పెట్టుబడిదారునికి అమ్మడం వలన తన శ్రమతో తయారు చేసిన వస్తువు తనకు పరాయిదవుతుంది. శ్రామికుని శ్రమ అతనికి చెందని, అతనికి వ్యతిరేకమైన వస్తువును సృష్టిస్తుందన్నమాట. ఉత్పత్తి క్రమంలోనే పరాయీకరణ గుర్తింపును పొందుతుంది. శ్రామికుడు సృజనాత్మకంగా పనిచేయలేడు. తన శ్రమశక్తిని తన కోరికలు తీర్చకోవడానికి, తృప్తిపరచుకోవడానికి బదులు అవసరాలను తీర్చుకునే సాధనంగా వాడుకుంటాడు. మరోవైపు ఉత్పత్తి ప్రక్రియపై నియంత్రణ, యాజమాన్యం పెట్టుబడిదారుని చేతిలో ఉంటుంది. శ్రామికుడు ఎంత పరిమాణంలో, ఏ పద్ధతిలో ఉత్పత్తి చేయాలో, ఏం ఉత్పత్తి చేయాలో పెట్టుబడిదారుడే నిర్ణయిస్తాడు. అలాగే ఉత్పత్తి ప్రక్రియలోని సాంకేతికత శ్రామికున్ని యంత్రానికి బానిసను చేస్తుంది. అందుకే మార్క్స్ పరాయీకరణ నుంచి బయటపడి మనిషి పరిపూర్ణమైన స్వేచ్ఛను పొందాలంటాడు. కానీ అలాంటి స్వేచ్ఛను మనిషి వర్గ సమాజంలో ఒంటరిగా సాధించలేడని చెప్పాడు. మనుషులంతా పీడకులు, పీడితులుగా చీలిపోయిన వర్గ సమాజంలో పీడకులు మాత్రమే స్వేచ్ఛ అనుభవించగలుగుతారు. ఈ స్వేచ్ఛ కూడా సాపేక్షమైన స్వేచ్ఛ. నిజానికి వర్గ సమాజంలో పరాయీకరణకు లోనుకాని మనిషి ఉండడు. కనుక ఎవరికీ సుఖ సంతోషాలుండవు. వర్గ సమాజంలో మనిషి పీడకుడైనా లేదా పీడితుడైనా అవుతాడు గానీ, మనిషిగా స్వేచ్ఛా జీవిగా అస్తిత్వంతో ఉండడు.

పరాయీకరణకు మార్క్స్ పరిష్కారాన్ని కూడా చూపించాడు. మార్క్స్ మనిషిని వెతికే ప్రక్రియను సామాజిక విప్లవం అన్నాడు. మానవీయ గుణాలను కోల్పోయిన మనిషిలో మానవీయతను శోధించి పునః ప్రతిష్టించడం అనేది ఆధ్యాత్మికతతోనో, సంస్కరణలతోనో సాధ్యం కాదు. అసమ సమాజాన్ని రూపుమాపడం వల్లనే అది సాధ్యమవుతుంది. ఎందుకంటే వర్గ సమాజమే ఈ అసమానతకు కారణం. కనుక ఈ బాధ్యతను శ్రామిక వర్గమే నిర్వర్తించగలదని మార్క్స్ భావించాడు. వ్యక్తి విముక్తి తన ఒక్కడితోనే సాధ్యం కాదని, తన వర్గ విముక్తితోనే, వర్గ రహిత సమాజంతో మాత్రమే అది సాధ్యమని మార్క్స్ విశ్వసించాడు. పెట్టుబడిదారీ వ్యవస్థ అంతమై దాని స్థానంలో సోషలిస్ట్ వ్యవస్థ అవతరిస్తేనే మానవజాతి విముక్తి సాధ్యమై, ఫలితంగా పరాయీకరణం అంతమవుతుందని మార్క్స్ అన్నాడు. పరాయీకరణ అంతం కమ్యూనిస్టు సమాజంలోనే సాధ్యమవుతుంది. ఈ దశలో బూర్జువా శ్రమ విభజన ఉండదు. మానవ స్వభావాన్ని అనేక విధాలుగా పరాయీకరణ నాశనం చేస్తే కమ్యూనిస్ట్ సమాజం అట్లాంటి మానవ స్వభావాన్ని పునరేకీకరించ గలదు. పరాయీకరణ అంతమవడం వల్ల ప్రజానీకానికి స్వేచ్ఛ లభిస్తుంది. పెట్టుబడిదారీ వర్గం అంతవరకూ అనుభవిస్తూ వచ్చిన అతి స్వేచ్ఛను తొలగిస్తుంది. తన వ్యక్తిగత స్వేచ్ఛను సమాజ శ్రేయస్సు కంటే మిన్నగా చూసే బూర్జువా వర్గ స్వేచ్ఛను సోషలిజం రూపుమాపుతుంది. శ్రమించకుండా బతకడానికి వీలు కలిగించే స్వేచ్ఛను రూపుమాపుతుంది. పెట్టుబడిదారులకు మినహా మిగిలిన వారందరికీ అంతకు ముందుకంటే అధికమైన నిజమైన స్వేచ్ఛ లభిస్తుంది. అతి తక్కువ స్వేచ్ఛను అనుభవిస్తున్న సాధారణ ప్రజానీకానికి ఎక్కువ స్వేచ్ఛ అందుతుంది. పెట్టుబడిదారీ వ్యవస్థలో తీవ్రంగా దుర్మార్గంగా ఉన్న పరాయీకరణను అంతం చేయడం వల్లనే ఇది సాధ్యం. మరో మాటలో చెప్పాలంటే కమ్యూనిస్ట్ సమాజం, సమ సమాజం ఏర్పడ్డప్పుడే ఇది సాధ్యం. అందుకు మార్గం కేవలం వర్గ పోరాటం.

మార్క్స్ మరణానంతరం మార్క్సియన్ రాజకీయ సిద్ధాంతంలో పరాయీకరణ భావనకున్న ప్రాధాన్యత క్రమేపి తగ్గుముఖం పట్టింది. అయితే మాక్స్‌వెబర్, జార్జి సిమెల్ వంటి కొద్దిమంది రచనల్లో

# పెట్టుబడిదారీ ఉత్పత్తి-శ్రమదోపిడీ-మార్కెట్ సంక్షోభం - 2

***పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలో శ్రమదోపిడీ జరిగే పద్ధతిని వివరిస్తున్నారు* రమేష్ పట్నాయక్**

*(గత సంచిక తరువాయి భాగం...)*

**శ్రమశక్తి విలువ – శ్రమ విలువ :** ఆర్థిక శాస్త్రంలో మార్కెట్‌లో అమ్మకం కొరకు తయారైన వస్తువులనే సరుకులు అని, సామాజిక విలువలని అంటారు. ఈ వ్యాసంలో సామాజిక విలువలు అన్నమాటను సరుకులుగానే లేదా అందులో చేరిన శ్రమగానే అర్థం చేసుకోవాలి. మానవ శ్రమ జోడించకపోతే చెట్టు తనకు తానే కలపను ఉత్పత్తి చేయదు. కలప తనకు తానే కుర్చీలను, బెంచీలను తయారు చేయదు. అంటే ప్రకృతి, యంత్రాలు తమకుతామే వస్తువులను తయారు చేయవు. మానవ శ్రమ లేనిదే వినియోగ వస్తువులు ఉత్పత్తికావు. మానవ శ్రమ మాత్రమే సామాజిక విలువలను సృష్టిస్తుంది. ఇప్పుడు 'శ్రమశక్తి' మరియు 'శ్రమ' విలువల వ్యత్యాసాన్ని పరిశీలిద్దాం. మనం ముందుగా తీసుకున్న ఉదాహరణలో 55 లక్షల విలువ గల కొత్త సరుకులు తయారయ్యాయి. ఈ కొత్త సరుకుల విలువలో 44.5 లక్షల రూపాయల విలువ గల ముడి సరుకుల విలువలు ఉన్నాయి. ఉత్పత్తి క్రమంలో భవనాలు, యంత్రాలలో 0.5 లక్షల తరుగు ఏర్పడింది. ఈ విలువలు కూడా తయారీ సరుకులకు చేరినట్లే. అంటే కార్మికుల శ్రమ వలన పెరిగిన విలువ 55 – (44.5 + 0.5) = 10 లక్షల రూపాయలు. 100 మంది కార్మికుల శ్రమశక్తి విలువ, అంటే వారి కుటుబాల తిండి తీర్థాలకయ్యే వ్యయం 5 లక్షల రూపాయలు అని ముందుగా గణించాము. కర్మిక శ్రమశక్తి సృష్టించిన విలువ 10 లక్షల రూపాయలు అని ఇప్పుడు చూస్తున్నాము. అంటే 5 లక్షల విలువైన శ్రమశక్తి, 10 లక్షల విలువైన శ్రమను ఉత్పత్తి చేస్తున్నదన్న మాట. మానవ శ్రమశక్తికి ఉండే ఈ సృజనాత్మకతే, తన విలువకంటె అధిక విలువను సృష్టించగల సృజనాత్మకతే, సంపద వృద్ధికి కారణం. ఈ వ్యత్యాసపు 5 లక్షల విలువనే అదనపు విలువ అన్నాడు కార్ల్ మార్క్స్. మన ఉదాహరణలో 100 మంది కార్మికులు ఒక నెల కాలం తమ కుటుంబాలతో కలిసి జీవించడానికి 5 లక్షలు ఖర్చయింది, ఇదే వేతనాలుగా చెల్లించబడింది. దానినే మనం వారి శ్రమశక్తి విలువ అన్నాం. 100 మంది కార్మికులు నెల రోజులు పనిచేసారు. వారు తమ శ్రమశక్తితో 10 లక్షలు విలువలు సృష్టించారు. సైద్ధాంతిక భాషలో చెప్పుకోవాలంటే 5 లక్షల రూపాయల విలువైన శ్రమశక్తి 10 లక్షల విలువను సృష్టించింది. అంటే కార్మిక శ్రమశక్తి అదనపు విలువను సృష్టించింది. మనం తీసుకున్న ఉదాహరణలోనే కాదు. ఇది సార్వత్రికంగా జరిగేదే. పెట్టుబడిదారుడు కార్మికుడికి సరాసరిన శ్రమశక్తి విలువ మాత్రమే ఇస్తాడు. అదనపు విలువను లాభంగా పరిగణిస్తాడు, తన ఖాతాలో జమచేసుకుంటాడు. దీనినే కార్ల్ మార్క్స్ 'లాభం అంటే చెల్లించబడని శ్రమ' అన్నాడు. ఈ శ్రమశక్తి, శ్రమ విలువల వ్యత్యాసాలు శారీరక శ్రమకేకాక ఇతర శ్రమలకు కూడా వర్తిస్తాయి. అయితే గణించే పద్ధతులు మరింత సంక్లిష్టంగా ఉంటాయి. ఈ వ్యాస పరిమితులలో ఆ సంక్లిష్ట విషయాలను మనం చర్చకు చేపట్టడం లేదు. అయితే, ఈ సందర్భంగా ఒకటి, రెండు ప్రత్యేక సందర్భాలను గమనిద్దాం.

మానవ శ్రమకు 'అదనపు విలువ' సృష్టికి సంబంధం లేదని వాదించేవారున్నారు. జర్మనీలో ఒక స్టీలు ఫ్యాక్టరీ ఉందని, దానిని పూర్తి ఆటోమేషన్ చేశారని కార్మికులు లేకుండానే ఫ్యాక్టరీ నడుస్తున్నదని, దీనిని బట్టి మానవ శ్రమ లేకుండానే ఫ్యాక్టరీలు ఉత్పత్తి చేయగలుగుతాయని, విలువ సృష్టించగలుగుతాయని ఈ సందర్భంగా పరాయీకరణం కనబడుతుంది. అస్తిత్వవాదులైన హెడెగర్, సార్త్ వంటి వారిపై పరాయీకరణ భావన ప్రభావం పడింది. హంగేరియన్ మార్క్సిస్ట్ రచయిత లుకాక్స్ తన 'హిస్టరీ ఆఫ్ కాన్సియస్‌నెస్'లో, మాక్స్‌వెబర్ తన 'ఐడియల్ టైప్ ఆఫ్ బ్యూరోక్రసీ'లో పరాయీకరణ భావనను చర్చించారు. వెబర్ పెట్టుబడిదారీ వ్యవస్థ పతనంతో పరాయీకరణ అంతమవుతుందన్న మార్క్స్ అభిప్రాయాన్ని వ్యతిరేకించాడు. జార్జ్ సిమ్మెల్ ప్రకారం బూర్జువా సమాజం శ్రమశక్తిని ఒక వస్తువుగా మారుస్తుంది. పర్యవసానంగా శ్రామికుల స్థితి సామాజిక వాస్తవంగా రూపొందుతుంది. సమాజం వస్తు మార్పిడి ద్వారా తన అవసరాలను తీర్చుకోవడంలోనే పరాయీకరణ దాగి ఉంది. పెట్టుబడిదారీ సమాజం అభివృద్ధి పరాయీకరణ నిర్మితిని పటిష్టం చేసి సామాజిక చైతన్యంపై ఆధిపత్యం పొందుతుంది.

**ముగింపు:** సామాజిక జీవనం సంక్లిష్టమైన కొద్దీ వ్యక్తి సంఘం నుండి దూరమవుతున్నాడు. వ్యక్తిగత సమస్యలు, సంక్షోభాలు, ఇబ్బందులు మనిషిని సమాజం నుంచి దూరం చేస్తున్నాయి. ఈ పరాయీకరణ భావనను ఎందరో తత్వవేత్తలు, రాజనీతి శాస్త్రవేత్తలు సామాజిక, ఆర్థిక, శాస్త్రవేత్తలు వివరించిననూ ఇప్పటివరకూ శాస్త్రీయమైన వివరణ మార్క్స్ నుంచే అందింది. పరాయీకరణ సమస్యకు శాస్త్రీయ పరిష్కారం కూడా మార్క్సిజమే చూపించింది. కమ్యూనిస్ట్ సమాజం ఏర్పడడం అన్నది ఎన్ని సుదీర్ఘమైన దశలను దాటితే సాధ్యమో కమ్యూనిస్ట్ సమాజం ఏర్పడ్డాక కూడా ఎన్నో దశల తర్వాత గాని పరాయీకరణ అంతం కాదు. బహుశా మార్క్స్ ఊహించిన రాజ్యరహిత సమాజం ఏర్పడితే గాని అది సాధ్యపడదేమో. అదంతా పక్కనబెడితే ఏదో ఒకరోజు మనిషి పరాయీకరణ చెందుతాడు. పరాయితనం నుంచి పరాయీకరించ బడతాడు. సంపూర్ణ స్వేచ్ఛననుభవిస్తాడు. పరిపూర్ణ మానవుడుగా మార్పు చెందుతాడు.

*(అయిపోయింది)*

*(రచయిత ప్రభుత్వ ఉపాధ్యాయుడు)*

వీ

కొద్దిమంది వాదిస్తున్నారు. ఈ ఉదాహరణలో ఉన్న సమస్య ఏమంటే ఫ్యాక్టరీలో జరగాల్సిన శ్రమ చాలావరకు బయట జరుగుతుంది. మిగతా పరిశ్రమలేవీ లేకుండా ఆ ఫ్యాక్టరీ ఇనుప ఖనిజం నుంచి స్టీల్ తయారు చేయజాలదు. దానికి కావలసిన ముడి సరుకులు, విద్యుత్, నీరు, రవాణా వంటి సహాయ సరుకులు ఎక్కడ నుంచో వస్తున్నాయి, ఆ ఫ్యాక్టరీకి కావలసిన యంత్రాలు ఇతర ఫ్యాక్టరీలలో తయారయ్యాయి. ఈ విధంగా మిగతా పారిశ్రామిక వ్యవస్థ అంతా లేకుండా సదరు స్టీలు ఫ్యాక్టరీ స్థాపన గాని, పనిచేయడం గాని సాధ్యం కాదు. మన చర్చ అంతా కూడా గణన సౌలభ్యం కొరకు ఒక ఫ్యాక్టరీని తీసుకుని చేశాము. కాని పెట్టుబడిదారీ వ్యవస్థ విడి విడి ఫ్యాక్టరీల మొత్తం మాత్రమే కాదు. అది అన్ని పరిశ్రమల సహకారం. కొన్ని సందర్భాలలో ఒక పరిశ్రమలో ఉత్పత్తి అయిన అదనపు విలువలో కొంత భాగం మరొక పరిశ్రమలో వ్యక్తం అవుతుంది. దానిని గణించడం కొంత సంక్లిష్టంగా ఉంటుంది, అంతే. కార్మికులు లేకుండా జర్మనీలో అటోమేటెడ్ స్టీల్ ఫ్యాక్టరీ సంపాదిస్తున్న లాభాలు గాని, ఐ.టి. పరిశ్రమ ఉద్యోగులకు ఎక్కువ జీతాలు ఇస్తూ కూడా లాభాలు సంపాదిస్తుండడాన్ని గాని, వ్యవస్థలో పునఃపంపకం అవుతున్న లాభాలుగా అర్థం చేసుకోవలసి ఉంటుంది. అంతేగాని, కార్మికుల దోపిడీకి, అదనపు విలువకు సంబంధంలేదని సిద్ధాంతం చేయడానికి కుదరదు.

ఐ.టి. వంటి పరిశ్రమలలో, ప్రధానంగా శిఖరాగ్ర ఉత్పత్తులు చేసే విభాగాలలో అదనపు విలువ మొత్తాన్ని కార్మికులు పొందే సందర్భాలు కూడా ఉండవచ్చు. అయినా ఆ రంగాలలో పరిశ్రమల యాజమాన్యాలకు అధిక లాభాలు వస్తున్నాయి. ఇవి ప్రధానంగా వ్యాపార లాభాలు అయ్యే అవకాశం ఉంది. అంటే, బహుశా వారి ఉత్పత్తులకు మార్కెట్‌లో పోటీ తక్కువగా ఉండడలం వలన అవి వాటిలో విలువకంటె అధిక ధరకు అమ్ముడుపోతూ ఉండవచ్చు. వీటిని ఏకస్వామ్య (మోనోపలి) ధరలుగా పరిగణించవచ్చు. ఈ రంగంలో ఒక ఉత్పత్తిలో పూర్తి పోటీ ఏర్పడక ముందే దానికి మించిన ఉత్పత్తి మార్కెట్‌లోకి రావడం వలన ఈ ఏకస్వామ్య (మోనోపలి) ధరల పరిస్థితి కొనసాగుతూ ఉంటుంది. దీనిని ఒక మినహాయింపుగా భావించాలి. ఇటువంటి మరికొన్ని మినహాయింపులు ఉండవచ్చు.

పైన చెప్పుకున్న మినహాయింపులను పక్కన పెడితే, ఒక పరిశ్రమలో ఉత్పత్తి అయిన అదనపు విలువ ఆ పరిశ్రమ యజమానులు కార్మికుల మధ్యనే పంపకం అవుతుంది. అత్యధిక సందర్భాలలో అత్యధిక శాతం అదనపు విలువ పెట్టుబడిదారుకే దఖలు పడుతుంది. ప్రాథమిక, అర్ధ నైపుణ్య రంగాలలో, విభాగాలలో ఈ దోపిడీ తీవ్రస్థాయిలో ఉంటుంది. ఉత్పత్తి క్రమంలో సృజించబడిన అదనపు విలువంతా తనకే చెందాలని పెట్టుబడిదారుడు ప్రయత్నిస్తాడు. అదే న్యాయమని వాదిస్తాడు, ప్రచారం చేస్తాడు. పాఠశాలలు, కళాశాలలు కూడా ఇదే సిద్ధాంతాన్ని బోధిస్తాయి. అయితే అదనపు విలువ తమ సృజన అని కార్మికులు క్రమంగా గ్రహిస్తారు. అసంఘటిత కార్మికుల ఉద్యమాలు బలహీనంగా ఉంటాయి. వారు తాము సృష్టించిన అదనపు విలువలో ఏమాత్రం భాగం పొందలేరు. అనేక సందర్భాలలో కనీసమైన తిండితీర్థాలకు అవసరమైన శ్రమశక్తి విలువను కూడా పూర్తిగా పొందలేరు. అదలా ఉండగా, సంఘటిత కార్మికులు కనీసం తిండితీర్థాలకు అవసరమైన శ్రమశక్తి విలువను పొందడమేగాక తాము సృష్టించిన అదనపు విలువలో కొంత భాగాన్ని తమ బలమైన ఉద్యమాల ఫలితంగా, మెరుగైన వేతనాలుగా, పెన్షన్లుగా, ఇతర సౌకర్యాలుగా పొందుతారు. కార్మికులు, పెట్టుబడిదారుల బలాబలాలపైనే కార్మికులకు పూర్తిగా చెందవలసిన అదనపు విలువ పంపకం ఆధారపడి ఉంటుంది. అందుకే ఈ రెండు వర్గాలు పరస్పర శత్రు శిబిరాలుగా ఉంటాయి. కార్మికులకిచ్చే వేతనాలను మరింతగా తగ్గించి లాభాలను పెంచుకోవడానికి పెట్టుబడిదారుడు ప్రయత్నిస్తాడు. దోపిడీని తగ్గించుకోవడానికి వేతనాలు పెంచుకోవడాని కార్మికులు ప్రయత్నిస్తారు. అందుకే ఈ రెండు వర్గాల మధ్య ఎడతెగని వైరం, వైరుధ్యం ఉంటాయి. ఈ శ్రమ – పెట్టుబడుల మధ్య వైరుధ్యమే పెట్టుబడిదారీ వ్యవస్థలో మౌలికమైన వైరుధ్యం. ఇది ఒక స్థితిలో ఉత్పత్తి శక్తుల, ఉత్పత్తి సంబంధాల మధ్య వైరుధ్యంగా ముందుకు వస్తుంది. ఉత్పత్తి శక్తుల, ఉత్పత్తి సంబంధాల వైరుధ్యాన్ని పరిష్కరించడానికి సమాజపు విప్లవాత్మక పునర్నిర్మాణం అవసరమవుతుంది. ఈ విషయాన్ని మరొక చోట చర్చిద్దాం.

అదలా ఉండగా, సామాజిక ప్రగతి క్రమాన్ని పరిశీలిస్తే, పెట్టుబడిదారీ వ్యవస్థ అనేది పరిశ్రమలు పెరిగి, భూస్వాములు, జమిందారులు, జాగీరుదారీ వ్యవస్థ దివాలా తీసేవరకు , అది దుర్మార్గమైన నిర్దాక్షిణ్యమైన దోపిడీ వ్యవస్థ అయినా, నాగరికత అభివృద్ధిలో కీలకమైన పాత్ర పోషిస్తుంది. భూస్వాముల ఆస్తులన్నీ పెట్టుబడిదారుల పరమైన తరువాత, నిర్జీవమైన ఫ్యూడల్ ఆస్థి చలనశీలమైన పెట్టుబడిగా మారిపోయిన తరువాత, సారాంశంగా చెప్పుకోవాలంటే, సృష్టించబడిన అదనపు విలువ అంతా పెట్టుబడిదారులకు చేరి పెట్టుబడిగా మారిన తరువాత, అంటే భూస్వామ్య వ్యవస్థ విచ్ఛిన్నమైన తరువాత పెట్టుబడిదారీ వ్యవస్థ చారిత్రక పాత్ర పూర్తి అవుతుంది. భారత దేశం మరియు అనేక వెనకబడిన దేశాలలో పెట్టుబడిదారులు భూమిపై యాజమాన్యాన్ని ఆశించడానికి బదులు భూమిపై ఉత్పత్తి అయ్యే అదనపు విలువను స్వాదీనం చేసుకుంటున్నారు. ఎరువుల, విత్తనాలు, పురుగుమందులు వంటి ఇన్‌పుట్స్ వ్యాపారంలోనూ అలాగే వ్యవసాయ ఉత్పత్తుల వ్యాపారం ద్వారానూ వ్యవసాయరంగపు అదనపు విలువను వ్యాపార రంగంలో ఉన్న పెట్టుబదిదారులు హస్తగతం చేసుకుంటున్నారు. ఈ పెట్టుబడి సర్వీసు రంగంలోనికి, బ్యాంకులలోనికి, షేర్ మార్కెట్ లోనికి, పరిశ్రమలలోనికి వెళుతుంది. సారాంశంలో భారత వ్యవసాయ రంగంలో పెట్టుబడి దోపిడియే జరుగుతుంది. (భారత దేశంలో జన సాంద్రత ఎక్కువగా ఉన్నందున తక్కువ స్థాయి యాంత్రీకరణయే గిట్టుబాటుగా ఉంది. తక్కువ స్థాయి యాంత్రీకరణ లేక యాంత్రీకరణ లేకపోవడం దానికదే ఫ్యూడలిజం కాదు. అది వేరే చర్చ) ఈ విధంగా వ్యవసాయం పెట్టుబడిదారీ వర్గం చేతిలోనికి వెళ్ళిన తరువాత పెట్టుబడిదారీ వ్యవస్థ చారిత్రక పాత్ర పూర్తి అవుతుంది. తరువాత అది సామ్రాజ్యవాద దశకు చేరి అభివృద్ధి నిరోధక పాత్ర పోషిస్తుంది. ఈ సామ్రాజ్యవాదం యుద్ధాలకు, వలసవాదానికి పర్యావరణ విధ్వంసానికి, సామాజిక సంబంధాల విధ్వంసానికి దారితీస్తుంది. చరిత్రలో పెట్టుబడి ప్రగతిశీల పాత్ర అంతమైపోయింది. అది ఇప్పుడు ఒక గొప్ప మార్కెట్ సంక్షోభంలో చిక్కుకుంది.

**పరిశ్రమల విస్తరణ, పెట్టుబడిదారీ అభివృద్ధి దశ**

మనం తీసుకున్న ఉదాహరణలో పెట్టుబడిదారుడు కోటి రూపాయలు వెచ్చించాడు. అందులో 50 లక్షల రూపాయలు స్థావర పెట్టుబడిగా కొనసాగుతుంది. అది నెలవారీ లెక్కలోనికి రాదు. ముడి సరుకులకు, సహాయక సరుకులు, సేవలకు, భవనాల, యంత్రాల అరుగుదలకు ఇంకా కార్మికుల వేతనాలకు నెల నాటికి (44.5 + 0.5 + 5) 50

లక్షల రూపాయలు ఖర్చవుతుంది. తయారయిన సరుకు 55 లక్షల రూపాయలకు అమ్ముడుపోతుంది. నెల తిరిగేసరికి 5 లక్షల రూపాయల స్థూల లాభం వచ్చింది. జనవరి 1న 50 లక్షల స్థావర పెట్టుబడి, 50 లక్షల టర్నోవర్ పెట్టుబడితో పరిశ్రమ ప్రారంభిస్తే ఫిబ్రవరి 1 నాటికి 5 లక్షల స్థూల లాభం వచ్చింది. మరుసటి సంవత్సరం జనవరి 1కి స్థూల లాభం 12 నెలలకు గాను 60 లక్షలు అవుతుంది. ప్రారంభ పెట్టుబడి ఒక కోటి రూపాయలు తనదే అయినా, బ్యాంకు నుంచి అప్పు తెచ్చినదైనా, తనది కొంత, అప్పు తెచ్చినది కొంత అయినా పెట్టుబడిదారుడు బ్యాంకు నుంచి అప్పు తెచ్చినట్లే ఖాతాలో చూపిస్తాడు. కోటి రూపాయలకు సంవత్సరానికి 13.5 శాతం వడ్డీ రేటు చొప్పున్న 13.5 లక్షలు వడ్డీగా రాస్తాడు. సౌలభ్యం కొరకు బ్యాంకుకు వడ్డీ చెల్లించాడనుకుందాం. భూమి తనదైనా కాకపోయినా సంవత్సరానికి 50 వేలు అద్దెగా రాస్తాడు. ఇంకా మిగిలిన లాభం 46 లక్షలు. దీనిని పన్ను చెల్లింపునకు ముందు లాభం అంటారు. ప్రభుత్వానికి వివిధ పన్నుల కింద సంవత్సరానికి 6 లక్షల రూపాయలు చెల్లిస్తాడు. ఇంకా మిగిలిన 40 లక్షల రూపాయలు పెట్టుబడిదారునికి సంవత్సరానికి నికర లాభం. పెట్టుబడిదారుడు ఇలా అంటాడు; నేను భూమికి భాటకం చెల్లించాను, పెట్టుబడికి వడ్డీ చెల్లించాను, ఒక బాధ్యతాయుతమైన పౌరునిగా ప్రభుత్వానికి పన్ను చెల్లించాను. మిగిలిన 40 లక్షల రూపాయలు వ్యవస్థాపకుడిగా నా లాభం. (ప్రతి నెలా వచ్చిన స్థూల లాభం 5 లక్షల రూపాయలు ఏ నెలకానెల సేవింగ్స్ అకౌంట్‌లో వేస్తే నెలకు వందకు రు. 0.50 పైసలు వడ్డీ వచ్చినా పెట్టుబడిదారుడికి బ్యాంకు నుంచి 1,72,500 రూపాయల వడ్డీ సంవత్సరాంతానికి వస్తుంది. దీనిని మనం గణన సౌలభ్యం కొరకు విడిచిపెడుతున్నాం) ఈ నలభై లక్షలలో మన పెట్టుబడిదారుడు 4 లక్షల ధనం స్వంతానికి వాడుకుంటాడు. ఒక లక్ష మతధార్మిక సంస్థల కింద ఖర్చు చేస్తాడు. మతం ఆయన దోపిడీని ధర్మ సమ్మతం చేస్తుంది. సంవత్సరాంతానికి మిగులు లాభం 35 లక్షల రూపాయలను పెట్టుబడిదారుడు బ్యాంకుకు అప్పు కింద జమచేస్తాడనుకుందాం. అలా చేస్తే సంవత్సరాంతానికి మిగిలిన అప్పు 65 లక్షల రూపాయలు. రెండవ సంవత్సరం అంతానికి వడ్డీ తగ్గుతుంది. వడ్డీ 9.47 లక్షల రూపాయలు మాత్రమే చెల్లించవలసి ఉంటుంది. కాబట్టి అసలు చెల్లింపు పెంచగలుగుతాడు. 4వ సంవత్సరం అంతానికి అప్పు పూర్తిగా చెల్లిపోగా చేతిలో సుమారు 20 లక్షల రూపాయలు మిగులుతుంది. అంతేకాదు, మొదటిగా పెట్టుబడి పెట్టిన కోటి రూపాయలు పెట్టుబడిదారుని స్వంతమే అయితే అది 3 సంవత్సరాలలోనే రెట్టింపు అవుతుంది. లాభాన్ని నిరంతరాయంగా పెట్టుబడిగా మారుస్తూ ఉంటే ఆయన పెట్టుబడి ప్రతి మూడు సంవత్సరాలకు రెండు రెట్లు అవుతుంది. ఈ విధంగా పెట్టుబడిదారుడి లాభాలు, పెట్టుబడి ఇబ్బడిముబ్బడిగా పెరుగుతాయి. అయితే అందుకు నాలుగు షరతులు ఉన్నాయి.

**పెట్టుబడి పెరగడానికి నాలుగు షరతులు**

1) పెట్టుబడి పెరుగుతున్న కొద్దీ ఫ్యాక్టరీల సంఖ్య లేదా సామర్థ్యం పెంచాలి.
2) పెరుగుతున్న పరిశ్రమల అవసరాల మేరకు ముడి సరుకులు అందుబాటులో ఉండాలి.
3) ఫ్యాక్టరీలు పెరుగుతున్న కొద్దీ అధిక సంఖ్యలో కార్మికులు అవసరం అవుతారు, కార్మికులు అందుబాటులో ఉండాలి.
4) అన్నింటికంటే ముఖ్యం అధికాధికంగా తయారవుతున్న సరుకులు అమ్ముడుపోవాలి.

తయారైన సరుకులు అమ్ముడుపోకపోవడమే సంక్షోభం. సరుకులు అమ్ముడుపోకపోతే పెట్టుబడిదారుడు ఉత్పత్తి తగ్గిస్తాడు, కార్మికులను తగ్గిస్తాడు. అన్ని పరిశ్రమలలో వస్తువుల అమ్మకాలు తగ్గిపోతే కార్మికులు రిట్రెంచ్‌మెంట్‌కు గురవుతారు. వారి కొనుగోలు శక్తి మరింత తగ్గుతుంది. మార్కెట్ సంక్షోభం, అంటే సరుకులు అమ్ముడు కాకపోవడం మరింత పెరుగుతుంది. ఇటువంటి సంక్షోభాలు ఒక దేశంలోనూ, కొన్ని సందర్భాల లో ప్రపంచ వ్యాప్తంగానూ ఏర్పడవచ్చు. ఎక్కువ పరిశ్రమలున్న దేశం గాని, ఎక్కువ కొనుగోలుదారులు ఉన్న దేశం గాని, ఎక్కువ సంఖ్యలో దేశాలు గాని సంక్షోభంలో పడితే అది ప్రపంచ సంక్షోభానికి దారితీస్తుంది. 1912 లోనూ, 1935 లోనూ అటువంటి ప్రపంచవ్యాప్తి సంక్షోభాలు వచ్చిన విషయం వాటిని వెన్నంటి ప్రపంచ యుద్ధాలు వచ్చిన విషయం తెలిసిందే. ప్రస్తుతదశలో అయితే ఒక నిరంతర సంక్షోభం, ఒక నిరంతర యుద్ధం అనే పరిస్థితి నెలకొని ఉంది. అదలా ఉంచితే యతారైన వస్తువులు ఎందుకు అమ్ముడుపోవు అన్న సమస్యను పరిశీలిద్దాం.

**మార్కెట్ సంక్షోభం, పెట్టుబడిదారీ వ్యవస్థ క్షీణదశ**

పెట్టుబడిదారులు తమ ఉత్పత్తులను అమ్ముకోలేకపోవడాన్ని మార్కెట్ సంక్షోభం అంటారు. ఉత్పత్తి అయిన సరుకుల విలువ కంటే వినియోగదారుల కొనుగోలు శక్తి తక్కువగా ఉంటే వినియోగదారులు కొనలేరు, పెట్టుబడిదారులు అమ్మలేరు. ఈ సమస్యను పరిశీలించడానికి వినియోగదారుల కొనుగోలు శక్తిని గణిద్దాం. ఒకానొక కాలంలో ఇంగ్లాండు దేశంలో పారిశ్రామిక పెట్టుబడి మొత్తం విలువ 10,000 కోట్ల రూపాయలు అనుకుందాం. అంటే గనులు, సహాయక సరుకులు తయారు చేసే పరిశ్రమలు, యంత్రాలు తయారు చేసే పరిశ్రమలు, తయారీ సరకుల పరిశ్రమలతో సహా – మొత్తం పట్టణ పరిశ్రమలలో పెట్టుబడి 10,000 కోట్ల రూపాయలు అనుకుందాం. గణన సౌకర్యం కొరకు గ్రామాలలో ఇంకా పెట్టుబడి ప్రవేశించలేదనుకుందాం. ఈ మొత్తం ఇంగ్లాండు పట్టణ పరిశ్రమలలో సదరు సంవత్సరంలో స్థావర పెట్టుబడి 5,000 కోట్లు, టర్నోవర్ పెట్టుబడి 5,000 కోట్లు అనుకుందాం. గనులు, యంత్ర పరిశ్రమలు, సహాయక సరుకులు, తయారీ సరకులు ఉత్పత్తి చేసే అన్ని పరిశ్రమలు, వ్యాపారులు, బ్యాంకర్లు – అంటే మొత్తం పెట్టుబడిదారుందరూ ఒక కన్సార్టియంగా ఏర్పడ్డారనుకుందాం. అలా ఏ దేశంలో ఎప్పుడూ ఏర్పడలేదు. గణన సౌలభ్యం కొరకే మనం ఇలా అనుకుంటున్నాం. ఇప్పుడు ఈ పెట్టుబడిదారుల మధ్య అంతర్గత లావాదేవీలు మనం గణించనవసరం లేదు. మొత్తం ఈ పరిశ్రమలన్నీ ఒక పెట్టుబడిదారీ సంస్థ నడుపుతున్నట్లు లెక్కలు వేయవచ్చు. ఈ ఇంగ్లాండు పెట్టుబడిదారీ వర్గం 5,000 కోట్ల రూపాయల టర్నోవర్ పెట్టుబడి నుంచి 4,500 కోట్ల రూపాయలు విలువగలిగిన నూలు, ఉన్ని, తోలు, జనపనార, పొగాకు, రబ్బరు పాలు, నీలిమందు, నూనె గింజలు వంటి వాణిజ్య వ్యవసాయ ఉత్పత్తులను గ్రామీణ రంగం నుండి ముడి సరుకులుగా కొనుగోలు చేస్తారు. 10 లక్షల మంది కార్మికులకు 500 కోట్ల రూపాయల వేతనాలు చెల్లించి ఒక నెలకాలం ఉత్పత్తి చేస్తారు. నెల అంతానికి 550 కోట్ల రూపాయల ఉత్పత్తి జరుగుతుంది. మరి ఈ ఉత్పత్తి ఎలా అమ్ముడుపోవాలి?

*(ఇంకా ఉంది...)*

*(రచయిత విద్యా పరిరక్షణ కమిటీ నాయకులు)* వీ

# సోషలిజానికి పరివర్తన : కార్మికవర్గ విప్లవం

- డా. నళిని, డా. శ్రీనివాస్

ఆగస్టు వీక్షణంలో సాయన్నగారు 'మార్క్సిజం విశ్వజనీన సత్యం' వ్యాసంలో రచయిత కొన్ని విప్లవాలు శాంతియుతంగా జరిగాయనీ, అందుకు ఉదాహరణగా రష్యా బోల్షివిక్ విప్లవాన్ని చూపడం సరైంది కాదనీ వివరించారు. వ్యాసంలో దొర్లిన పొరపాటును సాయన్నగారు సరిగానే ఎత్తిచూపారు. అయితే ఈ సందర్భంగా రాజ్యాంగ యంత్రాంగం – కార్మికవర్గ విప్లవం సమస్యపై సమగ్రమైన అవగాహన కోసం మరికొంత వివరణ ఇవ్వవలసిన అవసరం ఉంది.

శాంతియుత పద్ధతుల ద్వారా అధికారాన్ని స్వాధీనపరుచు కోవడానికి కార్మికవర్గం ప్రాధాన్యతనిస్తుంది. కానీ అభివృద్ధి నిరోధక వర్గాలు అధికారాన్ని తమంత తాముగా వదులుకోవనీ, ప్రజల విప్లవోద్యమంపై దౌర్జన్యం మొట్ట మొదట ప్రారంభించేది ఆ వర్గాలేననీ, అంతర్యుద్ధాన్ని రెచ్చగొట్టేది వారేననీ, ఆ విధంగా సాయుధ పోరాటాన్ని రంగం మీదకి తెచ్చిపెడతాయనీ చరిత్రానుభవం మనకు చెబుతున్నది. హింసాయుత విప్లవం కార్మికవర్గ విప్లవం సార్వజనీన సూత్రం. ఇది మార్క్సిస్టు లెనినిస్టు ప్రాథమిక సూత్రం. ప్రతి విప్లవంలోనూ కీలకమైన సమస్య రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకోవడం, బూర్జువా రాజ్యాంగ యంత్రాంగాన్ని ధ్వంసం చేసి కార్మికవర్గ నియంతృత్వాన్ని స్థాపించడం. ఆ విధంగా బూర్జువా రాజ్యం స్థానంలో కార్మికవర్గ రాజ్యాన్ని స్థాపించడం.

కామ్రేడ్ మావో తన సుప్రసిద్ధమైన 'సోవియట్ ఆర్థికం విమర్శనాత్మక పరిశీలన' గ్రంథంలో ఇలా అన్నారు, 'ప్రతి దేశంలోని కమ్యూనిస్టు పార్టీ, విప్లవ శక్తులు రెండు పద్ధతుల్లోనూ, అంటే శాంతియుతంగా విజయం సాధించడానికీ, హింసాయుతంగా అధికారాన్ని హస్తగతం చేసుకోవడానికీ కూడా సంసిద్ధంగా ఉండాలి. ఈ రెండింటిలో దేనినీ వదులుకోకూడదు. విషయాల సాధారణ ధోరణిని పరిగణలోకి తీసుకుని, బూర్జువాజీకి తన రాజకీయ అధికారాన్ని వదులుకోవాలనే ఉద్దేశం లేదనే వాస్తవాన్ని గ్రహించడం అవసరం. వారు రాజకీయాధికారం కోసం పోరాడుతారు. వారి జీవితానికే ముప్పు ఏర్పడినప్పుడు, వారు బలప్రయోగానికి ఎందుకు పూనుకోకూడదు? అక్టోబర్ విప్లవంలో, మన విప్లవంలో వలెనే రెండు పద్ధతులు సిద్ధంగా ఉండినాయి. 1917 జూలైకి మునుపు.

లెనిన్ విజయాన్ని సాధించడానికై శాంతియుత పద్ధతుల్ని ఉపయోగించడం గురించి ఆలోచించారు. అయితే కార్మిక వర్గానికి అధికారాన్ని శాంతియుతంగా అప్పజెప్పడమనేది ఇంకెంతమాత్రమూ సాధ్యం కాదని జూలై సంఘటన నిరూపించింది. తన అభిప్రాయాన్ని మార్చుకుని మూడు నెలల పాటు సైనిక సన్నాహాలు కావించిన తర్వాత ఆయన అక్టోబర్ విప్లవ విజయాన్ని సాధించగలిగారు.

అక్టోబర్ విప్లవ క్రమంలో కార్మికవర్గం రాజకీయ అధికారాన్ని హస్తగతం చేసుకున్న తర్వాత లెనిన్ శాంతియుత పద్ధతుల వైపు మొగ్గు కనపరిచారు. పెట్టుబడిదారీ విధానాన్ని తొలగించడానికి 'నష్టపరిహారాన్ని చెల్లించే పద్ధతి' సోషలిస్టు పరివర్తనను అమలులో పెట్టారు. అయితే ఆ దేశంలోని బూర్జువాజీ పదునాల్గు సామ్రాజ్యవాద శక్తులతో కుమ్మక్కై విప్లవ ప్రతీఘాతుక సాయుధ తిరుగుబాటుకు, జోక్యాలకు పూనుకుంది. అందుచేత, అక్టోబర్ విప్లవ విజయాన్ని సుదృఢం చేసుకునే ముందు రష్యా పార్టీ నాయకత్వం కింద మూడు సంవత్సరాల పాటు సాయుధ పోరాటం చేయాల్సి వచ్చింది' (పేజీలు 33, 34).

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు (బోల్షివిక్) పార్టీ చరిత్ర జూలై సంఘటన గురించీ బోల్షివిక్కుల ఎత్తుగడల గురించీ ఇలా తెలియజేసింది.

'పెట్రోగ్రాడ్ కార్మికుల, సైనికుల విప్లవ క్రోధావేశం పొంగి పొరలింది. జూలై 3న పెట్రోగ్రాడ్‌లోని వైబార్గ్ జిల్లాలో వాటంతటవే ప్రదర్శనలు ప్రారంభమయ్యాయి. అవి ఆ రోజంతా సాగాయి. విడి విడిగా బయలు దేరిన ప్రదర్శనలన్నీ కలిసి బ్రహ్మాండమైన సాయుధ ప్రదర్శనగా మారాయి. అధికారాన్ని సోవియట్లకు అప్పగించాలని ఈ ప్రదర్శన కోరింది. బోల్షివిక్ పార్టీ ఆ సమయంలో సాయుధ పోరాటానికి వ్యతిరేకం. ఎందువల్లనంటే, విప్లవ సంక్షోభం ఇంకా పరిపక్వం కాలేదని అది భావించింది.

రాజధాని నగరంలోని తిరుగుబాటును బలపరచడానికి సైన్యం, ఇతర రాష్ట్రాల ప్రజలు ఇంకా సిద్ధంగా లేరు. ఒంటరిగా పరిపక్వం కాకుండా తిరుగుబాటును గనుక తీసుకొనివస్తే, విప్లవ అగ్రశ్రేణిని అణచివేయడానికి విప్లవ ప్రతీఘాతకులకు మరింత సులభం అవుతుందని బోల్షివిక్ పార్టీ భావించింది. కాని ప్రజలను ప్రదర్శన చేయకుండా ఉంచడం అసాధ్యమని స్పష్టం కాగానే, ఆ ప్రదర్శనలో పాల్గొని దాన్ని శాంతియుతంగా సంఘటిత రూపాన నడపడానికి పార్టీ నిశ్చయించింది. ఇందులో బోల్షివిక్ పార్టీ విజయం పొందింది.

లక్షలాది స్త్రీలు, పురుషులు పెట్రోగ్రాడ్ సోవియట్ ప్రధాన కార్యాలయానికి, అఖిల రష్యన్ సోవియట్ల కార్యనిర్వాహక కార్యాలయానికి ఊరేగింపుతో వెళ్లారు. సోవియట్లు అధికారాన్ని తమ హస్తగతం చేసుకోవాలనీ సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ వర్గంతో తెగతెంపులు చేసుకోవాలనీ, కార్యకారియైన శాంతి విధానాన్ని అవలంబించాలనీ వారు కోరారు. 'ప్రదర్శన శాంతియుత స్వభావం కలిగి ఉన్నప్పటికీ ప్రభుత్వం, విప్లవ ప్రతీఘాత యూనిట్లను, అనగా సైనికాధికారులు, నావికా అధికారులు కల్గిన దళాలను ప్రదర్శనను ఇవ్వడానికి పంపారు. పెట్రోగ్రాడ్ వీధులు కార్మికుల, సైనికుల రక్తంతో ప్రవహించాయి... ద్వంద్వాధికారం అంతమైంది. ద్వంద్వాధికారం పెట్టుబడిదారీవర్గానికి అనుకూలంగా అంతమైంది. విప్లవ శాంతి దశ అంతమైంది. ఇప్పుడు తుపాకిదే ప్రథమాంశం.

మారిపోయిన పరిస్థితిని దృష్టిలో ఉంచుకుని బోల్షివిక్ పార్టీ తన ఎత్తుగడలను మార్చుకొన నిశ్చయించింది. బోల్షివిక్ పార్టీ అండర్ గ్రౌండ్‌కు వెళ్లింది. తమ పార్టీ నాయకుడు లెనిన్‌కు సురక్షితమైన ప్రదేశం ఏర్పాటు చేసింది. సాయుధ బలంతో బూర్జువా అధికారాన్ని కూలదోసి సోవియట్ల అధికారాన్ని నెలకొల్పే ఉద్దేశంతో తిరుగుబాటుకు బోల్షివిక్ పార్టీ సన్నాహం చేయసాగింది... అక్టోబర్ 25న అరోరా యుద్ధ నౌక ఫిరంగి గర్జనతో ఒక నూతన శకం, సోషలిస్టు విప్లవ శకం ప్రారంభమైంది. పెట్రోగ్రాడ్‌లోని సాయుధ తిరుగుబాటు విజయం పొందింది. అక్టోబర్ సోషలిస్టు విప్లవం పెటుబడిదారీ విధానాన్ని నాశనం చేసింది. అది

కార్మికవర్గ నియంతృత్వాన్ని స్థాపించింది. అది మానవజాతి చరిత్రలో ఒక నూతన శకాన్ని, శ్రామికవర్గ విప్లవాల శకాన్ని ప్రారంభించింది' (పేజీలు 19,20,21,40,62 – క్రాంతి ప్రచురణ).

కామ్రేడ్ స్టాలిన్ మరణానంతరం కృశ్చేవ్ రివిజనిస్టు ముఠా సోవియట్ పార్టీ నాయకత్వాన్నీ, ప్రభుత్వాధికారాన్నీ చేజిక్కించుకుంది. అక్టోబర్ విప్లవ విజయాలను వమ్ముచేసింది. మార్క్సిస్టు లెనినిస్టు మౌలిక సూత్రాలనే తిరగదోడి ప్రపంచ విప్లవానికి ద్రోహం చేసింది. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో తలెత్తిన ఆధునిక రివిజనిజానికి వ్యతిరేకంగా కామ్రేడ్ మావో నాయకత్వాన చైనా కమ్యూనిస్టు పార్టీ దృఢంగా నిలిచి, సిద్ధాంత రాజకీయ రంగంలో బృహత్తర చర్యను కొనసాగించి తొమ్మిది వ్యాఖ్యానాలను (కామెంట్స్) ప్రచురించింది. ఎనిమిదవ కామెంట్ అయిన 'కార్మికవర్గ విప్లవం – కృశ్చేవ్ రివిజనిజం', అక్టోబర్ విప్లవం గురించీ, లెనిన్ అంచనాతో అభిప్రాయాల గురించీ ఇలా వివరించింది.

'1917లో ఫిబ్రవరి విప్లవానంతరం లెనిన్ ఆనాడు నెలకొంటున్న పరిస్థితిలో 'రష్యాలో ఒక మినహాయింపుగా ఈ విప్లవం శాంతియుత విప్లవం కావచ్చున'నీ అన్నారు. (కార్మికుల, సైనికుల సోవియట్ల ప్రతినిధుల ప్రథమ రష్యన్ కాంగ్రెసు, విఐ లెనిన్ సెలెక్టివ్ వర్క్స్, విదేశీ భాషా ప్రచురణాలయం, మాస్కో, 1952 సంపుటి 2 పార్ట్–1 పేజీ 80.) ఆనాటి ప్రత్యేక పరిస్థితుల కారణంగా ఆయాన దానిని ఒక మినహాయింపుగా భావించారు. 'అసలు విషయమేమంటే ప్రజల చేతుల్లో ఆయుధాలు ఉన్నాయి. ప్రజలకు సంబంధించినంతవరకు బయటి నుంచి నిర్బంధం ప్రయోగించ బడలేదు.' ('నినాదాలు' సెలెక్టివ్ వర్క్స్, విదేశీ భాషా ప్రచురణాలయం, మాస్కో, 1952, సంపుటి 2, పార్–1, పేజీ 88.) 1917 జూలైలో విప్లవ ప్రతీఘాతుక ప్రభుత్వం ప్రజలను సాయుధ బలప్రయోగం ద్వారా అణిచివేసింది. పెట్రోగ్రాడ్ వీధులు కార్మికులు, సైనికుల రక్తంతో తడిసిపోయాయి. ఈ సంఘటన తర్వాత లెనిన్, 'రష్యన్ విప్లవం శాంతియుతంగా అభివృద్ధి చెందగల ఆశలన్నీ ఖచ్చితంగా అడుగంటిపోయాయనీ' ప్రకటించారు. ('రాజకీయ పరిస్థితి' కలెక్టడ్ వర్క్స్, ఇంటర్నేషనల్ పబ్లికేషర్స్ న్యూయార్క్, 1932, సంపుటి 21, పుస్తకం 1, పేజీ 37.)

1917 అక్టోబర్‌లో కార్మికుల సిపాయిల సాయుధ తిరుగుబాటును లెనిన్, బోల్షివిక్ పార్టీలు దృఢ నిశ్చయంతో నిడపి రాజ్యాధికారాన్ని స్వాధీనపరుచుకున్నాయి. 1918 జనవరిలో లెనిన్ 'వర్గ పోరాటం.... అంతర్యుద్ధంగా పరిణమించిదనీ' ఉద్ఘాటించారు. ('రాబోవు ప్రపంచపు మనుషులు' విఐ లెనిన్, కలెక్టడ్ వర్క్స్, 4వ రష్యన్ ముద్రణ, మాస్కో సంపుటి 26, పేజీ 393.) ఆ తర్వాత సోవియట్ ప్రభుత్వం మరో మూడున్నర ఏళ్లపాటు విప్లవ యుద్ధాన్ని కొనసాగిస్తూ ఎన్నో ఉదాత్తమైన త్యాగాలు చేశాక మాత్రమే దేశీయ విప్లవ ప్రతీఘాతుక తిరుగుబాటునీ, విదేశీ సాయుధ జోక్యాన్నీ ధ్వంసం చేయగలిగింది. అప్పుడు మాత్రమే విప్లవ విజయం సంఘటితపడింది. 'అక్టోబర్ విప్లవంలో విప్లవాత్మక హింస అద్భుతమైన విజయాలు సాధించింద'నీ 1918లో లెనిన్ అన్నారు' (పేజీలు 24,25). ('సోవియట్ రాజ్యాధికార విజయాలు, ఇబ్బందులు' కలెక్టడ్ వర్క్స్, 4వ రష్యన్ ముద్రణ, మాస్కో, సంపుటి 20, పేజీ 21)

1957లో ప్రపంచ కమ్యూనిస్టు, వర్కర్స్ పార్టీల ప్రతినిధుల సమావేశం మాస్కోలో జరిగింది. కామ్రేడ్ మావో నాయకత్వాన చైనా ప్రతినిధి వర్గం ఆ సమావేశంలో పాల్గొని గొప్ప కృషి చేసింది. ఆ సమావేశంలో చైనా పార్టీకీ, సోవియట్ పార్టీకీ మధ్య కొనసాగిన వివాదంలో క్యాపిటలిజం నుంచి సోషలిజానికి పరివర్తన అంశమే ప్రధాన అంశంగా రూపొందింది. 'రాజ్యాంగ యంత్రం – కార్మికవర్గ విప్లవం' సమస్యపై సోవియట్ పార్టీ మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంతాన్ని బలహీనపర్చడానికి ప్రయత్నించింది. అక్టోబర్ విప్లవ పంథాకు బదులుగా సెకండ్ ఇంటర్నేషనల్ అవకాశవాదులు ముందుకు తెచ్చిన పార్లమెంటరీ మార్గాన్నే శాంతియుత పరివర్తన రూపంలో ప్రవేశపెట్టింది. చైనా ప్రతినిధి వర్గం దీనిని ఖండిస్తూ శాంతియుత పరివర్తనా సమస్యపై తమ అభిప్రాయాలను స్థూలంగా వివరిస్తూ ఒక ప్రకటనను సోవియట్ ప్రతినిధి వర్గానికి అందజేసింది. అందులో చైనా పార్టీ తన అభిప్రాయాలను స్పష్టంగానూ, సమగ్రంగానూ పేర్కొంది. పాఠకుల అవగాహన కోసం దీని పూర్తి పాఠాన్ని ఈ వ్యాసానికి అనుబంధంగా అందిస్తున్నాం.

డా. నళిని తన 'మార్క్సిజం విశ్వజనీన సత్యం' వ్యాసంలో రాజ్యహింసకి వ్యతిరేకంగా కార్మికవర్గం సాగించే ప్రతిహింస ఆవశ్యకతని సరిగానే వివరించారు. ఆమె ఇలా రాశారు.

'మార్క్సిజాన్ని నమ్మేవారు హింసాత్మకమైన రాజకీయ చర్యలని నమ్ముతారనే ఆరోపణ ఉంది. విప్లవం హింసాత్మకమనీ, సామాజిక సంస్కరణలు శాంతియుతంగా జరుగుతాయనీ వారంటారు. కాని చాలా సంస్కరణలు కూడా హింసాత్మకంగా సాగక తప్పలేదు. ఉదాహరణకి అమెరికాలో పౌరహక్కుల ఉద్యమం, యుద్ధ వ్యతిరేక ప్రతిఘటన, లాటిన్ అమెరికా ఉదార సంస్కరణలు. అలానే కొన్ని విప్లవాలు శాంతియుతంగా జరిగాయి. ఉదాహరణకి 1916 నాటి డబ్లిన్ తిరుగుబాటు, 1917 నాటి బోల్షివిక్ విప్లవం.

పెట్టుబడిదారీ విధానం సాగించిన హింసనే వీరెందుకు మరుస్తారు? ప్రపంచ యుద్ధాలు, వలసవాదుల దోపిడీ, జాతుల విధ్వంసం, వారే చేతులారా కల్పించిన క్షామాలు, రసాయన యుద్ధాలు – ఇవి హింస కాదా? హింసను షింహతో ఎదుర్కోవలసి వస్తే ఎందుకు ఆక్షేపణ, ఆరోపణ? పెట్టుబడిదారీ విధానానికి సంబంధించిన తీవ్ర నిరంకుశ రూపమే ఫాసిజం అవుతుంది. ప్రస్తుతం అన్ని చోట్ల నియంతృత్వం కొరలు చాస్తోంది. దాన్ని ఎదుర్కోవాలంటే హింస తప్పకపోవచ్చు'.

కానీ ఈ పేరాలో బోల్షివిక్ విప్లవం శాంతియుతంగా జరిగినట్టు పేర్కొనబడింది. అది అవాస్తవం. అందువల్ల 'కొన్ని విప్లవాలు శాంతియుతంగా జరిగాయి' అనే మాటలకు బదులు 'కొన్ని విప్లవాలు శాంతియుతంగా తీసుకురావడానికి ప్రయత్నాలు జరిగాయి'. ఉదాహరణకి 1916 నాటి బడ్లిన్ తిరుగుబాటు, 1917 నాటి బోల్షివిక్ విప్లవం. బోల్షివిక్ విప్లవాన్ని శాంతియుతంగా తీసుకురావడానికి ప్రయత్నాలు జరిగినా, బూర్జువా పాలక వర్గాలు దారుణమైన హింసను ప్రయోగించడంతో దానిని ఎదుర్కొంటూ అక్టోబర్ నాటికి అది సాయుధంగానే ముగిసి కార్మికవర్గం రాజ్యాధికారాన్ని చేజిక్కించుకోవ డానికి దోహదపడింది' అనే మాటలను చేర్చి పాఠకులు చదువుకోగలరు.

ప్రజలే చరిత్ర నిర్మాతలు. అంతిమ విజయం ప్రజలదే. సాయుధ విప్లవ పోరాటాలు వర్ధిల్లాలి. మార్క్సిజం – లెనినిజం మావో ఆలోచనా విధానం వర్ధిల్లాలి.

*(మిగతా వివరాలకు 'చైనా – రష్యా విభేదాల పుట్టు పూర్వోత్తరాలు' పుస్తకం నుంచి, పేజీలు 68 – 73, జనశక్తి ప్రచురణలు చూడగలరు.)*

*(రచయితలు వైద్య నిపుణులు)* వీ

# చైనా సోషల్ సామ్రాజ్యవాద దేశమే

*- లంకా పాపిరెడ్డి*

వీక్షణం 2018 జూన్ సంచికలో చైనా గురించి ప్రారంభమైన చర్చ అక్టోబర్ సంచిక వరకు కొనసాగింది. చర్చ ప్రారంభమైన సందర్భం ఏదైనా చివరికి, చైనా సోషలిస్టు దేశమా? కాదా? అనేదే అసలు చర్చగా మారింది. చైనాలో సోషలిస్టు ఆర్థిక వ్యవస్థే అమలులో ఉన్నదని నిరూపించడానికి కృష్ణ ఆదిత్య చాలా ప్రయత్నించారు. అందుకు 'సిద్ధాంతం' కూడా చెప్పారు. చైనాలో ప్రజాస్వామ్యం ఉందా లేదా అనే చర్చ కూడా చేశారు. అయితే చైనాలో సోషలిజం ఉన్నదా లేదా అనే విషయం తెలుసుకుంటే, చైనాలో ఎటువంటి ప్రజాస్వామ్యం ఉన్నదనే విషయం కూడా తెలుస్తుంది.

మావో మరణానంతరం, డెంగ్ సియావో పింగ్ ఎందుకు మార్పులు చేశాడు? మావో కాలం నాటి విధానాలు, నిర్మాణాలు, ఏ అభివృద్ధికి ఎలా ఆటంకం అయ్యాయి? అనేది ఏది వివరించలేదు కృష్ణ. కాని 'మావో కాలంలో అంతా సవ్యంగా ఉందనీ, మావో తరువాత డెంగ్ అంతా తిరగదోడారని ఒక అభిప్రాయం ఉంది' అంటూ అదేదో తప్పుడు అభిప్రాయం అన్నట్లు పేర్కొన్నాడు. ఏ మార్పులు ఎందుకు చేశారో చెప్పకుండా, ఏమేమో చెప్పారు. అంతా అమూర్తం. ఇంకా 'సోషలిజానికి రెడీమేడ్ మోడల్ ఏమి లేదు' అనంటారు కృష్ణ. రెడీమేడ్ మోడల్ ఉన్నదని ఎవరన్నారో తెలవదు కాని ఇది జవాబు కాదు, చైనా పెట్టుబడిదారీ దేశం కాదనడానికి.

సోషలిజానికి రెడీమేడ్ మోడల్ ఏది ఉండదనేది నిజమే, ప్రతి దేశానికి కొన్ని ప్రత్యేకతలు ఉంటాయనేది కూడా నిజమే. కాని దాని అర్థం, చైనా ప్రత్యేక పరిస్థితులలో సోషలిజం, పెట్టుబడిదారీ విధానంగా ఉంటుందని కాదు. ఏ మోడల్‌లో అయినా సోషలిజం సారాంశం ఒకే విధంగా ఉంటుంది. పునాదిలో సోషలిస్టు ఉత్పత్తి సంబంధాలే ఉంటాయి. ఈ విషయం అర్థం కాకపోతే సోషలిజం ప్రత్యేక రూపాల పేరు మీద, సోషలిజం సారాంశాన్నే మాయం చేసినా గుర్తించడం సాధ్యం కాదు. చైనాలో అదే జరిగింది. సోషలిస్టు మార్కెట్ ఎకానమి పేరు మీద, మార్కెట్ ఆర్థిక వ్యవస్థను రుద్దారు. సోషలిజాన్ని హాస్యాస్పదం చేశారు.

కృష్ణ ఆదిత్య చెప్పిన మార్కెట్ సోషలిజం సిద్ధాంతాల గురించి చూద్దాం. 'చైనాలో కమ్యూన్‌లను రద్దు చేసి, వ్యక్తిగత బాధ్యతా విధానం అనే వ్యవసాయరంగ సంస్కరణ చేసారన్నది నిజమే. కాని సొంత ఆస్తిని పునరుద్ధరించారనేది వాస్తవం కాదు. చైనాలో వ్యవసాయ భూమి ఈనాడు కూడా ప్రభుత్వ ఆస్తిగానే ఉంది. రైతులకు అనుభవించే హక్కు ఉంది. ఆ హక్కును తరువాతి తరం పొందే హక్కు ఉంది. ఆస్తి వ్యవస్థ వేరు, నిర్వహణ పద్ధతి వేరు. సంస్కరించింది రెండో అంశం మాత్రమే.' ఈ కీలకమైన వాస్తవాన్ని విస్మరించి చైనాలో సోషలిజం లేదనడం అశాస్త్రీయం అంటారు కృష్ణ ఆదిత్య.

ఇక్కడ రెండు విషయాలు పరిశీలించాలి. మొదటిది, అసలు కమ్యూన్‌లను విచ్ఛిన్నం చేసి కాంట్రాక్టు పద్ధతిలో, అదీ వంశపారంపర్య హక్కుతో సహా రైతులకు విడిగా భూములు ఎందుకు ఇవ్వాల్సి వచ్చింది? కమ్యూన్ సమిష్టి వ్యవసాయం వల్ల సోషలిజం నిర్మాణానికి ఏమి ఆటంకం వచ్చింది? దీని గురించి ఏమి చెప్పకుండానే, చైనాలో కమ్యూన్‌లను రద్దుచేసింది నిజమే అంటూనే, దాని సహాయంతో అక్కడి నుంచి తప్పుకున్నారు.

చివరికి జరిగిన సంస్కరణ కూడా సోషలిజమే అని తేల్చేసారు. ఇదీ సోషలిజమే అయితే మరి కమ్యూన్ సమిష్టి వ్యవసాయం ఏమవుతుంది? సోషలిజం కాదా? అయితే అది ఏమిటి? ఏ దేశంలో అయినా ఎన్ని ప్రత్యేకతలు ఉన్నా సోషలిజం అనేది పరిశ్రమలలో అయినా వ్యవసాయంలో అయినా సోషలిస్టు ఉత్పత్తి సంబంధాల వల్లనే నిర్మాణం అవుతుంది. సోషలిస్టు ఉత్పత్తి సంబంధాలే సోషలిజం నిర్మాణానికి, కమ్యూనిజం వైపు పురోగమనానికి ఆధారం. ఉత్పత్తి సాధనాల పైన వ్యక్తిగత యాజమాన్యం వ్యక్తిగత ఉత్పత్తి, ఎట్టి పరిస్థితిలోనూ సోషలిజం నిర్మాణానికి దారితీయదు. అది ప్రతిరోజు పెట్టుబడిదారి విధానాన్నే ఉత్పత్తి చేస్తుంది.

ఇక రెండవ విషయం, భూమి ప్రైవేట్ ఆస్తి కాదు, ప్రభుత్వ ఆస్తిగానే ఉన్నది. కాబట్టి చైనాలో సోషలిజమే ఉన్నదనే విషయం. భూమి పేరుకే అయినా సరే ప్రభుత్వ ఆస్తిగా ఉంటే చాలు అది సోషలిజమే అవుతుందను కోవడం చిన్నపిల్లల అమాయకత్వం లాంటిదే.

వంశపారంపర్య హక్కుతో సహా భూమిని వ్యక్తిగతంగా పంపకం చేసిన తరువాత కూడా, భూమి ప్రభుత్వ ఆస్తిగానే ఉందని చెప్పడం అవకాశవాదం తప్ప మరేమి కాదు. ఉత్పత్తి సాధనాలను వ్యక్తిగత ఉత్పత్తి కోసం, వ్యక్తిగత ప్రయోజనాల కోసం ఇవ్వబడిన తరువాత వాటికి ప్రభుత్వ ఆస్తి అనో సామాజిక ఆస్తి అనో పేరు పెడితే సోషలిజం అయిపోదు. అది పెట్టుబడిదారీ విధానమే అవుతుంది. గతంలోనూ సోవియట్ యూనియన్‌ను గురించి కూడా అచ్చం ఇటువంటి వాదనలే వినిపించాయి కొన్ని పార్టీలు.

సోవియట్ యూనియన్‌లో పరిశ్రమలన్ని ప్రభుత్వ ఆస్తిగానే లేదా సామాజిక ఆస్తిగానే ఉన్నాయి కావున అక్కడ సోషలిజమే ఉన్నదని వాదించేవి ఆ పార్టీలు. సోవియట్ యూనియన్ కూలిపోయేవరకు అలాగే వాదించారు. కూలిపోయాక ఆ పార్టీలు కక్కలేక మింగలేక ఇబ్బందులు పడ్డాయి. పరిశ్రమలు 'ప్రభుత్వ ఆస్తిగా' ఉన్నప్పటికీ సోవియట్ యూనియన్ పెట్టుబడిదారీ దేశంగానూ సామ్రాజ్యవాద దేశంగానూ మారగలిగింది అనే విషయం అర్థమైతే చైనా గురించి కూడా అర్థం అవుతుంది. ఉత్పత్తి సాధనాలు పేరుకైనా ప్రభుత్వ ఆస్తిగా ఉంటే చాలు ఇక అక్కడ సోషలిస్ట్ ఉత్పత్తి సంబంధాలు వాటికవే నెలకొంటాయనే అవగాహన నుంచి ఈ వాదన చేస్తున్నారు. ఉత్పత్తి సాధనాలపై ఎటువంటి యాజమాన్యం ఉన్నదనే విషయమే ఉత్పత్తి విధాన్ని నిర్ధారిస్తుంది అనే సూత్రం నుంచి ఈ వాదన చేస్తున్నారు.

కాని నిజంగానే ఉత్పత్తి సాధానాలు సామాజిక ఆస్తిగా ఉన్నాయా? లేకపోతే కేవలం రూపం మాత్రమే అలా ఉండి, సారాంశంలో వాటిపై వ్యక్తిగత యాజమాన్యమే ఉందా? ఉత్పత్తి సాధనాలపైన సామాజిక యాజమాన్యమే ఉన్నదనే విషయం ఎలా తెలుస్తుంది? దాని రూపాన్ని బట్టి సామాజిక ఆస్తిగా భావించవచ్చునా? ఉత్పత్తి సంబంధాల మొత్తాన్ని సమగ్రంగా పరిశీలించినప్పుడే ఉత్పత్తి సాధనాలపైన నిజంగానే సామాజిక యాజమాన్యం ఉన్నదా లేదా అనే విషయం తెలుస్తుంది.

ఉత్పత్తి సంబంధాలలో 1) ఉత్పత్తి సాధనాలతో సంబంధం, 2) ఉత్పత్తిలో పాత్ర, 3) ఉత్పత్తి పంపిణీ ఉంటాయి. ఈ మూడింటిలో ఉత్పత్తి సాధనాలతో ఎటువంటి సంబంధం ఉన్నదనే విషయమే మిగతా రెండు విషయాలను నిర్ణయిస్తుంది. అంటే ఒక వ్యక్తి ఉత్పత్తి సాధనాల యజమానిగా ఉంటే, ఉత్పత్తిలో ఆ వ్యక్తి పాత్ర మేనేజర్ లాంటిది. మిగతవారితో పని చేయించే పాత్రగా మాత్రమే ఉంటుంది. కాని ఉత్పత్తి పంపిణీ విషయానికి వచ్చేసరికి మాత్రం ఉత్పత్తి సాధనాల యజమానిగా పనిచేయకుండానే సింహభాగం తీసుకుంటాడు. ఒకవేళ ఒక వ్యక్తికి ఉత్పత్తి సాధనాలపై యాజమాన్యం లేకపోతే, ఉత్పత్తిలో ఆ వ్యక్తి పాత్ర, ఉత్పత్తి సాధనాల యజమాని దగ్గర కూలిగా ఉంటుంది.

ఉత్పత్తి పంపిణీ విషయానికి వస్తే తను బతికి ఉండడానికి సరిపోయే వేతనం మాత్రమే లభిస్తుంది. ఉత్పత్తి సాధనాలపై సామాజిక యాజమాన్యం ఉంటే ఉత్పత్తిలో పాత్ర, శ్రామికులు శ్రామికులుగానూ మేనేజర్లుగానూ అంటే నిర్వహణలో కూడా పాల్గొంటారు. ఉత్పత్తి పంపిణిలో శ్రమకు తగ్గ ఫలితం ఉంటుంది (సోషలిజంలో). అందుకే ఉత్పత్తి సాధనాల యాజమాన్యం ఎవరిది అనే విషయమే అసలు విషయంగా మార్క్సిస్టులు భావిస్తారు. అయితే అదే సమయంలో ఉత్పత్తిలో పాత్రను, ఉత్పత్తి పంపిణీని బట్టి, ఉత్పత్తి సాధనాలు నిజంగా ఎవరి యాజమాన్యంలో ఉన్నాయో తెలుసుకోవచ్చు.

ఉదాహరణకు పరిశ్రమలన్ని ప్రభుత్వ యాజమాన్యంలో ఉన్నా, ఉత్పత్తిలో నిర్వహణలో మేనేజర్లకు, టెక్నీషియన్లకు..ఇతరులకు తప్ప కార్మికులకు ఏ పాత్రా లేనప్పుడు, ఉత్పత్తిలో పాల్గొనే కార్మికులకు శ్రమకు తగిన ఫలం లభించకుండా, ఉత్పత్తిలో పాల్గొనని పరిశ్రమల అధికారు లకు, ప్రభుత్వ అధికారులకు, పార్టీ అధికారులకు, వ్యాపారులకు, ఇతరులకు ఉత్పత్తి పంపిణీ ఎక్కువ జరిగినప్పుడు... ఉత్పత్తి సాధనాలపై సామాజిక యాజమాన్యం లేదని అర్థం. ఉత్పత్తి సంబంధాలను పరిశీలిస్తేనే ఇది అర్థం అవుతుంది. అందువల్ల, భూమి ప్రభుత్వ ఆస్తిగా ఉంది కాబట్టి అది సోషలిజమే అనడం అంటే ఉత్పత్తి సంబంధాల గురించిన మార్క్సిస్ట్ అవగాహన లేకపోవడమే. పై రూపాన్ని చూపి సారాంశాన్ని మాయ చేయడమే.

నిజానికి చైనాలో బహిరంగంగానే భూమి వ్యక్తిగత ఆస్తిగానే ఉన్నది, దానికి ఏపేరు పెట్టినా. ముందే చెప్పినట్లు వ్యక్తిగత ఉత్పత్తి ఎన్నడూ సోషలిజానికి దారితీయదు. అది రోజు పెట్టుబడిదారీ విధానాన్ని, పెట్టుబడిదారీ భావజాలాన్ని ఉత్పత్తి చేస్తుంది.

కృష్ణ ఆదిత్య చెప్పిన మరో సిద్ధాంత విషయం చూద్దాం. సోషలిజంలో కూడా సరుకుల ఉత్పత్తి, మార్కెట్ వ్యవస్థ ఉంటాయి, మౌలిక ఆర్థిక సూత్రాలు తెలియని వారు సోషలిజంలో సరుకుల ఉత్పత్తిని, మార్కెట్ వ్యవస్థను వ్యతిరేకిస్తున్నారని కృష్ణ రాశారు. 1953లో రాసిన ఒక పుస్తకంలో స్టాలిన్ కూడా సోషలిజంలో సరుకుల ఉత్పత్తి ఉంటుందని చెప్పారు. తరువాత మావో రాసిన పుస్తకాలలో కూడా ఈ విషయం ఉంది. ఈ విషయాలనే డెంగ్ సియావో పింగ్ అభివృద్ధి చేసి 'సోషలిస్టు మార్కెట్ ఆర్థిక వ్యవస్థను' రూపొందించారు. ఇది కృష్ణ చెప్పిన సిద్ధాంతానికి పునాది. ఇక్కడ మూడు విషయాలు పరిశీలించాలి.

మొదటిది. సోషలిస్టు సమాజంలో సరుకుల ఉత్పత్తి, మార్కెట్ వ్యవస్థలు ఉంటాయని మార్క్సిస్టులు అయిన వారందరికి తెలుసు. ఈ విషయం కృష్ణకి తెలవదా? లేక తెలిసినా ఒక లేని సమస్యతో పోరాడు తున్నట్లు నటిస్తూ, అసలు సమస్యను కప్పిపుచ్చాలని చూస్తున్నారా? సోషలిజంలో సరుకుల ఉత్పత్తి వ్యవస్థ ఉండడం అసలు సమస్య కాదు, ఆ సరుకుల వ్యవస్థ అభివృద్ధి ఏ దశ వరకు? దాని అభివృద్ధి ఏ దిశలో సాగాలి అనేది అసలు సమస్య.

సోషలిజం ఒక దీర్ఘకాలిక పరివర్తనా కాలం అనీ అందులో సరుకుల ఉత్పత్తి ఉంటుందనీ వెంటనే అంతం కాదనీ కార్ల్ మార్క్స్ నుండి మావో వరకు అందరు మహోపాధ్యాయులు చెప్పారు. వాటిని వక్రీకరించి డెంగ్ సియావో పింగ్ హైబ్రిడ్ రివిజనిజాన్ని రూపొందించాడు. కార్ల్ మార్క్స్, సోషలిజం బ్యానర్ పైన 'శ్రమకు తగిన ఫలితం' అనీ, కమ్యూనిజం బ్యానర్ పైన 'శక్తి కొలది పని, అవసరం కొలది వస్తువులు' అనీ రాసి ఉంటుందని చెప్పాడు.

శ్రమకు తగిన ఫలితం అంటే ఇంకా వర్గాలూ ఉంటాయని, సరుకు ఉత్పత్తి కూడా ఉంటుందనీ అర్థం. సరుకు ఉత్పత్తిని అంతం చేయగలిగారంటే, అది కమ్యూనిజమే అవుతుంది. కమ్యూనిజంలోనే సరుకు ఉత్పత్తి ఉండదని మార్క్సిస్టులందరికి తెలుసు. ఈ విషయం కృష్ణగారికే తెలవనట్టుంది. అందుకే ఒక పేజీ అంతా లేని పోరాటం చేశారు. సోషలిజంలో సరుకుల ఉత్పత్తి ఉండదని ఎవరో అన్నట్లు గాలిలో ఒక బొమ్మ గీసి దానితో యుద్ధం చేశాడు.

రెండవది – ఈ వాదనలో కప్పిపుచ్చబడుతున్న అసలు విషయం ఏమిటంటే, సోషలిజంలో సరుకు ఉత్పత్తి క్రమం, దాని దిశ ఏ వైపుకు ఉండాలనేది అసలు విషయం. సరుకుల ఉత్పత్తి వ్యవస్థపై ఎవరి నియంత్రణ అయినా ఉండాలా వద్దా అనేది అసలు విషయం. సోషలిజంలో సరుకుల ఉత్పత్తి శాశ్వతంగా ఉంటుందని స్టాలిన్, మావోలు చెప్పారా? లేక కొంతకాలం వరకు సరుకుల ఉత్పత్తి అనివార్యంగా ఉంటుందని చెప్పారా?

ఈ విషయంలో కృష్ణ ఆదిత్య పూర్తిగా మౌనం పాటించారు. సోషలిజంలో సరుకుల ఉత్పత్తి, మార్కెట్ శాశ్వతంగా ఉండవు, సహకార సంస్థలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు, ప్రభుత్వరంగ సంస్థలు, అంటే సోషలిస్టు ఉత్పత్తి సంబంధాలు ఏ క్రమంలో బలపడుతూ ఉంటే ఆ క్రమంలో ప్రైవేట్ రంగం, సరుకుల ఉత్పత్తి మార్కెట్ వ్యవస్థలు క్రమంగా బలహీనపడుతూ అంతం అవుతాయి, చేయాలి.

అయితే తెలివిగా డెంగ్ సియావో పింగ్ చైనాలో సోషలిజం ప్రాథమిక దశలో ఉన్నదని చెప్పాడు. అంటే ఈ దశలో సోషలిజం ఉండదు, పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలను ఉన్నత స్థాయికి అభివృద్ధి చేయాలని అర్థం. తరువాతనే సోషలిజం, సోషలిస్టు ఉత్పత్తి సంబంధాలలోకి వెళ్తారని

అర్థం. కాని పెట్టుబడి ఉత్పత్తి సంబంధాలు ఉన్నత స్థాయికి అభివృద్ధి చెందిన తరువాత ఇక సోషలిజం అనేది ఏమి ఉండదు. వాతాపి జీర్ణం లాగా పెట్టుబడి కడుపులో సోషలిజం పూర్తిగా అరిగిపోతుంది. చైనా ఉదాహరణ చూస్తే ఇదే అర్థమవుతుంది. సరుకుల ఉత్పత్తి వ్యవస్థపై ఎటువంటి నియంత్రణ ఉండొద్దు అనేది పెట్టుబడిదారి మార్గీయుల వాదన.

అయితే వాళ్లు ఈ విషయాన్ని తిన్నగా చెప్పరు. వాళ్లు కూడా మార్క్సిస్టుల లాగానే సరుకుల ఉత్పత్తి పైన, మార్కెట్ వ్యవస్థ పైన ప్రభుత్వం కంట్రోల్ ఉండాలంటూ పేరుకు చెప్తూనే, రకరకాల పరిస్థితులను కారణంగా చూపిస్తూ ప్రభుత్వ నియంత్రణను బలహీన పరుస్తారు. సరుకుల ఉత్పత్తి వ్యవస్థను ఎదగనిస్తూ, సోషలిస్టు ఉత్పత్తి సంబంధాలను నాశనం చేస్తూ ఉంటారు. వీరికి నిజమైన మార్క్సిస్టులకు తేడా ఏమిటో ఈ ఉదాహరణ చూస్తే తెలుస్తుంది.

సోషలిజంలో కూడా సరుకుల ఉత్పత్తి కొంతకాలం ఉంటుందని చెప్పిన లెనిన్, స్టాలిన్, మావోలు సహకార రంగ సంస్థల గురించి, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల గురించి శ్రమించారు. సోషలిజంలో కూడా సరుకుల ఉత్పత్తి, మార్కెట్ వ్యవస్థ ఉంటాయని స్టాలిన్, మావోలే చెప్పారంటూ డెంగ్ సియావో పింగ్ అతని గ్రూపు, సహకార సంస్థలను, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలనే విచ్ఛిన్నం చేశారు. చివరికి పెట్టుబడిదారి వ్యవస్థను స్థాపించారు. ఈ రోజు చైనా జిడిపిలో ప్రైవేట్ రంగం వాటా 60 శాతానికంటే ఎక్కువగా ఉన్నది. చైనా ఆర్థిక వ్యవస్థలో ప్రైవేట్ పెట్టుబడులు ప్రతి సంవత్సరం 6 శాతం చొప్పున పెరుగుతున్నాయి. ఉద్యోగ కల్పనలో కూడా 2017లో 90 శాతం, 2018లో 80 శాతం ప్రైవేట్ రంగమే కల్పించింది. చైనా ప్రైవేట్ రంగం విశ్వరూపం ఏమిటో అర్థం చేసుకోడానికి ఈ లెక్కలు చాలు. కావున సోషలిజంలో కూడా సరుకుల ఉత్పత్తి, మార్కెట్ ఉంటాయని చెప్పితే సరిపోదు. అది అసలు విషయం కాదు. సరుకుల ఉత్పత్తి వ్యవస్థ ఎటువైపు ప్రయాణించాలి అనేది అసలు సమస్య. అది తెలవకపోతే పెట్టుబడిదారీ ధృతరాష్ట్ర కౌగిలిలో సోషలిజం సచ్చి ఊరుకుంటుంది.

మూడవ విషయం – వర్గపోరాటం గురించి. కృష్ణ ఆదిత్యకి సోషలిజంలో కూడా సరుకు ఉత్పత్తి, మార్కెట్ వ్యవస్థ ఉంటుందని గుర్తుకు ఉంది కాని, అప్పుడు వర్గాలు కూడా ఉంటాయని మాత్రం గుర్తుకు లేదు. అవసరం రీత్యా మరిచిపోయారా? ఎందుకంటే సరుకు ఉత్పత్తి, మార్కెట్ ఉన్న తరువాత వర్గాలు కూడా ఉంటాయి. వర్గాలు ఉన్న తరువాత వర్గపోరాటం కూడా ఉంటుంది. కాని కృష్ణ అసలు వర్గ పోరాటాన్నే మరిచి పోయాడు. ఎందుకంటే ఇప్పుడు చైనాలో అధికారంలో ఉన్నవారు 12వ పార్టీ మహాసభలో (1982) ఇక చైనాలో దోపిడి వర్గాలు లేవు, వర్గపోరాటానికి కాలం చెల్లిందని తేల్చివేసారు. కాని లెనిన్, స్టాలిన్, మావోలు, సోషలిజంలో వర్గాలు కూడా ఉంటాయని, వర్గ పోరాటం ఉంటుందని, చాల తీవ్రంగా కూడా ఉంటుందని చెప్పారు. కాని కృష్ణ గారికి వారు చెప్పిన సోషలిజంలోని సరుకుల ఉత్పత్తి, మార్కెట్ వ్యవస్థ మాత్రమే గుర్తుకు ఉన్నది.

సాంస్కృతిక విప్లవం కాలం నాటికే చైనా కమ్యూనిస్టు పార్టీలో, సోషలిజం మార్గం ఏమిటి అనే విషయం పై వర్గ పోరాటం ఉన్నతస్థాయికి చేరుకున్నది. సోషలిస్టు మార్గంలో పురోగమిస్తున్న చైనా సమాజంలో ముందుకు వచ్చిన వర్గపోరాటం, చైనా కమూనిస్టు పార్టీలో ప్రతి ఫలించింది. సహకార సంస్థలు, కమ్యూన్‌ల వలన వ్యక్తిగత ఆస్తిని సంపాదించే అవకాశాలు క్రమంగా అంతం అవుతున్న పరిస్థితులలో, గతంలో పెద్ద ఎత్తున ఆస్తులు, అధికారాన్ని కోల్పోయిన వర్గాలు వెనకబడ్డ భావాలున్న వారిని కలుపుకుని వర్గపోరాటాన్ని తీవ్రం చేశాయి. అప్పుడే కమ్యూనిస్టు పార్టీలో, ఏది సోషలిస్టు మార్గం అనే దాని చుట్టూతా వర్గపోరాటం జరిగింది. ప్రభుత్వ రంగ సంస్థలు, సహకార సంస్థలు, కమ్యూన్‌లను (సోషలిస్టు ఉత్పత్తి సంబంధాలను) అభివృద్ధి చేస్తూ, సరుకుల ఉత్పత్తిని మార్కెట్ వ్యవస్థను నియంత్రిస్తూ, క్రమంగా తొలగిస్తూ కమ్యూనిజం వైపు పురోగమించాలి. ఇది లెనిన్, స్టాలిన్, మావోల సోషలిస్టు మార్గం.

సోషలిజం ముసుగులోనే క్రమంగా సహకార సంస్థలను, కమ్యూన్‌లను విచ్ఛిన్నం చేస్తూ, సరుకుల ఉత్పత్తి వ్యవస్థను అంటే పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలను అభివృద్ధి చేస్తూ సామ్రాజ్యవాదం దిక్కు ప్రయాణించాలి. ఇది లీషావ్ చి, డెంగ్‌ల మార్గం. ఈ రెండు మార్గాల మధ్య పోరాటమే సాంస్కృతిక విప్లవంగా కొనసాగింది.

సాంస్కృతిక విప్లవంలో కొన్ని ఘటనలు అతిగా జరిగి ఉండవచ్చు కాని, మౌలికంగా సాంస్కృతిక విప్లవం సోషలిస్టు ఉత్పత్తి సంబంధాలను, భావజాలాన్ని అభివృద్ధి చేయడం కొరకు, పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలను, భావజాలాన్ని దెబ్బతీయడానికి జరిగిన పోరాటం. సాంస్కృతిక విప్లవం అరాచకం కాదు. సోషలిజంలో పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాల అరాచకానికి విరుగుడు సాంస్కృతిక విప్లవం.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

***రచయితలకు సూచన :*** *తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు.*

*మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. – సం.*

# రష్యాలో సోషలిజం వైఫల్యానికి లెనిన్ బాధ్యుడు కాదు

**- జి. సత్యనారాయణ రెడ్డి**

'వీక్షణం' అక్టోబర్ సంచికలో 'చైనా – శాస్త్రీయ అధ్యయనం సమీర్ అమీన్ విశ్లేషణ' శీర్షికతో చైనాపై అమీన్ అభిప్రాయాల వివరణ చాలా ఆసక్తిదాయకంగా ఉంది. 'చైనా 2013 శీర్షికతో' అమీన్ రూపొందించిన తన సుదీర్ఘ పత్రంలో, సోషలిజం నిర్మాణం కోసం చైనా 'ఒరిజినల్' మార్గంలో తన కృషిని ఏ విధంగా కొనసాగిస్తున్నదీ, స్వతంత్ర సార్వభౌమ మార్గంలో ప్రపంచ శక్తిగా ఎదగడానికి అది చేస్తున్న కృషిని రామారావు చాలా బాగా వివరించారు. ఆయన ఈ ప్రయత్నం అభినందించ తగినది.

'వాస్తవాల నుండి సత్యాన్ని అన్వేషించు' అని మావో చెప్పాడు. ఆ విధంగా చేయాలంటే ఎవరైనా కూడా తాము ముందే ఏర్పరుచుకున్న ప్రతికూల అభిప్రాయాలను (ప్రెజుడీస్) పక్కనబెట్టి వాస్తవాలను పరిశీలించడంతో ప్రారంభించాలి. సమీర్ అమీన్ చైనాపై విశ్లేషణ చైనాలో జరుగుతున్న పరిణామాలను వాస్తవికంగా అధ్యయనం చేసి దాని ఆధారంగా వచ్చిన నిర్ధారణల ఫలితమేననేది స్పష్టం. చైనాపై నేడు పెద్ద ఎత్తున కొనసాగుతున్న చర్చల నేపథ్యంలో అమీన్ అభిప్రాయాలకు ఎంతో ప్రాధాన్యత ఉంది.

అయితే, లెనిన్ నేతృత్వంలోని రష్యాలో ఇలా సాగలేదనీ, బోల్షివిక్ పార్టీ ఫెయిల్ అయిన విషయంలో మావో కృతక్రుత్యులయ్యారని ఒకచోట 'లెనిన్ కంటే మెరుగ్గా మావో ఈ విషయాన్ని అర్థం చేసుకున్నారు. స్వతంత్రమైన మార్క్సిస్టు ఆలోచనలుగల మావో ఆయన!' అని మరొకచోట అమీన్ వ్యకం చేసిన అభిప్రాయాలు వాస్తవానికి అనుగుణంగా లేవు. లెనిన్ ఫెయిల్ అయ్యాడనీ, మావో విజయవంతం అయ్యాడనీ పేర్కొనడం తో పాటుగా మావో మాత్రమే స్వతంత్రమైన, 'ఒరిజినల్' ఆలోచనలు కలవాడిగా ఆయన పేర్కొనడం ఏ విధంగానూ సరైంది కాదు.

మావో కంటే ముందుగానే లెనిన్ కూడా 'ఒరిజినల్' మార్గంలోనే రష్యాలో విప్లవానికి నాయకత్వం వహించి దాన్ని విజయవంతంగా నడిపాడు. రష్యాలో సాగిన ఆ అక్టోబర్ విప్లవానికి ఎంతో అంతర్జాతీయ ప్రాముఖ్యత ఉంది. ఆ తర్వాత, రష్యాలో జరిగిన పరిణామాలు, వైఫల్యాలు దాని ప్రాముఖ్యతను ఏమాత్రం తగ్గించవు. లెనిన్ 'ఒరిజినల్'గా ఆలోచించకుండా మార్క్స్, ఎంగెల్స్ చెప్పిన దానివద్దే ఆగిపోయి, వాటి అమలు కోసమే ప్రయత్నించి ఉన్నట్లయితే, రష్యాలో అక్టోబర్ విప్లవ విజయం అనేది ఊహించనూ కూడాలేం. పెట్టుబడిదారీ దేశాల్లోనే ముందుగా, అదీ అలాంటి కొన్ని దేశాల్లో ఒకేసారి విప్లవం వస్తుందనే అభిప్రాయాలతో మార్క్స్ ఎంగెల్స్‌లు ఉన్నారు. కానీ, లెనిన్ కాలం నాటికి ఆ అంచనాలు, అభిప్రాయాలు మారిపోయాయి. సాపేక్షికంగా వెనకబడిన రష్యా లాంటి దేశంలో, అదీ ఒకే దేశంలోనైనా కూడా విప్లవాన్ని తేవడం సాధ్యమనే అభిప్రాయానికి లెనిన్ వచ్చాడు. మార్క్స్ అభిప్రాయాల వద్దనే లెనిన్ ఆగిపోయి ఉన్నట్లయితే, రష్యాలో విప్లవం ఏ విధంగా సాధ్యమయ్యేది? లెనిన్ 'ఒరిజినల్'గా ఆలోచించి మారిన పరిస్థితులకు అనుగుణంగా కొత్త అంచనాలకు రావడం మూలంగానే కదా ఆ విప్లవం విజయవంతం అయింది!

అక్టోబర్ విప్లవం విజయవంతం అయిన వెంటనే సామ్రాజ్యవాద దేశాల నాయకత్వంలో అనేక దేశాలు రష్యాలో జోక్యం చేసుకొని సుదీర్ఘ కాలం పాటు – దాదాపు నాలుగు సంవత్సరాలు – అంతర్ యుద్ధాన్ని కొనసాగించాయి. అప్పుడే ఆవిర్భవించిన నూతన రష్యాను ఆ అంతర్‌యుద్ధం అతలాకుతలం చేసింది. ఆ కాలంలోనే లెనిన్ పైన కాల్పులు జరపడం ద్వారా హత్యా ప్రయత్నం జరిగింది. ఆ కారణంగానే తీవ్ర అనారోగ్య పరిస్థితుల్లో కూడా లెనిన్ తన కృషిని కొనసాగించాడు. త్వరలోనే, 1924 జనవరిలో ఆయన మరణించాడు.

అక్టోబర్ విప్లవం తర్వాత, అంతర్ యుద్ధం కొనసాగుతున్న పరిస్థితుల మధ్యనే, ఆ కొద్ది కాలంలోనే రష్యాలో సోషలిజం నిర్మాణం కోసం తన శాయ శక్తులా కృషి చేశాడు. నూతన అర్థిక విధానాన్ని రూపొందించి దాని అమలు కోసం నిర్విరామంగా కృషి చేశాడు. దెబ్బతినిపోయిన, ఆర్థికంగా వెనకబడిన రష్యాను అభివృద్ధి పర్చడం కోసం సృజనాత్మకంగా అనేక ఆలోచనలు చేశాడు. దాని కోసం అభివృద్ధి చెందిన సామ్రాజ్యవాద దేశాల్లోని ఆధునిక, సాంకేతిక పరిజ్ఞానాన్ని, పెట్టుబడులను స్వీకరించాల్సిన ఆవశ్యకతను ఆయన గుర్తించాడు. దానికోసం వారికి అవసరమైన కొన్ని రాయితీలను ఇవ్వడానికి సిద్ధపడ్డాడు. 'రాయితీలపై లెనిన్' అనే పార్టీ కామ్రేడ్స్‌తో లెనిన్ జరిపిన సంభాషణలో మనం దాన్ని చూడవచ్చు.

లెనిన్ విశిష్టత రష్యాలో విప్లవ సాధనకు, ఆ దేశంలో సోషలిజం నిర్మాణానికి ఆయన చేసిన కృషికి మాత్రమే పరిమితమై లేదు. 1894లో ఆయన క్రియాశీల విప్లవ రాజకీయ జీవితం ప్రరంభమై, 1923 చివరితో ముగిసింది. ఆ మూడు దశాబ్దాలత కాలంలోనే లెనిన్ జాతీయ స్థాయిలోనూ, అంతర్జాతీయంగానూ ముందుకు వచ్చిన అనేక తప్పుడు ధోరణులు, సిద్ధాంతాలకు వ్యతిరేకంగా నిశితమైన, రాజీలేని ఎడతెగని సిద్ధాంత పోరాటాన్ని ఆయన కొనసాగించాడు. కాటస్కీ నాయకత్వంలోని రెండవ కమ్యూనిస్టు అంతర్జాతీయ సంస్థ ముందుకు తెచ్చిన రివిజనిస్టు, వర్గం సంకర విధానాలకు వ్యతిరేకంగా, సూత్రబద్ధమైన తీవ్రమైన సిద్ధాంత పోరాటాన్ని కొనసాగించాడు. మూడవ అంతర్జాతీయ కమ్యూనిస్టును నెలకొల్పి, ప్రపంచ వ్యాప్తంగా సరైన మార్క్సిస్టు భావజాల వ్యాప్తికి విశేషంగా కృషి చేశాడు. దాని ఫలితంగా సరైన మార్క్సిస్టు పునాదులపైన అనేక దేశాల్లో కమ్యూనిస్టు పార్టీలు ఏర్పడి, బలపడినాయి.

లెనిన్ రచనలు తప్పుడు సిద్ధాంతాలకు వ్యతిరేకంగా మాత్రమే పరిమితమై లేవు. లెనిన్ మూడు దశాబ్దాల కాలంలోని రచనలు మొత్తం 45 సంపుటాలుగా ప్రచురించబడ్డాయి. పార్టీ నిర్మాణంలో 'వృత్తి విప్లవకారులు' అనే భావనను ఆయనే మొదట ప్రవేశపెట్టాడు. కార్మిక వర్గం నియంతృత్వం అనే సిద్ధాంతాన్ని మరింత అభివృద్ధి పరిచి దానినీ మరింత పరిపుష్టం చేశాడు. ఆర్థిక, రాజకీయ, తత్వశాస్త్ర సంబంధమైన అనేక సమస్యలపైన లోతైన రచనలు చేశాడు. రాజ్యాంగ యంత్రం – విప్లవం, జాతుల సమస్య, గ్రామీణ పేదలకు సంబంధించి ఆయన

రచనలు సమగ్రమైనవి. ఒక్కమాటలో చెప్పాలంటే లెనిన్ సృజించని లేదా చర్చించని సమస్య లేదంటే అది ఎంతమాత్రం అతిశయోక్తి కాదు.

మార్క్స్, ఎంగెల్స్ రూపొందించిన మార్క్సిజపు మూల సిద్ధాంతాలను వివరించి, అమలుపరిచి వాటిని మరింత అభివృద్ధి పరిచాడు. మార్క్సిజాన్ని సృజనాత్మకంగా అన్వయించి దానిని మరింతగా అభివృద్ధి పరిచిన గొప్ప మార్క్సిస్టు లెనిన్.

మావో మార్క్సిజం – లెనినిజాన్ని చైనాలోని నిర్దిష్ట వాస్తవ పరిస్థితులకు సృజనాత్మకంగా అన్వయించి, చైనాలో విప్లవాన్ని విజయవంతంగా నడపడమే కాకుండా, వెనకబడిన వ్యవసాయక దేశాలకు ఒక కొత్త పంథాను – ప్రజా యుద్ధ పంథాను ప్రపంచ కార్మిక వర్గానికి అందించాడు. ఆ విధంగా ఆయన కూడా మార్క్సిజం – లెనినిజాన్ని మరింతగా అభివృద్ధి చేసి, దాన్ని సుసంపన్నం చేసిన గొప్ప మార్క్సిస్టు – లెనినిస్టు నాయకుడు. ఇక్కడ సమస్య అంతా కూడా మావో 'ఒరిజినల్'గా ఆలోచించాడని, లెనిన్ ఆ విధంగా చేయలేదనే సమీర్ అమీన్ తనపై పత్రంలో వ్యక్తం చేసిన అభిప్రాయాల పైననే. అవి సరికాదనేది పై వివరణ స్పష్టం చేస్తున్నది. లెనిన్ నేతృత్వంలోని బోల్షివిక్ పార్టీ ఫెయిల్ అయిందనీ, మావో కృతకృత్యుడయ్యాడనడం కూడా సరైంది కాదు. లెనిన్ మరణించిన తర్వాత రష్యాలో జరిగిన పరిణామాలకూ, అక్కడి వైఫల్యాలకూ లెనిన్‌ను ఎట్లా బాధ్యుడని చేస్తాం? లెనిన్ కనీసం మరో రెండు దశాబ్దాల పాటైనా జీవించి ఉంటే పరిస్థితులు, పరిణామాలు భిన్నంగా ఉండడానికి అవకాశం ఉండేది.

శ్రామికవర్గ విప్లవం కూడా ఒకే ప్రయత్నంలో విజయవంతం కాలేదు. ఫ్రాన్స్ దేశంలో పారిస్ కమ్యూన్ వైఫల్యాల నుండి గుణపాఠాలు తీసుకొని, వాటిని అధిగమించి లెనిన్ నాయకత్వంలో అక్టోబర్ విప్లవం విజయవంతమైంది. ఆ విధంగా మార్క్సిజం సిద్ధాంతం కూడా అభివృద్ధి చెందింది. (ముఖ్యంగా కార్మికవర్గ నియంతృత్వం ఆవశ్యకతలో). ఆ విధంగానే రష్యాలో సోషలిజం వైఫల్యం చెందడం నుండి గుణపాఠాలు తీసుకొని చైనాలోని కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాలు సోషలిజం నిర్మాణాన్ని కాపాడి మరింత ముందుకు తీసుకవెళ్తున్నాయి. విప్లవాలను నడపడంలో మార్క్సిజం అభివృద్ధి చెందినట్లుగానే, సోషలిజం నిర్మాణం విషయంలో కూడా కొత్త కొత్త సిద్ధాంతాల రూపకల్పనతో అది అభివృద్ధి చెందుతున్నది. సోషలిజం నిర్మాణానికి సంబంధించిన ఆ నూతన ఆవిష్కరణలు మార్క్సిజం – లెనినిజంలో అంతర్భాగాలే.

అందువలన, చైనాలోని సోషలిజాన్ని దృఢంగా సమర్థిస్తున్న సమీర్ అమీన్ అభిప్రాయాలను గౌరవిస్తూనే, లెనిన్ పైన ఆయన తనపై పత్రంలో వ్యక్తం చేసిన అభిప్రాయాలు పూర్తిగా తప్పని భావించవలసి ఉంటుంది.

భారతదేశంలోని కమ్యూనిస్టు, కమ్యూనిస్టు విప్లవకారుల గ్రూపులు ప్రారంభం నుండి నేటి దాకా రష్యా, చైనా కమ్యూనిస్టు పార్టీలు అనుసరించిన, అనుసరిస్తున్న విధానాలను గుడ్డిగా బలపర్చి కీర్తించడం లేదా గుడ్డిగా వ్యతిరేకించడమో కొనసాగిస్తున్నారు. ప్రస్తుతం దేశంలోని ఎం.ఎల్ గ్రూపుల్లో అత్యధికులు చైనా సోషల్ సామ్రాజ్యవాదంగా మారిపోయిందనో, మారిపోతున్నదనో, చైనా కమ్యూనిస్టు పార్టీ రివిజనిస్టుగా మారిపోయిందనో అభిప్రాయాలకు వచ్చి, దానికి వ్యతిరేకంగా పెద్ద ఎత్తున దుష్ప్రచారాలను కొనసాగిస్తున్నాయి. ఈ పరిస్థితుల్లో పై అభిప్రాయాలకు, చైనా సరైన సోషలిస్టు మార్గంలోనే ముందుకు పురోగమిస్తున్నదనే అభిప్రాయాలకు మధ్యన లోతైన, సూత్రబద్ధమైన ఒక బృహత్తర చర్చ జరగాల్సిన అవసరం ఉంది.

చైనా పూర్తిగా మారిపోయిందనే అభిప్రాయాలు కలవారి నుండి కూడా కొన్ని వ్యాసాలు వస్తే ఆ విధమైన చర్చకు తోడ్పడుతాయి. రెండు పరస్పర విరుద్ధమైన అభిప్రాయాల పైన సాగే చర్చ నుండి పాఠకులు తగిన విధంగా విద్యావంతం అవుతారు. ఆ వైపుగా 'వీక్షణం' నిర్వాహకులు చొరవ తీసుకోవడం బాగుంటుందనేది నా అభిప్రాయం. ఏమైనా, ఈ సమస్యపై భిన్నాభిప్రాయాల ప్రచురణకు అవకాశం కల్పిస్తున్న 'వీక్షణం' నిర్వాహకులకు అభివందనలు. నేను పైన సూచించినట్లుగా ఈ చర్చను మరింత కొనసాగించాలని కోరుకుంటూ అభివందనలతో.

*(రచయిత సంపాదకుడు పోరునేల)* వీ

# చదవదగిన పుస్తకం

**- వంగాల సంపత్‌రెడ్డి**



**భారత బడా బూర్జువా వర్గం**
పుట్టుక, పెరుగుదల, స్వభావం
**సునీతి కుమార్ ఘోష్**
అనువాదం: **ఎస్. ఆశాలత**
విరసం ప్రచురణ
పేజీలు: 454 వెల: రు. 200
ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు

లిబరేషన్ పత్రికకు సంపాదకుడిగా పనిచేసిన సునీతి కుమార్ ఘోష్ 1985లో ఆంగ్లంలో రాసిన ది ఇండియన్ బిగ్ బూర్జువాజీ – ఇట్స్ జెనిసిస్, గ్రోత్ అండ్ క్యారెక్టర్‌కు అనువాదమే 'భారత బడా బూర్జువా వర్గం – పుట్టుక, పెరుగుదల, స్వభావం'. దీన్ని ఎస్.ఆశాలత అనువదించారు. ఆంగ్లంలో మొదటి కూర్పు1985లో వచ్చింది. కొంత అదనపు సమాచారంతో 2012లో రెండవ కూర్పుగా వెలువడింది. రెండవ కూర్పు ఆధారంగానే ఆశాలత అనువాదం చేశారు. చాలా ఆలస్యంగా తెలుగులో వచ్చింది. దీన్ని విరసం ప్రచురించింది.

సునీతి కుమార్ ఘోష్ తెభాగ ఉద్యమంలో పాల్గొన్నందుకు తూర్పు పాకిస్తాన్‌గా పిలువబడిన బంగ్లాదేశ్ నుండి బహిష్కరించబడ్డాడు. కలకత్తా చేరాడు. ప్రజా సమూహంలో కలిశాడు. నక్సల్బరితో కలిసి నడిచాడు. లిబరేషన్ పత్రికకు సంపాదకుడిగా పనిచేశాడు. చివరి వరకూ ప్రజాపోరాటాల మద్దతుదారుడుగానే ఉన్నాడు.

1925లో భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ ఆవిర్భావం జరిగింది. అప్పటి నుండి 1967 వరకు అంటే నక్సల్బరీ మొదలయ్యేంత వరకు కూడా భారత సమాజాన్ని అర్థం చేసుకోవడంలో, భారత సమాజాన్ని శాస్త్రీయంగా విశ్లేషించడంలో కమ్యూనిస్టు పార్టీ విఫలం అయింది. నక్సల్బరీ మాత్రమే భారత సమాజాన్ని అర్థం చేసుకోవడంలో, విశ్లేషించడంలో సఫలమయ్యింది. అందువల్లనే భారత సమాజంలోని పీడిత వర్గాలు నక్సల్బరీ పోరాటాన్ని ఎత్తిపట్టాయి. అందువల్లనే దేశమంతా నక్సల్బరీ పోరాటం విస్తరించింది. ప్రజలకు ప్రత్యామ్నాయాలు చూపించింది. భారత సమాజ చలనాన్ని పట్టుకుంది.

రష్యన్ విప్లవోద్యమకాలంలో రష్యన్ సమాజంలో వచ్చిన మార్పులను లెనిన్ ఏ విధంగా పట్టుకుని విశ్లేషించి విప్లవాన్ని విజయవంతం చేశాడో అలా భారతీయ సమాజంలో వచ్చిన మార్పులను పట్టుకోవడంలో, విశ్లేషించడంలో కమ్యూనిస్టు నాయకత్వం విఫలమయింది. విప్లవోద్యమంలో ఒడిదొడుకులు ఎదురయిన ప్రతీసారి ఎక్కడ మొదలు పెట్టాలి, ఇప్పుడు ఏం చేయాలి, మన ముందున్న కర్తవ్యాలు ఏంటి స్పష్టంగా రష్యన్ సమాజానికి లెనిన్ దిశానిర్దేశం చేశాడు. దీర్ఘకాలిక పోరాటాలను నిర్మించడంలో, ప్రజలను దీర్ఘకాలిక పోరాటాలకు సిద్ధపరచడంలో లెనిన్ సఫలమయ్యాడు. అందువల్లనే రష్యన్ సమాజంలోని పీడితవర్గం విప్లవ విజయాలను అందుకోగలిగింది. కానీ భారత కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం తెలంగాణ సాయుధ పోరాటం వంటి పోరాటాలను దీర్ఘకాలిక పోరాటాలుగా మలచడంలో విఫలమయింది. ఒక విధంగా చెప్పాలంటే భారత కమ్యూనిస్టు పార్టీ భూస్వామ్యంతో రాజీపడింది. అందుకు సమర్థనగా ప్రజలు ఇంకా పోరాటాలకు సిద్ధంకాలేదనీ అంతవరకూ వేచి చూద్దామంది. ప్రపంచ వ్యాప్తంగా రివిజనిజం మీద దశాబ్దకాలంగా జరిగిన గ్రేట్ డిబేట్‌లో భారత కమ్యూనిస్టు నాయకత్వం చురుకుగా పాల్గొనకపోగా రివిజనిజానికి మద్దతుగా నిలబడింది. ఇలాంటి సందర్భంలోనే కమ్యూనిస్టు నాయకత్వం ఇచ్చిన మోసపూరిత వాగ్దానాలతో బెంగాల్‌లో కమ్యూనిస్టులు అధికారంలోకి వచ్చారు. మోసపూరిత వాగ్దానాలతో అధికారంలోకి వచ్చిన కమ్యూనిస్టుల అసలు రూపాన్ని నక్సల్బరీలో తమ రక్తతర్పణతో ప్రజలు బహిరంగపరిచారు. అప్పటి నుండి ప్రజలు నక్సల్బరీ పోరాట జెండాను ఎత్తిపట్టిన కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం కింద ఏకమయ్యారు. నక్సల్బరీ స్పష్టంగా భారత సమాజ రూపురేఖలను, భారత సమాజ స్వభావాన్ని శాస్త్రీయంగా విశ్లేషించింది. రైతులే విప్లవానికి ప్రధాన శక్తిగా భావించింది. కేవలం వర్గపోరాటం ద్వారా మాత్రమే కార్మిక కర్షక ఐక్యత సాధ్యమని నమ్మింది. భారత సమాజాన్ని అర్ధవలస, అర్ధభూస్వామ్య వ్యవస్థగా ప్రకటించింది. దీర్ఘకాలిక సాయుధ పోరాటం ద్వారా మాత్రమే విప్లవం విజయవంతం అవుతుందని ప్రకటించింది. భారత సమాజ పీడిత వర్గానికి శత్రువులు ఎవరో, మిత్రులు ఎవరో స్పష్టపరిచింది. భారత పాలక వర్గాలు ఏ విధంగా సామ్రాజ్యవాదంతో మిలాఖత్ అయ్యాయో బహిరంగ పరిచింది. రాజ్యాంగ యంత్రాన్ని ఏ విధంగా ధ్వంసం చేసి వ్యవసాయిక విప్లవం తేవాలో స్పష్టంగా ప్రకటించింది. గ్రామాలను ఏ విధంగా విముక్తి చేయాలో, ప్రజలను దీర్ఘకాలిక సాయుధ పోరాటానికి ఎలా సిద్ధం చేయాలో విశదీకరించింది.

నక్సల్బరీ చేసిన భారత సమాజ విశ్లేషణ ఎంత శాస్త్రీయమో నిరూపించిన రచన 'భారత బడా బూర్జువా వర్గం – పుట్టుక పెరుగుదల స్వభావం'. ఈ పుస్తకంలో మొత్తం పది అధ్యాయాలున్నాయి. భారతదేశంలో బూర్జువా వర్గం ఎలా ఆవిర్భవించింది, అప్పటి సామాజిక రాజకీయ ఆర్థిక పరిస్థితులను విశ్లేషించింది ఈ పుస్తకం. ఆవిర్భవించిన బూర్జువా వర్గంలోని ఒక వర్గం ఏ విధంగా బ్రిటిష్ వలస పాలకులకు దళారీగా పనిచేసిందో వివరిస్తూనే మరొక వర్గం భారత జాతీయ పోరాటాన్ని సమర్థిస్తూనే బ్రిటిష్ వలస పాలకులతో తమ ప్రయోజనాలను నెరవేర్చుకోవడానికి ఏ విధంగా ప్రయత్నించిందో విశ్లేషించారు. భారత సమాజం గురించి మార్క్స్ అంచనాలను చర్చించారు. భారత విప్లవోద్యమాన్ని ముందుకు తీసుకువెళ్లాలనే విప్లవకారులకు, భారత విప్లవోద్యమం విజయవంతం కావాలని ఆశించేవారు భారత సమాజ అధ్యయనానికి ఈ పుస్తక అధ్యయనం అత్యంత అవసరం.

సునీతి కుమార్ ఘోష్ పుస్తక అధ్యయనం భారత సమాజంలో విభిన్న పొరలను అర్థం చేసుకునే దిశగా ఉపకరిస్తుంది. నక్సల్బరీ అందించిన చైతన్యంతో భారత సమాజాన్ని చారిత్రక గతితార్కిక భౌతికవాదంతో చేసిన రాజకీయ ఆర్థిక విశ్లేషణ ఈ పుస్తకంలో ఉంది. పీడిత ప్రజల పోరాటాల పట్ల సానుభూతి కలవారు భారత సమాజాన్ని అర్థం చేసుకోవడానికి భారత బడా బూర్జువా వర్గం– పుట్టుక, పెరుగుదల, స్వభావం అధ్యయనం తప్పనిసరి. వీ

## కొండపల్లి కోటేశ్వరమ్మ సంస్మరణ సభ

కొండపల్లి కోటేశ్వరమ్మ సంస్మరణ సభ అక్టోబర్ 1న హైదరాబాద్‌లోని ముఖ్దూం భవన్‌లో జరిగింది. ఈ సభలో పాల్గొన్న వక్తలు ఆమె ప్రజా జీవితం గురించి, పోరాటం గురించి, ఆమె త్యాగం గురించి వక్తలు ప్రసంగించారు. ఆమె 'నిర్జనవారధి' పుస్తకాన్ని రచించారు. ఈ సభకు కొండవీటి సత్యవతి, గీతారామస్వామి, విమల, సజయ, వసంతలక్ష్మి మొదలైనవారు హాజరయ్యారు.

## ప్రాజెక్టు కోసం పాదయాత్ర

మహబూబ్‌నగర్ జిల్లా షాద్‌నగర్‌లోని లక్ష్మీదేవిపల్లి ప్రాజెక్టు సాధన కోసం ప్రజా సంఘాల ఆధ్వర్యంలో అక్టోబర్ 13న చౌదరగూడ నుంచి షాద్‌నగర్ వరకు పాదయాత్ర చేశారు. పాలమూరు - రంగారెడ్డి ప్రాజెక్టులో భాగంగా నిర్మించే లక్ష్మీదేవిపల్లి ప్రాజెక్టును మధ్యలో నిలిపివేయడం అన్యాయమని పాద యాత్రలో పాల్గొన్న ప్రజా సంఘాల నాయకులు అన్నారు. ఈ పాదయాత్రలో ప్రొ. హరగోపాల్, పాలమూరు అధ్యయన వేదిక కన్వీనర్ రాఘవాచారి, పౌరహక్కుల నాయకులు తిరుపతయ్య, జలవనరుల సంరక్షణ సమితి నాయకులు చంద్రారెడ్డితో పాటు అనేక మంది ప్రజలు పాల్గొన్నారు.

## ప్రణయ్ సంస్మరణ సభ

ప్రణయ్ హత్యను ఖండిస్తూ, కుల దురహంకార హత్యలను ఖండిస్తూ ఉస్మానియా యూనివర్సిటీ ఆధ్వర్యంలో 'విద్యార్థుల ఆగ్రహ సభ'ను ఉస్మానియా యూనివర్సిటీలో అక్టోబర్ 9న ఆర్ట్ కళాశాల ప్రాంగనంలో నిర్వహించారు. ఆధునిక సమాజంలో కుల దురంహంకార హత్యలు, పరువు హత్యలు జరగడం బాధకరమని వక్తలు అన్నారు. ఇలాంటి హత్యలను నిరోధించడానికి ప్రత్యేక చట్టం తీసుకురావాలని డిమాండ్ చేశారు. మిర్యాలగూడలో దళిత సంఘాల ఆధ్వర్యంలో అక్టోబర్ 21న 'ప్రణయ్ సంస్మరణ సభ' జరిగింది. ప్రొ.కంచె ఐలయ్య, ప్రొ. సి. కాశీం, అరుణోదయ విమలక్క, ప్రజా గాయకుడు గద్దర్, సామాజిక వేత్త ఉసా, చెరుకు సుధాకర్, మాల మహానాడు అధ్యక్షుడు చెన్నయ్య, విద్యార్థి నాయకులు మందాల భాస్కర్, రుద్రవరం లింగస్వామి పాల్గొన్నారు.

## తిత్లీ తుఫాను

ఉత్తరాంధ్ర, శ్రీకాకుళం జిల్లాలో అక్టోబర్ 11న వచ్చిన తిత్లీ తుఫాన్ వల్ల ఎనిమిది మంది మృతిచెందారు. యాభై వేల ఇళ్లు ధ్వంసమయ్యాయి. 620 కిలోమీటర్ల పొడవైన రహదారులు దెబ్బతిన్నాయి. 1.65 లక్షల హెక్టార్ల వ్యవసాయ పంటలు, 40 వేల హెక్టార్‌ల ఉద్యాన పంటలు ధ్వంసమయ్యాయి. ఈ తుఫాను వల్ల మొత్తం ఆర్థిక నష్టం రు. 3,435 కోట్ల నష్టం జరిగిందని అధికారులు వెల్లడించారు. ఈ తుఫాను ప్రభావం వారంరోజులు పాటు ఆ ప్రాంత ప్రజల్ని అనేక ఇబ్బందులకు గురిచేసింది.

## అవినీతి రాష్ట్రాలుగా తెలుగు రాష్ట్రాలు

తెలంగాణ, ఆంధ్రప్రదేశ్‌లలోని రిజిస్ట్రేషన్ కార్యాలయాలు, మున్సిపాలిటీలు, కార్పొరేషన్‌లు, పోలీస్ స్టేషన్‌లు, విద్యుత్ బోర్డులు, రవాణా, పన్ను కార్యాలయాలలో అవినీతి పెద్ద ఎత్తున జరుగుతున్నదని 'మీడియా కరప్షన్ సర్వే - 2018' అక్టోబర్ 12న వెల్లడించింది. ఈ సర్వే 13 రాష్ట్రాలలోని అవినీతి స్థాయిని వెల్లడిస్తూ తెలుగు రాష్ట్రాల అవినీతి గురించి తెలియజేసింది. గత ఏడాది కంటే ఈ ఏడాది తెలుగు రాష్ట్రాల్లో అవినీతి మరింత పెరిగిందని సర్వే తెలిపింది.

## కాశీభట్ల విశ్వనాథం మృతి

ప్రముఖ వైద్యుడు, సుప్రసిద్ధ చిత్రకారుడు డాక్టర్ కాశీభట్ల విశ్వనాథం (92) మరణించారు. ఆయన గత కొద్ది రోజులుగా అనారోగ్యంతో బాధపడుతూ అక్టోబర్ 17న వరంగల్ జిల్లా హన్మకొండలోని స్వగృహంలో చనిపోయారు. డాక్టర్ విశ్వనాథం కృష్ణా జిల్లా పెదకళ్లెపల్లిలో 1926 ఫిబ్రవరి 5న జన్మించారు. ఆయన ఆంధ్ర మెడికల్ కాలేజీలో వైద్య విద్యనభ్యసించారు. 1953లో ప్రభుత్వ డాక్టర్‌గా ఉద్యోగంలో చేరారు. ఉద్యోగ రీత్యా వరంగల్‌కు వచ్చి స్థిరపడ్డారు. ప్రభుత్వ ఉద్యోగానికి రాజీనామ చేసి ప్రైవేట్‌గా ప్రాక్టీస్ ప్రారంభించారు. ఆయన 300 వందలకు పైగా చిత్రాలను గీశారు. 1992లో తెలుగు విశ్వవిద్యాలయం విశ్వనాథంను ఉత్తమ చిత్రకారుడుగా సత్కరించింది.

## బాలగోపాల్ స్మారక సదస్సు

కాకతీయ యూనివర్సిటీలోని కామర్స్ అండ్ బిజినెస్ మేనేజ్‌మెంట్ సెమినార్ హాల్‌లో అక్టోబర్ 7న పౌరహక్కుల కోసం పనిచేసిన బాలగోపాల్ 9వ స్మారకోపన్యాసం జరిగింది. ఈ సందర్భంగా స్టర్క్ రియాల్టీ ఆఫ్ ది మోస్ట్ అప్రెస్డ్ - ది కండిషన్స్ ఆఫ్ స్కావెంజర్స్' అనే అంశం మీద బెజవాడ విల్సన్ మాట్లాడారు. దేశంలో ఆకలి చావులు పెరుగుతున్నాయని ఆందోళన వ్యక్తంచేశారు. సఫాయి, పాకి పనులను నిషేధించాలన్నారు. రాకెట్‌లు దూసుకుపోయే దేశంలో మురికి పనులు చేసే యంత్రాలు తయారుచేయలేకపోతున్నారని ప్రశ్నించారు. నిత్యం పేద ప్రజల హక్కులకోసం పోరాడిన బాలగోపాల్ సమాజానికి గొప్ప దార్శనికుడన్నారు.

## జన విజ్ఞాన వేదిక మహాసభలు

జన విజ్ఞాన వేదిక రాష్ట్ర మహాసభలు సుందరయ్య విజ్ఞానకేంద్రంలో అక్టోబర్ 14న జరిగాయి. రాష్ట్ర మహా సభల చివరి రోజులన ప్రొ. హరగోపాల్ ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. రాష్ట్రంలో విద్యా వ్యవస్థ పతనమవుతున్నదని కేరళలో విద్యా రంగానికి 30 శాతం నిధులు కేటాయిస్తే తెలంగాణ రాష్ట్రంలో 7 శాతం నిధులను మాత్రమే కేటాయిస్తున్నారన్నారు. కె.జి. టు పి.జి ఉచిత విద్య పత్తాలేకుండా పోయిందన్నారు. రాష్ట్రంలో ప్రజాస్వామ్యం లేకుండాపోయిందని ప్రశ్నిస్తే దాడులకు పాల్పడుతూ జైలుకు పంపుతున్నారన్నారు.

## వరవరరావు గృహ నిర్బంధం పొడిగింపు

భీమా కోరేగావ్ కేసులో విరసం నేత, రచయిత వరవరరావు గృహ నిర్బంధాన్ని మరో మూడు వారాలు పొడిగిస్తూ ఆంధ్రప్రదేశ్ హైకోర్టు అక్టోబర్ 25న ఆదేశించింది. ఈ మేరకు జస్టిస్ సి.వి. నాగార్జున్‌రెడ్డి, జస్టిస్ టి. అమర్‌నాథ్ గౌడ్‌ల ధర్మాసనం ఆదేశాలు జారీ చేసింది. ఈ కేసులో పూణేకు తరలించేందుకు వీలుగా హైదరాబాద్ చీఫ్ మెట్రోపాలిటన్ మెజిస్ట్రేట్ (సిఎంఎం) ఆగస్ట్ 28న ఇచ్చిన ట్రాన్సిట్ వారెంట్‌ను చట్టవిరుద్ధంగా ప్రకటించాలని కోరుతూ వరవరరావు హైకోర్టులో పిటిషన్ దాఖలు చేశారు. వీ

### ఎన్‌కౌంటర్‌లలో మావోయిస్టుల మృతి

ఛత్తీస్‌గఢ్‌లోని సుక్మా జిల్లా మల్కగూడ-ముల్లూరు అటవీ ప్రాంతంలో అక్టోబర్ 2న జరిగిన ఎన్‌కౌంటర్‌లో ముగ్గురు మావోయిస్టులు మృతిచెందారని, మరొకరిని పోలీసులు అదుపులోకి తీసుకున్నామని సుక్మా ఎస్.పి. అభిషేక్‌మీనా తెలిపారు. సుక్మా జిల్లాలోని తులసికొండలో అక్టోబర్ 12న జరిగిన ఎదురు కాల్పుల్లో కవాసి దేవా మృతిచెందగా అదేరోజు ఆంధ్ర-ఒడిశా సరిహద్దుల్లోని బెజ్జంగి-ఆంధ్రపల్లి మధ్య పోలీసులకు మావోయిస్టులకు మధ్య జరిగిన కాల్పుల్లో డిప్యూటీ కమాండర్ మీనా చనిపోగా ముగ్గురు మహిళా మావోయిస్టులతోపాటు, ఒక మిలీషియా సభ్యుడిని పోలీసులు అదుపులోకి తీసుకునారని తెలిపారు. ఛత్తీస్‌గఢ్‌లోని బీజాపూర్ జిల్లా మద్వాల్ అటవీ ప్రాంతంలో అక్టోబర్ 20న జరిగిన కాల్పుల్లో ముగ్గురు మావోయిస్టులు మృతిచెందినట్లుగా పోలీసు అధికారులు తెలిపారు.

### భారత్‌లో వ్యతిరేక గళాలపై దాడులు

భారత ప్రభుత్వం తమ రచయితలు, విలేఖరులు, భావ ప్రకటన స్వేచ్ఛను వినియోగించుకుంటున్నవారికి భద్రత కల్పించాలని అంతర్జాతీయ రచయితల సంఘం 'పెన్ ఇంటర్నేషనల్' కోరింది. గత కొన్నేళ్లలో దేశంలో భావ వ్యక్తీకరణ స్వేచ్ఛకు అనువైన వాతావరణం బాగా దెబ్బతిందని సెప్టెంబర్ 30న ఇక్కడ ముగిసిన సంఘం 84వ కాంగ్రెస్ పేర్కొంది. పెన్ ఇంటర్నేషనల్ ఏటా ఒక్కో దేశంలో ఈ సదస్సును నిర్వహిస్తుంటుంది. ఆ సందర్భంగా సదరు దేశంలోని భావ వ్యక్తీకరణ స్వేచ్ఛపై ఒక నివేదికను విడుదల చేస్తుంటుంది. ఈసారి భారత్‌పై నివేదికను వెలువరించింది. వ్యతిరేక గళాలను వినిపించే పాత్రికేయులు, రచయితలు, విద్యావేత్తలు, విద్యార్థులు.. బెదిరింపులు, వేధింపులు, ప్రాసిక్యూషన్, ఆన్‌లైన్‌లో నిందలు, భౌతిక దాడులను ఎదుర్కొంటున్న తీరును ఇది వివరించింది. ఏడాది కిందట హత్యకు గురైన పాత్రికేయురాలు గౌరీ లంకేశ్ కేసులో సరైన చర్యలు లేకుంటే.. హింసతో నోరు నొక్కడానికి ప్రయత్నించేవారు మరింత పేట్రేగిపోతారని హెచ్చరించారు.

### ఢిల్లీలో కిసాన్ క్రాంతి ర్యాలీ

దేశంలోని రైతులు స్వామినాథన్ కమిషన్ సిఫార్సులను, రుణాలు మాఫీ చేయాలని, ఎన్‌సిఆర్‌లో పదేళ్లు పైబడిన ట్రాక్టర్లపై విధించిన నిషేధాన్ని ఎత్తేయాలని కోరుతూ ఉత్తరాఖండ్‌లోని హరిద్వార్ నుంచి సెప్టెంబర్ 23న కిసాన్ క్రాంతి ర్యాలీ ప్రారంభించారు. దేశ రాజధాని ఢిల్లీలోకి ప్రవేశించకుండా దాదాపు 30వేల మంది రైతులను పోలీసుల బారికేడ్లు పెట్టి అక్టోబర్ 2న అడ్డుకున్నారు. రైతులపై పోలీసులు లాఠీ చార్జీ, భాష్పవాయువు, జల ఫిరంగులను ప్రయోగించారు. దీంతో భారతీయ కిసాన్ యూనియన్‌కు చెందిన వేలాది మంది రైతులు తీవ్ర గాయాలపాలయ్యారు. భూ సంస్కరణలు చేపట్టాలని భూమి లేని నిరుపేదలు సుమారు 27 వేల మంది 'ఏక్తా పరిషత్' ఆధ్వర్యంలో మధ్యప్రదేశ్‌లోని గ్వాలియర్ నుంచి దేశ రాజధానికి 'జన్ ఆందోళన్ 2018' పేరిట అక్టోబర్ 4న కాలినడకన యాత్రగా బయల్దేరారు. ఢిల్లీ-యుపి సరిహద్దులో రైతులను అడ్డుకున్నారు.

### సుప్రీం తీర్పు అమలుపై శబరిమల పూజారుల అసమ్మతి

కేరళలోని శబరిమల అయ్యప్పస్వామి దేవాలయానికి అన్ని వయస్సుల మహిళలను అనుమతించాలని సుప్రీంకోర్టు తీర్పు ఇవ్వగా, దీనిపై పలువురి నుంచి అభ్యంతరాల పరంపర కొనసాగుతూనే ఉంది. సుప్రీం తీర్పును విస్తృత చర్చల ద్వారానే ఆచరణలోకి తీసుకురావాలని కేరళ ముఖ్యమంత్రి పినరయి విజయన్ చెప్పినప్పటికీ ఆలయ సీనియర్ పూజారులు సమ్మతించడం లేదు. సుప్రీంతీర్పు ఆలయ సంప్రదాయాలకు విరుద్ధంగా ఉందంటూ పూజారులు, ఆర్ఎస్ఎస్ సంస్థలు అక్టోబర్ 7 నుంచి ఆందోళన వ్యక్తం చేస్తూ మహిళలు ఎవరూ రాకుండా అడ్డుకుంటు మీడియాపై కూడా దాడి చేశారు.

### ఐదు రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికల షెడ్యూల్

ఐదు రాష్ట్రాల ఎన్నికల షెడ్యూల్‌ను కేంద్ర ఎన్నికల సంఘం విడుదల చేసింది. ఎన్నికల నిర్వహణ తేదీల వివరాలను కేంద్ర ఎన్నికల ప్రధాన కమిషనర్ ఒ.పి. రావత్ అక్టోబర్ 6న వెల్లడించారు. తెలంగాణ, మధ్యప్రదేశ్, రాజస్థాన్, మిజోరాంలలో ఒకే దశలో ఎన్నికలు జరగనుండగా.. ఛత్తీస్‌గఢ్‌లో రెండు దశల్లో నిర్వహించనున్నారు. తెలంగాణ మొత్తం 119 స్థానాలకు ఒకే విడతలో డిసెంబర్ 7న, మధ్యప్రదేశ్ 230 స్థానాలకు నవంబర్ 28న, రాజస్థాన్ 200 శాసనసభ స్థానాలకు ఎన్నికలు డిసెంబర్ 7, ఈశాన్య రాష్ట్రం మిజోరాం లోని 40 స్థానాలకు నవంబర్ 28, ఛత్తీస్‌గఢ్ 90 స్థానాలకు రెండు విడతల్లో ఎన్నికలు నిర్వహించనున్నారు. తొలి దశలో 18 స్థానాల్లో నవంబర్ 12న, రెండవ విడత ఎన్నికలు నవంబర్ 20న జరగనున్నాయి. డిసెంబర్ 11న ఓట్ల లెక్కింపుచేసి ఫలితాలను వెల్లడిస్తారని కేంద్ర ఎన్నికల ప్రధానాధికారి ఒ.పి. రావత్ తెలిపారు.

### బూటకపు ఎన్‌కౌంటర్ కేసులో జీవిత ఖైదు

బూటకపు ఎన్‌కౌంటర్ కేసులో సైనిక కోర్టు 24 ఏళ్ల క్రితం అసోంలో జరిగిన ఘటనకు సంబంధించి మేజర్ జనరల్‌తో పాటు మరో ఆరుగురికి సమ్మరీ జనరల్ కోర్టు (ఎస్.జి.సి) మార్షల్ అక్టోబర్ 14న జీవిత ఖైదు విధించింది. ఒక హత్య కేసులో తిన్‌సుకియా జిల్లాలోని వివిధ ప్రాంతాల నుంచి తొమ్మిది మంది ఆల్ అసోం స్టూడెంట్ యూనియన్ నాయకులను అదుపులోకి తీసుకున్న సైనికులు వారిలోంచి నలుగురిని 1994 ఫిబ్రవరి 18న కాల్చిచంపి వీరిని యుఎల్ఎఫ్ఎ ఉగ్రవాదులని ప్రచారం చేశారు. ఈ ఘటనపై గువాహటి హైకోర్టులో అసోం మాజీ మంత్రి హెబియస్ కార్పస్ పిటిషన్ దాఖలు చేయడంతో ఈ విషయం వెలుగులోకి వచ్చింది.

### జమ్మూకశ్మీర్‌లో ఎన్‌కౌంటర్

జమ్మూకశ్మీర్‌లో భద్రతాదళాలు, మిలిటెంట్లకు మధ్య కాల్పుల్లో ముగ్గురు మిలిటెంట్లు మృతిచెందగా అదే ప్రదేశంలో పేలుడు జరిగి ఏడుగురు పౌరులు మరణించారు. ఈ ఘటన కుల్గాం జిల్లా లారూ గ్రామంలో అక్టోబర్ 21న జరిగింది. ఈ దాడి తరువాత స్థానిక యువకులకు భద్రతాదళాలాలకు ఘర్షణ జరిగి 20 స్థానిక పౌరులు గాయపడ్డారు.

### పటేల్ విగ్రహాన్ని వ్యతిరేకిస్తున్న ఆదివాసులు

ప్రపంచంలో అత్యంత ఎత్తైన సర్దార్ వల్లభాయ్ పటేల్ విగ్రహం ఆవిష్కరణకు సిద్ధమైంది. గుజరాత్‌లోని నర్మదా నదీ తీరంలో అక్టోబర్ 31న ఆవిష్కరించనున్నారు. విగ్రహం ప్రారంభోత్సవం రోజున సహాయ నిరాకరణ ఉద్యమాన్ని చేపడతామని 75 వేల మంది స్థానిక గిరిజనులు హెచ్చరించారు. ఈ ప్రాజెక్టు వల్ల 72 గ్రామాల్లోని వేల మంది గిరిజనులు జీవనాధారం కోల్పోతారని గిరిజన సంఘాలు ఆందోళన వ్యక్తం చేస్తున్నాయి. తమ ఉద్యమానికి రాష్ట్ర వ్యాప్తంగా 100 గిరిజన సంఘాలు మద్దతు తెలిపినట్లు గిరిజన నేత డాక్టర్ ప్రఫుల్ వసావాలిపారు.

### అగర్వాల్ కన్నుమూత

గంగానది ప్రక్షాళన చేయాలంటూ అమరణ దీక్ష ప్రారంభించిన ప్రముఖ పర్యావరణ వేత్త, ఐఐటి కాన్పూర్ మాజీ ప్రొఫెసర్ అగర్వాల్(87) అక్టోబర్ 11న కన్నుమూశారు. జూన్ 22న దీక్ష ప్రారంభించిన 19 రోజుల తరువాత పోలీసులు ఆయన్ను బలవం0తంగా దీక్షా స్థలం నుంచి తరలించారు. ఆయనా కూడా ఆయన రహస్య ప్రదేశంలో దీక్ష కొనసాగించారు. క్లీన్ గంగా ఉద్యమకారుడైన అగర్వాల్ 111 రోజులుగా కేవలం తేనె కలిపిన నీటిని మాత్రమే ఆహారంగా తీసుకుంటున్నారు. గంగా నది ప్రక్షాళనపై ప్రభుత్వంతో జరిపిన చర్చలు విఫలమవడంతో ఆయన నీరు తాగడం మానేశారు. దీంతో పోలీసులు ఆయన్ను రిషికేశ్‌లోని ఎయిమ్స్ ఆసుపత్రికి తరలించగా చికిత్స పొందుతూ మృతిచెందారు. వీ

## ఇండోనేషియాలో భూకంపం, సునామీ

ఇండోనేషియాలో సెప్టెంబర్ 28న భారీ భూకంపం సంభవించింది. రిక్టర్ స్కేల్‌పై దీని ప్రభావం 7.5గా నమోదయింది. ఆ వెంటనే సునామీ అలలు విరుచుకుపడడంతో భారీ ప్రాణ, ఆస్తి నష్టం సంభవించింది. సులావేసీ ద్వీపం సమీపంలో భూకంప కేంద్రంలో ఉండడంతో అక్కడ తీవ్ర నష్టం వాటిల్లింది. ఈ ప్రకృతి ప్రకోపానికి రెండు వేల మందికి పైగా మరణించారు. ఐదు వేల మందికి పైగా గల్లంతయ్యారు. దాదాపు పది లక్షల మందికి పైగా భూకంపం, సునామీ ప్రభావం పడింది.

## కామెరూన్ అధ్యక్ష ఎన్నికలు

కామెరూన్‌లో అక్టోబర్ 7న అధ్యక్ష పదవికి ఎన్నికలు జరిగాయి. ఎన్నికల్లో 53 శాతం ఓటర్లు తమ ఓటు హక్కును వినియోగించుకున్నారు. పౌల్ బియా 71 శాతం ఓట్లతో విజయం సాధించారు. ఆయన సమీప ప్రత్యర్థి మౌరిస్ కామ్టోకు కేవలం 14 ఓట్లు మాత్రమే వచ్చాయి. పౌల్‌బియా ఏడు సంవత్సరాలు ప్రధానిగా, 36 సంవత్సరాలు అధ్యక్షునిగా ఉన్నారు.

## ఇటలీలో విద్యార్థుల నిరసన

ఇటలీలో ప్రభుత్వం విద్యారంగం పట్ల వివక్షపూరితంగా వ్యవహరి స్తోందంటూ విద్యార్థులు నిరసనకు దిగారు. స్కూల్ వర్క్ మోడల్ విధానం ద్వారా విద్యార్థులపై అధిక పనిభారం మోపుతున్న పాఠశాలల తీరును విమర్శించారు. స్కూళ్లలో విద్యార్థుల డ్రాపవుట్స్ అధికమవుతున్నప్పటికీ ప్రభుత్వం పట్టించుకోవడం లేదనీ, దీని నివారణకు ఎటువంటి చర్యలు చేపట్టడం లేదనీ ఆరోపించారు. విద్యాసంస్థల దోపిడీని అరికట్టాలనీ, వచ్చే బడ్జెట్‌లో విద్యారంగానికి అధిక మొత్తంలో నిధులు కేటాయించాలని డిమాండ్ చేశారు. అక్టోబర్ 17న ఇటలీలోని యాభై నగరాలలో వేలాది మంది విద్యార్థులు నిరసన ప్రదర్శలు చేశారు.

## కోస్టారికాలో ఆర్థిక సంస్కరణలపై సమ్మె

కోస్టారికాలో ప్రభుత్వం అమలు చేస్తున్న ఆర్థిక సంస్కరణలను వెంటనే విరమించుకోవాలని డిమాండ్ చేస్తూ ప్రజలు నిరవధికంగా సమ్మె చేస్తున్నారు. ఈ సమ్మె పట్ల రోజురోజుకూ మద్దతు పెరుగుతోంది. కార్మికులు, సామాజిక గ్రూపుల సంకీర్ణం యుఎస్ఎస్ఎన్ సభ్యులు విస్తృత కార్యాచరణకు దిగారు. శాంతియుతంగా నిరసన తెలుపుతున్న ప్రజలపై పోలీసులు అణచివేత చర్యలకు పాల్పడుతున్నారు.

## బ్రెగ్జిట్‌కు వ్యతిరేకంగా భారీ ర్యాలీ

బ్రిటన్‌లో బ్రెగ్జిట్ తుది ఒప్పందానికి వ్యతిరేకంగా అక్టోబర్ 22న లండన్ వీధుల్లో ప్రజలు భారీ ర్యాలీ నిర్వహించారు. లండన్‌లోని పార్లమెంట్ స్క్వేర్ వరకు తీసిన ఈ ర్యాలీలో ఏడు లక్షల మందికి పైగా ప్రజలు పాల్గొన్నారు. యూరోపియన్ యూనియన్‌తో తెగతెంపులు చేసుకొనేందుకు అనుసరించే విధానాలపై బ్రిటన్ సర్కార్ చేసిన ఒప్పందంపై ప్రజాభిప్రాయం చేపట్టాలని ఆందోళనకారులు డిమాండ్ చేశారు. ఈ డిమాండ్‌ను ప్రధాని థెరిసా మే అంగీకరించలేదు.

## ఇజ్రాయిల్‌లో పాలస్తీనా చిన్నారులపై వేధింపులు

ఇజ్రాయిల్ దళాలు పాలస్తీనా చిన్నారులపై అత్యంత దారుణమైన దురాగతాలకు పాల్పడుతున్నాయి. గాజాస్ట్రిప్‌లో నిత్యం జరిగే నిరసనలు, అల్లర్ల సమయంలో పెద్ద సంఖ్యలో పాలస్తీనా చిన్నారులను పట్టుకొని డిటెన్షన్ సెంటర్‌లకు తరలించి, భౌతికంగా, మానసికంగా వేధిస్తున్నారు. ఈ ఏడాది ఇజ్రాయిల్ సైనిక బలగాల దాడిలో దాదాపు నలభై మందికి పైగా పిల్లలు చనిపోయారు. వందలాది మంది గాయపడ్డారు. గాజాలో ఈ ఏడాదిలో రెండు వందల మంది పాలస్తీనా పౌరులు మరణించారని, వేలాది మంది తీవ్రంగా గాయపడ్డారని అల్ జజీరా మీడియా తెలిపింది.

## యెమెన్‌లో అంతర్యుద్ధ బీభత్సం

యెమెన్‌లో చెలరేగుతున్న అంతర్యుద్ధం కారణంగా అక్కడి చిన్నారుల పరిస్థితి దారుణంగా ఉంది. సౌదీ సంకీర్ణ దళాలు నిత్యం దాడులు జరపడంతో ప్రజల జీవనం అతలాకుతలమైపోతోంది. అమెరికా ఆయుధ సహకారంతో సౌదీ సంకీర్ణ దళాలు విచక్షణారహితంగా దాడులు చేస్తున్నాయి. కరువు, కలరా కూడా విజృంభించడంతో కోట్లాది మంది సహాయం కోసం సహాయం కోసం ఎదురు చూస్తున్నారు. ఇందులో చిన్నారులు కూడా అధిక సంఖ్యలో ఉన్నారు. దాదాపు 70 లక్షల మంది ఆకలితో అలమటిస్తున్నారు. పది లక్షల మంది వరకు కలరా వ్యాధి బారినపడ్డారు. సరైన సమయంలో వైద్యం అందక, పోషకాహార లోపంతో లక్షలాది మంది ప్రాణాలు కోల్పోతున్నారు.

## అఫ్ఘనిస్తాన్ ఎన్నికలు రక్తసిక్తం

అఫ్ఘనిస్తాన్ పార్లమెంట్, జిల్లా కౌన్సిల్‌లకు జరిగిన ఎన్నికలు దాడులు, బాంబు పేలుళ్లతో రక్తసిక్తమయ్యాయి. 2015 నుంచి పెండింగ్‌లో ఉన్న పార్లమెంట్ ఎన్నికలు అక్టోబర్ 20న జరిగాయి. ఈ ఎన్నికలను తాలిబన్లు బహిష్కరించారు. మొత్తం 250 స్థానాలకు గాను రెండు వేల మందికి పైగా అభ్యర్థులు పోటీ పడుతున్నారు. కానీ 30 శాతానికి పైగా పోలింగ్ కేంద్రాలను భద్రతాపరమైన కారణాలతో మూసివేశారు. ఎన్నికల్లో పోటీ చేస్తున్న పది మంది అభ్యర్థులు హత్యకు గురయ్యారు. అక్టోబర్ 2న కాబుల్ సమీపంలోని జలాలాబాద్‌లో జరిగిన ఆత్మాహుతి దాడిలో ఏడుగురు మృతి చెందారు. ముప్పై మంది గాయపడ్డారు. ఎన్నికల ప్రచార ర్యాలీలో ఈ దాడి జరిగింది. అక్టోబర్ 9న లష్కర్ ఘా ప్రావిన్స్‌లో ఎన్నికల్లో పోటీ చేస్తున్న సాలెహ్ మహ్మద్ అక్జొ అనే అభ్యర్థి నిర్వహించిన ర్యాలీలో తాలిబన్లు దాడి చేశారు. ఈ దాడిలో సాలెహ్ మహ్మద్‌తో సహా ఎనిమిది మంది మరణించారు. అక్టోబర్ 20న జరిగిన పోలింగ్‌లో దాదాపు 1.2 కోట్ల ఓటర్లు ఉన్న అఫ్ఘనిస్తాన్‌లో తొంబై లక్షల మంది ఓటు వినియోగించుకున్నారు. ఇందులో ముప్పై లక్షల మంది మహిళలే ఉన్నారు. ఇక పోలింగ్‌రోజు కాబుల్‌లో ఓటర్లను లక్ష్యంగా చేసుకొని తాలిబన్లు దాడులు చేశారు. దాదాపు 170 మంది చనిపోగా, వందలాది మంది తీవ్రంగా గాయపడ్డారు.

## నోబెల్ పురస్కారాలు - 2018

ప్రతిష్టాత్మకమైన నోబెల్ పురస్కారాలను ప్రకటించారు. అమెరికా వైద్యుడు జేమ్స్ అలిసన్, జపాన్‌కు చెందిన తసుకు హొంజోకు ఈ ఏడాది వైద్య నోబెల్ దక్కింది. కేన్సర్‌ను తగ్గించేందుకు రోగి శరీరంలోని వ్యాధి నిరోధక శక్తి ఎలా సాయపడుతుందనే అంశంపై పరిశోధనలు చేసి విజయం సాధించినందుకు వీరికి నోబెల్ పురస్కారం లభించింది. భౌతిక శాస్త్ర రంగానికి సంబంధించి అమెరికా శాస్త్రజ్ఞుడు ఆర్థర్ అష్కిన్, ఫ్రాన్స్‌కు చెందిన జెరార్డ్ మౌరో, కెనడా శాస్త్రజ్ఞురాలు డొనా స్ట్రిక్‌ల్యాండ్‌లకు నోబెల్ దక్కింది. ఆప్టికల్ లేజర్‌లపై పరిశోధనలు చేసి కంటి శస్త్రచికిత్సలో అధునాతన పరికరాలను ఉపయోగించేందుకు వీలుగా కృషి చేసిన ఈ ముగ్గురికి నోబెల్ ప్రకటించారు. అమెరికాకు చెందిన ఫ్రాన్సిస్ అర్నాల్డ్, జార్జ్ స్మిత్, బ్రిటన్‌కు చెందిన గ్రెగరీ వింటర్‌లు రసాయన శాస్త్రంలో కృషి చేసినందుకు నోబెల్ గెలుచుకున్నారు. జీవ ఇంధనాల నుంచి ఔషధాల వరకు మానవాళికి ఉపయోగపడే పదార్థాల తయారీకి దోహదపడే ఎంజైమ్‌లను వీరు జీవపరిణామ సిద్ధాంతం ప్రాతిపదిక గా సృష్టించారు. శాంతి నోబెల్ కాంగోకు చెందిన ప్రముఖ గైనకాలజిస్టు డెనిస్ మక్‌వెగె, ఇరాక్‌కు చెందిన మానవ హక్కుల కార్యకర్త నదియా మురద్‌కు దక్కింది. వీరు లైంగిక హింసకు వ్యతిరేకంగా పోరాడి నందుకు శాంతి నోబెల్ గెలుచుకున్నారు. ఆర్థికాభివృద్ధికి వాతావరణ మార్పులు, సాంకేతిక ఆవిష్కరణలను సమ్మిళితం చేస్తూ తీసుకువచ్చిన సిద్ధాంతానికి గానూ యేల్ యూనివర్సిటీ ప్రొఫెసర్ విలియం నోర్దాస్, న్యూయార్క్ యూనివర్సిటీ ప్రొఫెసర్ పాల్ రోమర్‌లకు ఆర్థిక రంగ నోబెల్ గెలుచుకున్నారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(సెప్టెంబర్ 1 నుండి సెప్టెంబర్ 30, 2018 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (983), ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాలలో (859) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1842)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 3 | – | 24 | 23 | 11 | 12 | 4 | 4 | 3 | 3 | 4 | 1 | 3 | 26 | 34 | – | – | – | 4 | – |
| హైదరాబాద్ | – | – | – | 11 | 14 | 6 | 6 | 2 | 1 | 2 | 6 | 7 | 3 | 6 | 23 | 14 | – | – | – | – | – |
| కరీంనగర్ | – | 2 | 1 | 7 | 7 | 2 | 7 | 2 | – | 1 | 1 | 1 | – | 4 | 69 | 11 | – | – | – | – | – |
| ఖమ్మం | – | 3 | – | 5 | 16 | 13 | 19 | 5 | 2 | 5 | – | 5 | 5 | 5 | 24 | 16 | 1 | – | – | – | 4 |
| మహబూబ్‌నగర్ | – | 1 | 1 | 4 | 4 | 2 | 6 | 5 | 2 | 3 | 6 | 3 | 8 | 8 | 32 | 3 | – | – | – | – | – |
| మెదక్ | – | 22 | – | 15 | 21 | 4 | 4 | 1 | 4 | 2 | 2 | 6 | 9 | 16 | 21 | 29 | – | – | – | 6 | 2 |
| నల్గొండ | – | – | – | 4 | 8 | 1 | 6 | 1 | 1 | 1 | – | 2 | – | 11 | 21 | 8 | – | – | – | – | 4 |
| నిజామాబాద్ | – | 3 | – | 3 | 8 | 1 | – | – | – | 1 | 1 | 1 | 2 | 5 | 14 | 10 | – | – | – | – | 1 |
| వరంగల్ | – | 4 | – | 5 | 8 | 2 | 9 | 1 | 1 | – | – | 4 | 2 | 4 | 16 | 8 | – | – | – | – | 4 |
| వికారాబాద్ | – | – | – | 4 | 3 | 1 | 1 | – | – | – | 2 | 1 | 3 | 3 | 14 | 9 | – | – | – | – | – |
| **తెలంగాణ** | **1** | **38** | **2** | **82** | **112** | **43** | **70** | **21** | **15** | **18** | **21** | **34** | **33** | **65** | **260** | **142** | **1** | **-** | **-** | **10** | **15** |
| అనంతపురం | – | 6 | 1 | 7 | 12 | 3 | 3 | 3 | – | 9 | 4 | 2 | 4 | 4 | 25 | – | – | – | – | – | – |
| చిత్తూరు | – | 1 | – | 5 | 6 | 4 | 12 | – | 3 | 4 | 4 | 9 | 15 | 3 | 20 | 8 | – | – | – | – | – |
| కడప | – | 3 | – | 8 | 8 | – | – | – | 1 | 1 | – | 1 | – | 6 | 13 | 7 | – | – | – | – | – |
| గుంటూరు | – | 1 | – | 2 | 8 | 2 | 4 | 1 | 2 | 2 | 1 | 4 | – | 7 | 13 | 17 | – | – | – | – | – |
| కృష్ణా | – | – | – | 4 | 7 | 2 | 1 | 2 | – | 1 | 3 | – | – | 3 | 13 | 14 | – | – | – | – | 3 |
| కర్నూలు | – | 5 | – | 3 | 11 | 1 | 3 | 2 | – | 2 | – | 4 | 2 | 2 | 14 | 8 | – | – | – | – | 2 |
| తూర్పు గోదావరి | – | – | – | 3 | 3 | 4 | 3 | 5 | 2 | 3 | – | 9 | – | 5 | 31 | 35 | – | – | – | – | 1 |
| ప్రకాశం | – | – | – | 5 | 2 | 1 | 2 | 2 | – | 3 | 2 | 4 | 3 | 2 | 24 | 13 | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | – | – | 4 | 9 | 8 | 8 | 9 | – | – | – | – | – | 5 | 16 | 22 | – | – | – | – | 1 |
| పశ్చిమ గోదావరి | – | – | – | 1 | 2 | 2 | 1 | 1 | – | 2 | 2 | 3 | 2 | 6 | 15 | 15 | – | – | – | – | 1 |
| నెల్లూరు | – | – | – | 5 | 2 | – | 3 | – | 1 | 2 | – | 1 | 2 | 4 | 17 | 8 | – | – | – | – | 1 |
| విజయనగరం | – | – | – | 3 | 8 | 2 | 6 | 5 | – | 3 | 2 | 2 | 2 | 3 | 15 | 7 | – | – | – | – | – |
| విశాఖపట్నం | – | – | – | 5 | 3 | 1 | 5 | – | – | 3 | 1 | 4 | 2 | – | 25 | 12 | – | – | – | 1 | – |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **16** | **1** | **55** | **81** | **30** | **51** | **30** | **9** | **35** | **19** | **43** | **32** | **50** | **241** | **166** | **-** | **-** | **-** | **1** | **9** |

# వీక్షణం విడిప్రతి కొనుగోలు కోసం

## మీ సమీపంలోని ఈ కింది న్యూస్‌స్టాల్స్‌లో వీక్షణం విడిప్రతి కొనుక్కోవచ్చు

| | | |
|---|---|---|
| రైజింగ్ సన్ న్యూస్ ఏజెన్సీ (సోల్ డిస్ట్రిబ్యూటర్) | ఆబిడ్స్, హైదరాబాద్ | 96666 80857 |
| నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ | హైదరాబాద్ | 90004 13413 |
| సహచర బుక్‌మార్క్ | బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్ | 98483 48173 |
| బాల రాజేశ్వర బుక్ డిపో | నల్లకుంట బస్ స్టాప్ | 9705055738 |
| వెంకటేశ్వర బుక్ స్టాల్, స్టేషనరీ | నల్లకుంట, శంకర్‌మఠ్ | 040-66131071 |
| పస్ట్ లక్కీ పాన్ షాప్ | విద్యానగర్ సిగ్నల్స్ | 9848672831 |
| సుధాకర్ బుక్ స్టాల్ | సన్‌మాన్ హోటల్ పక్కన, తార్నాక | 9949337605 |
| వెంకటేశ్వర బుక్ స్టాల్ | రామ్‌నగర్ గుండు | 9502964995 |
| భవాని బుక్ స్టాల్ | శివం రోడ్ | 9849836996 |
| శ్రీభవాని బుక్ స్టాల్ | శివం రోడ్ (ఇండియన్ బ్యాంక్ దగ్గర) | 9640712555 |
| ఓరియన్ బుక్ స్టాల్ | అంబర్‌పేట్ (శ్రీరమణ టాకీస్ దగ్గర) | 7702535137 |
| అరవింద్ బుక్ స్టాల్ | రామంతాపూర్ (టివి స్టూడియో ఎదురుగా) | 8977995537 |
| రెడ్డి బుక్‌స్టాల్ | అశోక్‌నగర్, హైదరాబాద్ | |
| నేషనల్ బుక్‌హౌస్ | అబిడ్స్, హైదరాబాద్ | 9394495189 |
| దుర్గా భవన్ బుక్‌స్టాల్ | నాంపలి, హైదరాబాద్ | 9030656640 |
| డైమాండ్ బుక్‌స్టాల్ | నాంపలి, హైదరాబాద్ | 9885127491 |
| రాజు రామ్‌దాస్ బుక్‌స్టాల్ | మెహిదీపట్నం, హైదరాబాద్ | 7799244409 |
| రిలైబుల్ బుక్ సెంటర్ | నానల్‌గూడ, హైదరాబాద్ | 040-23512447 |
| ఇస్పెక్ట్రం బుక్‌హౌస్ | లంగర్‌హౌజ్, హైదరాబాద్ | 98486 68354 |
| శ్రీలక్ష్మి బుక్‌స్టాల్ | హైదర్‌గూడ, హైదరాబాద్ | 98855 81249 |
| లక్ష్మణ్ | చిక్కడపల్లి, హైదరాబాద్ | 93910 12051 |
| మల్లిఖార్జున్ బుక్‌స్టాల్ | దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ | 90594 40756 |
| సుధీర్ బుక్‌స్టాల్ | తార్నాక, హైదరాబాద్ | 95426 04166 |
| లడ్డు బుక్‌స్టాల్ | పంజగుట్ట, హైదరాబాద్ | 99492 15135 |
| వినోద్ బుక్‌స్టాల్ | సరూర్‌నగర్, హైదరాబాద్ | 95536 03603 |
| రాజ్ బుక్స్ స్టేషనరీ | ఓల్డ్ బస్‌స్టాండ్ దగ్గర, మెదక్ రోడ్, సిద్దిపేట్ | 87905 60097 |
| బాల్‌రెడ్డి బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, మహబూబ్‌నగర్ | 98660 18829 |
| శ్రీ స్వయం రాజరాజేశ్వర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, హుస్నాబాద్ | 90592 85948 |
| భాస్కర్ పాన్ షాప్ & జనరల్ స్టోర్ | కోహెడ | 95021 82545 |
| భండారి కిష్టయ్య బుక్‌స్టాల్ | ఫైర్‌స్టేషన్ దగ్గర, గోదావరిఖని | 98497 93836 |
| గణేష్ బుక్‌స్టాల్ | కళాభారతి ఎదురుగా, కరీంనగర్ | 97019 99007 |
| మహాలక్ష్మి బుక్‌స్టాల్ | సిటీ బస్‌స్టాండ్, హన్మకొండ చౌరస్తా, వరంగల్ | 99893 30297 |
| వినయ్ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, మంచిర్యాల | 94407 57503 |
| పాండు బుక్ స్టాల్, కూల్ డ్రింక్స్ | ఆర్‌టిసి కాంప్లెక్స్, మిర్యాలగూడ | 98857 38144 |
| శరత్ బుక్ స్టాల్ | షాప్ నం. 3, ఆర్‌టిసి బస్‌స్టాండ్, హుజూరాబాద్ | 98662 73720 |
| సత్యసాయి బుక్‌స్టాల్ | ఖమ్మం | |
| మహాకవి శ్రీశ్రీ బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, పార్వతీపురం | 73825 60366 |
| మణి బుక్‌స్టాల్ | సండేమార్కెట్, నెల్లూరు | 73862 23538 |
| సురేష్ బుక్ స్టాల్ | శివాలయం వీధి, ప్రొద్దుటూరు | 81210 02112 |
| పద్మావతి బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, అనంతపూర్ | 73965 09767 |
| అనేక బుక్‌స్టాల్ | ఏలూరు రోడ్డు, విజయవాడ | 92472 53884 |
| మైత్రి బుక్‌హౌస్ | మజీద్ వీధి, అరండల్‌పేట, విజయవాడ | 98486 31604 |
| రాజేశ్ బుక్ సర్వీస్ | ఆర్‌టిసి బస్‌స్టేషన్ కాంప్లెక్స్, విశాఖపట్నం | 99483 19842 |
| వి. భాస్కర్ న్యూస్‌పేపర్ ఏజెన్సీ | డాబా గార్డెన్, విశాఖపట్నం | 99482 90318 |
| రాఘవేంద్ర బుక్‌స్టాల్ | ఆర్‌టిసి బస్‌స్టాండ్, ఒంగోల్ | 90595 23091 |

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 208 - November 2018 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/10/2018 ● Postal Regn. No. HD/1100/2017-19

Date of Posting : 29th, 30th



## ఆర్ఎస్ రావు స్మారకోపన్యాసం, సదస్సు 2018

### వాయిదా

ఈ సంవత్సరం నవంబర్ రెండవ శనివారం, ఆదివారం జరగవలసిన ప్రొ. ఆర్.ఎస్. రావు స్మారకోపన్యాసం, సదస్సు అనివార్య కారణాల వల్ల వాయిదా పడింది. మళ్లీ ఎప్పుడు నిర్వహించేది తెలియజేస్తాం.

– బి1 కలెక్టివ్, ఆర్ఎస్‌రావు మిత్రులు



Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao